ఓమ్

సూర్యనారాయణపరబ్రహ్మణేనమః

తైత్తిరీయారణ్యకమునందుగల ప్రథమప్రపాఠకము

# అరుణమంత్రార్థప్రకాశిక



శ్రీవిద్యారణ్యభాష్యము.

ఆంధ్రప్రతిపదార్థసహితము

ఇది

మచిలీపట్టణవాస్తవ్యులగు

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రుఁడగు

లక్ష్మీనృసింహశాస్త్రిచే

లిఖింపఁబడి

బ్రహ్మశ్రీ కావూరి రంగయ్యశాస్త్రులవారిచేఁబరిష్కరింపఁబడి

స్వకీయ శ్రీ

ఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

ప్రథమముద్రణము 500 ప్రతులు



దీని వెల 1—8—0.

1935.

# సూర్యయంత్రము.



## యంత్రోద్ధారణ శ్లోకములు.

శ్లో॥ బిందుత్రికోణవృత్తంచ షట్కోణంవృత్తయుగ్మకమ్ ।
వసుకోణంతథావృత్తం ద్వాదశారంతథైవచ।
భూపురత్రయసంయుక్తం సూర్యయంత్రంవిధీయతే॥

శ్లో॥ ప్రణవంవాగ్భవంమాయాం వశ్యంశక్తించవర్తులే।
షట్కోణేశక్తిషట్కంతు తద్బాహ్యేవ్యజపాంలిఖేత్॥
వర్తులంవిన్యసేత్పశ్చాద్గాయత్ర్యాసహితంమనుమ్।
వర్తులంతుపునఃకృత్వా బీజాదికమతఃపరమ్॥
దిగ్బీజంభూపురంకుర్యా దేతద్యంత్రస్యలక్షణమ్।
అనూరుణాసుకథితం నారదాయమహాత్మనే।

---

# పీఠిక.



శ్రీమత్సమస్తప్రపంచ సృష్టికర్తయు, లోకైకరక్షకుఁడును, సర్వాంతర్యామియును, సర్వవంశకరుఁడును నిత్యముక్తశుద్ధబుద్ధస్వభావుఁడును, మాయాతీతుఁడును, సచ్చిదానంద స్వరూపుఁడును జ్ఞానగమ్యుఁడు నయిన భగవంతుఁడు ప్రకృతినాశ్రయించి సకల ప్రపంచమును సృజించియుండెను. * శ్లో॥ జన్తూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వంతతో విప్రతా । తస్మాద్వైదికధర్మమార్గపరతా విద్వత్తమస్మాత్పరమ్ । ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనాసంస్థితిః । ముక్తిర్నోశతజన్మకోటిసుకృతైః పుణ్యైర్వినాఽలభ్యతే ॥ అను ప్రమాణము ననుసరించి భూతసృష్టిలో మనుష్యజన్మమెత్తుట దుర్లభంబు ఏలయనిన, ఈజన్మములోనే జీవునికి పుణ్యవశమువలన జన్మరాహిత్యమును పాపమువలన బునర్జన్మమునుగలుగుచున్నవి. కాఁబట్టి మానవజన్మమెత్తిన తరువాత వారివారి పూర్వజన్మపాపంబును వర్తమానస్థితపుణ్యపాపంబులును పరిహరించుకొనుటకు ముందుగాసత్యవ్రతుఁడై మాతాపితృభక్తిగలవాఁడై ప్రత్యహం సూర్యభగవానుని ధ్యానించు సుజనులకందఱకును ప్రత్యక్షదేవుఁడై జగత్‌స్థితికి ప్రధానకారణభూతుఁడైయున్న సూర్యదేవునిగూర్చి వ్రాయుటయనావశ్యకము జగద్విఖ్యాతుఁడగు అట్టి సూర్యునియొక్క యుపాసనము మనభరతఖండమునందు చిరకాలమునుండి మనపూర్వులందఱు స్మార్తశిష్టాచారము చొప్పున "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అనుప్రమాణమునను సరించి కొందఱు అరుణముచేతను మఱికొందఱు మహాసౌరముచేతను మఱికొందఱు ఆదిత్యహృదయముచేతను కొందఱు స్త్రీపురుషులు (108) పురాణశ్లోకములచేతను శ్రీమన్నారాయణమూర్తిని వారివారిమనోభీష్ట

ప్రకారము ధ్యానించుచుండుటయును, పూజించుచుండుటయును, అర్ఘ్య మిచ్చుటయును లోకమందుగలదు అందువలన సమస్తరుగ్మతలు పరిహారమై ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని బొందుచున్న సంగతి సుజనుల కందఱికిని దెలిసినవిషయమే గనుక ఇచ్చట విస్తరింపపనిలేదు సూర్య భగవానుని ఉపాసించువారలలో నామిత్రులలో కొందఱుఅరుణభాష్య మును తెలుగునసీగ్రంథమునుముద్రించిన లోకోపకారమగునని బహుమంది కోరుచూ వచ్చినందున నేనీగ్రంథమునందు పదవిభాగ టీకా తాత్పర్యసమేతముగా పారాయణచేయువారల కనుకూలముగావ్రాసి ముద్రించి ప్రచురించితిని. మఱియుకొందరు చిత్రిపన్నమును అర్థముతో ముద్రించిప్రచురింపుడని కోరినందున ప్రత్యేకగ్రంథముగా చిత్రిపన్నము గూడ నిట్లేఅచ్చువేయఁబడును పిమ్మట స్వాధ్యాయబ్రాహ్మణముగూడ ఇట్లే ముద్రించదలచితిని.

ఈగ్రంథమందుండఁ నిలచిన ముద్రణ స్ఖాలిత్యలోపములు గను గొన్న మహానియ్యులు నన్నుమన్నించి నాకుఁదెలియపర్చినపక్షంబున రెండవ కూర్పునందు సవరించి ముద్రించబడును గాన వేదపరిజ్ఞాతలను ప్రార్థించుచున్నాడను.

సూర్యనమస్కారదర్పణము ప్రత్యేకముగా స్వరచిహ్నములో ముద్రించియున్నాను ప్రతి 1కి రు 0—8—0.

ఆర్యానందముద్రాక్షరశాలా,
మచిలీపట్టణము.

ఇట్లు,
చేల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.



# తైత్తిరీయారణ్యకే ప్రథమ ప్రపాఠక ప్రారంభః

———x———

మూ॥ భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః । స్థిరైరంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమ దేవహితం యదాయుః ॥

ప॥ భద్రం । కర్ణేభిః । శృణుయామ । దేవాః । భద్రం । పశ్యేమ । అక్ష భిః । యజత్రాః । స్థిరైః । అంగైః । తుష్టువాంసః । తనూభిః । వ్యశేమ । దేవ హితం । యత్ । ఆయుః ॥

అ॥ హే దేవాః=ఇంద్రుఁడు మొదలగు నో దేవతలారా! భద్రం=మంగళ ప్రదమైన శ్రుతి మొదలగువాక్యములను, కర్ణేభిః యద్వా-కర్ణైః=చెవులచేత, శృణు యామ=విందుము, యజత్రాః=యజ్ఞమును జేయ సమర్థులమగు, వయం = మేము, భద్రం=మంగళప్రదమగు యజ్ఞాదికర్మను, అక్షభిః-యద్వా-అక్షిభిః = నేత్రముల చేత, పశ్యేమ=చూతుము, స్థిరైః=దృఢమైనటువంటి, అంగైః=నేత్రాద్యవయవముల తోడను, తనూభిః=దృఢమైనశరీరములతోడను, యుక్తాః=కూడుకొనిన, వయం= మేము, తుష్టువాంసః=మీసంబంధమైన స్తోత్రమును జేసెదము, యత్=ఏ కారణము వలన, ఆయుః=బ్రహ్మచే నియ్యఁబడిన మా యాయుర్దాయము, దేవహితం = దేవత లకుఁ బ్రియమును జేయుటకొఱకు, వ్యశేమ=మిక్కిలి పొందియున్నామో ॥

తా॥ ఇంద్రుఁడు మొదలగు నో దేవతలారా! ఏ కారణమువలన యజ్ఞాది కర్మలను జేసి దేవతలం దృప్తి చేయుటకొఱకు బ్రహ్మదేవుఁడు విశేషాయుర్దాయమును మాకు నొసగియున్నాఁడో అందువలన మేము దృఢమైనవియు, వికలములు కాని వియునగు హస్తాద్యవయవములతోడను శరీరముతోడను గూడినవారమై మంగళ

ప్రదమగు శ్రుతిస్మృతిరూపమగు వాక్యములను వినుచుందుము. యజ్ఞమునుజేయ సమర్థులమై యజ్ఞాదికర్మలను జూచుచుందుము. ఎల్లప్పుడు మీ సంబంధమైన స్తోత్రమును జేయుచుందుము.

మూ॥ స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః । స్వస్తినః పూషావిశ్వవేదాః ।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తినో బృహస్పతిర్దధాతు
ఓంశాన్తిశ్శాన్తిశ్శాన్తిః ॥

ప॥ స్వస్తి । నః । ఇన్ద్రః । వృద్ధశ్రవాః । స్వస్తి । నః । పూషా । విశ్వవేదాః । స్వస్తి । నః । తార్క్ష్యః । అరిష్టనేమిః । స్వస్తి । నః । బృహస్పతిః । దధాతు । ఓం । శాన్తిః । శాన్తిః । శాన్తిః ॥

అ॥ వృద్ధశ్రవాః=పెద్దలు చెప్పఁగాఁ బురాణాదులయందు వినఁబడునట్టి, ఇంద్రః=దేవేంద్రుఁడు, నః=మాకు, స్వస్తి=శుభమును, దధాతు=చేయుఁగాక, విశ్వవేదాః=సమస్తము తెలిసినట్టి, పూషా=సూర్యుఁడు, నః=మాకు, స్వస్తి=శుభమును, దధాతు=చేయుఁగాక, అరిష్టనేమిః=నాశనము కలుగకుండుటకుఁ జక్రము వంటివాఁడయిన, (అనఁగాఁ గొయ్యచేఁ జేయఁబడిన చక్రమునకు భంగము కలుగకుండుటకు ఇనుపపట్టా వేయుటచే నది కొయ్యచక్రము నెట్లు కాపాడునో ఆ ప్రకారముగానే కాపాడును) తార్క్ష్యః=గరుత్మంతుఁడు, నః=మాకు, స్వస్తి=శుభమును దధాతు=చేయుఁగాక, బృహస్పతిః=బృహస్పతి, నః=మాకు, స్వస్తి=శుభమును, దధాతు=చేయుఁగాక, ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః=ముందు జెప్పఁబోవు గ్రంథమునకు విఘ్నములు కలుగకుండుటకొఱకు సమస్త మంత్రములకు మూలమైన ప్రణవోచ్చారణపూర్వకముగా మూఁడుసార్లు శాంతిని జెప్పియున్నాఁడు.

తా॥ పురాణాదులయందుఁ బెద్దలచే వినబడుచుండెడి దేవేంద్రుడు వేదాధ్యయనముఁ జేయుటయు వినుటయు దత్క్రియల నాచరించుటయు మొదలగు శుభమును జేయుఁగాక. సర్వమును దెలిసినవాఁడైన సూర్యుఁడును మాకు శుభమును గలుగఁజేయుఁగాక. ఇనుపపట్టా కొయ్యచక్రమునకు భంగము గలుగనీయక యెట్లు కాపాడునో ఆ ప్రకారముగానే గరుత్మంతుఁడు సర్పము మొదలగువానివలన బాధలను దొలగించి శుభమును గలిగించుగాక. బృహస్పతి మాకుండునట్టి బ్రహ్మవర్చస్సును గాపాడుచుండి శుభమును గలిగించుఁగాక. అని యీ ప్రకారముగా

ఆశీర్నమస్త్రియావస్తు నిర్దేశోవాపితన్ముఖం అను స్మృతిప్రమాణానుసారముగా దేవతాప్రార్థనచేసి తత్ప్రసాదముం బొంది సర్వమంత్రములకు మూలకారణమైన ప్రణవోచ్చారణ పూర్వకముగా మూఁడుపర్యాయములు శాంతిని జెప్పియున్నాడు.

మూ॥ ఓంభద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాః। భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః। వ్యశేమ దేవహితం యదాయుః। స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః। స్వస్తినః పూషావిశ్వవేదాః। స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః। స్వస్తినో బృహస్పతిర్దధాతు। ఆపమాపామపస్సర్వాః। అస్మాదస్మాదితోముతః॥౧॥ అగ్నిర్వాయుశ్చసూర్యశ్చ। సహసఞ్చస్కర ర్ధియా॥

ప॥ ఆపం। ఆపాం। అపః। సర్వాః। అస్మాత్। అస్మాత్। ఇతః। అముతః। అగ్నిః। వాయుః। చ। సూర్యః। చ। సహ। సంచస్కర। బుద్ధియా॥

అ॥ ఇతః=ఈ భూలోకమువలనను, అముతః=స్వర్గలోకమువలనను, అస్మాత్ అస్మాత్= భూలోకమునందుండు ఈ సమస్తమైన గంగాసరస్వతీ గోదావరీయమునా కావేరులు మొదలగు పుణ్యనదులవలనను, సర్వాః=సమస్తమైన, అపః=జలములను ఆపం=పొందితిని, ఆపాం=పొందితిని, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, వాయుశ్చ= వాయుదేవుఁడును, సూర్యశ్చ=సూర్యుఁడును, తాఏవ=ఆ జలములనే, సంపాదయంతు=కలుగజేయుదురుగాక, అహం=నేను, తైస్సహ= ఆ దేవతలతోఁగూడ, బుద్ధియా=సమృద్ధికొఱకు, తాః=ఆ జలములను, సఞ్చస్కర=అభిమన్త్రించుచున్నాను.

తా॥ ఈ భూలోకమందుఁగాని స్వర్గలోకమునందుఁగాని యేయే పుణ్యప్రదములైన గంగా సరస్వతీ నర్మదా యమునా కృష్ణా గోదావరీ కావేరీ ప్రముఖనదులు కలవో ఆ సమస్తనదుల జలమును బొందువాఁడ నయ్యెదను. అగ్ని వాయువు సూర్యుడు మొదలగు దేవతలును అట్టి జలములనే నాకు సంభవింపఁజేయుదురుగాక. ఆ యగ్ని మొదలగు దేవతలును నేనును జలమును సమృద్ధిగ నుండుటకొఱకు నభిమన్త్రించుచున్నాను.

మూ॥ వాయ్వశ్వారశ్మిపతయః । మరీచ్యాత్మానో అద్రుహః । దేవీ ర్భువనసూవరీః । పుత్త్రవత్త్వాయమేసుత ॥

ప॥ వాయ్వశ్వాః । రశ్మిపతయః । మరీచ్యాత్మానః । అద్రుహః । దేవీః । భువనసూవరీః । పుత్త్రవత్త్వాయ । మే । సుత ॥

అ॥ వాయ్వశ్వాః= మోసికొనిపోవునట్టి వాయువే గుఱ్ఱముగాఁగలవియు రశ్మిపతయః= సూర్యకిరణములు అధిపతిగాఁగలవియు, మరీచ్యాత్మానః= కిరణములే శరీరముగాఁగలవియు, అద్రుహః= ఎవరికిని అపాయముఁజేయనివియు, దేవీః= ప్రకాశించునట్టివియు, భువనసూవరీః= ప్రపంచమునకుఁ గారణమైనవియునగు జలములారా!, యూయం= మీరు, మే= నాకు, పుత్త్రవత్త్వాయ= పుత్త్రులుకలుగుటకొఱకు, సుత= అనుగ్రహింపుడు ॥

తా॥ గుఱ్ఱములవలెనే మోసికొనిపోవునట్టి వాయువుగలవియు, సూర్యకిరణములే కఱకములుగాఁగలవియు, సూర్యకిరణములవలనఁబుట్టుటచే నవియే శరీరముగాఁగలవియు, ఎవరికిని ద్రోహముఁజేయనివియు, నిర్మలముగాఁబ్రకాశించునవియు, సమస్త ప్రపంచమునకుఁ గారణమైనవియునగు నుదకములారా! మీరు నాకు విశేషముగాఁ బుత్త్రులు కలుగునట్లుగా ననుగ్రహింపుఁడు.

మూ॥ మహానామ్నీర్మహామానాః । మహసోమహసస్స్వః । దేవీః పర్జన్యసూవరీః । పుత్త్రవత్త్వాయమేసుత ॥ ౨ ॥

ప॥ మహానామ్నీః । మహామానాః । మహసః । మహసః । స్వః । దేవీః । పర్జన్యసూవరీః । పుత్త్రవత్త్వాయ । మే । సుత ॥

అ॥ మహానామ్నీః= అధికమైనపేరుగలవియు, అనఁగాజలమునకుఁబర్యాయపదమైన అప్ శబ్దమునకు "ఆప్నోతీత్యాపః" అనువ్యుత్పత్తి ప్రకారముగా సర్వఫలప్రాప్తి రూపమైన నర్థముచెప్పుటచే నధికనామము సంభవించినది, మహామానాః= అధికమైనపూజగలవియు, మహసః=మహసః ఆయాదేవతాపూజకు, స్వః=కారణమైనదియు, దేవీః= స్వచ్ఛముగాఁబ్రకాశించునవియు, పర్జన్యసూవరీః= మేఘమువలన బుట్టినవియునగు, నుదకములారా!, యూయం= మీరు, మే= నాకు, పుత్త్రవత్త్వాయ= విశేషముగాఁబుత్త్రులుకలుగుటకొఱకు, సుత= అనుగ్రహింపుఁడు

తా॥ “ అంతటను వ్యాపించియున్నది ” అను నర్థముగల అప్ శబ్దము గలుగుటచే నధికమైనపేరుగలవియు విశేషమైన పూజ్యతగలవియు నాయా దేవతా పూజాదులయందుఁబ్రవర్తింపఁజేయునవియు నిర్మలముగాఁబ్రకాశించునవియు మేఘములవలనఁబుట్టినవియునగు నుదకములారా! మీరు నాకు ననేక పుత్త్రులు కలుగునట్లుగా ననుగ్రహింపుఁడు.

మూ॥ అపాశ్మ్న వృష్ణి మపారక్షః । అపాశ్మ్న వృష్ణి మపారఘం । అపాఘ్రామపచావర్తిం । అపదేవీరితో హిత ॥

ప॥ అప । అశ్మ్న వృష్ణిం । అప । రక్షః । అప । అశ్మ్న వృష్ణిం । అప । రఘం । అపాఘ్రాం । అప । చ । అవర్తిం । అప । దేవీః । ఇతః । హిత ॥

అ॥ హేఆపః= ఓ యుదకములారా! అశ్మ్న వృష్ణిం = భోగ్యవస్తువులను దహింపఁజేయునట్టి అగ్నిహోత్రుని, ఇతః=ఈ ప్రదేశమునుండి, అపహిత=వెళ్ళఁగొట్టుఁడు, తథా=ఆ ప్రకారముగానే, రక్షః=బాధించునట్టి రాక్షసుని, అపహిత=వెళ్ళఁగొట్టుఁడు, అశ్మ్న వృష్ణిం=భుజించునట్టి వారలను జ్వరము మొదలగు వానిచేఁ బీడింపఁజేయు నగ్నిహోత్రుని, ఇతః=ఈప్రదేశమునుండి, అపహిత=వెళ్ళఁగొట్టుఁడు, రఘం=జ్వరాదులవలనఁగలిగిన శరీరశోషణమును లేక పాపమును గాని, ఇతః=ఇక్కడనుండి, అపహిత=వెళ్ళఁగొట్టుఁడు, అపాఘ్రాం=నాసిక మొదలగు జ్ఞానేంద్రియములయొక్క శక్తిలేకపోవుటను, అపహిత=పోఁగొట్టుఁడు, అవర్తిం=జీవనము లేకపోవుటను, (అనఁగా దారిద్ర్యమును) అపహిత=పోఁగొట్టుఁడు, దేవీః=స్వచ్ఛముగాఁ బ్రకాశించునట్టి యోజలములారా!, అన్యత్=ప్రతికూలమైన సమస్తమును, ఇతః=ఈ నా సమీపమునుండి, అపహిత=పోఁగొట్టుఁడు.

తా॥ భోగ్యవస్తువులను దహింపఁజేయునట్టి యగ్నిహోత్రుని (అనఁగా గృహములను దహించుటచే నా గృహములయందుండు పదార్థములు నశించిపోవుటచే భోగ్యవస్తు నాశనము చెప్పఁబడియెను) బాధించునట్టి రాక్షసుని జ్వరాదిరూపముచే భుజించు జంతువులను బీడింపఁజేయు నగ్నిహోత్రుని జ్వరాదులచే సంభవించిన శరీరకార్శ్యత్వమును లేక దానికిఁ గారణమగు పాపమును ముక్కు మొదలగు జ్ఞానేంద్రియముల వ్యాపారశూన్యత్వమును దారిద్ర్యమును మాకు ఎప్పుడును గలుగకుండునట్లుగాఁ జేయుము. స్వచ్ఛముగాఁ బ్రకాశించు నోయుదకములారా! మఱియు నితరమగు ప్రతికూలమైనదంతయు నాసమీపమున లేకుండఁజేయుము.

మూ॥ వజ్రిందేవీ రజీతాగ్ శ్చ। భువనం దేవసూవరీః। ఆదిత్యా
నదితిం దేవీం। యోనినోర్ధ్వ ముదీషత ॥

ప॥ వజ్రిం । దేవీః । అజీతాన్ । చ । భువనం। దేవసూవరీః । ఆదిత్యాన్ ।
అదితిం । దేవీం । యోనినా । ఊర్ధ్వం । ఉదీషత ॥

అ॥ హే ఆపః=ఓ యుదకములారా! యూయం=మీరు, దేవసూవరీః=దేవ
తలకును గారణమైనవారు గనుకనే, దేవీః=ప్రకాశించువారై, అస్మాన్ = మమ్మ
లను, అజీతాన్=శత్రువులచే జయింపఁబడనివారినిగా, రక్షార్థం=రక్షించుటకొఱకు,
యోనినా=కారణమాటచే, వజ్రిం=వజ్రాయుధమును, భువనం = భూతసమూహ
మును, ఆదిత్యాన్=అదితిపుత్త్రులైన సమస్తమైన దేవతలను, అదితిం=అదితియను,
దేవీంచ=దేవతను, ఊర్ధ్వం=పైభాగమునందు, ఉదీషత=ఎత్తియుంపుఁడు.

తా॥ దేవతలకును గారణమైన యోయుదకములారా! మీరు ప్రకాశించు
వారలై మమ్ము శత్రువులు జయింపకుండునట్లుగా వజ్రాయుధమును సమస్తమైన
భూతసమూహమును సమస్త దేవతలను దేవమాతయగు అదితియను దేవతను మా పై
భాగమునందుంచి మమ్మలను గాపాడునట్లుగాఁ జేయుఁడు.

మూ॥ శివానశ్శన్తమాభవన్తు। దివ్యా ఆపఓషధయః॥

ప॥ శివాః । నః । శన్తమాః । భవన్తు । దివ్యాః । ఆపః । ఓషధయః॥

అ॥ దివ్యాః=స్వర్గమందైన, ఆపః=జలములును, ఓషధయః=ఓషధులును,
నః=మాకు, శివాః=సుఖకరములైనవియు, శన్తమాః=దుఃఖమును నశింపఁజేయు
నట్టివియు, భవన్తు=అగుఁగాక.॥

తా॥ స్వర్గమందుండు జలములు ఓషధులును మాకెప్పుడును సుఖమును దుఃఖ
నివృత్తిని జేయుచుండుఁగాక॥

మూ॥ సుమృడీకాసరస్వతి। మాతేవ్యోమసందృశి॥ 3॥ ౧॥

ప॥ సుమృడీకా । సరస్వతి । మా । తే । వ్యోమ । సందృశి॥

అ॥ సరస్వతి=కొలఁకులుగల యోభూమీ! త్వం=నీవు, సుమృడీకా=
మిక్కిలి సుఖకారణమగుదువు, తే=నీసంబంధమైన, వ్యోమ=రంధ్రము, మాసందృశి=
[illegible]గాక॥

తా॥ సరస్సులు కలిగిన యో భూమీ ! మాకెప్పుడును సుఖమును జేయుచుం డుము. నీ సంబంధమైన రంధ్రములు పచ్చికచే వ్యాపింపఁబడినవై కనఁబడకుండుఁ గాక॥

ఇతి తైత్తిరీయారణ్యకే ప్రథమప్రపాఠకే ప్రథమోను వాకస్సమాప్తః.

—♦ అథద్వితీయోను వాకప్రారంభః ♦—

మూ॥ స్మృతిః ప్రత్యక్షమైతిహ్యం । అనుమానశ్చతుష్టయం । ఏతై రాదిత్యమండలం । సర్వై రేవవిధాస్యతే॥

ప॥ స్మృతిః। ప్రత్యక్షం। ఐతిహ్యం । అనుమానః । చతుష్టయం । ఏతైః, ఆదిత్యమండలం। సర్వైః। ఏవ। విధాస్యతే॥

అ॥ స్మృతిః=మన్వాదిధర్మశాస్త్రము, ప్రత్యక్షం=ఇంద్రియజ్ఞానముచేఁ బ్రత్యక్షముచేసికొనుట, ఐతిహ్యం=మహాభారతము మొదలగు ఇతిహాసముల సంబంధమైనదియు, అనుమానః=హేతుదృష్టాంతములతోఁ గూడిన శిష్టాచారరూపమైన అనుమానము అనునట్టి, చతుష్టయం=నాలుగుప్రమాణములు కలవు, ఏతైః=ఈ సర్వైః=సమస్తప్రమాణములచేతను, ఆదిత్యమండలం=సూర్యమండలము, విధాస్యతే=నిశ్చయింపఁబడుచున్నది.

తా॥ సూర్యమండలము ఏ తీరుగా నున్నదో నిత్యము ఏ తీరునఁ బ్రవర్తించు చున్నదో మన్వంతరాదులచే విభాగమై యున్న కాలమును ఏతీరునఁ బ్రవర్తింపఁ జేయుచున్నదో జలము మొదలగు వానిని సృజించుటచేఁ బ్రపంచము నేతీరున సృజించుచున్నదో యీ మొదలగు వృత్తాంతములు మన్వాది స్మృతులచేతను జక్షు రాదీంద్రియజ్ఞానము చేతను వేదవాక్యములచేతను గారణదృష్టాంతములతోఁ గూడిన శిష్టాచారరూపమైన అనుమాన ప్రమాణముచేతను నిర్ధారణ చేయఁబడుచున్నవి.

మూ॥ సూర్యోమరీచిమాదత్తే । సర్వస్మాద్భువనాదధి । తస్యాః పాక విశేషేణ । స్మృతంకాలవిశేషణం ॥

ప॥ సూర్యః । మరీచిం । ఆదత్తే । సర్వస్మాత్ । భువనాత్ । అధి । తస్యాః । పాకవిశేషేణ । స్మృతం । కాలవిశేషణం ॥

అ॥ సర్వస్మాత్=సమస్తమైన, భువనాత్=ప్రపంచముకంటె, అధి=పైభాగ మునందుండి, సూర్యః = సూర్యుఁడు, మరీచిం = కిరణమును, ఆదత్తే=గ్రహించును

చున్నాఁడు, తస్యాః=ఆకిరణముయొక్క, పాకవిశేషేణ=పరిపాక విశేషముచేత, కాలవిశేషణం = సంవత్సరాయన మాసాది కాలభేదము, స్మృతం=స్మరింపఁబడు చున్నది.

తా॥ సూర్యుఁడు సర్వప్రపంచమునకుఁ పైభాగమందుండి కిరణములను ధరించి ప్రకాశింపఁజేయుచున్నాఁడు. సూర్యునియొక్క ఆ కిరణముల ప్రకాశమువలనను సంకోచమువలనను సంవత్సరము అయనము ఋతువు మాసము పక్షము దినము మొదలగు కాలభేదములేర్పడియున్నవి. మఱియు విత్తనములు మొలచుట పెరుగుట వృక్షములగుట పుష్పించుట ఫలించుట మొదలగునవి యన్నియు సూర్యుని కిరణ ప్రకాశపరిపాకము వలననే గలుగుచున్నవి.

మూ॥ నదీవప్రభవాత్కాచిత్ । అక్షయ్యాత్స్యన్దతేయథా
తాంనద్యోభిసమాయన్తి । సోరుస్సతీననివర్తతే ॥

ప॥ నదీ । ఇవ । ప్రభవాత్ । కా । చిత్ । అక్షయ్యాత్ । స్యన్దతే । యథా । తాం । నద్యః । అభి । సం । ఆయన్తి । సా । ఊరుః । సతీ । న । నివర్తతే ॥

అ॥ అక్షయ్యాత్=ఎప్పుడును నాశనములేనటువంటి, ప్రభవాత్=ప్రవాహమువలన, ఉత్పన్నా=పుట్టిన, కాచిత్=ఒకానొకటియగు, నదీవ=మహానది, యథా=ఏప్రకారముగాను, స్యన్దతే=ప్రవహించుచున్నదో, యథా=ఏప్రకారముగాను, తాం=ఆమహానదిని, నద్యః=సెలయేళ్లు, అభిసమాయన్తి=అంతటను కలిసికొనుచున్నవో, సా=ఆనది, ఊరుస్సతీ=చిన్నసదులుకలియుటచే గొప్పదియగుచు, యథా=ఏప్రకారముగాను, ననివర్తతే=ఎప్పుడునెండిపోదో॥

మూ॥ ఏవంనానాసముత్థానాః । కాలాస్సంవత్సరగ్గ్శ్రితాః । అణుశశ్చమహాశశ్చ । సర్వేసమవయన్త్రితం॥

ప॥ ఏవం । నానాసముత్థానాః । కాలాః । సంవత్సరం । శ్రితాః। అణుశః । చ । మహాశః । చ । సర్వే । సం । అవయన్తి । తం॥

అ॥ ఏవం = ఈప్రకారముగానే; నానాసముత్థానాః=అనేకవిధములుగాఁ బుట్టిన, కాలాః=అయనాదికాలములు, సంవత్సరం=సంవత్సరమును, శ్రితాః=ఆశ్రయించియున్నవి, అనఁగా, అణుశశ్చ=క్షణముమహూర్తరూపమైన స్వల్పకాలము

లును, మహాళ్ళ్చ=దివసపక్షరూపమైన మహాకాలములును, సర్వే=అన్ని కాలములును, తం=ఆసంవత్సరమును సమవయన్తీ=పొందియున్నవి.

తా॥ అనేకచిన్నదులు కలియుటచేత గొప్పదియగుచు నెల్లప్పుడు నెడతెగక పాఱుచుండెడి ప్రవాహముకలదియై నాశనములేనిది యగుచు గంగా గోదావర్యాదులవలెనే మహానది యెట్టులగునో ఆప్రకారముగానే క్షణముహూర్తాదిరూపమైన చిన్నకాలములును దివసపక్షాదిరూపమైన మహాకాలములును ఏవికలవో అవియన్నియు సంవత్సరము నాశ్రయించి మహాకాలముగాఁ జెప్పఁబడుచున్నవి.

మూ॥ స తైస్సర్వైః స్సమావిష్టః । ఊరుస్సన్న నివర్తతే । అధి సంవత్సరం విద్యాత్ । తదేవలక్షణే ॥ ౫ ॥ ౨ ॥

ప॥ సః । తైః । సర్వైః । సం । ఆవిష్టః । ఊరుః । సన్ । న । నివర్తతే । అధి । సంవత్సరం । విద్యాత్ । తత్ । ఏవ । లక్షణే ॥

అ॥ సః=ఆ సంవత్సరము, తైః= ఆ పూర్వోక్తములైన, సర్వైః= సమస్తమైన కాలావయవాదులచేత । సమావిష్టః= మిక్కిలి కూడుకొనినదై, ఊరుస్సన్=గొప్పదియగుచు, ననివర్తతే=ఎప్పుడును ఆఁపుదలచేయబడదు. ఇఁక నేమనఁగాఁ బ్రభవవిభవాది సంవత్సరరూపముగాఁ బ్రవర్తించుచునే యుండును, తస్మాత్=ఆకారణమువలన, సర్వంజగత్=సమస్తమైన ప్రపంచము, అధిసంవత్సరం=సంవత్సరము నాశ్రయించియున్నదని, విద్యాత్= తెలిసికొనవలయును, లక్షణే=ఈ కాలస్వరూపము తెలియఁబడిన దగుచునుండఁగా, తదేవ=ఆ సంవత్సర స్వరూపము, అవగమ్యతే=తెలియఁబడుచున్నది.

తా॥ ఆ సంవత్సరము అణువు మొదలుగాఁగల సమస్త అవయవములతోఁ గూడినదై గొప్పదియగుచు నెప్పుడు విరామమునుబొందదు. ప్రభవవిభవాదిసంవత్సరరూపముగాఁబ్రవర్తించుచునే యుండును. ఆ హేతువువలన సమస్తమైన ప్రపంచము సంవత్సరము నాశ్రయించియున్నది. కావునఁగాల స్వరూపమును దెలిసికొనినయెడల సంవత్సర స్వరూపము తెలియఁ బడుచున్నది.

మూ॥ అణుభిశ్చమహద్భిశ్చ । సమారూఢః ప్రదృశ్యతే । సంవత్సరః ప్రత్యక్షేణ । నాధిసత్వః ప్రదృశ్యతే ॥

ప॥ అణుభిః । చ । మహద్భిః । చ । సం । ఆరూఢః । ప్ర । దృశ్యతే సంవత్సరః । ప్రత్యక్షేణ । న । అధిసత్వః । ప్ర । దృశ్యతే॥

అ॥ అణుభిశ్చ=క్షణము మొదలగు స్వల్ప కాలములచేతను, మహద్భిశ్చ=దినము మొదలగునధిక కాలములచేతను, సమారూఢః=మిక్కిలియేర్పడిన, సంవత్సరః=సంవత్సరము, ప్రత్యక్షేణ=ప్రత్యక్షముచేత, ప్రదృశ్యతే= తెలియఁబడుచున్నది, అధిసత్వః=అందఱకుఁ దెలియఁబడు చుండెడికాలముకన్న వేరైనపరమాత్మ స్వరూపమగు కాలము, నప్రదృశ్యతే=శాస్త్రవిచారణలేక తెలియఁబడదు.

తా॥ క్షణము మొదలగు స్వల్పకాలములచేత దివసము మొదలగు మహాకాలములచేత నేర్పడియున్న ప్రభవాది సంవత్సరములు జ్ఞానములేనిపిల్లలు మొదలగు నందఱకును దెలియఁబడుచునే యున్నవి. ఇఁకనేమనఁగా మనయందఱికిఁదెలియబడు చుండెడి కాలము కన్న వేరైన పరమాత్మ స్వరూపమగు కాలము శాస్త్రాభ్యాసము లేక తెలియఁబడనేరదు.

మూ॥ పటరోవిక్లిధః పిఙ్గః । ఏతద్వరుణ లక్షణం । యత్రైతదుపదృశ్యతే । సహస్రంతత్రనీయతే ॥

ప॥ పటరః । విక్లిధః । పింగః । ఏతత్ । వరుణలక్షణం । యత్ర । ఏతత్ । ఉప । దృశ్యతే । సహస్రం । తత్ర । నీయతే ॥

అ॥ పటరః = వస్త్రమువంటి చర్మవిశేషముగలదియు, విక్లిధః = అనేక క్లేశములుగలదియు, పింగః= ధూమ్రము ఎఱుపు తెలుపు మొదలగు రంగులుగలదియునగు ఏనేత్రగోళకముకలదో, ఏతత్ = ఈ నేత్రగోళకమే, వరుణలక్షణం = పరమార్థ చైతన్య స్వరూపమగు కాలమునకు ఆవరణ స్వరూపమైనది, యత్ర = మాంసరూపమగు ఏ నేత్రగోళకమందు, ఏతత్ = ఈప్రపంచము, ఉపదృశ్యతే = చూడఁబడుచున్నదో, తత్ర =ఆనేత్రగోళమందు, సహస్రం = క్షణము ముహూర్తము దినము మొదలగు ననేక కాలభేదములు, నీయతే = వ్యవహరింపఁబడుచున్నవి.

తా॥ చర్మరూపమైన ఱెప్పలను వస్త్రముగలదియు అనేకబాధలు పొందునదియు ఎఱుపు, తెలుపు మొదలగు రంగులుగలదియునగు నేత్రగోళకమే పరమాత్మ స్వరూపమగు కాలమును దెలిసికొనుటకు నాటంకముగానున్నది. ఏలయనఁగా దినమ్ము, పక్షము మాసము, క్షణము ముహూర్తము మొదలగు ననేక కాలభేదములచే వ్యవహరింపఁబడుచుండెడి యీప్రపంచమును జూచుచుండుటచేతఁ బరమాత్మ స్వరూపమగు కాలమును దెలిసికొనుటకు నభిలాషకలుగకున్నది.

మూ॥ ఏకగ్ంహిశిరోనానాముఖే । కృత్స్నంతదృతులక్షణం ౹ ఉభయతస్సప్తేంద్రియాణి । జల్పితన్త్వేవదివ్యతే ॥

ప॥ ఏకం । హి । శిరః । నానాముఖే । కృత్స్నం । తత్ । ఋతులక్షణం । ఉభయతః । సప్తేంద్రియాణి । జల్పితం । తు । ఏవ । దివ్యతే॥

అ॥ వ్యావహారిక కాలస్య=వ్యవహారసంబంధమైన కాలమునకు, ఏకం=ఒకటి యగు సంవత్సరము, శిరోహి=శిరస్సుగదా, నానాముఖే = దక్షిణోత్తరాయనములే ముఖము, తత్=అ, కృత్స్నం=సంవత్సరాయనములను జెప్పుటంతయు, ఋతులక్షణం=ఋతువులను జెప్పుటయే, ఉభయతః=రెండుపార్శ్వములయందును, సప్తేంద్రియాణి=ఏడింద్రియములున్నవి, ఏతత్=ఈ, జల్పితం = సంవత్సరము అయినములు ఋతువులు అని యుచ్చరించుట, దివ్యతఏవ=తెలియకమాట్లాడుటయే ॥

తా॥ కాలమునకు సంవత్సరము మనుష్యునకు శిరమువలె నున్నది. దక్షిణోత్తరాయనములు ముఖముగా నున్నవి. ఇక్కడ నానాశబ్దప్రయోగముచేత ఋతువులనుగూడ గ్రహింపవలయును. శిరస్సునకు రెండుపార్శ్వములయందును నాసారంధ్రములు రెండు చక్షురింద్రియములు రెండు కర్ణేంద్రియములు రెండు ముఖము ఒకటి మొత్తము ఏడు ఇంద్రియము లేతీరుననో ఆతీరున సంవత్సరమను శిరస్సునకు అయనములను ముఖము ఆఋఋతువులు నాసాదీంద్రియములుగాఁ జెప్పఁబడినవి గాని కేవలము సంవత్సరము అయనములు ఋతువులు అని చెప్పఁబడలేదు. ఈ సంవత్సరాయనాదిరూపముగాఁ జెప్పుట అజ్ఞానప్రలాపముగానే చెప్పఁబడినది.

మూ॥ శుక్లకృష్ణే సంవత్సరస్య । దక్షిణవామయోః పార్శ్వయోః । తస్యైషాభవతి ॥

ప॥ శుక్లకృష్ణే । సంవత్సరస్య । దక్షిణవామయోః । పార్శ్వయోః । తస్య । ఏషా । భవతి ॥

అ॥ సంవత్సరస్య=సంవత్సరమునకు, దక్షిణవామయోః=కుడియెడమలనఁదగు, పార్శ్వయోః = దక్షిణాయన ఉత్తరాయనములను రెండుప్రక్కలను, శుక్లకృష్ణే=తెలుపు నలుపు రంగులు గలవి యన్నట్లు, అహోరాత్రే=దివారాత్రములు, విద్యేతే=ఉన్నవి, తస్య=ఆవిషయమును బ్రతిపాదనచేయుటకు, ఏషా = ఈ ముందు జెప్పఁబోవు మంత్రము, విద్యతే=ఉన్నది.

తా॥ శిరస్సునకు కుడియెడమలను రెండు పార్శ్వములున్నట్లు సంవత్సరమునకు దక్షిణాయనము అనియు ఉత్తరాయనము అనియు రెండు పార్శ్వములున్నవి. ఆ రెండు పార్శ్వములయందును తెలుపునలుపు రంగులు గలవియున్నట్లు పగలు రాత్రియును గలవు. ఈ విషయమును గురించి ముందు చెప్పబోవు మంత్రమునందుఁ జెప్పబడి యున్నది.

మూ॥ శుక్రంతే అన్యద్యజతంతే అన్యత్ । విషురూపే అహనీద్యౌరి
వాసి । విశ్వాహిమాయా అవసిస్వధావః । భద్రాతే పూష
న్నిహారాతిరస్త్వితి ॥

ప॥ శుక్రం । తే । అన్యత్ । యజతం । తే । అన్యత్ । విషురూపే । అహనీ ద్యౌః । ఇవ । అసి । విశ్వాః । హి । మాయాః । అవసి । స్వధావః । భద్రా । తే । పూషన్ । ఇహ । రాతిః । అస్తు । ఇతి ॥

అ॥ హేపూషన్=జగత్తును పోషించునట్టి యో సంవత్సరమా, । తే=నీ యొక్క, శుక్రం=తెలుపువర్ణముగల పగలు, అన్యత్=వేరైనది, తే=నీయొక్క, యజతం=పూజనీయమైన రాత్రి రూపము, అన్యత్=వేరైనది, తత్=ఆ హేతువు వలన, అహనీ=దివారాత్రులు, విషురూపే=పరస్పరము విలక్షణముగా నున్నవి, త్వం=నీవు, తయోః=ఆ యహోరాత్రములలో, ద్యౌరివ=ప్రకటిస్వరూపమైన ప్రవర్తకుడువలెనే, అసి=అయితివి, హేస్వధావః=అన్నమును గలిగింపజేయునట్టి యోసంవత్సరమా !, విశ్వాః=సమస్తమైన, మాయాః=దినము పక్షము మాసము మొదలగు సమస్తమైన కల్పితాకారములను ధరించినవాడవై, అవసి=పాలించుచున్నావు, హేపూషన్=ఓ సంవత్సరమా ! తే=నీయొక్క, రాతిః=రాత్రి, భద్రా=శుభప్రదమైనదై, అస్తు=అగుఁగాక, ఇతి=ఈలాగని పూర్వమందు చెప్పబడిన విషయము నీ మంత్రమునందు విశదముగాఁ జెప్పబడియెను.

తా॥ జగత్తును పోషించునట్టి యోసంవత్సరమా! తెలుపువర్ణముగల నీయొక్క పగలు వేఱుగానున్నది. నలుపురంగుగల నీ యొక్క రాత్రియు వేఱుగానున్నది. కావున అహోరాత్రములు పరస్పరము వేఱుగానున్నవి. నీవు ఆ యహోరాత్రము లలోఁబ్రకటి స్వరూపముగల వాఁడవై సమస్తప్రాణులను ఆయావ్యాపారముల యందుఁ బ్రవర్తింపజేయుచున్నావు. మఱియు దినము పక్షము మాసము మొదలగు

ననేక రూపావయవములను ధరించి ఆయా ప్రాణులకు నాయా ఆహారములను గల్పించి, పోషించుచున్నావు. నీ సంబంధమగు రాత్రియు నేఁజేయునట్టి కర్మలయందను కూలమైనదై శుభఫలము నొసగుగాక, అని పూర్వవిషయము ఈ మంత్రమునందు విశదముగాఁ జెప్పఁబడియె.

మూ॥ నాత్రిభువనం॥ ౭॥ నపూషా । నపశవః । నాదిత్యస్సంవత్సర ఏవప్రత్యక్షేణ ప్రియతమం విద్యాత్ । ఏతద్వై సంవత్సర స్యప్రియతమగ్ం రూపం । యోస్యమహానర్థ ఉత్పత్స్య మానోభవతి । ఇదంపుణ్యం కురుష్వేతి । తమాహరణం దద్యాత్॥ ౨॥

ప॥ న । అత్ర । భువనం । న । పూషా । న । పశవః । న । ఆదిత్యః । సంవత్సరః । ఏవ । ప్రత్యక్షేణ । ప్రియతమం । విద్యాత్ । ఏతత్ । వై । సంవత్సరస్య । ప్రియతమం । రూపం । యః । అస్య । మహాన్ । అర్థః । ఉత్పత్స్యమానః । భవతి । ఇదం । పుణ్యం । కురుష్వ । ఇతి । తం । ఆహరణం । దద్యాత్ ॥

అ॥ అత్ర=ఈ పారమార్థికతత్త్వమందు, భువనం=భూతజాలము, నాస్తి=లేదు, పూషా=పోషకుఁడు, నాస్తి=లేఁడు, పశవః=మనుష్యపశ్వాదులును, నసన్తి=లేవు, ఆదిత్యః=సూర్యుఁడును నాస్తి=లేఁడు, సంవత్సరఏవ, పారమార్థిక కాలతత్త్వమైన చైతన్యమే సంవత్సరమను పేరుచేఁజెప్పఁబడుచున్నదై అఖండముగానున్నది, సర్వః= సమస్తప్రాణిసమూహము, ప్రియతమం=అతిప్రియతమమైన రూపమును, వేత్తి= తెలిసికొనుచున్నది, ఏతత్=ఈ దివసపక్షమాసాదులే, సంవత్సరస్య=సంవత్సరము యొక్క, ప్రియతమం=ప్రేమాస్పదమైన, రూపం=రూపముగా, ఉచ్యతే=చెప్పఁ బడుచున్నది, యః=ఏక్రతువు, ఉత్పత్స్యమానః=పుట్టింపఁబడినదై, అస్య=ఈ యజమానికి, మహాన్=అధికమైన, అర్థః=ఫలమునిచ్చునది, భవతి=అగుచున్నదో, ఇదం=ఈ, పుణ్యం=పుణ్యకార్యమును, కురుష్వ=చేయుము, ఇతి=ఈలాగని, తం= అక్రతువును, ఆహరణం=చేయదగినదిగా, దద్యాత్=శిష్యులకొఱకు ఉపదేశరూప ముగా నియ్యవలయును.

తా॥ ఈ పారమార్థిక చైతన్య స్వరూపమగు కాలమునందు భూతజాలము పోషకుఁడు మనుష్యులు పశువులు సూర్యుఁడు చంద్రుఁడు మొదలగు నే విధమైన

తా॥ శిరస్సునకు గుడిమొదములను రెండు పార్శ్వములున్నట్లు సంవత్సరము నకు దక్షిణాయనము అనియు ఉత్తరాయనము అనియు రెండు పార్శ్వములున్నవి. ఆ రెండు పార్శ్వములందునను తెలుపునలుపు రంగులు గలవియున్నట్లు పగలు రాత్రి యును గలవు. ఈ విషయమును గురించి ముందు చెప్పబోవు మంత్రమునందుఁ జెప్పబడి యున్నది.

మూ॥ శుక్రంతే అన్యద్యజతంతే అన్యత్ । విషురూపే అహనీద్యౌరి వాసి । విశ్వాహిమాయా అవసిస్వధావః । భద్రాతే పూష న్నిహరాతిరస్త్వతి ॥

ప॥ శుక్రం । తే । అన్యత్ । యజతం । తే । అన్యత్ । విషురూపే । అహనీ ద్యౌః । ఇవ । అసి । విశ్వాః । హి । మాయాః । అవసి । స్వధావః । భద్రా । తే । పూషన్ । ఇహ । రాతిః । అస్తు । ఇతి ॥

అ॥ హేపూషన్=జగత్తును పోషించునట్టి ఓ సంవత్సరమా, । తే=నీ యొక్క, శుక్రం=తెలుపువర్ణముగల పగలు, అన్యత్=వేరైనది, తే=నీయొక్క, యజతం=పూజనీయమైన రాత్రి రూపము, అన్యత్=వేరైనది, తత్=ఆ హేతువు వలన, అహనీ=దివారాత్రులు, విషురూపే=పరస్పరము విలక్షణముగా నున్నవి, త్వం=నీవు, తయోః=ఆ యహోరాత్రములలో, ద్యౌరివ=ప్రకటిస్వరూపమైన ప్రవర్త కుడువలెనే, అసి=అయితివి, హేస్వధావః=అన్నమును గలిగింపజేయునట్టి యోసం వత్సరమా!, విశ్వాః=సమస్తమైన, మాయాః=దినము పక్షము మాసము మొదలగు సమస్తమైన కల్పితాకారములను ధరించినవాడవై, అవసి=పాలించుచున్నావు, హేపూషన్=ఓ సంవత్సరమా! తే=నీయొక్క, రాతిః=రాత్రి, భద్రా=శుభప్రద మైనదై, అస్తు=అగుఁగాక, ఇతి=ఈలాగని పూర్వమందు చెప్పబడిన విషయము నీ మంత్రమునందు విశదముగాఁ జెప్పబడియెను.

తా॥ జగత్తును పోషించునట్టి యోసంవత్సరమా! తెలుపువర్ణముగల నీయొక్క పగలు వేఱుగానున్నది. నలుపురంగుగల నీ యొక్క రాత్రియు వేఱుగానున్నది. కాఁబట్టి అహోరాత్రములు పరస్పరము వేఱుగానున్నవి. నీవు ఆ యహోరాత్రము లలోఁబ్రకటి స్వరూపముగల వాఁడవై సమస్తప్రాణులను అయావ్యాపారముల యందుఁ బ్రవర్తింపజేయుచున్నావు. మఱియు దినము పక్షము మాసము మొదలగు

ననేక రూపావయవములను ధరించి అయా ప్రాణులకు నాయా ఆహారములను గల్పించి పోషించుచున్నావు. నీ సంబంధమగు రాత్రియు నేఁడే యొసట్టి కర్మలయందను కూలమైనదై శుభఫలము నొసగుగాక, అని పూర్వవిషయము ఈ మంత్రమునందు విశదముగాఁ జెప్పఁబడియె.

మూ॥ నాత్రిభువనం॥ ౭॥ నపూషా । నపశవః । నాదిత్యస్సంవత్సర ఏవప్రిత్యక్షేణ ప్రియతమం విద్యాత్ । ఏతద్వై సంవత్సర స్యప్రియతమగ్ం రూపం । యోస్యమహానర్థ ఉత్పత్స్య మానోభవతి । ఇదంపుణ్యం కురుష్వేతి । తమాహరణం దద్యాత్॥ ౨॥

ప॥ న । అత్ర । భువనం । న । పూషా । న । పశవః । న । ఆదిత్యః । సంవత్సరః । ఏవ । ప్రత్యక్షేణ । ప్రియతమం । విద్యాత్ । ఏతత్ । వై । సంవత్సరస్య । ప్రియతమం । రూపం । యః । అస్య । మహాన్ । అర్థః । ఉత్పత్స్యమానః । భవతి । ఇదం । పుణ్యం । కురుష్వ । ఇతి । తం । ఆహరణం । దద్యాత్ ॥

అ॥ అత్ర=ఈ పారమార్థికతత్వమందు, భువనం=భూతజాలము, నాస్తి=లేదు, పూషా=పోషకుఁడు, నాస్తి=లేఁడు, పశవః=మనుష్యపశ్వాదులును, నసన్తి=లేవు, ఆదిత్యః=సూర్యుఁడును నాస్తి=లేఁడు, సంవత్సరఏవ, పారమార్థిక కాలతత్వమైన చైతన్యమే సంవత్సరమను పేరుచేఁజెప్పఁబడుచున్నదై అఖండముగానున్నది, సర్వః=సమస్తప్రాణిసమూహము, ప్రియతమం=అతిప్రియప్రితమైన రూపమును, వేత్తి=తెలిసికొనుచున్నది, ఏతత్=ఈ దివసపక్షమాసాదులే, సంవత్సరస్య=సంవత్సరము యొక్క, ప్రియతమం=ప్రేమాస్పదమైన, రూపం=రూపముగా, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, యః=ఏక్రతువు, ఉత్పత్స్యమానః=పుట్టింపఁబడినదై, అస్య=ఈ యజమానికి, మహాన్=అధికమైన, అర్థః=ఫలమునిచ్చునది, భవతి=అగుచున్నదో, ఇదం=ఈ, పుణ్యం=పుణ్యకార్యమును, కురుష్వ=చేయుము, ఇతి=ఈలాగని, తం=ఆక్రతువును, ఆహరణం=చేయదగినదిగా, దద్యాత్=శిష్యులకొసఁగు ఉపదేశరూపముగా నిశ్చయింపవలయును.

తా॥ ఈ పారమార్థిక చైతన్య స్వరూపమగు కాలమునందు భూతజాలము పోషకుఁడు మనుష్యులు పశువులు సూర్యుఁడు చంద్రుఁడు మొదలగు నే విధమైన

ప్రపంచము వాస్తవముగా నుండియుండలేదు. ఇంక నేమి యున్నదనంగా, పారమార్థికమైన చైతన్యమే కాలస్వరూపముగా సంవత్సరమను నామముచేఁ జెప్పఁబడుచు ఖండాకారము గానున్నది. అట్లైన ఈ సమస్త ప్రాణులచేత నది యెందు నిమిత్తము తెలిసికొనఁబడలేదనంగా=ఈ ప్రాణులన్నియుఁ దమ యింద్రియములకుఁ బ్రత్యక్షముగా గోచరమయ్యెడి రూపాదికమును బ్రియమైనదానిఁగా గ్రహించుచున్నవి. శాస్త్రవిచారణ లేకపోవుటచేఁ బారమార్థిక తత్త్వమును దెలిసికొనలేకున్నవి. కాఁబట్టి యిక్కడ సంవత్సరముయొక్క ప్రియమైన రూపమేమి యనఁగా,=క్షణము ముహూర్తము దినము పక్షము మాసము మొదలగునవియే సంవత్సరముయొక్క ప్రియమైన రూపముగా శాస్త్రజ్ఞానరహితులకుఁ దోఁచఁబడుచున్నది. అందువలన ఏ క్రతువు యజమానునకు విశేషఫలమును గలుగఁజేయుచున్నదో పుణ్యప్రదమైన అట్టి క్రతువును జేయుమని శాస్త్రజ్ఞానములేని శిష్యుని కొఱకు గురువుపదేశముఁ జేయవలయును.

ఇతి ద్వితీయోనువాకస్సమాప్తః.

—♦ అథతృతీయోను వాకప్రారంభః ♦—

మూ॥ సాకఞ్జానాగ్ంసప్తథమాహురేకజం। షడుద్యమాఋషయో దేవజాఇతి। తేషామిష్టాని విహితానిధామశః। స్థాత్రేరేజంతే వికృతానిరూపశః॥

ప॥ సాకంజానాం। సప్తథం। ఆహుః। ఏకజం। షట్। ఉద్యమాః। ఋషయః। దేవజాః। ఇతి। తేషాం। ఇష్టాని। విహితాని। ధామశః। స్థాత్రే। రేజంతే। వికృతాని। రూపశః।

అ॥ సాకంజానాం= కూడబుట్టిన సూర్యకిరణములలో, సప్తథం= సప్తథము ఏడవకిరణము, ఏకజం= ఇతరకిరణములకంటె ప్రత్యేకముగాఁబుట్టినదానిఁగా, ఆహుః = చెప్పిరి, ఋషయః = ప్రకాశము కలపాటవలన ఋషులతో సమానమైనవియు, దేవజాః = సూర్యునివలనఁ బుట్టిన, షట్ = ఇతరమైన ఆఱుకిరణములు, ఉద్యమాఇతి = ఉట్టికి ఆఱుచేరలువలెనే యున్నవని, ఆహుః = చెప్పిరి, తేషాం = ఆ యాఱుకిరణములకు, ఇష్టాని = ఇష్టములైన, ధామశః = స్థానములు, విహితాని = బ్రహ్మచేవసంతాది ఋతురూపముగా

నేర్పఱుపఁబడినవి, స్థాతే = ప్రపంచముయొక్క స్థితికొఱకు, విక్రుతాని= శీతోష్ణాది రూపముగా విలక్షణములైన, రూపకః= రూపములు, రేజన్తే= ప్రవర్తించు చున్నవి.

తా॥ కూడఁబుట్టిన సూర్యకిరణములలో సప్తమమను ఏడవ కిరణము ప్రత్యేకముగాఁబుట్టినదానిగాఁ జెప్పిరి. కాంతిగలవాటచేఁబుఘులతో సమానమైనవనియు సూర్యునివలనఁబుట్టిన మిగిలిన యారు కిరణములు ఉట్టికి చేయఁబడెనే యున్నవనియు జెప్పిరి. ప్రపంచముయొక్క స్థితికొఱకు వసంతాది ఋతురూపముగా నా యారు కిరణములకు నభిమతమయిన స్థానములను బ్రహ్మకల్పించి ప్రవర్తింపఁజేసెను.

మూ॥ కోనుమర్త్యా అమిథితః । సఖాసఖాయమబ్రవీత్ । జహాకో అస్మదీషతే ॥

ప॥ కః । ను । మర్త్యాః । అమిథితః । సఖా । సఖాయం । అబ్రవీత్ జహాకః । అస్మత్ । ఈషతే ॥

అ॥ మర్త్యాః = మరణస్వభావముగలవోా మనుష్యులారా, అమిథితః = రెండవవానిచే బాధింపఁబడని, కోను = ఏ, సఖా = స్నేహితుఁడు, సఖాయం = అబాధింపని స్నేహితుని, ఇతి = ఈప్రకారముగా, అబ్రవీత్ = పలుకును ?, ఇతికిం = ఈప్రకారమనఁగా నదియేమన, జహాకః = ఘాతుకస్వభావముగల, అయం=ఇతఁడు, అస్మత్ = నాసమీపమువలన, ఈషతే = పొఁటిపోవుఁగాక॥

తా॥ మరణస్వభావముగల యోమనుష్యులారా! స్నేహముగల యిద్దఱిస్నేహితులలో నొకఁడు మరియొకని బాధింపకుండఁగా నాబాధింపని స్నేహిని బాధింపఁబడనివాఁడు ఈనాస్నేహితుఁడు నన్ను బాధింపుచున్నాఁడుగాన నాసమీపమునుఁడి పొఁటిపోవుఁగాక అని పలుకునా ? అనఁగాఁ జెప్పుడు.

మూ॥ యస్తిత్యాజసఖివిదగ్ం సఖాయం । నతస్యవాచ్యపిభాగోఅస్తి । యదీగ్ంశృణోత్యలకగ్ం శృణోతి ॥

ప॥ యః । తిత్యాజ । సఖివిదం । సఖాయం । న । తస్య । వాచి । అపి । భాగః । అస్తి । యత్ । ఈం । శృణోతి । అలకం । శృణోతి ॥

అ॥ యః=కూరస్వభావముగల యేపురుషుఁడు, సఖివిదం=వీఁడు నాస్నేహితుఁడని గుర్తెఱిఁగియున్న, సఖాయం = ఇతరస్నేహితుని, తిత్యాజ = విడిచిపెట్టుచున్నాఁడో, తస్య=అమిత్రద్రోహికి, వాచ్యపి = వేదశాస్త్రములపఠనములయందు

దును, భాగః=భాగ్యము, నాస్తి=లేదు, అయం=ఈమిత్రద్రోహి, ఈం=వేదవాక్య మును, శృణోతీతియత్=విన్నాఁడనిన మాట యేదికలదో, అలకం = అసత్యమును, శృణోతి=వినెనని చెప్పఁబడయును ॥

తా॥ ఇద్దఱు మిత్రులలోఁ గ్రూరస్వభావముగల యొకమిత్రుఁడు వీఁడు నాస్నేహితుఁడని గుర్తెఱిగియున్న మంచిస్వభావముగల మరియొకమిత్రుని విడిచి పెట్టుచున్నాఁడో అట్టి మిత్రద్రోహియైన పురుషుఁడు వేదశాస్త్రములను జదివినను ఫల మేమియును లేదు. ఇఁకను వాని యర్థమును దెలిసికొనినను వాని క్రియల నాచ రించినను ఫలములేదని చెప్పనవసరములేదు. లేక అట్టి మిత్రద్రోహి వేదమును విన్నను అసత్యమును విన్నవాఁ డగును. ఎందువలన ననఁగా, దేనియందును నమ్మ కము లేనివాఁ డగుటవలన సుకృతమునుఁ బొందఁదగినవాఁడు గాఁడని చెప్పఁ బడియెను.

మూ॥ నహిప్రవేద సుకృతస్య పన్థామితి ॥ ఋతుర్ ఋతునా నుద్య మానః । విననా దాభిధావః । షష్టిశ్చత్రిగ్ం శకావల్గాః । శుక్లకృష్ణౌచ షాష్టికా ॥

ప॥ న । హి । ప్ర । వేద । సుకృతస్య । పన్థాం । ఇతి ॥

అ॥ తస్మాత్ = ఆకారణమువలన, అయం = ఈ వేదద్రోహి, సుకృతస్య= పుణ్యముయొక్క, పన్థాం=మార్గమును, నహిప్రవేద=తెలిసికొనలేఁడుగదా ॥

తా॥ మిత్రునియందును వేదమందును నమ్మకము లేనివాఁ డగుటచేఁ బుణ్య మార్గము పొందనేరఁడు అని చెప్పఁబడినది గాన మిత్రునియందు విశ్వాసమును వేద శాస్త్రములయందుఁ బ్రామాణ్యబుద్ధియుఁగల పురుషుఁడు పుణ్యమార్గమును బొందును. మంత్రముపైని వ్రాయఁబడినది గాన నిక్కడ వ్రాయలేదు.

ప॥ ఋతుః । ఋతునా । నుద్యమానః । వినదాద । అభిధావః । షష్టిః చ । త్రింశకాః । వల్గాః । శుక్లకృష్ణౌ । చ । షాష్టికా ॥

అ॥ ఋతునా=ఒక ఋతువుచేత,ఋతుః=మఱియొకఋతువు, నుద్యమానః= ప్రేరేపింపఁబడినదై, అభిధావః=అభిముఖముగా వచ్చుచున్నదై, వినదాద=ధ్వనిఁ జేయుచున్నది, త్రింశకాః=ముప్పది ముహూర్తములు గలది యొక యహోరాత్ర మని చెప్పఁబడుచున్నది, తాదృశాః=అట్టువంటి, షష్టిః=అఱువది యహోరాత్రి

ములు, వల్గాః=సమూహముకలవై, ఋతుః=ఒక ఋతువని చెప్పఁబడుచున్నది, శుక్లకృష్ణౌ=శుక్లపక్ష బహుళపక్షములు, షాష్టికౌ=రెండు భాగములుగల యఱువది దినములయందుఁ బొందినవి. అనఁగా అఱువది దినములను రెండు భాగములు సేయఁగా ముప్పది దినము లొకభాగమగును. అట్టిభాగమును మాసమని చెప్పుదురు. అటువంటి మాసములోఁ బదియేను దినములు శుక్లపక్షమనియుఁ బదియేను దినములు బహుళపక్షమనియుఁ జెప్పుదురు. ఈ తీరుననే ప్రతి మాసమునందును జెప్పఁబడును. కాఁబట్టి ఋతు స్వభావం బీమంత్రములోఁ జెప్పఁబడియెను.

తా॥ వసంతఋతువు మొదలగునవి యొక్కొక్క ఋతువు వెళ్ళుచుండఁగా అనంతరమే మఱియొక ఋతువు ప్రవేశించుటవలన ఆ యా యా ఋతువుల కను గుణమైన ధ్వనులను జీవరాసులవలనఁ గలిగించుచున్నవి. ఈ ఋతుస్వభావం బెట్టి దనఁగా - ముప్పది ముహూర్తములు కలియుటచే నొకయహోరాత్రి మనఁబడును. అట్టి యహోరాత్రములు అఱువది యయినయెడల నొక ఋతువు అని చెప్పఁబడును. ఈ ఋతువులో ముప్పదిదినముల వంతున రెండుమాసములు కలవు. ఒక్కొక్క మాసములో మొదటి పదియేను దినములు శుక్లపక్షమనియు రెండవ పదియేను దినములు బహుళపక్షమనియుఁ జెప్పఁబడును. ఈ తీరున నే ప్రతిఋతువునందుఁ జెప్పఁబడును.

మూ॥ సారాగవస్త్రైర్జరదక్షః । వసన్తోవసుభిస్సహ । సంవత్సరస్య

సవితుః । ప్రైషకృత్ప్రథమస్స్మృతః॥

ప॥ సారాగవస్త్రైః । జరదక్షః । వసన్తః । వసుభిః । సహ । సంవత్సరస్య । సవితుః । ప్రైషకృత్ । ప్రథమః ॥ స్మృతః ॥

అ॥ సారాగవస్త్రైః=అంతటను ఎఱ్ఱనగు వస్త్రములుగల, వసుభిః=వసువులను దేవతలతోఁగూడ గూడియున్నదియు, జరదక్షః=జలమందు నేర్పుకలదియు । సవితుః= ప్రేరకుఁడు అయిన, సంవత్సరస్య=సంవత్సరముయొక్క, ప్రైషకృత్=ఆజ్ఞకు వశవర్తిగానున్నట్టి, వసన్తః=వసంతర్తువు, ప్రథమః=ఋతువులలో మొదటిదిగా, స్మృతః=చెప్పఁబడినది.

తా॥ శృంగారముకొఱకు ఎఱుపు మొదలగు రంగులచే వ్యాప్తమై యున్న వస్త్రములను ధరించియుండు వసువులు దేవతలు గలదియు జలమును వర్షాకాలము వలెనే మలినముగా నుండనీయక స్వచ్ఛముగా నుంచుటచే జలమందు నేర్పగలదియు అన్ని ఋతువులను ప్రేరేపించుటచే నట్టి సంవత్సరము యొక్క యాజ్ఞాప్రకారము ప్రవర్తించునదియు ఋతువులలో ప్రధానమైన వసంతఋతువు మొదటిదిగాఁ జెప్పఁబడిరెను.

మూ॥ అమూనాదయతేత్యన్యాన్॥ చ॥ అమూగ్ శ్చపరిరక్షతః। ఏతా వాచః ప్రియుజ్యన్తే । యత్రైతదుపదృశ్యతే॥

ప॥ అమూన్ । ఆదయత । ఇతి । అన్యాన్ । అమూన్ । చ । పరిరక్షతః । ఏతాః । వాచః । ప్రయుజ్యన్తే । యత్ర । ఏతత్ ఉప । దృశ్యతే॥

అ॥ హే పురుషాః =ఓపురుషులారా ! అమూన్= ఈబంధువులను, అద యత = భుజింపఁజేయుఁడు, అన్యాన్ = ఇతరులైన, అమూన్ = ఈ బ్రాహ్మణులు మొదలగు వారిని, పరిరక్షత = పోషింపుఁడు, ఇతి = ఈలాగునవని, యత్ర = ఏఋతువునందు, ఏతాః ఈ, వాచః = వాక్యములు, ప్రయుజ్యన్తే= ప్రవర్తించు చున్నవో, ఏతత్ = అట్టువంటి ఈఋతువు, వసన్తః =వసన్తఋతువుగా, ఉపదృశ్యతే = చూడఁబడుచున్నది.

తా॥ వసన్తఋతువునందు వివాహము ఉపనయనము యజ్ఞము మొదలగునవి చేసి వచ్చియున్న బంధువులను బ్రాహ్మణులను అన్నదానాదులచేఁ దృప్తినొందించుటచే ఆవసన్తఋతువు ముఖ్యమైనదిగాఁ జెప్పఁబడిరెను.

మూ॥ ఏతదేవవిజానీయాత్ । ప్రమాణంకాలపర్యయే । విశేషణం తువ్యక్ష్యామః । ఋతూనాంతన్నిబోధత ॥

ప॥ ఏతత్ । ఏవ । విజానీయాత్ । ప్రమాణం। కాలపర్యయే । విశేషణం।తు । వక్ష్యామః । ఋతూనాం । తం । నిబోధత ॥

అ॥ కాలపర్యయే = కాలభేదముగల గ్రీష్మాది ఋతువులయందునను, ఏతదేవ = ఇట్టువంటి, ప్రమాణం = ప్రమాణమును, విజానీయాత్ = తెలిసికొనవలయును, ఋతూనాం = గ్రీష్మాది ఋతువులయొక్క, విశేషణంతు = విశేషస్వరూపమైన, వక్ష్యామః=చెప్పుచున్నాము, తం = అస్వరూపమును, నిబోధత = తెలిసికొనుఁడు.

తా॥ ఎఱుపురంగుగల వస్త్రములు మొదలగునవి వసన్తఋతువునకు విశేష ధర్మముగా నెట్లుగ్రహించియున్నారో ఆ ప్రకారముగానే గ్రీష్మాది ఋతువుల కును విశేషధర్మములున్నవని తెలిసికొనవలయును. కాఁబట్టి యాగ్రీష్మాదిర్తువుల విశేషస్వరూపమును జెప్పుచున్నాముగాన తెలిసికొనుఁడు.

మూ॥ శుక్లవాసారుద్రగణాః । గ్రీష్మేణావర్తతేసహ । నిదహత్పృథి వీంసర్వాం॥ ౧౦॥ జ్యోతిషాప్రతిఖ్యేనసః॥

ప॥ శుక్లవాసాః । రుద్రగణాః । గ్రీష్మేణ । ఆవర్తతే । సహ । నిదహత్ । పృథివీం । సర్వాం । జ్యోతిషా । అప్రతిఖ్యేన । సః॥

అ॥ రుద్రగణాః=ఏకాదశరుద్రుల సమూహము, శుక్లవాసాః=తెల్లనివస్త్ర ములుగలదై, గ్రీష్మేణసహ=గ్రీష్మర్తువుతోఁగూడ, ఆవర్తతే=ఎల్లప్పుడు కలసి యుండును, సః=రుద్రులతోఁగూడియున్న ఆగ్రీష్మఋతువు, అప్రతిఖ్యేన= మిక్కిలి అధికమైన, జ్యోతిషా=వేఁడిమిచేత సర్వాం=సమస్తమైన, పృథివీం= భూమిని, నిదహత్=మిక్కిలి దహించుచున్నది॥

తా॥ ఏఋతువు శుభ్రమైన వస్త్రములుగల ఏకాదశ రుద్రులు అధిదేవతలు గాఁగలదై అమితమైన వేడిమిచే భూమినంతయును దహించుచున్నదో ఆఋతువును గ్రీష్మ ఋతువుగాఁ దెలిసికొనవలయును.

మూ॥ విశ్వరూపాణివాసాంసి । ఆదిత్యానాంనిబోధత । సంవత్స రీణం కర్మఫలం । వర్షాభిర్దదతాంసహ॥

ప॥ విశ్వరూపాణి । వాసాంసి । ఆదిత్యానాం । నిబోధత ।సంవత్సరీణం । కర్మఫలం । వర్షాభిః । దదతాం । సహ॥

అ॥ వర్షాభిస్సహ= వర్షర్తువుతోగూడినవారలై, సంవత్సరీణం= సంవత్సరప ర్యంతము అనుభవింపఁదగిన, కర్మఫలం= వ్యవసాయాది కర్మలఫలమును, దదతాం= ఇచ్చుచుండెడి, ఆదిత్యానాం= పండ్రెండుగురు సూర్యులయొక్క, వాసాంసి= వస్త్రములు, విశ్వరూపాణి= అనేకవర్ణములుకలవిగా, నిబోధత= తెలిసికొనుఁడు,

తా॥ యాభిరాదిత్యస్తపతీతి శ్రుత్యనుసారముగా సూర్యకిరణములవలన వర్షము గురియునని చెప్పుటచే వర్షర్తువునందు ద్వాదశాదిత్యులు వర్షమును గురిపించి కృషీ ఫలుల సస్యాదులను ఫలింపఁజేసి సర్వప్రాణులకు సంవత్సరపర్యంతము జీవనము నిచ్చు

వారలకు చున్నారు. అటువంటి యాదిత్యుల వస్త్రములు అనేకమయిన రంగులు కలవిగా నెఱుంగుదు.

మూ॥ అదుఃఖోదుఃఖచక్షురివ । తద్మాపీతఇవదృశ్యతే । శీతేనావ్యథయన్నివ । రురుదక్షఇవదృశ్యతే ॥

ప॥ అదుఃఖః । దుఃఖచక్షుః । ఇవతద్మా । పీతః । ఇవ । దృశ్యతే । శీతేన । అవ్యథయన్ । ఇవ । రురుదక్షః । ఇవ । దృశ్యతే ॥

అ॥ అదుఃఖః= తానుదుఃఖమునులేనిదై, దుఃఖచక్షురివ= దుఃఖకరమైన నేత్రములుకలదానివలెనే, దృశ్యతే= చూడఁబడుచున్నది, తద్మా= ఆ కామిలరోగము కలదియై, పీతఇవ= పచ్చనిదివలెనే, దృశ్యతే= చూడఁబడుచున్నది, శీతేన= చలిచేత, అవ్యథయన్నివ= పీడింపఁబడనిదానివలెనే, దృశ్యతే= చూడఁబడుచున్నది, రురుదక్షఇవ= నల్లచాఱలమృగములకు ఘాసాములు గల్పించుటచే సమర్థమైనదానివలెనే, దృశ్యతే= చూడఁబడుచున్నది ॥

తా॥ ఈ వర్షర్తువు తాను దుఃఖములేనిదైనను వర్షాకాలంబునను మనుష్యులకు గామిలాది నేత్రరోగములు పుట్టుటచే దుఃఖకరమైన నేత్రములు కలదానివలెనే యున్నది. ఈ కామిలాది రోగములచేఁ బ్రాణులు పచ్చని నేత్రములు కలవియగుటచే నీ వర్షర్తువును అట్టిరోగము కలదియై పచ్చనైనదానివలెనే కనఁబడుచున్నది. గాలివాన మొదలగువానిచేఁ గలిగిన చలిచేత బాధింపబడనిదియైనట్లు కనబడుచున్నది. ఎందువలననఁగా వర్షఋతువునందుఁ గలుగు చలి వస్త్రములను గప్పుకొనుట అగ్నిని సేవించుట మొదలగువానిచే నివారణయగును. మఱియు వర్షము గురియుటవలన విశేషమైన గడ్డిమొలచుటచే నాహార సమృద్ధి కలిగి నల్లచాఱల మృగములు విశేషముగ నడవులయందు నిండియుండును. కాఁబట్టి యిట్టి అసాధారణ ధర్మములుగలది వర్షఋతువుగా నెఱుంగవలయును.

మూ॥ హ్లాదయతే జ్వలతశ్చైవ॥౧౧॥శామ్యతశ్చాస్య చక్షుషీ॥

ప॥ హ్లాదయతే । జ్వలతః । చ । ఏవ । శామ్యతః । చ । అస్య । చక్షుషీ॥

అ॥ అయం=ఈ, ఋతుః= వర్షఋతువు, హ్లాదయతే=సంతోషపెట్టుచున్నది, అస్య=ఈ వర్షఋతువుయొక్క, చక్షుషీ=నేత్రములు, జ్వలతశ్చైవ= ప్రకాశించుచున్నవి, శామ్యతశ్చ=శాంతినిబొందియున్నవి.

తా॥ ఈవర్ష ఋతువు వర్షమును గురిపించి సస్యములను ఫలింపఁజేయుటచే సర్వప్రాణులను సంతోష పెట్టుచున్నది. మఱియు వర్షము గురియుటచే సమస్తమైన తృణగుల్మలతాదులు చక్కఁగా బెఱిగి తేజస్సునుబొంది ప్రకాశించుటచే వర్షర్తువు సంబంధమైన నేత్రములు ప్రకాశించినట్లుండెను. మఱియు జలసమృద్ధిచే సర్వప్రాణులు పిపాసాదులు తగ్గి యుపద్రవములు లేక కాంతిగాయుండుటచే, వర్ష ఋతువుయొక్క నేత్రములు కాంతిని బొందినట్లుండెను. కాఁబట్టి యిట్టి అసాధారణ ధర్మములుగలది వర్షఋతువుగా నెఱుంగవలయును.

మూ॥ యా వై ప్రజాభ్రగ్ంశ్యన్తే । సంవత్సరాత్తాభ్రగ్ంశ్యన్తే । యాః ప్రతితిష్ఠన్తి । సంవత్సరే తాః ప్రతితిష్ఠన్తి । వర్షాభ్య ఇత్యర్థః॥ 3॥

ప॥ యాః । వై । ప్రజాః । భ్రంశ్యన్తే । సంవత్సరాత్ । తాః । భ్రంశ్యన్తే । యాః । ప్రతి । తిష్ఠన్తి । సంవత్సరే । తాః । ప్రతి । తిష్ఠన్తి । వర్షాభ్యః । ఇతి అర్థః॥

అ॥ యా వైఏ, ప్రజాః = మనుష్యులు, భ్రంశ్యన్తే = విత్తనములను జల్లక వర్షఋతువునలన భ్రష్టులగుచున్నారో, తాః = ఆమనుష్యులు, సంవత్సరాత్ = సంవత్సరమువలనను, భ్రంశ్యన్తే = భ్రష్టులగుచున్నారు, యాః = ఏమనుష్యులు, ప్రతితిష్ఠన్తి = విత్తనములను చల్లి ప్రతిష్ఠను బొందుచున్నారో, తాః = ఆమనుష్యులు, సంవత్సరే = సంవత్సరమునందంతయు, ప్రతితిష్ఠన్తి = ఆహారసమృద్ధిచేఁబ్రతిష్ఠనుబొందువారగుదురు. ఇక్కడ విచారింపగా పూర్వవాక్యమునందు భ్రంశమునకుఁ బంచమ్యంతపదమేమియు నుండలేదు. అందువలనఁ బ్రకృతానుసారముగా, వర్షాభ్యః = వర్షర్తువువలన, భ్రంశ్యన్తే = భ్రష్టులగుచున్నారు, ఇతి = ఈలాగునని, అర్థః = అర్థము, వక్తవ్యః = చెప్పఁదగినది.

తా॥ ఏ మనుష్యులు వర్షర్తువునందు విత్తనాదులు చల్లి వ్యవసాయము నందుఁ బ్రయత్నముగలవారలై యుందురో ఆ మనుష్యులు ఆ ఋతువునందే సుఖపడుటగాక చేసిన కృషిఫలించి ఆహారసమృద్ధిగలిగి సంవత్సరపర్యంతము ప్రతిష్ఠను బొందిన వారగుదురు. ఎవరువర్ష ఋతువునందుఁగృష్యాదులను జేయక వ్యర్థముగా నుందురో అట్టివారు ఆ ఋతువునందే గాక సంవత్సరపర్యంతము ఆహారము దుర్లభమగుటచేఁగష్టపడుచునే యుందురు. ఈ మంత్రములలో మొదటిదియగు యా వై ప్రజాభ్రగ్ంశ్యన్తే

అనువోట మనుష్యులు భ్రష్టులగుచున్నారు అనిచెప్పియున్నది. ఇక్కడ దేని వలననని ప్రశ్నరాఁగా సమాధానరూపమైన పంచమ్యంతపదమేమియు లేకపోవుటచే వర్షాకాలప్రశంస యిక్కడ ప్రకృతమగుటచే వర్షర్తువలన అని చెప్పుకొనవలయును.

—♦ అథ చతుర్థోనువాకప్రారంభః ♦—

మూ॥ అక్షిదుఃఖోత్థితస్యైవ । విప్రసన్నేకనీనికే । ఆఙ్క్తేచాద్గణం నాస్తి । ఋభూణాంతన్నిబోధత ॥

ప॥ అక్షిదుఃఖోత్థితస్య । ఏవ । వి । ప్రసన్నే । కనీనికే । ఆఙ్క్తే । చ-అద్గణం। న । అస్తి । ఋభూణాం । తత్ । నిబోధత ॥

అ॥ అక్షిదుఃఖోత్థితస్య= నేత్రరోగనివారణవలన కలిగిన ఆరోగ్యముకలవాని యొక్క, కనీనికే= నల్లగుడ్లు, విప్రసన్నే ఇవ= మిక్కిలినిర్మలముగా నుండినట్లు తలెనే, సర్వంజగత్= ప్రపంచమంతయు, నిర్మలం= నిర్మలముగాయున్నది, కించ= ఇంతియే కాదు, ఆఙ్క్తేచ= కాటుక చేఁబూయఁబడినదానివలనే యున్నది, అద్గణం= దృష్టిప్రతిబంధకమైన మంచు మొదలగునవి, నాస్తి= లేవు, తత్= ఆఋతువంతయు, ఋభూణాం= దేవతలయొక్క, సామర్థ్యం= సామర్థ్యమైనదానిగా, నిబోధత= తెలిసికొనుఁడు.

తా॥ వర్షాకాలంబున కలిగిన నేత్రరోగములు శరదృతువునందు మానుటచే నట్టివాని నేత్రము లెట్లు నిర్మలముగా నుండునో ఆ తీరుననే మేఘము బురద మొదలగునవి లేకపోవుటచే శరదృతువునందుఁ బ్రపంచమంతయు నిర్మలముగా నుండును. మఱియు నేత్రరోగములు నివారణ మగుటచే మనుష్యులు కాటుక మొదలగు సంస్కారములను బొందినవారువలెనే యుండిరి. ఈ ఋతువునందు దృష్టి ప్రతిబంధకమైన మంచు మొదలగునవి యుండవు. యిది యంతయు దేవతల సామర్థ్యముగా నెఱుఁగవలయును.

మూ॥ కనకాభానివాసాగ్ంసి । అహతానినిబోధత । అన్నమశ్నీత మృజ్మీత । అహంవోజీవనప్రదః ॥

ప॥ కనకాభాని । వాసాంసి । అహతాని । నిబోధత । అన్నం । అశ్నీత । మృజ్మీత । అహం । వః । జీవనప్రదః ॥

అ॥ తేషాం=ఆ దేవతలయొక్క, వాసాంసి=వస్త్రములు, కనకాభాని= బంగారువర్ణమువంటి వర్ణము కలవిగాను, అహతాని=చిరుఁగనివిగాను, నిబోధత= తెలిసికొనుఁడు, హేజనాః= ఓ మనుష్యులారా! అన్నం=ఆహారమును, అశ్నీత= భక్షింపుఁడు, ఎల్లప్పుడు ఆహారమును భక్షింపుచున్నప్పటికిని అన్నమును భక్షింపుఁడు అనుటచే ఈ శరదృతువునందు భుజించిన పదార్థము వలన సమస్త ప్రాణులకు శరీరపుష్టి విశేషముగాఁ గలుగునని తెలిసికొనవలయును, వ్యజీమత=విశేషముగా భక్ష్యభోజ్యాదులతో భుజించుటకు యత్నింపుఁడు, అహం=శరదృతువునైన నేను, వః=మీకొఱకు, జీవనప్రదః=జీవనము నిచ్చుదాననగుచున్నాను.

తా॥ ఓమనుష్యులారా! శరదృతువున కధిదేవతలైన దేవతలయొక్క వస్త్రములు బంగారుతో సమానమైన పచ్చనిరంగు కలవిగాను ఎల్లప్పుడు నూతనమైనవిగానే యుండుటచేతఁ జిరుఁగనివిగాను దెలిసికొనుఁడు. మీరు ఎల్లప్పుడు అన్నమును భుజించుచున్నను శరదృతువునందు భుజించిన పదార్థమువలన శరీరమునకు విశేషపుష్టి కలుగును గాన ఈశరదృతువునందు ప్రయత్నముఁజేసి భక్ష్యభోజ్యాదులతో భుజింపుఁడు. మీరుభుజించిన పదార్థములను జీర్ణమగునట్లుచేసి వ్యాధులు పుట్టనీయక మీజీవనమును సుఖముగా నుండునట్లు చేసెదనని శరదృతువు పలుకుచున్నది.

మూ॥ ఏతా వాచః ప్రయుజ్యన్తే। శర ద్యత్రోపదృశ్యతే॥ ౧౨॥

ప॥ ఏతాః। వాచః। ప్రయుజ్యన్తే। శరత్। యత్ర। ఉపదృశ్యతే॥

అ॥ యత్ర = ఎప్పుడు। శరత్ = శరత్కాలము। ఉపదృశ్యతే = చూడఁబడుచున్నదో। తదా = అప్పుడు। ఏతాః = ఈ, । వాచః = మాటలు, ఉపదృశ్యతే = ప్రవర్తింపఁ బడుచున్నవి॥

తా॥ ఎప్పుడు శరత్కాలము ప్రవర్తించుచున్నదో అప్పుడు భక్ష్యభోజ్యాదులతోఁ దృప్తిగా భుజింపుఁడనెడు మనుష్యులయొక్క మాటలు ప్రవర్తిల్లుచున్నవి గాన యిటువంటి అసాధారణ ధర్మములు కలది శరదృతువుగా నెఱుంగవలయును.

అనుపోట మనుష్యులు భ్రష్టులగుచున్నారు అనిచెప్పియున్నది. ఇక్కడ దేని వలననని ప్రశ్నరాఁగా సమాధానరూపమైన పంచమ్యంతపదమేమియు లేకపోవుటచే వర్షాకాలప్రశంస యిక్కడ ప్రకృతమగుటచే వర్షర్తువులన అని చెప్పుకొనవలయును.

—♦ అథచతుర్థోనువాకప్రారంభః ♦—

మూ॥ అక్షిదుఃఖోత్థితస్యైవ । విప్రసన్నేకనీనికే । ఆఙ్క్తేచాద్గణం నాస్తి । ఋభూణాంతన్నిబోధత ॥

ప॥ అక్షిదుఃఖోత్థితస్య । ఏవ । వి । ప్రసన్నే । కనీనికే । ఆఙ్క్తే । చ-అద్గణం । న । అస్తి । ఋభూణాం । తత్ । నిబోధత ॥

అ॥ అక్షిదుఃఖోత్థితస్య= నేత్రరోగనివారణవలన గలిగిన ఆరోగ్యముకలవాని యొక్క, కనీనికే= నల్లగుడ్లు, విప్రసన్నే ఇవ= మిక్కిలినిర్మలముగా నుండినట్లు వలెనే, సర్వంజగత్= ప్రపంచమంతయు, నిర్మలం= నిర్మలముగాయున్నది, కించ= ఇంతియే కాదు, ఆఙ్క్తేచ= కాటుక చేఁబూయఁబడినదానివలనే యున్నది, అద్గణం= దృష్టిప్రతిబంధకమైన మంచు మొదలగునవి, నాస్తి= లేవు, తత్= ఆఋతువంతయు, ఋభూణాం= దేవతలయొక్క, సామర్థ్యం= సామర్థ్యమైనదానిగా, నిబోధత= తెలిసికొనుఁడు.

తా॥ వర్షాకాలంబున కలిగిన నేత్రరోగములు శరదృతువునందు మానుటచే నట్టివాని నేత్రము లెట్లు నిర్మలముగా నుండునో ఆ రీతుననే మేఘము బురద మొదలగునవి లేకపోవుటచే శరదృతువునందుఁ బ్రపంచమంతయు నిర్మలముగా నుండును. మఱియు నేత్రరోగములు నివారణ మగుటచే మనుష్యులు కాటుక మొదలగు సంస్కారములను బొందినవారువలెనే యుండిరి. ఈ ఋతువునందు దృష్టి ప్రతిబంధకమైన మంచు మొదలగునవి యుండవు. యిది యంతయు దేవతల సామర్థ్యముగా నెఱుఁగవలయును.

మూ॥ కనకాభానివాసాగ్ంసి । అహతానినిబోధత । అన్నమశ్నీత మృజ్మీత । అహంవోజీవనప్రదః ॥

ప॥ కనకాభాని । వాసాంసి । అహతాని । నిబోధత । అన్నం । అశ్నీత । మృజ్మీత । అహం । వః । జీవనప్రదః ॥

అ॥ తేషాం=ఆ దేవతలయొక్క, వాసాంసి=వస్త్రములు, కనకాభాని= బంగారువర్ణమువంటి వర్ణము కలవిగాను, అహతాని=చిరుఁగనివిగాను, నిబోధత= తెలిసికొనుఁడు, హేజనాః= ఓ మనుష్యులారా! అన్నం=ఆహారమును, అశ్నీత= భక్షింపుఁడు, ఎల్లప్పుడు ఆహారమును భక్షింపుచున్నప్పటికిని అన్నమును భక్షింపుఁడు అనుటచే ఈ శరదృతువునందు భుజించిన పదార్థము వలన సమస్త ప్రాణులకు శరీరపుష్టి విశేషముగాఁ గలుగునని తెలిసికొనవలయును, మృజీమత=విశేషముగా భక్ష్యభోజ్యాదులతో భుజించుటకు యత్నింపుఁడు, అహం=శరదృతువునైన నేను, వః=మీకొఱకు, జీవనప్రదః=జీవనము నిచ్చుదాననగుచున్నాను.

తా॥ ఓమనుష్యులారా! శరదృతువున కధి దేవతలైన దేవతలయొక్క వస్త్రములు బంగారుతో సమానమైన పచ్చనిరంగు కలవిగాను ఎల్లప్పుడు నూతనమైనవిగానే యుండుటచేతఁ జిరుఁగనివిగాను దెలిసికొనుఁడు. మీరు ఎల్లప్పుడు అన్నమును భుజించుచున్నను శరదృతువునందు భుజించిన పదార్థమువలన శరీరమునకు విశేషపుష్టి కలుగును గాన ఈశరదృతువునందు ప్రయత్నముఁజేసి భక్ష్యభోజ్యాదులతో భుజింపుఁడు. మీరుభుజించిన పదార్థములను జీర్ణమగునట్లుచేసి వ్యాధులు పుట్టనీయక మీజీవనమును సుఖముగా నుండునట్లు చేసెదనని శరదృతువు పలుకుచున్నది.

మూ॥ ఏతా వాచః ప్రయుజ్యన్తే। శరద్యత్రోపదృశ్యతే॥ ౧౨॥

ప॥ ఏతాః। వాచః। ప్రయుజ్యన్తే। శరత్। యత్ర। ఉపదృశ్యతే॥

అ॥ యత్ర = ఎప్పుడు। శరత్ = శరత్కాలము। ఉపదృశ్యతే = చూడఁబడుచున్నదో। తదా = అప్పుడు। ఏతాః = ఈ, । వాచః = మాటలు, ఉపదృశ్యతే = ప్రవర్తింపఁ బడుచున్నవి॥

తా॥ ఎప్పుడు శరత్కాలము ప్రవర్తించుచున్నదో అప్పుడు భక్ష్యభోజ్యాదులతోఁ దృప్తిగా భుజింపుఁడనెడు మనుష్యులయొక్క మాటలు ప్రవర్తిల్లుచున్నవి గాన యిటువంటి అసాధారణ ధర్మములు కలది శరదృతువుగా నెఱుంగవలయును.

అనువోట మనుష్యులు భ్రిష్టులగుచున్నారు అనిచెప్పియున్నది. ఇక్కడ దేని వలననని ప్రశ్నరాఁగా సమాధానరూపమైన పంచమ్యంతపదమేమియు లేకపోవు టచే వర్షాకాలప్రశంస యిక్కడ ప్రకృతమగుటచే వర్షర్తువువలన అని చెప్పుకొన వలయును.

——♦ అథచతుర్థోనువాకప్రారంభః ♦——

మూ॥ అక్షిదుఃఖోత్థితస్యైవ । విప్రసన్నేకనీనికే । ఆఙ్క్తేచాద్గణం నాస్తి । ఋభూణాంతన్నిబోధత ॥

ప॥ అక్షిదుఃఖోత్థితస్య । ఏవ । వి । ప్రసన్నే । కనీనికే । ఆఙ్క్తే । చ-అద్గణం। న । అస్తి । ఋభూణాం । తత్ । నిబోధత ॥

అ॥ అక్షిదుఃఖోత్థితస్య= నేత్రరోగనివారణవలన గలిగిన ఆరోగ్యముకలవాని యొక్క, కనీనికే= నల్లగుడ్లు, విప్రసన్నేఇవ= మిక్కిలినిర్మలముగా నుండినట్లు వలెనే, సర్వంజగత్= ప్రపంచమంతయు, నిర్మలం= నిర్మలముగాయున్నది, కించ= ఇంతియే కాదు, ఆఙ్క్తేచ= కాటుక చేఁబూయఁబడినదానివలనే యున్నది, అద్గణం= దృష్టిప్రతిబంధకమైన మంచు మొదలగునవి, నాస్తి= లేవు, తత్= ఆఋతువంతయు, ఋభూణాం= దేవతలయొక్క, సామర్థ్యం= సామర్థ్యమైనదానిగా, నిబోధత= తెలి సికొనుఁడు.

తా॥ వర్షాకాలంబున కలిగిన నేత్రరోగములు శరదృతువునందు మానుటచే నట్టివాని నేత్రము లెట్లు నిర్మలముగా నుండునో ఆ తీరుననే మేఘము బురద మొదలగునవి లేకపోవుటచే శరదృతువునందుఁ బ్రపంచమంతయు నిర్మలముగా నుండును. మఱియు నేత్రరోగములు నివారణ మగుటచే మనుష్యులు కాటుక మొదలగు సంస్కారములను బొందినవారువలెనే యుండిరి. ఈ ఋతువునందు దృష్టి ప్రతిబంధకమైన మంచు మొదలగునవి యుండవు. యిది యంతయు దేవతల సామర్థ్యముగా నెఱుఁగవలయును.

మూ॥ కనకాభానివాసాꣳసి । అహతానినిబోధత । అన్నమశ్నీత మృజ్మీత । అహంవోజీవనప్రదః ॥

ప॥ కనకాభాని । వాసాంసి । అహతాని । నిబోధత । అన్నం । అశ్నీత ।

అ॥ తేషాం=ఆ దేవతలయొక్క, వాసాంసి=వస్త్రములు, కనకాభాని= బంగారువర్ణమువంటి వర్ణము కలవిగాను, అహతాని=చిరుఁగనివిగాను, నిబోధత= తెలిసికొనుఁడు, హేజనాః= ఓ మనుష్యులారా! అన్నం=ఆహారమును, అశ్నీత= భక్షింపుఁడు, ఎల్లప్పుడు ఆహారమును భక్షింపుచున్నప్పటికిని అన్నమును భక్షింపుఁడు అనుటచే ఈ శరదృతువునందు భుజించిన పదార్థము వలన సమస్త ప్రాణులకు శరీరపుష్టి విశేషముగాఁ గలుగునని తెలిసికొనవలయును, మృజ్మత=విశేషముగా భక్ష్యభోజ్యాదులతో భుజించుటకు యత్నింపుఁడు, అహం=శరదృతువునైన నేను, వః=మీకొఱకు, జీవనప్రదః=జీవనము నిచ్చుదాననగుచున్నాను.

తా॥ ఓమనుష్యులారా! శరదృతువున కధి దేవతలైన దేవతలయొక్క వస్త్రములు బంగారుతో సమానమైన పచ్చనిరంగు కలవిగాను ఎల్లప్పుడు నూతనమైనవిగానే యుండుటచేతఁ జిరుఁగనివిగాను దెలిసికొనుఁడు. మీరు ఎల్లప్పుడు అన్నమును భుజించుచున్నను శరదృతువునందు భుజించిన పదార్థమువలన శరీరమునకు విశేషపుష్టి కలుగును గాన ఈశరదృతువునందు ప్రయత్నముఁజేసి భక్ష్యభోజ్యాదులతో భుజింపుఁడు. మీరుభుజించిన పదార్థములను జీర్ణమగునట్లుచేసి వ్యాధులు పుట్టనీయక మీజీవనమును సుఖముగా నుండునట్లు చేసెదనని శరదృతువు పలుకుచున్నది.

మూ॥ ఏతావాచః ప్రయుజ్యన్తే। శర ద్యత్రోపదృశ్యతే॥ ౧౨॥

ప॥ ఏతాః। వాచః। ప్రయుజ్యన్తే। శరత్। యత్ర। ఉపదృశ్యతే॥

అ॥ యత్ర = ఎప్పుడు। శరత్ = శరత్కాలము। ఉపదృశ్యతే = చూడఁబడుచున్నదో। తదా = అప్పుడు। ఏతాః = ఈ,। వాచః = మాటలు, ఉపదృశ్యతే = ప్రవర్తింపఁ బడుచున్నవి॥

తా॥ ఎప్పుడు శరత్కాలము ప్రవర్తించుచున్నదో అప్పుడు భక్ష్యభోజ్యాదులతోఁ దృప్తిగా భుజింపుఁడనెడు మనుష్యులయొక్క మాటలు ప్రవర్తిల్లుచున్నవి గాన యిటువంటి అసాధారణ ధర్మములు కలది శరదృతువుగా నెఱుంగవలయును.

మూ॥ అభిధూన్వన్తోభి ఘ్నన్త ఇవ। వాతవన్తోమరుద్గణాః। అముతో జేతుమిషుముఖమివ। సన్నద్ధాస్సహాద దృశేహ। అపధ్వస్తై ర్వస్తి వర్ణైరివ। విశిఖా సః కపర్దినః॥

ప॥ అభిధూన్వన్తః। అభిఘ్నన్తః। ఇవ। వాతవన్తః। మరుద్గణాః। అముతః। జేతుం। ఇషుముఖం। ఇవ। సన్నద్ధాః। సహా। దదృశే। హ। అపధ్వస్తైః। వస్తివర్ణైః ఇవ। విశిఖాసః। కపర్దినః॥

అ॥ హేమంతుఋతువుయొక్క ధర్మములను జెప్పుచున్నాఁడు.

అ॥ తస్మిన్ ఋతౌ= ఆ హేమంతుఋతువునందు, మరుద్గణాః= దేవతలలో నొకతెగవారి సమూహములు, అభిధూన్వన్తః= అంతటను గదలించుచున్నవై, అభిఘ్నంతఃఇవ= మిక్కిలిబాధించుచున్నవానివలెనే, వాతవన్తః= అధికముగా వీచుగాలి కలవై, భవన్తి= అగుచున్నవి, అముతః= ఈ వాయులోకమునలన, వాయవః= వాయువులు, ఆగతాః= వచ్చినవై, జేతుం= జయించుటకొఱకు, ఇషుముఖమివ= బాణాగ్రమువలెనే, సన్నద్ధాః= ప్రయత్నముకలవై, సహాదదృశేహ= సమూహముగా నుండినట్లుకనఁబడుచున్నవి, అపధ్వస్తైః= మలినమైనటువంటి, వస్తివర్ణైరివ= పొత్తికడుపుయొక్క ఆకారమువంటి ఆకారముగల కవచములతో గూడుకొనినవారు వలెనేయున్నట్టియు, విశిఖాసః= అనేకవిధమైనశిఖలతోఁగూడుకొనినట్టియు, కపర్దినః= కేశబంధనములతో గూడినట్టి, ప్రాణినః=ప్రాణులు, దృశ్యంతే= చూడఁబడుచున్నవి॥

తా॥ హేమంతఋతువు ధర్మమును జెప్పుచున్నాఁడు. వాయువున కధిదేవతలగు మరుత్తులను దేవతలలో నొకతెగవారు కవచాదులనుధరించి యుద్ధసన్నాహులై శత్రువులను జయించుటకొఱకు వీరులచేతఁబ్రయోగింపఁబడిన బాణముయొక్క మొనవలెనే వేగముగా వాయులోకమునుండివచ్చి విశేషముగా వాయువును వీచునట్లు చేయుచునంతటను గంపింపఁజేయుచుఁబీడించువారివలెనే సంఘముగా జూడఁబడుచున్నారు. మఱియు మనుష్యులు చలివేయకుండుటకు మలినముగా నున్నను దృఢముగా నున్నట్టియు, ముదుగుగానున్నట్టియు, పొత్తికడుపాకారమువంటి యాకారముగల కవచములను వస్త్రములను దలపాగాలు మొదలగువానిని ధరించువారలై చూడఁబడుచున్నారు.

మూ॥ అక్రుద్ధస్యయోత్స్యమానస్య। క్రుద్ధస్యేవలోహినీ। హేమ
తశ్చక్షుషీవిద్యాత్। అక్ష్ణయోఃక్షిపణోరివ॥ ౧౩॥

ప॥ అక్రుద్ధస్య। యోత్స్యమానస్య। క్రుద్ధస్య। ఇవ। లోహినీ। హేమతః।
చక్షుషీ। విద్యాత్। అక్ష్ణయోః। క్షిపణః। ఇవ.

అ॥ అక్రుద్ధస్య = కోపములేనిదైనప్పటికిని, హేమతః = హేమంతఋతువు యొక్క, చక్షుషీ = నేత్రములను, క్రుద్ధస్య = కోపముకలిగినట్టియు, యోత్స్యమానస్యఇవ = యుద్ధముఁ జేయనిశ్చయించినవానియొక్క, క్షిపణోః = చలించునట్టి, అక్షయోరివ = నేత్రములనువలెనే, ద్వితీయార్థేషష్ఠీ, లోహినీ = ఎఱ్ఱనైనవిగాను విద్యాత్ = తెలిసికొనవలయును.

తా॥ కోపముకలిగి యుద్ధముఁ జేయనిశ్చయించుకొనినవానియొక్క నేత్రము లతీయన ఎఱ్ఱఁగాఁ జలించుచుండునో అప్రకారముగానే కోపము మొదలగు కారణ ములు లేకుండినను హేమంతఋతువుయొక్క నేత్రములెఱ్ఱఁగానుండునని తెలిసికొన వలయును. ఏఋతువునందేమి చెప్పినను అదియంతయుఁ బ్రాణులకుఁ జెందునట్లుగాఁ దెలిసికొనవలయును. ఇవి హేమంతఋతుధర్మములు.

మూ॥ దుర్భిక్షందేవలోకేషు। మనూనాముదకంగృహే। ఏతావా
చః ప్రవదన్తీః। వైద్యుతోయాన్తి శైశిరీః॥

ప॥ దుర్భిక్షం। దేవలోకేషు। మనూనాం। ఉదకం। గృహే। ఏతాః।
వాచః। ప్రవదన్తీః। వైద్యుతః। యాన్తి। శైశిరీః॥

అ॥ దేవలోకేషు = ఆకాశప్రదేశములయందు, ఉదకం= జలము, దుర్భిక్షం= పొందుటకు దుర్లభమైయున్నది, మనూనాం = మనుష్యులయొక్క, గృహే=గృహము నందు, ఉదకం = జలము, స్వల్పం = కొంచెముగా, అస్తి = కలదు, ఏతాః = ఈ, వాచః = మాటలను, ప్రవదన్తీః = చెప్పుకొనుచు, శైశిరీః = శిశిరర్తువు సంబంధ మైన, వైద్యుతః = అగ్నిసంబంధమైన తాపముగలవారై, యాంతి=వెళ్ళుచున్నారు.

తా॥ శిశిరఋతువునందు వర్షము లేకపోవుటచే ఆకాశమునుండి వచ్చెడి వర్ష ధారల వలనఁ గలుగు ప్రవాహములెక్కడను మార్గమునందులేవు. ఇంక నేమనగా నూతులు మొదలగునవి యుండుటచే మనుష్యుల గృహములలో జలముండునుగనుక అచ్చటికేతెంచి దప్పి తీర్చుకొనవచ్చును. అని మార్గస్థులు ఒకరితో నొకరు చెప్పు కొనుచు శిశిరఋతువు సంబంధమైన తాపమును బొందుచు వెళ్లుచున్నారు.

మూ॥ తాఅగ్నిః పవమానా అన్వైక్షత। ఇహ జీవికా మపరిపశ్యన్। తస్యైషాభవతి॥

ప॥ తాః। అగ్నిః। పవమానాః। అను। ఐక్షత। ఇహ। జీవికాం। అ। పరి పశ్యన్। తస్య। ఏషా। భవతి॥

అ॥ అగ్నిః, అగ్నిహోత్రుఁడు, ఇహ=ఈ లోకమునందు, జీవికాం=జీవన హేతువైన జలమును, అపరిపశ్యన్, అంతటను వెదకుచు, తస్య=ఆప్రాణి సమూహమునకు, ఏషా=జీవనము, కథం=ఎట్లుగా, భవతీ=అగుచుండెనో, ఈలాగున నను కొనుచు, పవమానాః=జలమునిమిత్తము వెదకుచున్న, తాః=ఆ మనుష్యులనుగూర్చి అన్వైక్షత=విచారించుచున్నాడు.

తా॥ ఈ లోకమునందెక్కడను జలములేదు. మార్గస్థులు జలము నిమిత్తము తిరుగుచున్నారు. ఇంతటినుండి ప్రాణులకు జీవనము ఎట్లు జరుగునో అని అగ్నిహోత్రుడు జలముకొఱకు నంతటను వెదుకుచున్నాడు.

మూ॥ ఇహేహావస్స్వతపసః। మరుతస్సూర్యత్వచః। శర్మ సప్రథా ఆవృణే ॥ ౧౮ ॥ ౪ ॥

ప॥ ఇహ। ఇహ। వః। స్వతపసః। మరుతః। సూర్యత్వచః। శర్మ। సప్రథాః। ఆ। వృణే॥

అ॥ స్వతపసః=స్వాధీనమైన తపస్సులు గలవారును, సూర్యత్వచః=సూర్యునితో సమానకాంతిగల, హేమరుతః= ఓ వాయువులారా! వః=మీ సమీపమునుండి, సప్రథాః=విశేషమైన, శర్మ= సుఖకారణమగు జలమును, ఇహేహ=ఈ సమస్త ప్రదేశములయందుఁ గలుగుటకొఱకు, ఆవృణే=కోరుచున్నాను.

తా॥ సూర్యునితో సమానకాంతిగల యో వాయుదేవతలారా! మీరు ఎండింపఁజేయుటకు వర్షము కురిపింపఁ జేయుటకు సమర్థమైన తపస్సులు కలవారు కావున సుఖమును గలిగించు విశేషమైన జలమును ఈ సమస్త ప్రదేశములయందు గలుగునట్లు చేయఁగలందులకు మిమ్ము కోరుచున్నానని యగ్నిహోత్రుఁడు పలుకు చున్నాఁడు.

ఇతిచతుర్థోనువాకస్సమాప్తః.

అథ పంచమోऽనువాకః

మూ॥ అతితామ్రాణివాసాగ్ంసి । అష్టివజ్రిశతఘ్ని చ । విశ్వేదేవావి ప్రహరన్తి । అగ్నిజిహ్వా అసశ్చత ॥

ప॥ అతితామ్రాణి । వాసాంసి । అష్టివజ్రిశతఘ్ని । చ । విశ్వేదేవాః । వి । ప్రహరన్తి । అగ్నిజిహ్వాః । అసశ్చత ॥

అ॥ వాసాంసి=శిశిరర్తువున కధిదేవతలగు విశ్వేదేవతలయొక్క వస్త్రములు, అతితామ్రాణి=మిక్కిలి యెఱ్ఱనైనవి, అష్టివజ్రిశతఘ్ని చ=అష్టి, వజ్రి, శతఘ్ని, అను పేరుగల ఆయుధములు గలవు, విశ్వేదేవాః=విశ్వేదేవతలు, తైః=ఆ యాయుధములచేత, విప్రహరన్తి=శత్రువులను గొట్టుచున్నారు, తే=ఆవిశ్వేదేవతలు, అగ్నిజిహ్వా=అరుణకేతుకాగ్నిరూపమైన జిహ్వలు గలవారై, అసశ్చత=మిక్కిలి బిగ్గరగా శబ్దమును జేయుచున్నారు.

తా॥ శిశిరఋతువున కధిదేవతలగు విశ్వేదేవతల వస్త్రములు మిక్కిలి యెఱ్ఱనైనవి. వారు అష్టి, వజ్రి, శతఘ్ని, అను పేరుగల ఆయుధములచేత శత్రువులను సంహరించుచున్నారు. మఱియు అరుణకేతుకాగ్నిరూపమైన జిహ్వలు కలవారై మిక్కిలి బిగ్గరగా ధ్వనిఁ జేయుచున్నారు.

మూ॥ నైవదేవో నమర్త్యః । నరాజావరుణో విభుః । నాగ్నిర్నేంద్రో నపవమానః । మాతృక్కచ్చన విద్యతే ॥

ప॥ న । ఏవ । దేవః । న । మర్త్యః । న । రాజా । వరుణః । విభుః । న । అగ్నిః । న । ఇంద్రః । న । పవమానః । మాతృక్ । కచ్చన । విద్యతే ॥

అ॥ మాతృక్ = మాదృక్ = మాతో సమానమైన, దేవః = దేవుఁడు, నవిద్యతే = లేడు, మర్త్యః = మనుష్యుఁడు, నవిద్యతే = లేఁడు, రాజా = రాజైన, వరుణః = వరుణుఁడును, విభుః = సమర్థుఁడు, నవిద్యతే = కాఁడు, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, నవిద్యతే = కాఁడు, ఇంద్రః = ఇంద్రుడు, నవిద్యతే = కాఁడు, పవమానః = వాయువు, నవిద్యతే = కాదు, మాదృక్ = మాతో సమానమైనవాఁడు, కశ్చన = ఒక్కడైనను, నవిద్యతే = లేఁడు ॥

తా॥ దేవుఁడుగాని మనుష్యుఁడుగాని వరుణదేవుఁడుగాని అగ్నిహోత్రుఁడుగాని ఇంద్రుఁడుగాని వాయువుగాని యెవరైనను మాతో సమానులు లేరని విశ్వేదేవతలుచ్చైస్స్వరములతో ధ్వనిఁ జేయుచున్నారు.

మూ॥ దివ్యస్త్యై కాధనురార్త్నిః। పృథివ్యామపరాశ్రితా ॥ ౧౫॥
తస్యేంద్రోవమ్రిరూపేణ। ధనుర్జ్యా మఛినత్స్వయం ॥

ప॥ దివి। ఏకా। ధనురార్త్నిః। పృథివ్యాం। అపరా। శ్రితా। తస్య। ఇంద్రః। వమ్రిరూపేణ। ధనుర్జ్యాం। అఛినత్। స్వయం॥

అ॥ అస్య = విశ్వేదేవతల జిహ్వారూపమైన ఆరుణకేతు కాగ్నియొక్క, ఏకా = ఒక్కటియగు, ధనురార్త్నిః = ధనుస్సుయొక్క వైభాగమందుండుకొన, దివి = ఆకాశంబున, శ్రితా = ఉన్నది, అపరా = రెండవదియగు దిగువభాగమం దున్నకొన, పృథివ్యాం = భూమియందు, శ్రితా = ఉన్నది, ఇంద్రః = దేవేం ద్రుడు, వమ్రిరూపేణ = చలిచీమరూపముచే, తస్య = ఆయారుణకేతు కాగ్ని యొక్క, ధనుర్జ్యాం = ధనువుయొక్కనారిని। స్వయం = స్వయముగానే, అఛి నత్ = కొట్టివేసెను.

తా॥ విశ్వేదేవతలకు జిహ్వారూపమైన ఆరుణకేతు కాగ్నియొక్క ధనుస్సు నకుగల రెండుకొనలలో నొకటిభూమియందునను మతియొకటి యాకాశమందునను వ్యాపించి యుండుటను జూచి యింద్రుఁడు భయపడి చలిచీమరూపమునొంది ఆరుణ కేతుకాగ్నియొక్క ధనుస్సునందుంకునారిని గొట్టివేసెను.

మూ॥ తదింద్రధనురిత్యజ్యం। అభ్రవర్ణేషుచక్షతే। ఏతదేవశంయో ర్బార్హస్పత్యస్య। ఏతద్రుద్రస్యధనుః॥

ప॥ తత్। ఇంద్రధనుః। ఇతి। అజ్యం। అభ్రవర్ణేషు। చక్షతే। ఏతత్। ఏవ। శంయోః। బార్హస్పత్యస్య। ఏతత్। రుద్రస్య। ధనుః॥

అ॥ తత్ = ఆధనుస్సునే, అభ్రవర్ణేషు = మేఘములయందుండు రంగుల యందు, అజ్యం = నారిలేనట్టి, ఇంద్రధనురితి = ఇంద్రధనుస్సని, చక్షతే = చెప్పు చున్నారు, ఏతదేవ = ఈధనువేను, బార్హస్పత్యస్య = బృహస్పతి కుమారుండగు, శంయోః = శంయువు అనువానికిఁ జెందియున్నది, ఏతత్ = ఇది, రుద్రస్య=ఆరుణ కేతు కాగ్ని యొక్క, ధనుః = ధనుస్సు.

తా॥ ఇంద్రునిచే నారికొట్టివేయఁబడిన ఈధనుస్సునే వర్షాకాలంబున మేఘ ములయందుఁ జిత్రవిచిత్రముగా మనకగపడురంగులనుగల ఇంద్రధనుస్సుగాఁ జెప్పు చున్నారు. ఈధనువు చేతనే బృహస్పతి కుమారుండగు శంయువు తనకార్యములను నెఱవేర్చు కొనుచున్నాఁడు. కాఁబట్టి ఈధనుస్సు ఆరుణకేతు కాగ్నిదియైయున్నది.

మూ॥ రుద్రస్యత్వేవధనురార్త్నిః । శిరఉత్పిపేష । సప్రవర్గో౽భవత్ । తస్మాద్యస్సప్రవర్గ్యేణయజ్ఞేనయజతే । రుద్రస్యసశిరః ప్రతిదధాతి । నైనగ్ంరుద్రఆరుకోభవతి। యఏవంవేద ౧౬॥౫॥

ప॥ రుద్రస్య । తు । ఏవ । ధనురార్త్నిః । శిరః । ఉత్పిపేష । సః । ప్రవర్గ్యః । అభవత్ । తస్మాత్ । యః । సప్రవర్గ్యేణ । యజ్ఞేన । యజతే । రుద్రస్య। సః । శిరః । ప్రతి । దధాతి । న । ఏనం । రుద్రః । ఆరుకః । భవతి।యః।ఏవం।వేద॥

అ॥ ఆధనుస్సుకొట్టివేయఁబడిన నారికలదై కేవలము ఇంద్రుని స్వాధీనమగుటయే కాదు, కింతు=ఇఁక నేమనఁగా, జ్యాయాం=నారి, చిన్నాయాంసత్యాం=తెగఁగొట్టఁబడినదగుచుండఁగా, ధనురార్త్నిః=ధనుస్సుయొక్క కొన, రుద్రస్య=అరుణకేతుకాగ్నియొక్క, శిరః = శిరస్సును, ఉత్పిపేష = ఎగురఁగొట్టి క్రిందపడవేసి చూర్ణముగావించెను, సః=ఆచూర్ణము, ప్రవర్గ్యః=ప్రవర్గ్యము, అభవత్=ఆయెను, అనఁగా యజ్ఞమునందు హవిస్సుగా నుపయోగించు నొకపదార్థము, తస్మాత్= అరుణకేతుకాగ్నియొక్క శిరస్సు ప్రవర్గ్యమగుటవలన, యః=ఎవఁడు, సప్రవర్గ్యేణ= ప్రవర్గ్యముతోఁగూడిన, యజ్ఞేన = యజ్ఞముచేత, యజతే = పూజించుచున్నాఁడో, సః=ఆమనుష్యుఁడు, రుద్రస్య=అరుణకేతుకాగ్నియొక్క, తత్=ఆ, శిరః=శిరస్సును, ప్రతిదధాతి = తిరిగికూర్చుచున్నాఁడు, యః=ఎవఁడు, ఏవం = ఈప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, ఏనం=ఈ తెలిసినట్టి వానిని గూర్చి, రుద్రః=అరుణకేతుకాగ్ని, ఆరుకః=హింసకుఁడై, నభవతి= కాఁడు.

తా॥ ఇంద్రుఁడు అరుణకేతుకాగ్నియొక్క ధనస్సునందుండు నారిని జెదల పురుగై కొట్టివేసి ఆ ధనుస్సును దన స్వాధీనము చేసికొనుటయే కాదు. ఇఁక నేమనఁగా అరుణకేతుకాగ్ని నారిచే బిగువుగానుండు ధనస్సును దండమువలె నిలువుగాఁబెట్టి పైకొనను దనగడ్డముక్రిందనుంచుకొనెను. అంతట ఇంద్రుఁడు నారిని దెగఁగొట్టుటచే గడ్డముక్రిందనుండు కొన పైకెగిరి శిరస్సును బడఁగొట్టగా నది చూర్ణమై యజ్ఞమునందు హవిస్సుగా నుపయోగింపఁబడు ప్రవర్గ్యమను ఒకపదార్థవిశేషమయ్యెను. కాఁబట్టి అటువంటి ప్రవర్గ్యము గల యజ్ఞము నెవఁడు సేయునో వాఁడు అరుణకేతుకాగ్నియొక్క శిరస్సును తిరిగికూర్చినవాఁడగుచున్నాఁడు. ఈ విషయము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో అట్టివానిని అరుణకేతుకాగ్ని హింసింపదు.

ఇతిపంచమోనువాకస్సమాప్తః

—♦ అథషష్ఠోనువాకః ప్రారభ్యతే, ♦—

మూ॥ అత్యూర్ధ్వాక్షో౽తిరశ్చాత్ । శిశిరః ప్రదృశ్యతే । నైవరూపంన వాసాగ్ంసి । నచక్షుఃప్రతిదృశ్యతే ॥

ప॥ అతి । ఊర్ధ్వాక్షః । అతిరశ్చాత్ । శిశిరః । ప్రదృశ్యతే । న । ఏవ । రూపం । న । వాసాంసి । న । చక్షుః । ప్రతి । దృశ్యతే ॥

అ॥ శిశిరః=శిశిరఋతువు, అత్యూర్ధ్వాక్షః=మిక్కిలి పైకెత్తబడిన కనుబొమలుగల నేత్రములుకలదియు, అతిరశ్చాత్=తిర్యక్కుయొక్క చూపులే నిదియునై, ప్రదృశ్యతే=చూడఁబడుచున్నది, రూపం=ఆకారము, నైవదృశ్యతే=చూడఁబడుట లేదు, వాసాంసి=వస్త్రములు, నప్రతిదృశ్యతే=చూడఁబడుటలేదు, చక్షుః=నేత్రము, నప్రతిదృశ్యతే=చూడఁబడుటలేదు.

తా॥ శిశిరఋతువునందు అధికమైన చలిగల దినంబులలో మనుష్యులు శరీరమంతయును ముడుచుకొనుచు హస్తములచే వక్షస్థలమును గప్పికొనుచు ముఖంబున నిట్టూర్పులు విడుచుచు రెండు కనుబొమలును ఎక్కువగా పైకెత్తుచు నుందురు. అందువలన అత్యూర్ధ్వాక్షులగుదురు. మఱియు చలివలన కుడిప్రక్కకుఁగాని యెడమ ప్రక్కకుఁగాని మఱియే వైపునకుఁగాని చూచుటలేదు. అందువలన అతిరశ్చులు. మఱియు రూపమునుగాని పృథువైనట్టియుఁ బలుచనైనట్టియు సుందర వస్త్రములనుగాని నేత్రముల సొగసునుగాని యపేక్షింపక దళసరియగు వస్త్రములు మొదలగువానిచే చలిపోఁగొట్టుకొనుటనే కోరుచున్నారు.

మూ॥ అన్యోన్యంతునహిగ్ంస్రాతః । సతస్తద్దేవలక్షణం । లోహితో౽క్ష్ణి శారశీర్ష్ణి । సూర్యస్యోదయనంప్రతి॥

ప॥ అన్యోన్యం । తు । న । హింస్రాతః । సతః । తత్ । దేవలక్షణం । లోహితః । అక్ష్ణి । శార । శీర్ష్ణి । సూర్యస్య । ఉదయనం । ప్రతి॥

అ॥ అస్మిన్=ఈ ఋతువునందు, అన్యోన్యం=పరస్పరము, నహింస్రాతః=బాధించుకొనరు, తత్=అపూర్వోక్తవిషయము, సతః=జరుగుచున్న శిశిరఋతువుయొక్క, దేవలక్షణం=సూర్యునిచే నేర్పఱుపఁబడిన చిహ్నము, కించ=ఇంతియేకాదు, సూర్యస్య=సూర్యునియొక్క, ఉదయనంప్రతి= ఉదయమునుగూర్చి, అస్య=ఈ శిశిరఋతువున కధిదేవతయొక్క, అక్ష్ణి=నేత్రమునందు, లోహితః=ఎఱుపు, వర్తతే=

ఉండుచున్నది, శీర్షికే=శిరస్సునందు, శారి=ఆఁడుచిలుకయొక్క వర్ణమువంటి వర్ణము, వర్తతే=ఉండుచున్నది.

తా॥ ఈ శిశిరఋతువునందు పరస్పరము విశేషద్వేషముండినను చలిని పోఁగొట్టుకొనుటయందే ప్రయత్నము కలవారైయుందురు. బాధించుకొనుటయందు వాంఛ గలవారైయుండరు. మఱియు సూర్యోదయకాలంబున శిశిరఋతువున కధిదేవత యొక్క నేత్రములయందెఱుపుగానుండును. శిరస్సునందు ఆఁడుచిలుకయొక్కవర్ణము వంటి వర్ణముండును. ఇటువంటి అసాధారణ ధర్మములుకలది శిశిరఋతువుగా నెఱుంగ వలయును.

మూ॥ త్వఙ్కరోషిన్యంజలికాం । త్వఙ్కరోషినిజానుకాం॥ ౧౭॥
నిజానుకామేన్యంజలికా । అమీవాచముపాసతామితి ॥

ప॥ త్వం । కరోషి । ని । అంజలికాం । త్వం । కరోషి । ని । జానుకాం । ని । జానుకా । మే । ని । అంజలికా । అమీ । వాచం । ఉపాసతాం । ఇతి॥

అ॥ శిశిరర్తో=ఓశిశిరర్తువా! త్వం=నీవు, జానుకాం=మోకాలిని, నికరోషి =క్రిందుగానుండునట్లుచేయుచున్నావు, త్వం=నీవు, అంజలికాం=దోసిలిని, నికరోషి=క్రిందుగానుండునట్లు చేయుచున్నావు, అమీ=ఈ, హేబాలాః=ఓబాలులారా!, మే=నాయొక్క, జానుకా=మోకాలు, న్యగ్భూతాభవతు=క్రిందుగానుండుఁగాక, అంజలిగా=దోసిలి, న్యగ్భూతాభవతు=క్రిందుగానుండుగాక, ఇతి= ఈలాగుననని, వాచం=వాక్యమును, ఉపాసతాం=సేవింపుఁడు.

తా॥ శిశిరఋతువునందుఁ జలిపోవుటకుఁ జలియంటుగాఁచుకొనుచు దోసిలిని మోకాళ్లను గ్రిందుగానుండునట్లుచేసి హృదయాది ప్రదేశములనంతయును గాచి కొందురు. మఱియుఁగొందఱు పెద్దవారు తమపిల్లలతోఁ దమరు చలిమంటుగాఁచి కొనినట్లే మోకాళ్లనుగ్రిందనుంచి హస్తములనుసాచి దోసిలిని గ్రిందుగానుంచి హృదయాది సర్వఅవయవములను గాఁచికొనుఁడని చెప్పుదురు. ఇదియే శిశిరఋతువుధర్మము.

మూ॥ తస్మై సర్వఋతవో నమన్తే । మర్యాదాకరత్వాత్ప్రపురోధాం । బ్రాహ్మణఆప్నోతి । యఏవంవేద ॥ సఖలుసంవత్సర ఏతైస్సేనానీభిస్సహ । ఇన్ద్రాయసర్వాన్కామా నభివహతి । సద్రప్సః । తస్యైషాభవతి ॥ ౧౮ ॥

ప॥ తస్మై । సర్వే । ఋతవః । నమన్తే । మర్యాదాకరత్వాత్ । ప్ర । పురోధాం । బ్రాహ్మణః । ఆప్నోతి । యః । ఏవం । వేద । సః । ఖలు । సంవత్సరః । ఏతైః । సేనానీభిః । సహ । ఇంద్రాయ । సర్వాన్ । కామాన్ । అభి । వహతి । సః । ద్రప్సః । తస్య । ఏషా । భవతి ।॥

అ॥ యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారముగా, వేద = తెలిసికొనునో, తస్మై = అట్టివానికొఱకు, సర్వే = సమస్తమైన, ఋతవః = ఋతువులు, నమన్తే = స్వాధీనమగుచున్నవి, కించ = ఇదియే కాదు, సః = అటువంటి, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, మర్యాదాకరత్వాత్ = మర్యాదకు స్థానభూతుఁ డగుటవలన, పురోధాం = బ్రాహ్మణులలో శ్రేష్ఠత్వమును, ప్రాప్నోతి = పొందు చున్నాఁడు సఖలు = ఆ తెలిసిన బ్రాహ్మణుండైన, సంవత్సరః = సంవత్సరమును నేర్పఱచు న, యాదిత్యరూపమును బొందియు ఆరుణకేతు కాగ్ని తాదాత్మ్య స్వరూపుఁడై, ఏతైః = ఈ, సేనానీభిస్సహ = వసంతాది ఋతువుల కధి దేవతలగు వస్వాది సేనల తోఁగూడ నున్నవాఁడై, ఇంద్రాయ = కర్మలను జేయునట్టి యజమానుని కొఱకు, సర్వాన్ = సమస్తమైన, కామాన్ = కోరికలను, అభివహతి = కూర్చుచున్నాఁడు, సః = అతఁడే । ద్రప్సః, ద్రవస్వరూపుఁడగును, ఏషా = ఈమంత్రము, తస్య = ఆరుణకేతు కాగ్నియొక్క, ప్రతిపాదికా = ప్రతిపాదనఁ జేయునదై, భవతి = అగుచున్నది॥

తా॥ ఏపురుషుఁడు పూర్వమందుఁ జెప్పఁబడిన మంత్రములయందుఁగల ఋతుస్వరూపమును దెలిసికొనుచున్నాఁడో ఆపురుషునికి సమస్తఋతువులు స్వాధీనమగును. మఱియు నే యే ఋతువులయందు ఏ యే ధర్మము లాచరింపవలయునో అట్టి ధర్మము లాచరించుటచేతఁ బూర్వమందుఁ జెప్పఁబడినట్టి పురుషుఁడు బ్రాహ్మణులలో శ్రేష్ఠత్వమునుఁ బొందుచున్నాఁడు. మఱియు నిటువంటి తెలిసిన బ్రాహ్మణుఁడు మృతినొందినపిమ్మట సంవత్సరమును గావించు సూర్యరూపుండగు ఆరుణకేతు కాగ్నిలో నైక్యముఁజెంది పూర్వమందుఁ జెప్పఁబడిన వసంతాది ఋతువుల కధిదేవతలగు వసువులు రుద్రులు విశ్వేదేవతలు మొదలగు సేనాధిపతులతోఁగూడ సంచరించుచుఁ గర్మలను జేయునట్టి యజమానునకు సమస్తకోరికలను ఇచ్చుచుండును. అట్టి విద్వాంసుని తాదాత్మ్యమును బొందియున్న ఆరుణకేతు కాగ్ని వర్షము కురిపించుటచే ద్రవస్వరూపుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. కాఁబట్టి యీ మంత్రము ఆరుణకేతు కాగ్నినిఁ బ్రతిపాదనఁ జేయుచున్నది.

మూ॥ అవదర్షిప్సో అగ్ంశుమతీ మతిష్ఠత్ । ఇయానః కృష్ణో దశభి స్సహస్రైః । ఆవర్తమింద్రశ్శ చ్యాథమన్తం । ఉపస్నుహితం నృమణామథద్రామితి ॥

ప॥ అవ । దర్షిప్సః । అంశుమతీం । అతిష్ఠత్ । ఇయానః । కృష్ణః । దశభిః । సహస్రైః । ఆవర్తం । ఇంద్రః । శచ్యా । ధమన్తం । ఉపస్నుహి । తం । నృమణాం । అధద్రాం । ఇతి ॥

అ॥ దర్షిప్సః = ద్రవస్వరూపుఁడగు అరుణకేతుకాగ్ని, దశభిస్సహస్రైః = పదివేలకిరణములతో, ఇయానః=సంచరించుచు, కృష్ణః=వర్షమునకుఁ గారణుఁడై, పృథివీం = భూమిని, అవాతిష్ఠత్ = అధిష్ఠించియుండెను, ఓఅరుణకేతుకాగ్నీ, ఇంద్ర;=వర్షాధిపతివగు, త్వం=నీవు, ఆవర్తం=జలము నపేక్షించినప్పుడు వచ్చి, ధమన్తం=గర్జనాదిధ్వనులతోఁగూడినట్టియు, నృమణాం=మనుష్యులచేతఁగోరఁదగినట్టియు, అధద్రాం=క్రిందుగాఁ బాఱు స్వభావముగల, తం=ఆయుదకమును, ఉపస్నుహి= భూమియందు వ్యాపింపఁజేయుము, ఇతి=ఈలాగునని, ఉపదధ్యాత్=ధ్యానముఁ జేయఁదగినది ॥

తా॥ ద్రవరూపుండగు అరుణకేతుకాగ్ని యనేకకిరణములచేతఁ బ్రకాశించుచు వర్షమునకుఁ గారణుఁడై భూమియందు వ్యాపించియుండెను. ఓయారుణకేతుకాగ్నీ ! నీవు వర్షమునకు నధిపతివిగాన మనుష్యు లెప్పు డెప్పుడు కావలయునని కోరుదురో అప్పుడప్పుడువచ్చి గర్జనములను జేయుచు వర్షమును గురిపించి జలమును భూమినంతయు వ్యాపింపఁజేయుము. అనఁగాఁ దగినట్లు వర్షమును గురిపింపుమనుట. ఈలాగున ధ్యానముఁజేయుము.

మూ॥ ఏతద్వై వేద్రిస్సలావృక్యాసహ । అసురాః పరివృశ్చతి । పృథివ్యగ్ంశుమతీ । తామన్వవస్థితస్సంవత్సరోదివంచ । నైవం విదుషాచార్యాంతేవాసినౌ । అన్యోన్య స్మైద్రుహ్యాతాం । యోద్రుహ్యాతి । భ్రశ్యతే స్వర్గాల్లోకాత్ । ఇత్యృతుమణ్డలాని । సూర్యమండలాన్యాఖ్యాయికాః । అత ఊర్ధ్వగ్ం సనిర్వచనాః ॥ ౧౯ ॥ ౬ ॥

ప॥ ఏతయా । ఏవ । ఇంద్రః । సలావృక్యా । సహ । అసురాన్ । పరి । వృశ్చతి । పృథివీ । అంశుమతీ । తాం । అను । అవస్థితః । సంవత్సరః । దివం । చ । న । ఏవం । విదుషా । ఆచార్యాంతేవాసినా । అన్యోన్యస్మై । ద్రుహ్యేతాం । యః । ద్రుహ్యతి । భ్రశ్యతే । స్వర్గాత్ । లోకాత్ । ఇతి । ఋతుమండలాని । సూర్యమండలాని । ఆఖ్యాయికాః । అతః । ఊర్ధ్వం । సనిర్వచనాః ॥

అ॥ ఇంద్రః=వర్షాధిపతియగు అరుణకేతుకాగ్ని, ఏతయా=ఈ, సలావృక్యా సహ=జలదానము నపేక్షించియున్న భూమినిమిత్తముచేత, అసురాన్ = ప్రాణము లను సంతోషపెట్టు మేఘములను, పరివృశ్చతి=ఆకాశమునందంతటను వ్యాపించునట్లు చిమ్ముచున్నాఁడు, యా=ఏ, పృథివీ=భూమి, అంశుమతీ=ఓషధులుకలదని చెప్పఁ బడినదో, అంశువనఁగా సోమలతాఖండము. అంశువలన అన్ని ఓషధులు చెప్పఁ దగినవి, తాం=అట్టువంటి ఓషధులు కల భూమిని, దివంచ=ఆకాశమును, అను=అను సరించి, సంవత్సరః=సంవత్సరాధిదేవత యగు సూర్యుఁడను అరుణకేతుకాగ్ని, అవ స్థితః=ఉండెను, ఏవం=ఈ ప్రకారముగా, విదుషా=తెలిసికొనినవానిచేత, ఆచా ర్యాంతేవాసినా=అధ్వర్యు యజమానులు, అన్యోన్యస్మై = తమలోఁ దమకొఱకు నద్రుహ్యేతాం=ద్రోహముఁజేయువారు కారు, యః=ఎవఁడు మూఢుడై, ద్రుహ్యతి= ద్రోహము చేయుచున్నాఁడో, సః=ఆమూఢుఁడు, స్వర్గాల్లోకాత్=స్వర్గలోకము వలన, భ్రశ్యతే=జాఱిపడుచున్నాఁడు, ఇతి=ఈలాగున, ఋతుమండలాని=ఋతు మండల స్వభావమును గూర్చియు, సూర్యమండలాని= సూర్యమండల స్వభావమును గూర్చియు, ఆఖ్యాయికాః=మంత్రములు చెప్పినవి, అతఃఊర్ధ్వం=ఇంతటినుండియుఁ నింకముందు, సనిర్వచనాః=బ్రాహ్మణ్యముచేతఁ బ్రతిపాదనఁ జేయఁబడుచున్నవి.

తా॥ వర్షము నపేక్షించియున్న భూమియందు వర్షించుటకయి ప్రాణముల కానంద మొదించు మేఘములను ఆకాశమునందంతటను వ్యాపించునట్లు చిమ్మివేయు చున్నాఁడు. సంవత్సరాదిదేవత యగు అరుణకేతుకాగ్ని ఓషధులచే వ్యాపించియున్న భూమిని ఆకాశమును అధిష్ఠించి యుండును. ఈప్రకారము అరుణకేతుకాగ్ని యొక్క మహిమను తెలిసినవారై అధ్వర్యు యజమానులలో నెవరైనను ఒకరికొకరు అపకారముఁ జేసికొనఁగూడదు. అలాగు తెలియక యెవఁడైనను అపకారముఁ జేసెనేని వాఁడు స్వర్గలోకమును బొందని వాఁడగును అని ఈప్రకారముగా ఋతుస్వభావ

మను గూర్చియు సూర్యస్వభావమును గూర్చియు మంత్రములు ప్రతిపాదనఁజేసినవి. ఇఁక ముందును ఈప్రకారముగానే బ్రాహ్మణములు ప్రతిపాదనఁ జేయుచున్నవి.

ఇతి షష్ఠోనువాకస్సమాప్తః॥

—♦ అథసప్తమోనువాకః ప్రారభ్యతే. ♦—

మూ॥ ఆరోగోభ్రాజః పటరఃపతఙ్గః స్వర్ణరోజ్యోతిషీమాన్ విభాసః। తే అస్మైసర్వేదివమాతపన్తి। ఊర్జందు హానా అనపస్ఫురన్త ఇతి॥

ప॥ ఆరోగః। భ్రాజః। పటరః। పతఙ్గః స్వర్ణరః। జ్యోతిషీమాన్। విభాసః। తే। అస్మై। సర్వే। దివం। ఆతపన్తి। ఊర్జం। దుహానాః। అనప స్ఫురన్తః॥ ఇతి॥

అ॥ ఆరోగః = ఆరోగుఁడనియు, భ్రాజః = భ్రాజుఁడనియు, పటరః = పటరుఁడనియు, పతంగః = పతంగుఁడనియు, స్వర్ణరః = స్వర్ణరుఁడనియు, జ్యోతిషీమాన్ = జ్యోతిష్మంతుడనియు, విభాసః = విభాసుఁడనియు పేర్లుగల యేడుగురు సూర్యులుకలరు, తే = ఆ, సర్వే = ఏడుగురు సూర్యులును ఊర్జం = వర్షమువలన నన్నమును, దుహానాః = కల్పింపఁజేయుచు, అనపస్ఫురంతః = అనుకూలముగునట్లు కాంతినిగలుగ జేయుచు, అస్మై = ఈభూలోకముకొఱకు, దివం = ఆకాశమును, ఆతపన్తి=వ్యాపించి ప్రకాశించుచున్నారు, ఇతి=ఈప్రకారము తెలిసికొనవలయును.

తా॥ ఆరోగుఁడు, భ్రాజుఁడు, పటరుఁడు, పతంగుఁడు, స్వర్ణరుఁడు, జ్యోతిష్మంతుఁడు, విభాసుఁడు, అను పేర్లుగల యేడుగురు సూర్యులు వర్షమును గురిపించి యన్నమును గల్పింపఁజేయుచుఁ బ్రాణులకు ననుకూలమగునట్లు కాంతిని గలుగఁ జేయుచు ఈ భూలోకముయొక్క మేలుకొఱకే యాకాశమునందుండి ప్రకాశించు చున్నారు అని తెలిసికొనవలయును.

మూ॥ కశ్యపోష్టమః। సమహామేరుం నజహాతి। తస్యైషాభవతి॥

ప॥ కశ్యపః। అష్టమః। సః। మహామేరుం। న। జహాతి తస్య। ఏషా। భవతి॥

అ॥ కశ్యపః=కశ్యపుఁడను పేరుగల, అష్టమః=ఎనిమిదవ సూర్యుఁడుకలఁడు। సః= ఆ సూర్యుఁడు, మహామేరుం=గొప్పదియగు మేరుపర్వతమును, నజహాతి=

విడిచి పెట్టఁడు, తస్య=ఆ యెనిమిదవ సూర్యునియొక్క, మహిమను, ఏషా=ఈ ముందు చెప్పఁబోవు మంత్రము ప్రతిపాదన చేయునదియై, భవతి - అగుచున్నది॥

తా॥ పూర్వమందుఁ జెప్పఁబడిన ఆరోగుఁడు మొదలగు నేడుగురు సూర్యులు గాక కశ్యపుఁడను పేరుగల యెనిమిదవ సూర్యుఁడుకలఁడు. ఆయన ఎప్పుడును మేరు పర్వతమునందే ప్రకాశించుచుండును. ముందు చెప్పబోవు మంత్రము ఆయన ప్రభావమును వర్ణించుచున్నది.

మూ॥ యత్తే శిల్పం కశ్యపరోచనావత్ । ఇంద్రియావత్పుష్కలం
చిత్రభాను । యస్మిన్ సూర్యా అర్పితాస్సప్తసాకం ॥ ౨౦ ॥
తస్మి న్రాజానమధి విశ్రయేమమితి ॥

ప॥ యత్ । తే । శిల్పం । కశ్యప । రోచనావత్ । ఇంద్రియావత్ । పుష్కలం । చిత్రభాను । యస్మిన్ । సూర్యాః । అర్పితాః । సప్త । సాకం ॥ తస్మిన్ । రాజానం । అధి । విశ్రయ । ఇమం । ఇతి॥

అ॥ హేకశ్యప = ఓకశ్యపా !, రోచనావత్ = కాంతిగలదియు, ఇంద్రియావత్=ఇంద్రియములకుఁ బుష్టికలుగఁజేయునదియు, పుష్కలం=సంపూర్ణమైనదియు, చిత్రభాను = అనేకవిధములైన కిరణములు గలదియునగు, తే=నీయొక్క, యత్ = ఏ, శిల్పం=జగత్తును బ్రకాశింపఁజేయుట రూపమైన చిత్రకర్మకలదో, యస్మిన్= నీ ప్రకాశరూపమగు ఏచిత్రకర్మయందు; సప్తసూర్యాః = ఆరోగుఁడు మొదలగు నేడుగురు సూర్యులు, త్వయాసాకం = నీతోఁగూడ, అర్పితాః = ఉంపఁబడిరో, తస్మిన్=ఆచిత్రకర్మయందు, ఇమం = ఈ యజమానుని, రాజానం = ప్రకాశించు వానిగాఁజేసి, అధివిశ్రయ = అందరికంటె నుత్కృష్టస్థానమందుండునట్లుచేయుము ఇతి=ఈలాగున ఈమంత్రమునందు గశ్యపుని ప్రభావము చెప్పఁబడినది.

తా॥ ఓకశ్యపుఁడా! ఆరోగుఁడు మొదలగువారు యేడుగురును జగత్ప్రకాశకరూపమైన వ్యాపారమందుండి అనేకవిధములైన కిరణములచేఁ గాంతి గలదియు నింద్రియములకు బుష్టికలుగఁజేయునదియు సంపూర్ణమైనదియు నీచేఁ గల్పింపఁబడినదియు నగు జగత్ప్రకాశకరూపమైన యేచిత్రకర్మను జేయుచున్నారో ఈ యజమానునిఁగూడఁ గాంతిగలవానిఁగాఁజేసి అట్టి వ్యాపారమందుంచి అందరి కంటెను ఉత్కృష్టస్థానమందున్నవానిఁగాఁ జేయుము అని ఈ ప్రకారముగా ఈ మంత్రమునందుఁ గశ్యపుఁడను ఎనిమిదవ సూర్యుని ప్రభావము చెప్పఁబడినది.

మూ॥ తేఅస్మై సప్త కశ్యపాజ్జ్యోతిర్లభంతే। తాన్సోమః కశ్యపాదధి
నిర్ధమతి। భ్రస్తాకర్మకృదివైవం॥

ప॥ తే। అస్మై। సప్త। కశ్యపాత్। జ్యోతిః। లభంతే। తాన్। సోమః।
కశ్యపాత్। అధి। నిర్ధమతి। భ్రస్తాకర్మకృత్। ఇవ। ఏవం॥

అ॥ తే=ఆ పూర్వోక్తమైన, సప్త=ఏడుగురు సూర్యులు, అస్మై=ఈజగత్తును బ్రకాశింపఁజేయుట కొఱకు, కశ్యపాత్=కశ్యపునివలన, జ్యోతిః=కాంతిని లభంతే=పొందిరి, సోమః=సోముడను దేవుఁడు, తాన్=ఆ సూర్యులను, కశ్యపాత్=కశ్యపునివలననే, అధినిర్ధమతి=అధికమైన కాంతిగలవారినిఁగాఁ జేయుచున్నాఁడు, భ్రస్తాకర్మకృదివ=తోలుతిత్తిచే నూఁది సువర్ణము మొదలగువానిని గరగించి సువర్ణకారుఁడెట్లు శోధించునో, ఏవం=ఈ ప్రకారముగానే చేసెను.

తా॥ ఆరోగుఁడు మొదలగు ఏడుగురు కశ్యపునివలననే కాంతిని బొంది జగత్తును బ్రకాశింపఁజేయుచున్నారు. ఆ సూర్యులు కశ్యపునివలనఁ గాంతిపొందుటయెట్లనగా బంగారు మంచివర్ణము కలదైనను మూసయందుంచి తిత్తిచేనూది యగ్నిని బ్రజ్వలింపఁజేసి కరఁగించి దానియందుండు మలినము పోఁగొట్టి మిక్కిలి కాంతిగలదానిగా సువర్ణకారుడెట్లు చేయునో ఆ తీరుననే సోముఁడను దేవుఁడు పూర్వమందు ఆ యేడుగురు సూర్యులు కాంతిగలవారైనను వారిని కశ్యపునియొద్దకుఁ దీసికొనివెళ్ళి ఆ కశ్యపుని ప్రకాశముచే వారియందుండు మలినమును బోఁగొట్టి విశేషకాంతిగలవారినిఁగా జేసెను. కాఁబట్టి కశ్యపునివలన జ్యోతిస్సును బొందినవారైరి యని చెప్పఁబడియెను.

మూ॥ ప్రాణోజీవానీంద్రియ జీవాని। సప్తశీర్షణ్యాః ప్రాణాః।
సూర్యా ఇత్యాచార్యాః॥

ప॥ ప్రాణాః। జీవాని। ఇంద్రియజీవాని। సప్తశీర్షణ్యాః। ప్రాణాః।
సూర్యాః। ఇతి। ఆచార్యాః॥

అ॥ ప్రాణాః = ముఖనాసికములయందు సంచరించుచున్న ప్రాణవాయువు ఏడువృత్తులచే సంచరించుటచేత, సప్తసూర్యాః = ఏడుగురు సూర్యులు, ఇతి=ఈలాగని, ఆచార్యాః=కొందఱాచార్యులు, ఆహుః=చెప్పిరి, జీవాని=జీవనమునకుఁ గారణమైన మహత్తు అహంకారము పంచభూతములు ఈ యేడు సప్తసూర్యులు

ఏడుగురు సూర్యులు, ఇతి=ఈలాగని, కేచిదాచార్యాః=కొందఱాచార్యులు, ఆహుః=చెప్పిరి, ఇంద్రియజీవాని=జీవననిమిత్తములైన చక్షురాది పంచేంద్రియములు మనస్సు బుద్ధి ఈ యేడు, సప్తసూర్యాః=ఏడుగురు సూర్యులు, ఇతి=ఈలాగని, కేచిదాచార్యాః=కొందఱాచార్యులు, ఆహుః=చెప్పిరి, శీర్షణ్యాః=శిరస్సునందుండు ముఖాది సప్తరంధ్రములయందు సంచరించునట్టి, ప్రాణాః=ప్రాణములు, సప్తసూర్యాః=ఏడుగురు సూర్యులు, ఇతి=ఈలాగని, కేచిదాచార్యాః=కొందఱాచార్యులు, ఆహుః=చెప్పిరి.

తా॥ ఏడుగురు సూర్యులయొక్క స్వరూపము విషయమై మతభేదములు చెప్పుచున్నాఁడు. అది యెట్లనఁగా, ముఖమునందు నాసికయందు సంచరించునట్టి ప్రాణవాయువే యేడు వృత్తులచే సంచరించుటచేత నేడుగురు సూర్యులని కొందఱును జీవనమునకుఁ గారణమైన పృథివ్యాది పంచభూతములు మహత్తు అహంకారము ఈ యేడును ఏడుగురు సూర్యులని కొందఱును జీవనమునకుఁ గారణమైన త్వగాది పంచేంద్రియములు మనస్సు బుద్ధి ఈయేడును ఏడుగురు సూర్యులని కొందఱును దలయందుండు ముఖ నాసిక చక్షుశ్శ్రోత్రముల సంబంధమైన యేడు రంధ్రములయందు సంచరించునట్టి వాయువులే యేడుగురు సూర్యులని కొందఱును జెప్పిరి. ఎవరు ఎట్లు చెప్పినను దమ శరీరమునందుండు తత్వములనే సూర్యబుద్ధిచే ధ్యానించిరి. కాఁబట్టి యిక్కడ చెప్పిన సూర్యస్వరూపము జగత్తును బ్రకాశింపఁజేయునట్టి ప్రత్యక్షసప్తసూర్యుల విషయముకాదు.

మూ॥ అపశ్యమహమేతాన్ సప్తసూర్యానితి। పంచకర్ణో వాత్స్యాయనః। సప్తకర్ణశ్చ ప్లాక్షిః ॥ ౨౧ ॥ ఆనుశ్రవిక ఏవ నౌ కశ్యప ఇతి। ఉభౌ వేదయితే। నహి శేకుమివ మహామేరుం గంతుం ॥

ప॥ అపశ్యం। అహం। ఏతాన్। సప్త। సూర్యాన్। ఇతి। పంచకర్ణః। వాత్స్యాయనః। సప్తకర్ణః। చ। ప్లాక్షిః। ఆనుశ్రవికః। ఏవ। నౌ। కశ్యపః। ఇతి। ఉభౌ। వేదయితే। న। హి। శేకుం। ఇవ। మహామేరుం। గంతుం॥

అ॥ అహం=నేను, ఏతాన్=ఈ, సప్తసూర్యాన్=ఆరోగుఁడు మొదలగు నేడుగురు సూర్యులను, అపశ్యం=చూచితిని, ఇతి, ఈ లాగని, వాత్స్యాయనః=వత్సమహర్షియొక్క కొడుకుఁడగు, పంచకర్ణః = పంచకర్ణుఁడను పేరుగల మునియు,

ప్లాక్షిః=ప్లక్షమహర్షియొక్క కుమారుండగు సప్తకర్ణః=సప్తకర్ణుఁడను మునియు, ఆహ=చెప్పెను, కించ=ఇదియే కాదు, కే=మాయిద్దఱకు, కశ్యపః=కశ్యపుఁడను యెనిమిదవ సూర్యుఁడు, ఆనుశ్రావిక ఏవ=గురువువలన వినఁబడుచున్నాఁడుగాని చూడఁబడలేదు, ఇతి=ఈలాగని ఉభౌ=ఆమునీశ్వరులిద్దఱును, వేదయితే=ప్రాణులను గూర్చి తెలుపుచున్నారు, ఆవాం=మేమిద్దఱము, మహామేరుం=గొప్పదియగు మేరువు పర్వతమును గూర్చి, గంతుం=వెళ్లుటకొఱకు, నహిశేకుమివ=సమర్థులము కాకపోతిమి॥

తా॥ ఆరోగుఁడు మొదలుగాఁగల యేడుగురు సూర్యులను నేను జూచితినని వత్సమునీశ్వరుని కుమారుండగు పంచకర్ణ మహర్షియు నేను జూచితినని ప్లక్షమునీశ్వరుని కుమారుండగు సప్తకర్ణమహర్షియు జెప్పిరి. మఱియు మేమిద్దఱము ఎనిమిదవ సూర్యుండగు కశ్యపుని వేదమువలనను గురూపదేశమువలనను వింటిమేగాని చూడలేదనిరి. ఎందువలననఁగా ఆ కశ్యపుఁడు మహోన్నతస్థానమైన మేరు పర్వతమందుండుఁగాన నచ్చటికి మేము పోఁజాలమైతిమని చెప్పిరి.

మూ॥ అపశ్యమహమేతత్సూర్యమండలం పరివర్తమానం। గార్గ్యః ప్రాణత్రాతః। గచ్ఛన్త మహామేరుం ఏకం చాజహాతం॥

ప॥ అపశ్యం। అహం। ఏతత్। సూర్యమండలం। పరివర్తమానం। గార్గ్యః। ప్రాణత్రాతః। గచ్ఛన్త। మహామేరుం। ఏకం। చ। అజహాతం॥

అ॥ పరివర్తమానం = మేరుపర్వతమునందుఁ దిరుగుచుండెడి ఏతత్ =ఈకశ్యపుఁడను పేరుగల సూర్యమండలమును, అహం = నేను, అపశ్యం = చూచితిని, అజహాతం = ఎప్పుడును మేరువుపర్వతమును విడిచిపెట్టని, ఏకం ఒక్కఁడైన కశ్యపుఁడను సూర్యుని, ద్రష్టుం = చూచుటకొఱకు, మహామేరుం = గొప్పదియగు మేరు పర్వతమునుగూర్చి, గచ్ఛంత = మీరిద్దఱు వెళ్ళుఁడు, ఇతి = ఈలాగని, గార్గ్యః = గర్గునికుమారుండగు, ప్రాణత్రాతః = ప్రాణత్రాతుఁడను పేరుగల మునీశ్వరుఁడు, తౌ = ఆపంచకర్ణ సప్తకర్ణుల గుఱించి, ఆహ = చెప్పెను.

తా॥ గర్గుని కుమారుండగు ప్రాణత్రాతుఁడు నేను మేరువను పర్వతమందుఁ దిరుగుచుండెడి కశ్యపుఁడను పేరుగల యెనిమిదవ సూర్యమండలమును జూచితిననియు ఆకశ్యపుఁడెల్లప్పుడు మేరుపర్వతమును విడిచియుండఁడుగాన మీరిద్దఱా మేరు పర్వతంబున కేఁగి యాయనను జూడవచ్చుననియుఁ బంచకర్ణ సప్తకర్ణులతోఁ జెప్పెను.

ప్లాక్షిః=ప్లక్షమహర్షియొక్క కుమారుండగు సప్తకర్ణః=సప్తకర్ణుఁడను మునియు, ఆహ=చెప్పెను, కించ=ఇదియేకాదు, కే=మాయిద్దఱకు, కశ్యపః=కశ్యపుఁడను యెనిమిదవ సూర్యుఁడు, ఆనుశ్రావిక ఏవ=గురువువలన వినఁబడుచున్నాఁడుగాని చూడఁబడలేదు, ఇతి=ఈలాగని ఉభౌ=ఆమునీశ్వరులిద్దఱును, వేదయితే=ప్రాణులను గూర్చి తెలుపుచున్నారు, ఆవాం=మేమిద్దఱము, మహామేరుం=గొప్పదియగు మేరువు పర్వతమునుగూర్చి, గంతుం=వెళ్లుటకొఱకు, నహి శేకుమివ=సమర్థులము కాకపోతిమి॥

తా॥ ఆరోగుఁడు మొదలుగాఁగల యేడుగురు సూర్యులను నేను జూచితినని వత్సమునీశ్వరుని కుమారుండగు పంచకర్ణ మహర్షియు నేను జూచితినని ప్లక్షమునీశ్వరుని కుమారుండగు సప్తకర్ణమహర్షియు జెప్పిరి. మఱియు మేమిద్దఱము ఎనిమిదవ సూర్యుండగు కశ్యపుని వేదమువలనను గురూపదేశమువలనను వింటిమేగాని చూడలేదనిరి. ఎందువలననఁగా ఆ కశ్యపుఁడు మహోన్నతస్థానమైన మేరు పర్వతమందుండుఁగాన నచ్చటికి మేము పోఁజాలమైతిమని చెప్పిరి.

మూ॥ అపశ్యమహమేతత్సూర్యమండలం పరివర్తమానం। గార్గ్యః
ప్రాణత్రాతః। గచ్ఛన్త మహామేరుం ఏకం చాజహాతం॥

ప॥ అపశ్యం। అహం। ఏతత్। సూర్యమండలం। పరివర్తమానం। గార్గ్యః। ప్రాణత్రాతః। గచ్ఛన్త। మహామేరుం। ఏకం। చ। అజహాతం॥

అ॥ పరివర్తమానం = మేరుపర్వతమునందుఁ దిరుగుచుండెడి ఏతత్ = ఈకశ్యపుఁడను పేరుగల సూర్యమండలమును, అహం = నేను, అపశ్యం = చూచితిని, అజహాతం = ఎప్పుడును మేరువుపర్వతమును విడిచిపెట్టని, ఏకం ఒక్కఁడైన కశ్యపుఁడను సూర్యుని, ద్రష్టుం = చూచుటకొఱకు, మహామేరుం = గొప్పదియగు మేరు పర్వతమునుగూర్చి, గచ్ఛంత = మీరిద్దఱు వెళ్ళుఁడు, ఇతి = ఈలాగని, గార్గ్యః = గర్గునికుమారుండగు, ప్రాణత్రాతః = ప్రాణత్రాతుఁడను పేరుగల మునీశ్వరుఁడు, తౌ = ఆపంచకర్ణ సప్తకర్ణుల గుఱించి, ఆహ = చెప్పెను.

తా॥ గర్గుని కుమారుండగు ప్రాణత్రాతుఁడు నేను మేరువను పర్వతమందుఁ దిరుగుచుండెడి కశ్యపుఁడను పేరుగల యెనిమిదవ సూర్యమండలమును జూచితిననియు ఆకశ్యపుఁడెల్లప్పుడు మేరుపర్వతమును విడిచియుండఁడుగాన మీరిద్దఱా మేరు పర్వతంబున కేతెంచి యాయనను జూడవచ్చుననియుఁ బంచకర్ణ సప్తకర్ణులతోఁ జెప్పెను.

అ॥ సప్తసూర్యాః=ఏడుగురు సూర్యులు, దివం=అంతరిక్షమును, అనుప్రవిష్టాః=క్రమముగా వ్యాపించియున్నారు, దక్షిణావాన్ = శాస్త్రోక్త దక్షిణలుగల యారుణకేతుకాగ్ని, తాన్=ఆసూర్యులను, అను = అనుసరించి, పథిభిః=చల్లనైన మార్గములచేత, ఏతి=మేరుపర్వతమును బొందుచున్నాఁడు, తేసర్వే = ఆ యేడుగురు సూర్యులున్ను, ఊర్జం=క్షీరాదిభోగ్యపదార్థమును, దుహానాః=కల్పింపఁజేసినవారలై, అనపస్ఫురంతః = అనుకూలముగునట్లు ప్రకాశించుచు, అస్మై = ఆరుణకేతుకాగ్ని తాదాత్మ్యమును బొందియున్న ఈ యజమానుని కొఱకు, ఘృతం=ఘృతాదులతోఁ దుల్యమగు మేరుమార్గరూపమగు ఆకాశమును, అతపన్తి = ప్రకాశింపఁజేయుచున్నారు, ఇతి=ఈలాగని, ఏషా=ఈ మంత్రము, తేషాం=ఆ సూర్యులయొక్క, ప్రభావము వర్ణించునదియై, భవతి=అగుచున్నది.

తా॥ ఆరోగుఁడు మొదలగు ఏడుగురు సూర్యుల క్రమముగా నాకాశమును వ్యాపించియున్నారు. యజమానుఁడు శాస్త్రోక్తప్రకారముగా యజ్ఞముఁజేసి యథావిధిగా దక్షిణలనిచ్చి జన్మాంతరమున ఆరుణకేతుకాగ్నితాదాత్మ్యమును బొంది మేరుమార్గమునకు దిగువనుండు ముగ్గురు సూర్యులకు మధ్యయందుండు సుఖకరమైన మార్గములచేత మేరుపర్వతమునకుఁ బోవుచుండఁగా నా యేడుగురు సూర్యులు ఈ యజమానునికి క్షీరాదిభోగ్యవస్తువులను గల్పించి ఇక్కడకు రండి, ఇక్కడ కూర్చుండుఁడు, ఇది భుజింపుఁడు, అనునట్టి ప్రియవాక్యములఁ బలుకుచు మిక్కిలి శీతోష్ణములుగాక అనుకూలమగునట్లు ప్రకాశించుచు మార్గమునందు ఘృతాదివస్తువులతో సంపూర్ణమైన యాహారము నిచ్చుచు మేరుమార్గమునుఁ బ్రకాశింపఁజేయుచున్నారు. ఈలాగని ఈ మంత్రము ఆ సూర్యుల సామర్థ్యము చెప్పుచున్నది.

మూ॥ సప్తర్త్విజ స్సూర్యా ఇత్యాచార్యాః ॥

ప॥ సప్త । ఋత్విజః । సూర్యాః । ఇతి । ఆచార్యాః ॥

అ॥ సప్త=ఏడుగురైన, ఋత్విజః=ఋత్విక్కులే, సప్తసూర్యాః=ఏడుగురు సూర్యులు, ఇతి=ఈలాగని, ఆచార్యాః= కొందఱాచార్యులు, ఆహుః=చెప్పిరి ॥

తా॥ యజ్ఞమును జేయుంచునట్టి హోత, ప్రశస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అచ్ఛావాక, అగ్నీధ, అను నేడుగురైన యే ఋత్విక్కులు కలరో వారినే యేడుగురు సూర్యులని కొందఱు పెద్దలు చెప్పిరి.

మూ॥ తేషామేషాభవతి॥

ప॥ తేషాం । ఏషా । భవతి॥

అ॥ తేషాం=ఋత్విక్స్వరూపమైనసూర్యులయొక్క, ప్రతిపాదికా = ప్రతిపాదనచేయునదియై, ఏషా=ఈ చెప్పఁబోవుఋక్కు, భవతి=అగుచున్నది.

తా॥ ఆయేడుగురు ఋత్విక్కులను యేడుగురు సూర్యులనుగా ఈ ముందు చెప్పఁబోవు ఋక్కు ప్రతిపాదనచేయుచున్నది.

మూ॥ సప్తదిశోనానాసూర్యాః॥ ౨౩॥ సప్తహోతార ఋత్విజః దేవా ఆదిత్యాయేసప్త । తేభిస్సోమాభీరక్షణ ఇతి॥

ప॥ సప్త । దిశః । నానాసూర్యాః । సప్త । హోతారః । ఋత్విజః । దేవాః ఆదిత్యాః । యే । సప్త । తేభిః । సోమ । అభి । రక్ష । నః । ఇతి॥

అ॥ సప్త = ఏడైన, దిశః = ఆగ్నేయము మొదలీశాన్యమువఱకు నుండు దిక్కులు, నానాసూర్యాః = అనేకులైన సూర్యులుకలవి, తే = ఆయేడు దిక్కులకు నధిపతులగు సూర్యులు, హోతారః = హోతృ మొదలగు, సప్తఋత్విజః = ఏడుగురు ఋత్విక్కులగుచున్నారు, యే = ఏ,సప్త = ఏడుగురు ఋత్విక్కులు కలరో, తే=వారు, దేవాః=దేవతలై, ఆదిత్యాః=సూర్యులని చెప్పఁబడుచున్నారు, సోమ= యజ్ఞమునకు నధిపతివగు ఓ సోముఁడా! తేభిః, తైః, ఆసూర్యులచేత, నః= మమ్ములను, అభిరక్ష=రక్షింపఁజేయుము.

తా॥ సూర్యుఁడుదయించునట్టి తూర్పుదిక్కు అందఱకుఁ దెలిసియేయున్నది. ఇదిగాక ఆగ్నేయము మొదలీశాన్యమువఱకు నుండు నేడు దిక్కులయందునను అనేకమైన సూర్యులు సంచరించు చుండిరి. వారే హోతృ మొదలగు నేడుగురు ఋత్విక్కులని చెప్పఁబడుచుండిరి. ఈ యేడుగురు ఋత్విక్కులే దేవతలై సూర్యులని చెప్పఁబడుచున్నారు. సోముఁడా! సప్తహోతృ స్వరూపులగు ఆదిత్యులచే మమ్ములను రక్షింపఁజేయుము.

మూ॥ తదప్యామ్నాయః । దిగ్భ్రాజ ఋతూన్కరోతి ॥

ప॥ తత్ । అపి । ఆమ్నాయః । దిగ్భ్రాజః । ఋతూన్ । కరోతి ॥

అ॥ తత్ అపి=ఏడుదిక్కులయందు అనేక సూర్యులుండిరనుట, ఆమ్నాయః=

భేదము చెప్పుచున్నదిగాని ప్రత్యక్షము చూడఁబడలేదు, దిగ్భ్రాజః=దిక్కులయందు సంచరించునట్టి సూర్యులు, ఋతూన్=ఋతుధర్మములను, కరోతి=చేయుచున్నారు.

తా॥ ఆగ్నేయాది యెనుదిక్కులయందు అనేకసూర్యులుండిరన్నమాట వేదము చెప్పుచున్నదిగాని ప్రత్యక్షముగా దూర్పుదిక్కునందువలెనే చూచియుండలేదు. అయినను అనంత సూర్యులుండిరనుటకు యుక్తియొకటి కలదు. అది యెట్లనఁగా ఏయే దిక్కులయందు ఏయేఋతుధర్మములు జరిగినను ఆయా దిక్కులయందు సూర్య ప్రకాశములేనిది సంభవింపదు గాన అనంత సూర్యులుండిరని యెడు యుక్తిని యొప్పు కొనవలసి యున్నది.

మూ॥ ఏతయైవావృతా సహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః॥

ప॥ ఏతయా। ఏవ। ఆవృతాః। సహస్ర సూర్యతాయాః। ఇతి వైశం పాయనః॥

అ॥ ఏతయైవ=ఈ న్యాయముచేతనే, సహస్రసూర్యతాయాః=సహస్ర సూర్య భేదములు, ఆవృతాః=కల్పింపఁదగినవి, ఇతి=ఈ లాగని, వైశంపాయనః=వైశం పాయనముని చెప్పెను.

తా॥ ఎక్కడ ఋతుధర్మములు ప్రవర్తించునో అక్కడ ఆ ఋతుధర్మ ప్రవర్త కుఁడైన సూర్యుఁడుండవలయునుగాన అనేక దిక్కులయందు వసంతాది ఋతుధర్మ ములు ప్రవర్తించుటచేతననంత సూర్యత్వ మంగీకరింపవలసి యుండఁగా సప్తసూర్యు లుండిరనుటకు నేమి యాశ్చర్యమని వైశంపాయనమునీశ్వరుఁడు చెప్పియున్నాఁడు.

మూ॥ తస్యైషాభవతి। యద్ద్యావఇన్ద్రతేశతగ్ం శతంభూమీః। ఉతస్యుః। నత్వావజ్రిన్ సహస్రగ్ం సూర్యాః ॥౨౮॥ అను నజాతమష్టరోదసీఇతి॥

ప॥ తస్య। ఏషా। భవతి। యత్। ద్యావః। ఇంద్ర। తే। శతం। శతం। భూమీః। ఉత। స్యుః। న। త్వా। వజ్రిన్। సహస్రం। సూర్యాః। అను। న। జాతం। అష్టరోదసీ। ఇతిః

అ॥ ఇంద్ర=ఓ యింద్రుఁడా, తే=నీకు, శతం=నూఱు, ద్యావః=స్వర్గములు ఉత=మతియును, శతం=నూఱు, భూమీః=భూములు। స్యుఃయత్=ఉన్నట్లాయె నా, వజ్రిన్=ఓ యింద్రుడా! రోదసీ=ఆద్యావాపృథివీల మధ్యమందు, జాతం=

ఉన్నట్టి, త్వా=నిన్ను, సహస్రింసూర్యాః=అనేకసూర్యులు, నానుప్పన=అనుస రించి వ్యాపించి యుండలేదనిన మాట లేదు, అనఁగా వ్యాపించియున్నారనుట ఇతి= ఈలాగని, ఏషా=ఈ ఋక్కు, తస్య=ఆ సూర్యుల ప్రతిపాదనం గూర్చి, భవతి= అగుచున్నది.

తా॥ వజ్రధరుఁడవగు నో యింద్రుఁడా! నూఱు స్వర్గములు నూఱుభూము లున్నవని శ్రుతులు ప్రతిపాదనఁ జేయుచున్నవి. అట్లున్నయెడల ప్రతిద్యావా పృథివీలమధ్యను నీవు వ్యాపించియుండవలయును. ఇట్టి నూఱుప్రదేశములయందు వ్యాపించియున్న నిన్ను అనుసరించి అనంతసూర్యులు అన్ని ప్రదేశములయందు వ్యాపించియున్నారనిన మాట నిశ్చయము.* అని ఈ ఋక్కు అనేక సూర్యులుండు టను గూర్చి ప్రతిపాదనఁ జేయఁబడినది.

మూ॥ నానాలింగత్వాదృతూనాం నానాసూర్యత్వం॥

ప॥ నానాలింగత్వాత్ । ఋతూనాం । నానాసూర్యత్వం॥

అ॥ ఋతూనాం ఋతువులు నానాలింగత్వాత్=అనేకవిధ ధర్మములు కల వగుటవలన, నానాసూర్యత్వం=అనేక సూర్యులుండుట॥

తా॥ ఒక్కఁడే సూర్యుఁడనిన యెడల వసంతఋతువు మొదలగు నాఱు ఋతువుల ధర్మములు భేదముగా నున్నవిగాన ఆయాఋ ఋతుధర్మ ప్రవర్తనకు ఆయాసూర్యులుండుటచే ననంతసూర్యత్వ మంగీకరింపవలసి యున్నది.

మూ॥ అష్టౌతు వ్యవసితా ఇతి॥

ప॥ అష్టౌ । తు । వ్యవసితాః । ఇతి॥

అ॥ అష్టౌతు=ఎనమండ్రు సూర్యులు, వ్యసితాః=నిశ్చయింపఁబడిరి, ఇతి=ఈ లాగని చెప్పఁబడెను.

తా॥ పూర్వము ఎనమండ్రు సూర్యులు అని చెప్పఁబడెను. ఇప్పుడు అనంత సూర్యులని చెప్పబడెను. ఈ రెంటికి విరోధముగా నున్నదని ప్రశ్నఁజేసితివేని చెప్పు చున్నాము. అనేక సూర్యులుండి నప్పటికీ శాస్త్రమువలనను యుక్తి వలనను నిర్ధా రణ చేయుటయేగాని వారినందఱను ఎవరును జూచి యుండలేదు వారిలో ఆరోగుఁడు మొదలగు నేడుగురిని మేము చూచితి మని చెప్పిన పంచకర్ణ సప్తకర్ణుల వచనము వలనను, ఎనిమిదవ సూర్యుండగు కశ్యపుని గూడ నేను జూచితినని చెప్పిన

ప్రాణత్రాతుని వచనమువలనను ప్రత్యక్షముగాఁ జూడఁబడిన సూర్యులు ఎనమండ్రు అని పూర్వాపరవాక్యములను సమన్వయము చేసికొనవలయును.

మూ॥ సూర్యమండలాన్యష్టాత ఊర్ధ్వం। తేషామేషా భవతి ॥

ప॥ సూర్యమండలాని । అష్ట । అతః । ఊర్ధ్వం । తేషాం । ఏషా । భవతి ।

అ॥ అతః=ఈ కారణమువలన, ఊర్ధ్వం=అంతరిక్షమందు, అష్ట=ఎనిమిది సూర్యమండలాని=సూర్యమండలములు, సంతి=కలవు, తేషాం=వారి యొక్క ప్రతిపాదసంగూర్చి, ఏషా=వీరిబుక్కు, భవతి=అగుచున్నది.

తా॥ పంచకర్ణ సప్తకర్ణ ప్రాణత్రాతులు మేము చూచితిమని చెప్పుట వలన అంతరిక్షమందు ఎనిమిది సూర్యమండలము లున్నవని నిశ్చయింపఁబడినవి. ఆ సూర్యమండలములను గూర్చియే ముందు చెప్పఁబోవు మంత్రము ప్రతిపాదన చేయుచున్నది.

మూ॥ చిత్రం దేవానాముదగాదనీకం। చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః । ఆప్రాద్ద్యావాపృథివీ అంతరిక్షం। సూర్య ఆత్మాజగతస్తుషశ్చేతి ॥

ప॥ చిత్రం । దేవానాం । ఉదగాత్ । అనీకం । చక్షుః । మిత్రస్య । వరుణస్య । అగ్నేః । ఆప్రా । ద్యావాపృథివీ । అంతరిక్షం । సూర్యః । ఆత్మా । జగతః । తస్థుషః । చ । ఇతి ॥

అ॥ చిత్రం=అనేకవిధములైనట్టిదియు, దేవానాం=దేవతలకు, అనీకం=సేనగానున్నట్టిదియు, మిత్రస్య = మిత్రుఁడను దేవునకును, వరుణస్య = వరుణునకును, అగ్నేః=అగ్నికిని, చక్షుః=నేత్రప్రాయమైనట్టి, యత్=ఏ, మండలం=సూర్యమండలము కలదో, తత్=ఆ మండలము, ఉదగాత్=ఉదయించుచున్నది, తత్=ఆ మండలము, ద్యావాపృథివీ=స్వర్గలోక భూలోకములను, అంతరిక్షంచ = ఆకాశమును, వ్యాపించియుండుచున్నది, సూర్యః=ఆ మండల స్వరూపుఁడైన సూర్యుఁడు, జగతః=జంగమములకును, తస్థుషశ్చ=స్థావరములకును, ఆత్మా = అంతర్యామియై, భవతి=అగుచున్నాడు .

తా॥ సూర్యమండలము లనేకము లగుటచేఁ జిత్రముగా నున్నదియు పూర్వమందు వృత్రాసురుని శరీరమే చీఁకటిగా నేర్పడినది గాన అట్టి శత్రుస్వరూపమైన

చీఁకటిని వోఁగొట్టుటకు దేవతలకు నైశ్యముగా నున్నదియు తేజస్స్వరూప మగు టచే మిత్రుఁడు వరుణుఁడు అగ్ని మొదలగు దేవతలకు నేత్రప్రాయముగానున్నది యునగు రేయే సూర్యమండలము కలదో ఆ సూర్యమండలము తూర్పు దిక్కున నుద యించి స్వర్గలోక భూలోకా అంతరిక్షముల యందుఁ దన కాంతిచే నిండి ప్రకాశిం చుచున్నది. ఆ మండల స్వరూపుఁడగు సూర్యుఁడు స్థావర జంగమాత్మకమగు ప్రపంచమునందు అంతర్యామిగా నుండెను.

ఇతి సప్తమోను వాకస్సమాప్తః

## —♦ అథఅష్టమోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ క్వేదమభ్రంనివిశతే। క్వాయగ్ం సంవత్సరోమిథః। క్వాహః క్వేయం దేవరాత్రీ। క్వమాసాఋతవశ్శ్రితాః॥

ప॥ క్వ। ఇదం। అభ్రం। నివిశతే। క్వ। అయం। సంవత్సరః। మిథః। క్వ। అహః। క్వ। ఇయం। దేవ। రాత్రీ। క్వ। మాసాః। ఋతవః। శ్రితాః॥

అ॥ దేవ=ఓ ప్రభువా!, ఇదం=ఈ, అభ్రం=మేఘము, క్వ=ఎక్కడ, నివి శతే=ఉండినది, మిథః=అనేక కాలావయములతోఁగూడిన, అయం=ఈ సంవత్స రము, క్వ=ఎక్కడ నివిశతే=ఉండినది, అహః=పగలు, క్వ=ఎక్కడ, నివిశతే=ఉండి నది, ఇయం=ఈ రాత్రీ=రాత్రి, క్వ=ఎక్కడ, మాసాః=మాసములు, ఋతవః= ఋతువులు, క్వ=ఎక్కడ, శ్రితాః=ఆశ్రయించియున్నవి.

తా॥ మేఘము అనేక కాలావయవవిశిష్టమైన సంవత్సరము పగలు రాత్రి మాసములు ఋతువులు ఇవియన్నియు దేనియాధారముచేనున్నవి. వీని కన్నింటికిఁ గారణమేది చెప్పుమని యడిగెను.

మూ॥ అర్థమాసాముహూర్తాః। నిమేషాస్త్రుటిభిస్సహ। క్వేమా ఆపోనివిశన్తే। యదీతోయాన్తి సంప్రతి॥

ప॥ అర్థమాసాః। ముహూర్తాః। నిమేషాః। త్రుటిభిః। సహ। క్వ। ఇమాః। ఆపః। నివిశన్తే। యది। ఇతః। యాన్తి। సంప్రతి॥

అ॥ త్రుటిభిస్సహ=త్రుటిలు అని పేరుగల స్వల్పకాలములతోఁగూడ, అర్థ మాసాః=శుక్లపక్ష బహుళపక్షములు, ముహూర్తాః=రెండు ఘడియల ప్రమాణము

గలకాలములు, క్వ=ఎక్కడ, నివిశన్తే=ఉన్నవి, ఇమాః=ఈ, అపః=జలములు, క్వ=ఎక్కడ, నివిశన్తే=ఉండుచున్నవి, ఇతః= ఈ భూలోకమునుండి, కుత్ర=ఎక్కడికి, ఘర్మకాలే=గ్రీష్మకాలంబున, యాన్తి=వెళ్ళుచున్నవి, సంప్రతి=అప్పుడు, క్వ=ఎక్కడ, నివిశన్తే=ఉండుచున్నవి.

తా॥ పక్షములు ముహూర్తములు త్రుటులు మొదలగు కాలములు ఎక్కడ ఉండుచున్నవి, మఱియు ఈజలములు గ్రీష్మకాలంబున ఎక్కడకి వెళ్ళుచున్నవి అప్పుడు అక్కడే తీరున ఉండుచున్నవి అని ప్రశ్న చేసెను.

మూ॥ కాలా అప్సునివిశన్తే । ఆపస్సూర్యేసమాహితాః॥౨౬॥ అభ్రాణ్యాపః ప్రపద్యన్తే । విద్యుత్సూర్యే సమాహితా॥

ప॥ కాలాః । అప్సు। నివిశన్తే । ఆపః । సూర్యే । సమాహితాః । అభ్రాణి । అపః । ప్రపద్యన్తే । విద్యుత్ । సూర్యే । సమాహితా ॥

అ॥ కాలాః=కాలములు, అప్సు=జలములయందు, నివిశన్తే=నివసించుచున్నవి, ఆపః=జలములు, సూర్యే=సూర్యునియందు, సమాహితాః=ఉన్నవి, అభ్రాణి=మేఘములు, అపః = సూర్యకిరణములద్వారా జలములను, ప్రపద్యన్తే = పొందుచున్నవి, విద్యుత్=మెఱుపు, సూర్యే=ఆదిత్యునియందు, సమాహితా=ఉన్నది.

తా॥ ఆపోవా ఇదమగ్రేసలిల మాసీత్ అను శ్రుతిప్రమాణముచే సృష్టికిఁ బూర్వంబున జలమయముగా నుండుటచే సంవత్సరము మొదలు త్రుటివఱకు నుండు కాలములన్నియు జలములయందున్నవి. ఈజలములు గ్రీష్మకాలంబున సూర్యకిరణములచే శోషింపఁబడి యాసూర్యకిరణములయం దున్నవి. అట్టి సూర్యకిరణములయందున్నట్టి జలములను మేఘములు పొందుచున్నవి. మేఘములయందున్నట్టి మెఱుపు సూర్యుని కాంతి సంబంధమైనది.

మూ॥ అనవర్ణేఇమేభూమీ । ఇయంచాసౌచరోదసీ॥

ప॥ అనవర్ణే । ఇమే । భూమీ । ఇయం । చ । అసీ । చ । రోదసీ॥

అ॥ ఇమే=ఈ, భూమీ=భూమ్యంతరిక్షములు, అనవర్ణే=మంచిరూపములు గానున్నవి, ఇయంచ=ఈభూమియు, అసౌచ=ఈ అంతరిక్షము, రోదసీ=రోదశి యనుచేఁ జెప్పఁబడుచున్నవి॥

తా॥ రోదశ్శబ్దముచేఁ జెప్పబడెడు భూమ్యంతరిక్షములు రెండును అనేక విధములగు దేవతలచేఁ బరిపూర్ణములగుటచే సురూపములుగానున్నవి.

మూ॥ కిగ్ంస్విదత్రాంతరాభూతం । యేనేమేవిధృతేఉభే । విష్ణునా విధృతేభూమీ । ఇతివత్సస్యవేదనా॥

ప॥ కిం । స్విత్ । అత్ర । అంతరాభూతం । యేన । ఇమే । విధృతే । ఉభే। విష్ణునా । విధృతే । భూమీ । ఇతి । వత్సస్య । వేదనా ॥

అ॥ ఎన=ఎవనిచేత, ఇమే=ఈ, ఉభే=రెండైన భూమ్యంతరిక్షములు, విధృతే=ధరింపఁబడుచున్నవి, అత్రాంతరా=ఈ రెంటిమధ్యను, కింస్విద్భూతం= ఏమియున్నది, భూమీ=భూమ్యంతరిక్షములు, విష్ణునా=వ్యాపకశీలుఁడైన పరమేశ్వరునిచే, విధృతే=ధరింపఁబడినవి, ఇతి = ఈలాగని, వత్సస్య = వత్సమహాముని యొక్క, వేదనా=అనుభవప్రకటనము.

తా॥ ఈ భూమ్యంతరిక్షములు ఎవరిచే ధరింపఁబడినవి ఈ రెంటిమధ్య నేమి యున్నదని ప్రశ్న వేయుఁగాఁ జెప్పుచున్నాఁడు. ఈ భూమ్యంతరిక్షములు రెండును సమస్త జగత్కారణుండగు పరమేశ్వరునిచే ధరింపఁబడినవని వత్సమహాముని తన యనుభవమును బ్రకటనచేసి యున్నాఁడు.

మూ॥ ఇరావతీధేనుమతీహిభూతం । సూయవసినీమనుషేదశస్యే । వ్యష్టభ్నాద్రోదసీ విష్ణవేతే । దాధర్థపృథివీ మభితోమయూఖైః ॥

ప॥ ఇరావతీ । ధేనుమతీ । హి । భూతం । సూయవసినీ । మనుషే । దశస్యే । వి । అష్టభ్నాత్ । రోదసీ । విష్ణో । ఏతే । దాదర్థ । పృథివీం । అభితః । మయూఖైః॥

అ॥ ఇరావతీ=అన్నముకలవియు, ధేనుమతీ=పశువులు కలవియు, సూయవసినీ=సౌభాగ్యమైన భక్ష్యములు కలవియునగు, ఏతే=ఈ భూమ్యంతరిక్షములు, మనుషే=మనుష్యులకొఱకు, దశస్యే=అన్నము మొదలగువాని నిచ్చుకొఱకు సమర్థములైనవియై, భూతం=అయినవి, ఏతే=ఈ, రోదసీ=భూమ్యంతరిక్షములను, విష్ణుః=విష్ణుమూర్తి, వ్యష్టభ్నాత్ = మిక్కిలి ధరించియున్నాఁడు, విష్ణో=ఓ విష్ణుమూర్తీ!, త్వం = నీవు, పృథివీం = స్వర్గలోకముతోఁగూడ ఈభూమిని, అభితః = అంతటను, మయూఖైః=కిరణములచేత, దాధర్థ=ధరించియుంటివి.

తా॥ ఈ భూమ్యంతరిక్షములు అన్నముకలవియు, పశువులుకలవియు, యోగ్యమైన భక్ష్యములుకలవియునై మనుష్యులకు నన్నము మొదలగువాని నిచ్చునట్టివియై యగుచున్నవి. అట్టి భూమ్యంతరిక్షములను విష్ణువు ధరించియున్నాఁడు. ఓ విష్ణుమూర్తీ! నీవు స్వర్గసహితమైన భూమినంతయును నీకిరణములచేత మేకులచే బిగించి పట్టుకొనినట్లు పట్టుకొనియున్నావు. యిక్కడ మనుష్యులకొఱకు నన్నమునిచ్చుకొఱకు సమర్థమైనవియని చెప్పుటచేత నన్నిప్రాణులలో మనుష్యులు ప్రధానులుగాన మనుష్యశబ్దమువలన నిక్కడ నన్నిప్రాణులు గ్రహింపఁదగియున్నవి. కాఁబట్టి ఆయాప్రాణులకు నాయాయాహారములను గల్పించి యిచ్చుచున్నవని చెప్పుకొనఁదగియున్నది.

మూ॥ కింతద్విష్ణోర్బలమాహుః। కాదీప్తిః కింపరాయణం। ఏకో
యద్ధారయద్దేవః। రేజతీరోదసీఉభే॥

ప॥ కిం। తత్। విష్ణోః। బలం। ఆహుః। కా। దీప్తిః। కిం। పరాయణం। ఏకః। యత్। ధారయత్। దేవః। రేజతీ। రోదసీ। ఉభే॥

అ॥ యత్=ఏ, ఏకః=ఒక్కఁడైన, దేవః=దేవుఁడు, రేజతీ=ప్రకాశించునట్టి, ఉభే=రెండైన, రోదసీ = భూమ్యంతరిక్షములను, ధారయత్ = ధరించెనో, తద్విష్ణోః=ఆ విష్ణువునకు, తత్=ఆ, బలం=బలము, కిం=ఏమిటి, దీప్తిః=ప్రకాశమును, కా=ఎక్కడిది, పరాయణం=సహాయభూతమైన వస్తువయు, కిం=ఏది॥

తా॥ ఏవిష్ణువు తాను ఒక్కఁడైనను బ్రకాశించునట్టి ఈభూమ్యంతరిక్షములరెంటిని ధరించి యున్నాఁడో, ఆవిష్ణువునకు ఆబలము ఎక్కడిది. ఆకాంతి యెక్కడిది. ఆయనకు సహాయకారి యగు వస్తువేది యని పృచ్ఛకులు ప్రశ్నించిరి.

మూ॥ వాతాద్విష్ణోర్బలమాహుః। అక్షరాద్దీప్తిరుచ్యతే। త్రిపదా
ద్ధారయద్దేవః। యద్విష్ణోరేకముత్తమం॥ ౨౮॥

ప॥ వాతాత్। విష్ణోః। బలం॥ ఆహుః। అక్షరాత్। దీప్తిః। ఉచ్యతే। త్రిపదాత్। ధారయత్। దేవః। యత్। విష్ణోః। ఏకం। ఉత్తమమ్॥

అ॥ విష్ణోః=విష్ణువునకు, బలం=బలము, వాతాత్=వాయువువలన, ఆగతం=కాఁబడినదని, ఆహుః=పెద్దలు చెప్పిరి, దీప్తిః=కాంతి, అక్షరాత్=నాశరహితమైన పరబ్రహ్మమువలన కలిగినదని ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, దేవః=విష్ణుమూర్తి,

త్రిపదాత్=జగదంశరహితమైనదియునగు అంశత్రియ విశిష్టమైన చైతన్యమువలనన్ సామర్థ్యముగలవాఁడై, ధారయత్=ప్రపంచమునంతనుధరించి యున్నాఁడు, యత్=ఏవాఁడు అంశలుగల చైతన్యము కలదో, తత్=అదియే, విష్ణోః=విష్ణువుయొక్క ఉత్తమం=అధికమైన, ఏకం=ఒక్కటి యగు రూపము॥

తా॥ విష్ణువునకు బలము వాయువువలన రాబడినదనియు నాశరహితమైన పరబ్రహ్మము వలననే సమస్త ప్రపంచమును బ్రకాశింపఁజేయునట్టి కాంతి కలిగిన దనియు పెద్దలు చెప్పిరి. మఱియు బరబ్రహ్మముయొక్క నాలుగుఅంశములలో నొక యంశము ప్రపంచస్వరూపమైనది. మిగిలిన మూఁడు యంశములు ప్రపంచ సంబంధములేక కేవలానందకరమైన చైతన్యముగా నున్నవి. కాఁబట్టి అట్టి ప్రపంచ సంబంధరహితమైన మూఁడు అంశములవలనను బొందబడిన సామర్థ్యము కలవాఁడై ఈ ప్రపంచము నంతయును ధరించియున్నాడు. ఆ మూఁడు అంశములుగల చైతన్య స్వరూపమే ఈ విష్ణువుయొక్క శ్రేష్ఠమగు రూపమైయున్నది.

మూ॥ అగ్నయో వాయవశ్చైవ । ఏతదస్యపరాయణం॥

ప॥ అగ్నయః । వాయవః । చ । ఏవ । ఏతత్ । అస్య । పరాయణం॥

అ॥ అగ్నయః=అగ్నిహోత్రులు, వాయవశ్చ=వాయువులు, అనునవియేవి కలవో, ఏతత్= ఈ సమస్తము, అస్య=ఈ విష్ణువునకు, పరాయణం=ముఖ్యసహాకారిగా నున్నది.

తా॥ అగ్నిహోత్రులు వాయువులు మొదలగు సమస్తభూతములు ఈ విష్ణువునకు సహాకారముగా నున్నవి.

మూ॥ పృచ్ఛామిత్వాపరం మృత్యుం । అవమంమధ్యమంచతుం ।
లోకంచ పుణ్యపాపానాం । ఏతత్పృచ్ఛామి సంప్రతి॥

ప॥ పృచ్ఛామి । త్వా । పరం । మృత్యుం । అవమం । మధ్యమం । చతుం । లోకం । చ । పుణ్యపాపానాం । ఏతత్ । పృచ్ఛామి । సంప్రతి॥

అ॥ సంప్రతి=ఇప్పుడు, పరం=పరమనెడు, అవమం=అవమమనెడు, మధ్యమం=మధ్యమమనెడు, చతుం=చతువు అనెడు, మృత్యుం=మృత్యువునుగూర్చి, త్వా=నిన్ను, పృచ్ఛామి=అడుగుచున్నాను, ఏతత్=ఈ, పుణ్యపాపానాం=పుణ్యపాపములయొక్క, లోకంచ=సమూహమును పృచ్ఛామి=అడుగుచున్నాను॥

తా॥ పరము అవమము మధ్యమము చతువు అనెడు నాలుగువిధములగు మృత్యువుల స్వరూపమెట్టువంటిదో పుణ్యాత్ముల పాపాత్ముల స్వరూప మెట్టువంటిదో చెప్పుమని తెలియని యొక మునీశ్వరుడు తెలిసినట్టి మునీశ్వరునిఁ జెప్పుమని యడిగెను.

మూ॥ అముమాహుః పరంమృత్యుం। పవమానస్తు మధ్యమం। అగ్ని రేవావమోమృత్యుః। చంద్రమార్చతురుచ్యతే॥ ౨౭॥

ప॥ అముం। ఆహుః। పరం। మృత్యుం। పవమానం। తు। మధ్యమం। అగ్నిః। ఏవ। అవమః। మృత్యుః। చంద్రమాః। చతుః। ఉచ్యతే॥

అ॥ అముం=ఈ కనఁబడునట్టిసూర్యుని, పరం=పరమనెడు, మృత్యుం=మృత్యువుగాను, ఆహుః=చెప్పిరి, పవమానం=వాయువుని, మధ్యమం=మధ్యమమను మృత్యువుగాను, ఆహుః=చెప్పిరి, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, అవమః=అవమమను, మృత్యువు = మృత్యువుగా, ఉచ్యతఏవ = చెప్పఁబడుచున్నాఁడు, చంద్రమాః = చంద్రుఁడు, చతుః=చతువనెడు, మృత్యువుగా, ఉచ్యతఏవ=చెప్పఁబడుచున్నాఁడు॥

తా॥ ఈ కనఁబడునట్టి సూర్యుఁడు అహోరాత్రములచే సర్వప్రాణుల నాయువును తుయింపఁజేయుటచేత పరమను మృత్యువుగాఁ జెప్పఁబడుచున్నాడు. ప్రాణవాయువు నాడులయందు మఱియొకవిధముగా సంచరించుటచే విశేషముగా శ్వాసములు తగ్గిపోవుటవలన వాయువును మధ్యమమను పేరుగలదై మృత్యువుగాఁ జెప్పఁబడుచున్నది. జఠరాగ్ని మందముగానున్నయెడల భుజించిన పదార్థము జీర్ణము కాకుండుటచే రోగాదులేర్పడును. అందువలన అగ్నియును అవమను పేరుగలదై మృత్యువుగాఁ జెప్పఁబడియెను. ఓషధులకు నధిపతియగు చంద్రుఁడు వృష్టికాల సమయమందు నాయోషధులను జక్కగా వృద్ధినొందింపక పోయినయెడల నాహారమునకు భంగముకలుగును గావున జంద్రుఁడును చతువను మృత్యువుగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

మూ॥ అనాభోగాః పరంమృత్యుం। పాపాస్సంయన్తిసర్వదా। ఆభోగాస్త్వేవసంయన్తి। యత్రపుణ్యకృతోజనాః॥

ప॥ అనాభోగాః। పరం। మృత్యుం। పాపాః। సంయన్తి। సర్వదా। ఆభోగాః। తు। ఏవ। సంయన్తి। యత్ర। పుణ్యకృతః। జనాః।

అ॥ పాపాః=శ్రుతి స్మృతులను అతిక్రమించిన పాపాత్ములు, అనాభోగాః=ఆత్మసంబంధమైన సుఖములేనివారై, సర్వదా=ఎల్లప్పుడు, పరంమృత్యుం=పరమమృత్యువును, అహోరాత్రములు గడచిపోవుటచేత నహోరాత్రి కర్తయగు సూర్యుని సంబంధమగు మృత్యువును, సంయన్తి=పొందుచున్నారు, ఆభోగాస్తు=శ్రుతిస్మృతుల నతిక్రమింపక సన్మార్గమునఁ ప్రవర్తించునట్టి సత్పురుషులు, యత్ర=ఏ పుణ్యలోకంబున, పుణ్యకృతః=పుణ్యమును జేసినట్టి మనుష్యులు, వర్తంతే=ఉండుచున్నారో, తం=ఆలోకమును, సంయంత్యేవ=పొందుచున్నారు.

తా॥ ఏ మనుష్యులు శ్రుతిస్మృతుల నతిక్రమించి నడచుచున్నారో వారు ఆత్మసంబంధమగు సుఖము లేనివారై, అహోరాత్రి క్షయరూపమగు సూర్యుని సంబంధమగు మృత్యువును బొంది చచ్చుచుఁ బుట్టుచుందురు. ఎవరు శ్రుతిస్మృతుల నతిక్రమింపక సన్మార్గమునందుఁ ప్రవర్తింతురో అట్టి సజ్జనులు ఆత్మసంబంధమైన సుఖము కలవారై పుణ్యాత్ములు పొందియున్నట్టి స్వర్గాది పుణ్యలోకములు పొందుదురు.

మూ॥ తతోమధ్యమమాయన్తి । చతుమగ్నించ సంప్రతి ॥

ప॥ తతః । మధ్యమం । ఆయన్తి । చతుం । అగ్నిం । చ । సంప్రతి ॥

అ॥ తతః=విశేష పుణ్యమును గాని విశేష పాపమును గాని జేసిన వారికంటె, అన్యే=ఇతరులగు, యే=ఏ మనుష్యులు మిశ్రమమైన పుణ్యపాపములు కలవారైరో, తే=వారు, సంప్రతి=ఇప్పుడు, మధ్యమం=మధ్యమమును, అగ్నిం=అధమమును, చతుం=చతుర్థమును, ఆయన్తి=పొందుచున్నారు.

తా॥ విశేషమైన పుణ్యమును జేసి స్వర్గాదిలోకములయందుండువారును విశేష పాపమును జేసి క్రిమికీటకాదులయందుఁ బుట్టువారును గాక పుణ్యపాపమిశ్రమ కర్మను జేయునట్టివారు ఈమనుష్యశరీరమందుఁ బుట్టినవారలై పవమాన సంబంధమగు మధ్యమమృత్యువును అగ్నిసంబంధమగు నధమమృత్యువును జంద్రుని సంబంధమగు నధమాధమ మృత్యువును బ్రతిక్రియలచే మళ్ళింపఁ జేసికొనుటకు సమర్థులగుదురు. ఈప్రకారముగా నుత్తమమధ్యమాధమాధమాధమములగు నాలుగు విధములయిన మృత్యుస్వరూపములను విశేషపాపాత్ములయొక్కయు విశేషపుణ్యాత్ములయొక్కయు పుణ్యపాపమిశ్రిత కర్ములయొక్కయు స్వరూపములను జెప్పియున్నారు.

మూ॥ పృచ్ఛామిత్వాపాపకృతః । యత్రయాతయతేయమః । త్వంన
స్తద్బ్రహ్మన్ప్రబ్రూహి । యది వేత్థాసతో గృహాన్ ॥౩౦॥

ప॥ పృచ్ఛామి । త్వా । పాపకృతః । యత్ర । యాతయతే । యమః ।త్వం।
నః । తత్ । బ్రహ్మన్ । ప్ర । బ్రూహి । యది । వేత్థ । అసతః । గృహాన్ ॥

అ॥ బ్రహ్మన్=ఓబ్రాహ్మణుఁడా!, అసతః=పాపాత్మునియొక్క గృహాన్=
గృహస్వరూపమగు పాతకమును, వేత్థయది=తెలిసికొంటివేని, యమః=యముఁడు,
యత్ర=ఏస్థానమందు, పాపకృతః=పాపముఁ జేసినవారిని, యాతయతే=బాధించు
చున్నాఁడో, త్వా=నిన్ను, పృచ్ఛామి=అడుగుచున్నాను, త్వం=నీవు, నః=మా
కొఱకు, తత్=ఆవిషయమును, ప్రబ్రూహి=బాగుగాఁ దెలియునట్లుగాఁ జెప్పుము.

తా॥ ఓబ్రాహ్మణుఁడా! పాపాత్ముల పాపములను తత్ఫలప్రాప్తిని దెలిసిన
వాఁడవైతివేని పాపముఁజేసిన మనుష్యులను యముఁడు ఏలోకమందుంచి యెట్టి
వంటి బాధను కలిగించునో యని నిన్నడుగుచుంటిమి గావునఁ జెప్పుమని శిష్యు
డడిగెను.

మూ॥ కశ్యపాదుదితాస్సూర్యాః। పాపాన్నిర్ఘ్నంతిసర్వదా। రోద
స్యోరంతర్దేశేషు। తత్రన్యస్యంతేవాసవైః ॥

ప॥ కశ్యపాత్ । ఉదితాః । సూర్యాః । పాపాన్ । నిర్ఘ్నంతి । సర్వదా ।
రోదస్యోః । అంతర్దేశేషు । తత్ర । న్యస్యంతే । వాసవైః ॥

అ॥ కశ్యపాత్=కశ్యపుఁడను సూర్యునివలన, ఉదితాః=పుట్టిన, సూర్యాః=
ఆరోగుఁడు మొదలగు సూర్యులు, రోదస్యోః=భూమ్యంతరిక్షములయొక్క, అంత
ర్దేశేషు=మధ్యప్రదేశములయందు, పాపాన్=పాపాత్ములను, సర్వదా=ఎల్లప్పుడు,
నిర్ఘ్నంతి=హింసించుచున్నారు, తే=ఆహింసింపఁబడిన పాపాత్ములు, వాసవైః=
సూర్యకిరణ స్వరూపమగు దేవతలచే, తత్ర=ఆనరకాది స్థానములయందు, న్యస్యంతే=
ఉంపబడుచున్నారు,

తా॥ మేరుపర్వతంబునఁ జివరనుండునట్టి కశ్యపుఁడను సూర్యునివలనఁబుట్టిన
ఆరోగాదులను సూర్యులు భూమ్యంతరిక్షముల మధ్యమందు పాపాత్ముల నెల్లప్పుడు
హింసించుచుందురు. ఆహింసింపఁబడిన పాపాత్ములను సూర్యుని కిరణరూపములగు
దేవతలు నరకస్థానములయం దుంచుచుందురు,

మూ॥ తేశరీరాః ప్రపద్యంతే । యథాపుణ్యస్యకర్మణః । అపాణ్యా పాదకేశాసః । తత్రతేయోనిజాజనాః॥

ప॥ తే । అశరీరాః । ప్రపద్యంతే । యథా । అపుణ్యస్య । కర్మణః । అపాణ్యా పాదకేశాసః । తత్ర । తే । అయోనిజాః । జనాః ॥

అ॥ తే=ఆపాపాత్ములు, అశరీరాః=సంపూర్ణమైన అవయవములు లేనివారై, అపాణ్యాపాదకేశాసః=హస్తములయందుఁగాని పాదములయందుఁగాని కేశములయందుఁగాని లోపముగలవారై, అపుణ్యస్య=పాపస్వరూపమగు, కర్మణః=కర్మకు, యథా= తగినట్టుగాను, జన్మ=శరీరమును, ప్రపద్యంతే=పొందుచున్నారు, జనాః= ఆ పాపాత్ములగు జనులు, తత్ర=ఆనరకస్థానములయందు, అయోనిజాః=యోనివలనఁ బుట్టనివారై, జాయంతే=ఉద్భవించుచున్నారు.

తా॥ పాపమును జేసినట్టి ప్రాణులు కొందఱు చేతులులేనివారలై కొందఱు కాళ్లులేనివారలై కొందఱు కన్నులులేనివారలై కొందఱు కేశములులేనివారలై ఈ ప్రకారముగా సంపూర్ణమగు శరీరావయవములు లేనివారలై వారివారి పాపానుగుణ్యమైన జన్మములను బొందుచుందురు. మఱికొందఱు మానుషశరీరమును బొందని వారలై నల్లులు మొదలగు స్వేదజములుగాను చెట్లు మొదలగు నుద్భిజ్జములుగాను బుట్టుచున్నారు.

మూ॥ మృత్వాపునర్మృత్యుమాపద్యంతే । అద్యమానాస్స్వకర్మభిః॥ ౩౧ ॥ ఆశాతికాః క్రిమయఇవ । తతః పూయంతేవాసవైః ॥

ప॥ మృత్వా । పునః । మృత్యుం । ఆపద్యంతే । అద్యమానాః । స్వకర్మభిః । ఆశాతికాః । క్రిమయః । ఇవ । తతః । పూయంతే । వాసవైః ॥

అ॥ తే = అపాపాత్ములు, మృత్వా = మరణమునుబొంది, పునః = తిరిగి, మృత్యుం = మరణమును, ఆపద్యంతే = పొందుచున్నారు, తే=వారు, స్వకర్మభిః= తమపాపకర్మలచేత, అద్యమానాః = భక్షింపబడినవారై, ఆశాతికాః = మనవలన బాధింపఁబడునట్టి, క్రిమయఇవ = పేలు నల్లులు దోమలు మొదలగువానివలెనే, వాసవైః=దేవతలచేత, పూయంతే=బాధింపఁబడుచున్నారు.

తా॥ ఆ పాపాత్ములు వారు చేసినట్టి పాపకర్మల వలనఁ జచ్చుచుఁ బుట్టుచుఁ దిరిగి చచ్చుచు నీప్రకారముగా ననేక జన్మాంతరంబులను బొందుచుందురు,

కేలు నల్లులు దోమలు మొదలగు జంతువులను ఘన మేతీరున హింసించుచుం దురో ఆ ప్రకారముగానే పాపాత్ములను దేవతలు హింసించుచుందురు.

మూ॥ అపైతంమృత్యుంజయతి । యఏవంవేద సఖల్వైవం విద్బ్రాహ్మణః । దీర్ఘశ్రుత్తమోభవతి । కశ్యపస్యాతిథిస్సిద్ధగమన స్సిద్ధాగమనః ॥

ప॥ అప । ఏతం । మృత్యుం । జయతి । యః । ఏవం । వేద । సః । ఖలు । ఏవంవిత్ । బ్రాహ్మణః । దీర్ఘశ్రుత్తమః । భవతి । కశ్యపస్య । అతిథిః । సిద్ధగమనః ॥ సిద్ధాగమనః ॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో సః=వాఁడు, ఏతఁ=ఈ, అపమృత్యుం=క్రిమికీటకాదుల సంబంధమగు హీనజన్మమును, జయతి=జయించుచున్నాఁడు, అనఁగాఁ బొందఁడనుట, కించ=ఇదియే కాదు, ఏవంవిత్=ఈ ప్రకారము తెలిసిన, సః=ఆ, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, దీర్ఘశ్రుత్తమః=చిరకాలము వినఁదగినవాఁడై, భవతి=అగుచున్నాఁడు, సః=ఆబ్రాహ్మణుఁడు, కశ్యపస్య=కశ్యపుఁడను సూర్యునకు, అతిథిః=అతిథివలెనే పూజింపఁదగిన వాఁడగుచున్నాఁడు, సిద్ధగమనః=కశ్యపుని సమీపమునకు వెళ్లఁదగిన సామర్థ్యము గలవాఁడును, సిద్ధాగమనః=కశ్యపుని వద్దనుండి వచ్చుటకు సమర్థమైనవాఁడును, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఏ పురుషుఁడు ఈ ప్రకారము కశ్యపుని మహిమను దెలిసికొనుచున్నాఁడో ఆ పురుషుఁడు క్రిమికీటాదుల సంబంధమగు జన్మలను బొందక యుండును. మఱియు ఈ ప్రకారము కశ్యపుని మహిమను దెలిసిన బ్రాహ్మణుఁడు బహుకాలము వఱకు సమస్తమైన వారిచే వినఁదగినవాఁడై అగుచున్నాఁడు. మరియు ఆ బ్రాహ్మణుఁడు అతిథివలెనే కశ్యపునకుఁ బూజింపఁదగినవాఁడై స్వేచ్ఛాగమనముచేఁ గశ్యపుని సమీపమునకు వెళ్ళుటకును అక్కడనుండి తిరిగి వచ్చుటకును సమర్థమైన గమనము గలవాఁడగును.

మూ॥ తస్యైషాభవతి॥

ప॥ తస్య । ఏషా । భవతి॥

అ॥ తస్య=ఆ మహిమయొక్క, ప్రతిపాదకమైన శ్రుతి, ఏషా=ఈ చెప్పఁబోవునదియై, భవతి=అగుచున్నది॥

తా॥ దిగులను జెప్పబోవు ఈ శ్రుతి ఆ మహిమను బ్రతిపాదించునదియై అగుచున్నది.

మూ॥ ఆ యస్మింత్సప్తవాసవాః । రోహన్తి పూర్వ్యారుహాః॥౩౫॥
ఋషిర్హదీర్ఘశ్రుత్తమః । ఇంద్రస్యఘర్మో అతిథిరితి॥

ప॥ ఆ । యస్మిన్ । సప్త । వాసవాః । రోహన్తి । పూర్వ్యాః । రుహాః । ఋషిః । హ । దీర్ఘశ్రుత్తమః । ఇంద్రస్య । ఘర్మః । అతిథిః । ఇతి ॥

అ॥ పూర్వ్యారుహాః=సృష్టికంటె ముందుగాఁ బుట్టినవారు గనుకనే, వాసవాః=ప్రపంచమునకు గారణభూతులగు, సప్త=ఆరోగుఁడు మొదలగు నేడుగురు సూర్యులు, యస్మిన్ = ఏ కశ్యపుఁడను సూర్యునియందు, ఆరోహంతి = స్థానమును బొందియుండిరో, ఘర్మః=ప్రకాశమానుఁడగు, దీర్ఘశ్రుత్తముఁడను పేరుగల, ఋషిః =మునీశ్వరుఁడు, ఇంద్రస్య=పరమైశ్వర్యసంపన్నుఁడయిన, తస్య=ఆకశ్యపునకు, అతిథిః=పూజనీయుఁడాయెను, ఇతి=ఈలాగని చెప్పఁబడియెను.

తా॥ ప్రపంచముకంటె ముందుగాఁ బుట్టినవారుగనుకనే ప్రపంచమునకుఁ గారణభూతులగు ఆరోగుఁడు మొదలగు ఏడుగురు సూర్యులును ఏకశ్యపునివలనఁ బుట్టి ఏకశ్యపునియందు నిలిచియుండిరో అట్టికశ్యపునకుఁ బ్రకాశమానుండగు దీర్ఘశ్రుత్తముఁడను మునీశ్వరుఁడు పూజనీయుఁడాయెను.

మూ॥ కశ్యపః పశ్యకో భవతి । యత్సర్వం పరిపశ్యతీతి సౌక్ష్మ్యాత్॥

ప॥ కశ్యపః । పశ్యకః । భవతి । యత్ । సర్వం । పరి । పశ్యతి । ఇతి । సౌక్ష్మ్యాత్॥

అ॥ యత్=ఏకారణమువలన, సౌక్ష్మ్యాత్=సూక్ష్మదృష్టివలనను, సర్వం=సమస్తవిషయములను, పరిపశ్యతి=అంతటను దెలిసికొనుచున్నాడో, ఇతి=ఈకారణమువలన, కశ్యపః=కశ్యపుఁడు, పశ్యకః=పశ్యకుఁడని చెప్పఁబడువాఁడై, భవతి=అగుచున్నాఁడు.

తా॥ కశ్యపుఁడు అగతానాగతాది సమస్తసూక్ష్మ విషయములను దెలిసికొనుటచే చూచువాఁడు అనునర్థమిచ్చు పశ్యకశబ్దవాచ్యుఁడగుచున్నాఁడు. అనఁగా "కశ్యపః" అనుశబ్దమందుండు మొదటిది యగు కవర్ణము చివరను, చివరనుండు పవర్ణము మొదటనుంచిన రెండవ, "పశ్యకః", అని చెప్పఁబడుచున్నాఁడు. ఈప్రకారముగాఁ [illegible]కశ్యపుని మహిమ చెప్పఁబడినది.

మూ॥ అథాగ్నే రష్టపురుషస్య । తస్యైషాభవతి ॥

ప॥ అథ । అగ్నేః । అష్టపురుషస్య । తస్య । ఏషా । భవతి॥

అ॥ ఏషా=ఈమంత్రము, అథ=కశ్యపునిమహిమను జెప్పినపిమ్మట, తస్య=అప్రసిద్ధమైనటువంటి, అష్టపురుషస్య=అష్టమూర్తిస్వరూపుండగు, అగ్నేః=అగ్నిహోత్రునియొక్క మహిమను జెప్పునదియై, భవతి=అగుచున్నది॥

తా॥ ఈప్రకారముగాఁ గశ్యపుని మహిమను జెప్పినపిమ్మట అష్టమూర్తి స్వరూపుండగు నగ్నిహోత్రుని మహిమను ఈముందు చెప్పఁబోవు మంత్రము చెప్పుచున్నది.

మూ॥ అగ్నేనయ సుపథారాయే అస్మాన్ । విశ్వానిదేవవయు నాని విద్వాన్ । యుయోధ్యస్మజ్జుహురాణమేనః । భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమేతి॥ 33॥ ౮॥

ప॥ అగ్నే । నయ । సుపథా । రాయే । అస్మాన్ । విశ్వాని । దేవ । వయునాని । విద్వాన్ । యుయోధి । అస్మత్ । జుహురాణం । ఏనః । భూయిష్ఠాం । తే । నమఉక్తిం । విధేమ॥ ఇతి॥

అ॥ అగ్నే=ఓయగ్నిహోత్రుఁడా !, త్వం=నీవు, అస్మాన్=మమ్ములను, రాయే=ధనముపొందుటకొఱకు, సుపథా=మంచిమార్గముచే, నయ=పొందింపుము, దేవ=ఓదేవుఁడా !, విశ్వాని=సమస్తములైన, వయునాని=మార్గములను, విద్వాన్=గుర్తెఱుఁగుదువు, జుహురాణం=కుటిలమైన, ఏనః=పాపమును, అస్మత్=మావలననుండి, యుయోధి=విడఁగొట్టుము, తే=నీకొఱకు, భూయిష్టాం=అధికమైన, నమ ఉక్తిం=నమస్కారమనుమాటను, విధేమ=చేయుచున్నాము.

తా॥ ఓయగ్నిహోత్రుఁడా ! నీవుసమస్త విషయములను దెలిసినవాఁడవుగావఁ గుటిలంబగు మాపాపమును బోగొట్టి మంచిమార్గమునందు మమ్ముల ప్రవేశపెట్టి మాకు ధనములభించునట్లుగాఁ జేయుము. నీకు అనేకనమస్కారములను జేసెదము. ఈలాగున ధ్యానింపవలయును.

ఇతి అష్టమోఽనువాక స్సమాప్తః

—♦ అథనవమోఽనువాకః ప్రారంభః ♦—

మూ॥ అగ్నిశ్చజాతవేదాశ్చ। సహోజా అజిరాప్రభుః। వైశ్వానరోనర్యపాశ్చ। పఙ్క్తిరాధాశ్చసప్తమః। విసర్పీవాష్టమోగ్నీనాం। ఏతేష్టౌవసవః క్షితా ఇతి॥

ప॥ అగ్నిః। చ। జాతవేదాః। చ। సహోజాః। అజిరాః। ప్రభుః। వైశ్వానరః। నర్యాపాః। చ। పంక్తిరాధాః। చ। సప్తమః। విసర్పీ। వా। అష్టమః। అగ్నీనాం। ఏతే। అష్టౌ। వసవః। క్షితాః। ఇతి॥

అ॥ అగ్నిశ్చ=అగ్నియు, జాతవేదాశ్చ=జాతవేదుఁడు, సహోజాః=సహోజుఁడు, ప్రభుః=ప్రభువగు, అజిరాః=అజిరుఁడు, వైశ్వానరః=వైశ్వానరుఁడు, నర్యాపాశ్చ=నర్యాపసుఁడు, అగ్నీనాం=అగ్నిహోత్రులలో, సప్తమః=ఏడవవాఁడగు, పంక్తిరాధాశ్చ=పంక్తిరాధసుఁడు, అష్టమః=ఎనిమిదవవాఁడగు, విసర్పీ=విసర్పియు, అను పేరుగల అగ్నిహోత్రులు కలరు, ఏతే=ఈ, అష్టౌ=ఎనమండ్రు, వసవః=సమస్తప్రాణులు నుండుటకుఁ గారణమైనవారును, క్షితాః=తాము సుఖముగా నుండువారునై యుండిరి, ఇతి=ఈ ప్రకారముగాఁ జెప్పఁబడియెను.

తా॥ అగ్నియనియు జాతవేదసుఁడనియు సహోజసుఁడనియు అజిరసుడనియు వైశ్వానరుఁడనియు నర్యాపసుఁడనియు పంక్తిరాధసుఁడనియు విసర్పియనియు నెనమండ్రు అగ్నిహోత్రులుకలరు. ఆ యెనమండ్రును సమస్త ప్రాణులకు నాధారభూతులై తాము సుఖస్థితిని బొందియున్నారు. ఈలాగున అగ్నిహోత్రుల నామములు చెప్పఁబడినవి.

మూ॥ యథర్త్వే వాగ్నేరర్చిర్వర్ణవిశేషాః। నీలార్చిశ్చపీతకార్చిశ్చేతి।

ప॥ యథర్తు। ఏవ। అగ్నేః। అర్చిర్వర్ణవిశేషాః। నీలార్చిః। చ। పీతకార్చిః। చ। ఇతి॥

అ॥ నీలార్చిశ్చేతి = నల్లనిజ్వాల యనియు। పీతకార్చిశ్చేతి = పచ్చనిజ్వాల యనియు। అగ్నేః = అగ్నిహోత్రుని యొక్క। అర్చిర్వర్ణవిశేషాః = జ్వాలల యొక్క రంగువిశేషములు। యథర్త్వేవా = ఆయాయా ఋతువులకుఁ దగినట్లుగా నుండును.

తా॥ ఈరెయినమండ్రియొక్క జ్వాలలరంగులు ఆయాబుతువుల ననుసరించి యొకబుతువునందు నల్లగాను ఒకబుతువునందుఁ పచ్చగాను ఒకబుతువునందు నెఱ్ఱగాను ఒకబుతువునందుఁ దెల్లగాను ఈప్రకారముగా నుండును.

మూ॥ అథవాయోరేకాదశపురుషస్యైకాదశ స్త్రీకస్య ॥

అథ । వాయోః । ఏకాదశపురుషస్య । ఏకాదశ స్త్రీకస్య ॥

అ॥ అథ=అగ్నిహోత్రుల విషయము జెప్పిన పిమ్మట, ఏకాదశ పురుషస్య= పదునొకండు పురుషస్వరూపములు కలిగినట్టియు, ఏకాదశ స్త్రీకస్య=పదునొకండు స్త్రీ స్వరూపములు కలిగినట్టియు, వాయోః=వాయువుయొక్క, వివరము చెప్పఁ బడుచున్నది.

తా॥ అగ్నిహోత్రుల విషయముఁ జెప్పిన పిమ్మట వాయువుయొక్క పదు నొకటి పురుషస్వరూపములును బదునొకటి స్త్రీ స్వరూపములును జెప్పఁబడు చున్నవి.

మూ॥ ప్రిభ్రాజమానావ్యవదాతాః ॥ ౩౮ ॥ యాశ్చవాసుకి వైద్యు తాః । రజతాః పురుషాశ్శ్యామాః । కపిలా అతిలోహి తాః । ఊర్ధ్వా అవపతంతాశ్చ । వైద్యుత ఇత్యేకాదశ ॥

ప॥ ప్రిభ్రాజమానాః । వ్యవదాతాః । యాః । చ । వాసుకివైద్యుతాః । రజ। తాః । పరుషాః । శ్యామాః । కపిలాః । అతిలోహితాః । ఊర్ధ్వాః । అవపతంతాః చ । వైద్యుతః । ఇతి । ఏకాదశ ॥

అ॥ ప్రిభ్రాజమానాః = ప్రిభ్రాజమానులు, వ్యవదాతాః = వ్యవదాతులు, యాశ్చ = ఏ, వాసుకివైద్యుతాః = వాసుకివైద్యుతులను వారుకలరో, తే=వారు, రజతాః=రజతులు, పరుషాః=పరుషులు, శ్యామాః = శ్యాములు, కపిలాః=కపిలులు, అతిలోహితాః = అతిలోహితులు , ఊర్ధ్వా=ఊర్ధ్వులు = అవపతంతాః = అవపతం తులు, వైద్యుతః = వైద్యుతులు, ఇతి = ఈప్రకారము పేర్లుగల, ఏకాదశ = పదునొకటి వాయుగణములు కలవు.

తా॥ ప్రిభ్రాజమానులు వ్యవదాతులు వాసుకివైద్యుతులు రజతులు పరుషులు శ్యాములు కపిలులు అతిలోహితులు ఊర్ధ్వులు అవపతంతులు వైద్యుతులు అను పేర్ల

గల పురుషవాయుగణములు పదునొకటియు ఇట్టిపేర్లుగల స్త్రీవాయుగణములు పదునొకటియుఁ గలవని చెప్పిరి. అయినను ఈ నామములు సార్థకనామములుగాఁ జెప్పఁదగియున్నవి. అది యెట్లనఁగా విశేషముగాఁ బ్రకాశించువారు, తెల్లనివారు, వానుకివలెను మెఱుపువలెను బ్రకాశించువారు, కెండివలెనే ప్రకాశించువారు, కఠినమైనవారు, నల్లగానుండువారు, కపిలవర్ణముకలవారు, మిక్కిలి యెఱ్ఱగానుండువారు, ఊర్ధ్వభాగమందుండువారు, క్రిందుగా వ్యాపించుచుండువారు, మెఱుపువలెనే ప్రకాశించుచుండువారు అని పదునొకటి నామములకుఁ గ్రమముగా నర్థముజేసికొనవలయును.

మూ॥ నైనంవైద్యుతోహినస్తి। యఏవంవేద॥

ప॥ న। ఏనం। వైద్యుతః। హినస్తి। యః। ఏవం। వేద॥

అ॥ యః=ఏపురుషుఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, ఏనం=ఈ పురుషుని, వైద్యుతః=మెఱుపుసంబంధమగు నగ్నిహోత్రము, నహినస్తి=బాధింపదు.

తా॥ ఏమనుష్యుఁడు ఈ ప్రకారముగా వాయుగణముల ప్రభావమును దెలిసికొనుచున్నాఁడో అట్టివానికి విద్యుత్సంబంధమైన పిడుగు మొదలగు వానియొక్క బాధలు కలుగవనిరి.

మూ॥ సహోవాచవ్యాసః పారాశర్యః। విద్యుద్వధమేవాహం
మృత్యుమైచ్ఛమితి॥

ప॥ సః। హ। ఉవాచ। వ్యాసః। పారాశర్యః। విద్యుద్వధం। ఏవ। అహం। మృత్యుం। ఐచ్ఛం। ఇతి॥

అ॥ అహం=నేను, విద్యుద్వధమేవ=పిడుగువలనఁగలిగినవధకే, మృత్యుం=మృత్యువునుగా, ఐచ్ఛం=ఇచ్ఛయించితిని, ఇతి=ఈలాగని, పారాశర్యః=పరాశరుని కుమారుండగు, సః=అప్రసిద్ధమైన, వ్యాసః=వ్యాసమునీశ్వరుఁడు, ఉవాచహ=చెప్పెనుగదా॥

తా॥ పిడుగువలనఁ గలిగిన హింసయే మృత్యువుగా నేనూహించితినని పరాశరుని కుమారుండగు వ్యాసమునీశ్వరుఁడు చెప్పెను.

మూ॥ నత్వాకామగ్ంహన్తి॥ ౩౯॥ యఏవంవేద॥

ప॥ న। త్వా। అకామం। హన్తి। యః। ఏవం। వేద॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, తం=అటువంటి, అకామం=కోరికలేనట్టువంటి, పిడుగునన్ను హింసించును అనెడు భయములేనట్టిపురుషుని, నహినస్తి=హింసింపదు.

తా॥ ఈ ప్రకారముగా దెలిసికొనినట్టి పురుషుఁడు నిర్భయుఁడై విశేషజ్ఞానము కలిగియుండుటవలన అట్టివానిని పిడుగు మొదలగు మృత్యువు హింసింపదు.

మూ॥ అథగంధర్వగణాః॥

ప॥ అథ । గంధర్వగణాః॥

అ॥ అథ = అనంతరమందు, గంధర్వగణాః = గంధర్వగణములు, చెప్పబడుచునవి.

తా॥ వాయుగణముల వివరమును జెప్పినపిమ్మట గంధర్వగణముల విషయముఁ జెప్పుచున్నాఁడు.

మూ॥ స్వానభ్రాట్ । అంఘారిర్బంభారిః । హస్తస్సుహస్తః । కృశానుర్విశ్వావసుః । మూర్ధన్వాంత్సూర్యవర్చాః । కృతిరిత్యేకాదశ గంధర్వగణాః॥

ప॥ స్వాన్ । అభ్రాట్ । అంఘారిః । బంభారిః । హస్తః । సుహస్తః కృశానుః । విశ్వావసుః । మూర్ధన్వాన్ । సూర్యవర్చాః । కృతిః । ఇతి । ఏకాదశ । గంధర్వగణాః॥

అ॥ స్వాన్=స్వాను, అభ్రాట్=అభ్రాట్టు, అంఘారిః=అంఘారి, బంభారిః=బంభారి, హస్తః=హస్తుఁడు, సుహస్తః=సుహస్తుఁడు, కృశానుః=కృశానుడు విశ్వావసుః విశ్వావసుఁడు, మూర్ధన్వాన్=మూర్ధన్వానుఁడు, సూర్యవర్చాః=సూర్యవర్చస్సు, కృతిః=కృతి, ఇతి=ఈ ప్రకారము పేర్లుగల, గంధర్వగణాః=గంధర్వగణములు, ఏకాదశ=పదునొకటి కలవు॥

తా॥ స్వానులు అభ్రాట్టులు అంఘారులు బంభారులు హస్తులు సుహస్తులు కృశానులు విశ్వావసులు మూర్ధన్వానులు సూర్యవర్చస్సులు కృతులు అను పేర్లుగల గంధర్వగణములు పదునొకటిగలవు. ఏకవచనముగా ప్రయోగించినను గణవాచ్యముగాన బహువచనముగా నెఱుంగవలయును.

మూ॥ దేవాశ్చ మహాదేవాః । రశ్మయశ్చ దేవాగరగిరః॥౩౬॥

ప॥ దేవాః । చ । మహాదేవాః । రశ్మయః । చ । దేవాః । గరగిరః ॥

అ॥ తే=ఆ గంధర్వగణములు, దేవాః=స్వయముగాఁ బ్రకాశించునవియు, మహాదేవాః=దేవతలలో నధికమైనవియు, రశ్మయః=కాంతిగలవియు, దేవాః=ఇతరులను బ్రకాశింపఁజేయునవియు, గరగిరః=విషమువలెనే వ్యర్థముగాని వాక్కులు గలవియునై యున్నవి.

తా॥ ఆ గంధర్వగణములు తమంతట దాము ప్రకాశించునవియు దేవతలలో నధికమైనవియుఁ గాంతిగలవియు ఇతరులను బ్రకాశింపఁజేయునవియు విషమువలెనే అమోఘమైన వాక్కులు గలవియునై యున్నవి.

మూ॥ నైనంగరోహినస్తి । యఏవంవేద॥

ప॥ న । ఏనం । గరః । హినస్తి । యః । ఏవం । వేద ॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో ఏనం=ఈ తెలిసినవానిని, గరః=విషము, నహినస్తి=హింసఁజేయదు.

తా॥ ఎవఁడు ఈ విషయమును దెలిసికొనుచున్నాఁడో అట్టివానికి విషసంబంధమైన బాధ కలుగనేరదు.

మూ॥ గౌరీమిమాయసలిలానితక్షతీ । ఏకపదీద్విపదీ సాచతుష్పదీ । అష్టాపదీనవపదీ బభూవుషీ । సహస్రాక్షరా పరమేవ్యోమన్నితి ॥

ప॥ గౌరీ । మిమాయ । సలిలాని । తక్షతీ । ఏకపదీ । ద్విపదీ । సా । చతుష్పదీ । అష్టాపదీ । నవపదీ । బభూవుషీ । సహస్రాక్షరా । పరమే । వ్యోమన్ । ఇతి ॥

అ॥ గౌరీ=తెల్లని వర్ణముగల యే సరస్వతికలదో, సా=ఆ సరస్వతి, సలిలాని=జలములయందుఁ బుట్టిన సమస్త భూతములను, తక్షతీ=తాను వ్యాపించియుండుటచే ననేక విధములుగాఁ జేయుచు, ఏకపదీ=ఒక్కపాదము గలదై, ద్విపదీ=రెండు పాదములు గలదై, చతుష్పదీ=నాలుగు పాదములు గలదై, అష్టాపదీ=ఎనిమిది పాదములు గలదియై, నవపదీ=తొమ్మిదిపాదములు గలదియై, సహస్రాక్షరా=అనేక అక్షరములు గలదియై బభూవుషీ=అంతట నిచ్చగలదియై, పరమేవ్యోమన్=పరబ్రహ్మమునం దున్నటువంటిదై, మిమాయ=పరిమితిగాఁ జేయుచున్నది. ఇతి=ఈ ప్రకారము చెప్పఁబడుచున్నది.

తా॥ తెల్లని వర్ణము గలదియు శబ్దస్వరూపమైన సరస్వతీదేవి జలముల యందుఁబుట్టిన సమస్త భూతజాలములను నామములచే ననేక విధములుగాఁ జేయుచుఁ దాను ఛందోరూపముగా ఒక పాదము గలదనియు రెండు పాదములు గలదనియు నాలుగు పాదములు గలదనియు ఎనిమిది పాదములు గలదనియుఁ దొమ్మిది పాదములు గలదనియు నేక అనేక అక్షర స్వరూపమైనదనియుఁ జెప్పఁబడుచుఁ గారణ పరబ్రహ్మమునందు నివసించి జగత్తునంతయు నొక్కొక్క వస్తువునకు ననేక నామములచేఁ బరిచ్ఛేదనఁ జేయుచున్నది. ఈలాగునఁ జెప్పఁబడియున్నది.

మూ॥ వాచోవిశేషణం ॥

ప॥ వాచః । విశేషణం ॥

అ॥ వాచః = వాగ్దేవతయగు సరస్వతియొక్క । విశేషణం = స్తోత్రముఁ జేయఁబడుచున్నది.

తా॥ ఈమంత్రమునందు వాగ్దేవతయగు సరస్వతీదేవి స్తోత్రముఁ జేయఁబడుచున్నది.

మూ॥ అథనిగద వ్యాఖ్యాతాః తాననుక్రమిష్యామః ॥

ప॥ అథ । నిగదవ్యాఖ్యాతాః । తాన్ । అనుక్రమిష్యామః ॥

అ॥ అథ=సరస్వతీ స్తవానంతరము, నిగదవ్యాఖ్యాతాః = అవరాహావాదులైన వాయువులను గురించి చెప్పఁబడినవి, తాన్ = ఆమంత్రములను, అనుక్రమిష్యామః = అనుసరించి క్రమముగాఁ జెప్పుచున్నాము.

తా॥ సరస్వతీదేవి స్తోత్రానంతరము, కొన్నిమంత్రములయందు వరాహావాదులైన వాయువులను గురించి చెప్పఁబడినది గాన ఆమంత్రములను క్రమముగాఁ జెప్పుచున్నాము.

మూ॥ వరాహవస్స్వతపసః ॥ ౩౭ ॥ విద్యున్మహసోధూపయః ।
శ్వాపయోగృహమేధాశ్చేత్యేతే । యేచేమేశిమివిద్విషః ॥

ప॥ వరాహవః । స్వతపసః । విద్యున్మహసః । ధూపయః । శ్వాపయః । గృహమేధాః । చ । ఇతి । ఏతే । యే । చ । ఇమే । శిమివిద్విషః ॥

అ॥ వరాహవః=వరాహవములు, స్వతపసః = స్వతపస్సులు, విద్యున్మహసః, విద్యున్మహస్సులు, ధూపయః=ధూపులు, శ్వాపయః= శ్వాపులు, గృహమేధాః=

గృహమేధులు, ఇతి=ఈలాగు పేర్లుగల, ఏతే= ఈ మరుద్గణములు, షట్=ఆరు గలవు, శిమివిద్విషః=శిమివిద్విషులను పేరుగల, యేచ=ఏమరుద్గణములు గలవో, ఇమే=ఈ మరుద్గణములు, షడంతర్గతాః=పైఁజెప్పిన ఆఱింటిలోఁ జేరినవి.

తా॥ వరాహవములు స్వతపస్సులు విద్యున్మహస్సులు ధూపులు శ్వాపులు గృహమేధులు అను పేరుగల ఆఱు మరుద్గణములుకలవు. శిమివిద్విషులను పేరుగల మరుద్గణము పైఁ జెప్పిన యాఱింటిలో నంతర్గతమైయున్నది. ఇక్కడ వరాహ వాదులకు రూఢ్యర్థము కాక అవయవార్థముకూడ గలదు. అదియెట్లనఁగా, వర్షమును గురిపించునవి, తమంతటనే తపించునవి, మెఱుపుతో సమానమైన తేజస్సుగలవి, గుగ్గులాది సుగంధద్రవ్యములేకనే సమస్తపదార్థములను బరిమళింపఁజేయునవి, శీఘ్రముగా వ్యాపించునవి, యజ్ఞాదులకుఁదగిన గృహములయందుండునవి, అని యాఱింటికిఁ గ్రమముగా నన్వయించుకొనవలయును. శిమివిద్విషులు, అనఁగా కృష్యాదులకు ననుకూలముగా వీచునవి. ఈ ప్రకారముగా నవయవార్థమునుగలదు.

మూ॥ పర్జన్యాస్సప్త పృథివీమభివర్షన్తి। వృష్టిభిరితి। ఏతయైవ విభక్తి విపరీతాః। సప్తభిర్వాతైరుదీరితాః। అమూన్లోకానభి వర్షంతి। తేషామేషాభవతి॥

ప॥ పర్జన్యాః। సప్త। పృథివీం। అభి। వర్షంతి। వృష్టిభిః। ఇతి। ఏతయా। ఏవ। విభక్తివిపరీతాః సప్తభిః। వాతైః। ఉదీరితాః। అమూన్। లోకాన్। అభి। వర్షంతి। తేషాం। ఏషా। భవతి॥

అ॥ సప్త=ఏడగు, పర్జన్యాః=మేఘములు, వృష్టిభిః=వర్షములచేత, పృథివీమభి=భూమియందంతటను, వర్షంతి=కురియుచున్నవి, ఏతయైవ=ఈ రీతిచేతనే, విభక్తివిపరీతాః=రచనలచే వ్యతిరేకముగా బొందినవై, సప్తభిః=ఏడైన, వాతైః= వాయువులచే, ఉదీరితాః=ఊర్ధ్వముగా ప్రేరేపణఁజేయఁబడినవి యగుచు, అమూన్=ఈ, లోకాన్=సమస్తలోకములను, అభివర్షంతి=అంతటను గురియుచున్నవి. వి, తేషాం= వారి యొక్క, మహిమను గుఱించి, ఏషా = ఈ చెప్పబోవు మరత్రి ము, భవతి. ప్రతిపాదనఁ జేయునది యగుచున్నది

తా॥ పూర్వమందుఁ జెప్పఁబడిన యేడు వాయుగణముల చేతను ప్రేరేపింపఁబడిన యేడు మేఘములు భూమి యందటను గురియుచున్నవి. వాయువులచే ప్రేరేపింపఁబడినవియై అథో ముఖముగా భూమియందు మేఘములు వర్షించినట్లు

గానే ఈ మేఘములు వాయువుల ప్రేరణవిశేషముచే వ్యతిరేకమునుబొంది యూర్ధ్వ ముఖములై అన్నిలోకములయందును వర్షించుచున్నవి. ఆ వాయువుల మహిమను గుఱించి ముందు చెప్పఁబోవు మంత్రము ప్రతిపాదనఁ జేయుచున్నది.

మూ॥ సమానమేత దుదకం ॥౩౭॥ ఉచ్చైత్యవచాహభిః। భూమింప ర్జన్యాజిన్వంతి । దివంజిన్వంత్యగ్నయ ఇతి॥

ప॥ సమానం । ఏతత్ । ఉదకం । ఉత్ । చ । ఏతి । అవ । చ । అహభిః। భూమిం । పర్జన్యాః । జిన్వంతి । దివం । జిన్వంతి । అగ్నయః ।ఇతి॥

అ॥ ఏతత్=ఈ, ఉదకం=జలము, సమానం=భూమ్యంతరిక్షములయందు వ్యాపించుటయందు, సమానమైనది, పర్జన్యాః=మేఘములు, అహభిః=కొన్నిదినముల చేత, భూమిం=భూమిని, జిన్వంతి=సంతోషింపఁ జేయుచున్నవి, అగ్నయః=అగ్ని జ్వాలలవలెనే ఊర్ధ్వవ్యాప్తిగలవై మేఘములు, అహభిః=కొన్నిదినములచేత, దివం= స్వర్గమును, జిన్వంతి=సంతోషింపఁ జేయుచున్నవి, తస్మాత్=ఆ కారణమువలన, ఉదకం=జలము, ఉదేతిచ=ఊర్ధ్వవ్యాప్తిగలవి, అవైతిచ=అధోవ్యాప్తిగలది, ఇతి= ఈప్రకారముగాఁ జెప్పఁబడినది.

తా॥ ఈజలము అధోముఖముగా భూమియందుఁ బడుటయందును ఊర్ధ్వ ముఖముగా నంతరిక్షమందు వ్యాపించుటయందును సమానమైన ద్రవస్వభావముగలది. కాఁబట్టి మేఘములు కొన్నిదినములలో అధోముఖముగా నుండి వర్షించి భూమిని సంతోషింపఁజేయును. కొన్నిదినములయందు అగ్నిజ్వాలలవలెనే ఊర్ధ్వవ్యాప్తిగలిగి స్వర్గమును సంతోషింపఁ జేయును. ఈప్రకారముగాఁ జెప్పఁబడియున్నది.

మూ॥ యదక్షరంభూతకృతం । విశ్వేదేవా ఉపాసతే । మహర్షిమస్య గోప్తారం । జమదగ్ని మకుర్వత ॥

ప॥ యత్ । అక్షరం । భూతకృతం । విశ్వే । దేవాః । ఉపాసతే । మహ ర్షిం । అస్య । గోప్తారం । జమదగ్నిం । అకుర్వత ॥

అ॥ భూతకృతం=సమస్త భూతములకుఁ గారణమగు, యత్=ఏ, అక్షరం= నాశనములేని పరబ్రహ్మము కలదో, తత్=ఆ పరబ్రహ్మమును, విశ్వే=సమస్తమైన దేవాః=దేవతలు, ఉపాసతే=ఉపాసనఁజేసిరి, మహర్షిం=మునిశ్రేష్ఠుఁడగు, జమ దగ్నిం=జమదగ్నిని, అస్య=ఈ అక్షర పరబ్రహ్మమునకు, గోప్తారం=రక్షకునిఁగా, అనఁగా ఉపదేశకునిఁగా, అకుర్వత=చేసిరి ॥

తా॥ నాశనరహితమైనదియు సమస్త భూతములకును గారణమైనదియు నగు పరబ్రహ్మమును సమస్తమైన దేవతలు తాము స్వయముగా సేవించి అజ్ఞులైన మనుష్యాదులకు నుపదేశముఁ జేయఁగలందులకు జమదగ్ని మొదలగు మునీశ్వరుల నేర్పఱచిరి.

మూ॥ జమదగ్నిరాప్యాయతే । ఛందోభిశ్చతురుత్తరైః । రాజ్ఞస్సోమస్యతృప్తాసః ॥ 38 ॥ బ్రహ్మణావీర్యావతా । శివానః ప్రదిశోదిశః ॥

ప॥ జమదగ్నిః । ఆప్యాయతే । ఛందోభిః । చతురుత్తరైః । రాజ్ఞః । సోమస్య । తృప్తాసః । బ్రహ్మణా । వీర్యావతా । శివాః । నః । ప్రదిశః । దిశః ॥

అ॥ జమదగ్నిః=జమదగ్ని మునీశ్వరుఁడు, చతురుత్తరైః=నాలుగు అక్షరములకంటె నధికమైన, ఛందోభిః=గాయత్ర్యాది ఛందస్సులచేత, ఆప్యాయతే= ప్రాణులను సంతోషపెట్టుచున్నాఁడు, తే=ఆప్రాణులు, వీర్యావతా=శక్తికలిగిన బ్రహ్మణా=మంత్రముచేత, రాజ్ఞః=ప్రకాశమానమైన, సోమస్య=సోమలతయొక్క, రసపానము కలవారై, తృప్తాసః=తృప్తిని బొందినవారగుచు, నః=మాయొక్క, దిశః=తూర్పు మొదలగు దిక్కులును, ప్రదిశః=ఆగ్నేయాది ఉపదిక్కులును, శివాః= మంగళకరములై, భవంతు=అగుఁగాక॥

తా॥ జమదగ్ని మహాముని నాలుగు అక్షరములకంటె నధికముగా నుండు గాయత్ర్యాది మంత్రముల నుపదేశింపఁగా సమస్తమైన ప్రాణులును సంతోషము నొంది శ్రేష్ఠములైన మంత్రములచే యజ్ఞాములఁగావించి సోమపానముఁజేసి యెట్టు వంటి తృప్తి నొందుచున్నారో అట్టి తృప్తినిబొంది తూర్పు మొదలగు దిక్కులును ఆగ్నేయాదివి దిక్కులును సర్వప్రాణులకు క్షేమమును గలుగఁజేయునవియైయుండు గాక యని కోరుచున్నారు.

మూ॥ తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే । దైవీస్వస్తిరస్తునః । స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వంజిగాతుభేషజం । శంనో అస్తుద్విపదే । శంచతుష్పదే॥

ప॥ తత్ । శంయోః । ఆ । వృణీమహే । గాతుం । యజ్ఞాయ । గాతుం । యజ్ఞపతయే । దైవీః । స్వస్తిః । అస్తు । నః । స్వస్తిః । మానుషేభ్యః । ఊర్ధ్వం । జిగాతు । భేషజం । శం । నః । అస్తు । ద్విపదే । శం । చతుష్పదే ॥

అ॥ శంయోః=వర్తమాన భవిష్యత్కష్టములయొక్క నివారకమగు, తత్= ఆరుణకేతుకాగ్నిని, ఆవృణీమహే=ప్రార్థించుచున్నాము, యజ్ఞాయ=యజ్ఞము యొక్క గాతుం=గతిని, ఆవృణీమహే=కోరుచున్నాము, యజ్ఞపతయే=యజమానునకు, గాతుం=ఫలప్రాప్తిని గురించి, ఆవృణీమహే=ప్రార్థించుచున్నాము, నః= మాకు, దైవీః=దేవతల సంబంధమైన స్వస్తిః=శుభము, అస్తు=అగుగాక, మానుషేభ్యః = మాపుత్రులకును, స్వస్తిః = శుభము, అస్తు = అగుగాక, ఊర్ధ్వం=ఇది మొదలు ముందెల్లప్పుడును, భేషజం=సర్వారిష్టనివారణము, జిగాతు=పొందుగాక, శం=సుఖం నః = మాయొక్క, ద్విపదే = మనుష్యాదులకు, అస్తు=అగుగాక, చతుష్పదే= పశువులు మొదలగు వానికొఱకును, శం =సుఖము, అస్తు=అగుగాక.

తా॥ వచ్చుచున్నట్టివియు, రాఁబోవునట్టివియునగు కష్టములను నివారణఁ జేయునట్టి యారుణకేతుకాగ్నిని ప్రార్థించుచున్నాము. ఆరుణకేతుకాగ్నియందు యజ్ఞమును జేయుట సంభవించునట్లు ప్రార్థించుచున్నాము. యజ్ఞఫలము యజమానునిఁ బొందునట్లుగాఁ గోరుచున్నాము. దేవతలు మాకెల్లప్పుడు క్షేమమును గలుగఁ జేయుచుండుఁగాక. మాకు మాపుత్రులు మొదలగు వారికిని క్షేమము కలుగు చుండుగాక. సమస్తమైన బాధలు మాకులేకుండుఁగాక. మాసంబంధమైన మనుష్యులకుఁ బశువులకు నెల్లప్పుడు క్షేమము కలుగుచుండుఁగాక.

మూ॥ సోమపా అసోమపా ఇతి నిగదవ్యాఖ్యాతాః॥ ౮౦॥

ప॥ సోమపాః । అసోమపాః । ఇతి । నిగదవ్యాఖ్యాతాః॥

అ॥ సోమపాః=దేవతలు, అసోమపాః=దేవతలు కానివారును, ఇతి=ఈప్రకారముగా, నిగదవ్యాఖ్యాతాః=చెప్పఁబడిన వ్యాఖ్యానము కలవారైరి॥

తా॥ ఈ ప్రకారముగా దేవతలయొక్కయు దేవతలు కానివారియొక్కయు వివరములు చెప్పఁబడినవి.

ఇతినవమోను వాకస్సమాప్తః

---

—♦ అథదశమోనువాకః ప్రారంభః ♦—

మూ॥ సహస్రవృదియం భూమిః । పరంవ్యోమసహస్రవృత్ । అశ్వినా భుజ్యూనాసత్యా । విశ్వస్యజగతస్పతీ ॥

ప॥ సహస్రవృత్ । ఇయం । భూమిః । పరం । వ్యోమ । సహస్రవృత్ । అశ్వినా । భుజ్యూ । నాసత్యా । విశ్వస్య । జగతః । పతీ॥

అ॥ ఇయం = ఈ కనఁబడునట్టి । భూమిః = భూమి, సహస్రవృత్ = అనేక మనుష్యులచే ప్రార్థింపబడుచున్నది, పరం=అధికమైన, వ్యోమ = స్వర్గమును, సహస్రవృత్ = అనేక దేవతలచేతను ప్రార్థింపఁబడుచున్నది, తే = ఆ స్వర్గభూలోకములు భుజ్యూ = భోగహేతువులైనవారును, నాసత్యా= అసత్యము లేనివారును, విశ్వస్య= సమస్తమైన, జగతః = ప్రపంచమునకు, పతీ = పాలకులగు, అశ్వినా = అశ్వినీదేవతలవలెనే యుపకారకములయినవి.

తా॥ ఈ కనఁబడునట్టిభూమి అనేకమనుష్యులచే వ్యాపింపఁబడి ప్రార్థింపఁబడుచున్నది. స్వర్గము దేవతలచే నావరింపఁబడి ప్రార్థింపఁబడుచున్నది. కాఁబట్టి యీ భూస్వర్గములు రెండును రోగములను నివారణఁజేసి భోగమును కలిగించునట్టివారును అసత్యములేనివారును సమస్త ప్రపంచమునకు పోషకులునగు అశ్వినీదేవతలవలెనే సమస్త ప్రాణులకు నుపకారమును జేయునట్టివియై యున్నవి.

మూ॥ జాయాభూమిః పతిర్వ్యోమ । మిథునంతా అతుర్యథుః । పుత్రోబృహస్పతీరుద్రః । సరమాఇతిస్త్రీపుమం ॥

ప॥ జాయా । భూమిః । పతిః । వ్యోమ । మిథునం । తా । అతుర్యథుః । పుత్రః । బృహస్పతిః । రుద్రః । సరమా । ఇతి । స్త్రీపుమం ॥

అ॥ భూమిః=భూమి, జాయా=భార్యారూపముగా నున్నది, వ్యోమ=ఆకాశము, పతిః=భర్తృస్వరూపముగా నున్నది, తౌ=ఆ భూమ్యంతరిక్షములు రెండును, మిథునం=భార్యాభర్తృ స్వరూపముగా, అతుర్యథుః = పొందియుండిరి, బృహస్పతిః=బృహస్పతి, పుత్రః=ఒక్క పుత్రుఁడుగా నుండెను, రుద్రః=అగ్నిహోత్రుఁడు, పుత్రః=మఱియొక పుత్రుఁడుగా నుండెను, సరమా=వేదిక, దుహితా=కుమారికగా నుండెను, ఇతి=ఈ ప్రకారముగా, స్త్రీపుమం=స్త్రీ పురుష సంతానము కలిగియుండెను.

తా॥ సమస్తమైన ప్రాణులు భూమియందుఁ బుట్టుటచే భూమి భార్యా రూపముగాను అంతరిక్షమునుండి వర్షము కురిసి సమస్త సస్యములు ఫలించుటచేత ఆకాశము పెనిమిటిగాను నుండి పరస్పరము దాంపత్యభావమును బొందియుండిరి. ఈ భూమ్యంతరిక్షములకు సమీపమందున్నట్టి బృహస్పతి అగ్నిహోతృఁడు ఇద్దఱును దనయులుగాను అగ్నిహోత్ర సంబంధమగు వేదిక కుమారికగానునుండిరి. కాఁబట్టి ఈ ప్రకారముగా దాంపత్యభావముగా నున్నట్టి భూమ్యంతరిక్షములకు స్త్రీ పురుష సంతాన మేర్పడియుండెను.

మూ॥ శుక్రంవామన్యద్యజతంవామన్యత్ । విషురూపే అహనీద్యౌరి వస్థః ॥ ౪౧ ॥ విశ్వాహిమాయా అవథస్స్వధావస్తా । భద్రావాంపూషణావిహారాతిరస్తు ॥

ప॥ శుక్రం । వాం । అన్యత్ । యజతం । వాం । అన్యత్ । విషురూపే । అహనీ । ద్యౌః । ఇవ । స్థః । విశ్వాః । హి । మాయాః । అవథః । స్వధావస్తా । భద్రా । వాం । పూషణౌ । ఇహ । రాతిః । అస్తు ॥

అ॥ హేద్యావాపృథివ్యౌ=ఓ అంతరిక్ష భూములారా! వాం=మీ యిద్దఱలో, అన్యత్=ఒకటియగు పగలు, శుక్రం=తెల్లనైనది, వాం=మీద్దఱలో, అన్యత్=మఱియొకటిరాత్రి, యజతం=పూజనీయమైన యజ్ఞాదులయందు బయలు వెడలు ధూమముతో సమానమైన వర్ణముగలది, ఇతి=ఈ ప్రకారముగా, యువాం=మీరిద్దఱు, విషురూపే=పరస్పర విలక్షణమైన రూపము కలవారై, అహనీ=అహోరాత్రములుగా, ద్యౌరివ=ఆకాశమునందున్న సూర్యునివలెనే, స్థః=ఉండిరి హి=ఏకారణమువలన, స్వధావస్తా=అన్నముగల, యువాం=మీరు, పూషణౌ=పోషకులయిరో, తస్మాత్=ఆ కారణమువలన, విశ్వాః=సమస్తములైన, మాయాః=బుద్ధులను, అవథః=రక్షించుచుండిరి. ఇహ=ఈ కర్మయందు, రాతిః=రాత్రి, భద్రా=మంగళప్రదమైనదియై, అస్తు=అగుఁగాక ॥

తా॥ వెనుకటి మంత్రములో భూమ్యంతరిక్షములను దాంపత్యరూపముగా స్తోత్రముఁజేసి యిప్పుడహోరాత్రరూపము స్తోత్రముఁ జేయుచున్నాఁడు. ఓ యంతరిక్ష భూములారా! మీ యిద్దఱలో నొక స్వరూపము పగలై తెల్లఁగా నున్నది మఱి యొక స్వరూపము పూజనీయములగు యజ్ఞాదులయందు వెలువడు

ధూమమువలెనే నల్లనిది యగుచు రాత్రిగానున్నది. కాఁబట్టి పరస్పరము విలక్షణమైన స్వరూపముగల మీ యిద్దఱును ఆకాశమునందున్నట్టి సూర్యునివలెనే సర్వప్రాణులకు నుపకారముఁ జేయువారగుచున్నారు. మీ రిద్దరు సమస్తప్రాణులకు నన్నమును గలుగఁజేసి పోషించుచు నిర్మలమైన బుద్ధి వృత్తులుగల వారినిగాఁ జేయుచున్నారు. ఇప్పుడు నేఁజేయునట్టి కర్మయందు రాత్రి సమస్తమైన మంగళములను గలుగఁజేయుచుండుఁగాక.

మూ॥ వాసాత్యౌ చిత్రౌ జగతో నిధానౌ। ద్యావాభూమీ చరథస్సగ్ం సఖాయా। తావశ్వినా రాసభాశ్వా హవంమే। శుభస్పతీ ఆగతగ్ం సూర్యయా సహ॥

ప॥ వాసాత్యౌ। చిత్రౌ। జగతః। నిధానౌ। ద్యావాభూమీ। చరథః। సం। సఖాయా। తౌ। అశ్వినా। రాసభాశ్వా। హవం। మే। శుభస్పతీ। ఆగతం। సూర్యయా। సహ॥

అ॥ వాసాత్యౌ=సమస్తప్రాణులు నివసించుటకుఁ దగినవియు, చిత్రౌ=అనేకవిధములగు భోగములనిచ్చునట్టివియు, జగతః=ప్రపంచమునకు, నిధానౌ=కారణమైనవియు, రాసభాశ్వా=అశ్వినీదేవతలయొక్క రాసభ, అశ్వ, అను పేరుగల, అశ్వినా=అశ్వములతో సమానమైనవియునగు, యౌ=ఏ, ద్యావాభూమీ=అంతరిక్షభూములు, సఖాయా=స్నేహితులుగా, సంచరథః=ప్రవర్తించుచున్నవో, తౌ=అట్టి మీరిద్దఱు, శుభస్పతీ=నేఁజేయునట్టి శుభకర్మను పాలించువారై, సూర్యయాసహ=సూర్యుఁడను దేవతతోఁగూడ మే=నాయొక్క, హవం=యజ్ఞమునుగుఱించి, ఆగచ్ఛతం=రండు॥

తా॥ ఇక్కడ భూమ్యంతరిక్షములను బరస్పరసఖిత్వముగా నారోపణఁజేసి చెప్పుచున్నాఁడు. ఓ భూమ్యంతరిక్షములారా! మీరిద్దఱు స్నేహముకలవారై దేవతలకు మనుష్యులకు నివాసమునకుఁ దగినవారై అనేకవిధములైన భోగములనిచ్చువారై సమస్తప్రాణులకు నాధారులై అశ్వినీదేవతలయొక్క రాసభ, అశ్వ, అను పేరుగల అశ్వములతో సమానమైనవారై యుండిరి. అట్టి మీరు నేఁజేయునట్టి శుభకర్మమును పోషించువారలై సూర్యా-అను పేరుగల కర్మాధిదేవతతోఁగూడ నేఁజేయు యజ్ఞమునకువచ్చి వత్తురుగాక.

మూ॥ తుగ్రోహభుజ్యు మశ్వినోదమేఘే । రయింనకశ్చి న్మమృవాం అవాహాః । తమూహథు ర్నౌభిరాత్మ న్వతీభిః । అంతరిక్ష ప్రుద్భిరపోదకాభిః ॥ ౪౨ ॥

ప॥ తుగ్రః । హ । భుజ్యుం । అశ్వినా । ఉదమేఘే । రయిం । న । కశ్చిత్ । మమృవాం । అవాహాః । తం । ఊహథుః । నౌభిః । ఆత్మన్వతీభిః । అంతరిక్షప్రుద్భిః । అపోదకాభిః॥

అ॥ అశ్వినా=ఓయశ్వినీదేవలారా !, యువాం=మీరు, ఆత్మన్వతీభిః=దృఢమైనవియు, అంతరిక్షప్రుద్భిః=జలము నాధారముజేసికొని ఆకాశమునందుఁదిరుగుచున్నట్టివియు, అపోదకాభిః=జలముప్రవేశింప వీలులేనట్టివియునగు, నౌభిః=ఓడలచేత, తరణీయం=దాఁటఁదగినట్టిదియు, భుజ్యుం=పాలించునట్టి, తం=అప్రసిద్ధమైన జలమును, కశ్చిత్=ఒకానొక, తుగ్రః=మూర్ఖుఁడు, రయిం=ధనమును, అదత్వా=ఈయక, మమృవాం=మృతినిబొందియు, అవహేవావ=అవహించినవాఁడువలెనే, ఊహథుః=వహించియుంటిరి॥

తా॥ ఓ యశ్వినీదేవతలారా! ఒకానొకమూర్ఖుఁడు ధనమును సంపాదించి యెవరికీ నియ్యక మృతినొందియు ఆ ధనమునే ఆవహించి యున్నట్లు దృఢమైనట్టియు జలముపయిఁ భైభాగమునందు ఆకాశంబునఁ దిరుగుచున్నట్టివియు జలము ప్రవేశించుటకు రంధ్రములు లేక దృఢముగానున్నట్టివియు నగు నోడలు దిరుగుటకుఁ దగినవియు సమస్తప్రాణులకు నాధారమైన జలములను మేఘములయందు ధరించి యున్నారు. అనఁగా అశ్వినీదేవతలు జలమును బహు శ్రద్ధతో మేఘమునందు దాఁచియుంచి భూమియందుఁ గురిపించి యుపకారమును జేఁయుచున్నారు.

మూ॥ తిస్రఃక్షపస్త్రి రహాతివ్రజద్భిః । నాసత్యాభుజ్యు మూహథుః పతంగైః । సముద్రస్యధన్వన్నార్ద్రస్య పారే । త్రిభీరథైశ్శత పద్భిష్షడశ్వైః ॥

ప॥ తిస్రః । క్షపః । త్రిరహా । అతివ్రజద్భిః । నాసత్యా । భుజ్యుం । ఊహథుః । పతంగైః । సముద్రస్య । ధన్వన్ । ఆర్ద్రస్య । పారే । త్రిభిః । రథైః । శతపద్భిః । షడశ్వైః ॥

అ॥ నాసత్యా = అసత్యము లేనట్టియో అశ్వినీదేవతలారా ! యుఽవాం = మీరు అతివ్రజద్భిః = మిక్కిలి వేగముగా వెళ్ళునట్టి, పతంగైః = పక్షులతో సమానమైన వియు, త్రిభిః = మూఁడువిధములు గలవియు, రథైః = రథములతో సమానమైన వియు, శతపద్భిః = అనేక పాదములవంటి జలధారలుకలవియు, షడశ్వైః = అశ్వ ప్రవృత్తివంటి ఆఱుప్రవృత్తులుకల, మేఘైః = మేఘములచేత, ఆర్ద్రస్య = జలముచే సంపూర్ణమైయున్న, సముద్రస్య = సముద్రముయొక్క, పారే = అంతమందు, అనఁగా మెరకభూమియందు, ధన్వన్ = నిర్జలప్రదేశమందు, తిస్రః క్షపః=మూఁడు రాత్రులయందును, త్రిరహా = మూఁడుపగళ్ళయందును, భుజ్యుం = రక్షకమైన జల మును, ఊహథుః = వహించుచున్నారు. అనఁగా గురిపించుచున్నారు.

తా॥ ఎప్పుడును సత్యమును బలుకునట్టియో అశ్వినీ దేవతలారా ! మిక్కిలి వేగముగా బోవుపక్షులవలెనే ఇటుఅటు వ్యాపించియున్నవియు ఉత్తమ మధ్యమ అధమములను మూఁడువిధములైనవియు, (అనఁగా నేయేప్రదేశముల యందెంతెంత వర్షము కురియవలెనో ఆయారీతిగా విశేషముగాను సమముగాను దక్కువగాను గురియునవి కాఁబట్టి మూఁడువిధములు) రథములతో సమానమైనవియు, (అనఁగా రథములు తమపై నుంపబడిన విశేషభారము నెట్లుమోయునో ఆ రీతిగానే మేఘ ములు విశేషజలములను మోయుచున్నవి.) పాదములతో సమానమైన అనేక జల ధారలు కలవియు ఆఱువిధములైన ప్రవృత్తులు కలవియు (అనఁగా ఉత్తమము మధ్యమము అధమము అను మూఁడింటికిని రాకపోకలు అను రెండువిధములచే మూఁడురెళ్ళు ఆఱువిధములైనవి) అగు మేఘములచేత జలముచే నిండియుండిన సముద్రమునకు ఇటుఅటునున్న నిర్జలప్రదేశములయందు మూఁడురాత్రులయందును మూఁడు పగళ్ళయందయినను ఆయాసములేక సర్వప్రాణులకు జీవనాధారమైన జలమును గురిపించి పోషించుచున్నారు.

మూ॥ సవితారం వితన్వన్తం । అనుబధ్నాతి శాంబరః । ఆపపూరుషం। బరశ్చైవ సవితారేపసోభవత్ ॥

ప॥ సవితారం । వితన్వన్తం । అను । బధ్నాతి । శాంబరః । ఆపపూః । షంబరః । చ । ఏవ । సవితా । అరేపసః । అభవత్ ॥

అ॥ శాంబరః=జలమును ధరించియుండునట్టి మేఘుఁడు, వితన్వన్తం=వృష్టినిమి త్తమై కిరణములను వ్యాపింపఁజేయునట్టి, సవితారం=సూర్యుని, అనుబధ్నాతి=అనుస

కించి యుండుచున్నాఁడు, సః = అటువంటి, శంబరః = మేఘుఁడు, తస్మాత్ = ఆ సూర్యువలన, అపపూః=జలములచే నిండింపఁబడినవాఁడై. అరేపసః=పాపరహితమైన అనఁగా సమస్తప్రాణులకు నిష్టమగు వర్షమునకు, సవితా=ఉత్పాదకుఁడై, అభవదేవ=అగుచున్నాఁడయ్యెను.

తా॥ జలమునుధరించియుండువాఁడగుటచే శంబరశబ్దవాచ్యుఁడగు మేఘుఁడు వర్షమునిమిత్తము కిరణములను వ్యాపింపఁజేయుచుండెడు సూర్యు నాశ్రయించి ఆయన అనుగ్రహమువలన విశేషమైన జలముకలవాఁడై సమస్తజంతువులకుఁ బ్రియకరమైన వర్షమును గురిపించుచున్నాఁడు.

మూ॥ త్యగ్ంసుతృప్తం విదిత్వైవ । బహుసోమగిరంవశీ ॥ ౮౩ ॥
అన్వేతితుగ్రోవక్రియాన్తం । ఆయసూయాన్త్సోమతృప్సుషు॥

ప॥ త్యం । సుతృప్తం । విదిత్వా । ఏవ ॥ బహుసోమగిరం । వశీ । అను । ఏతి । తుగ్రః । వక్రియాం । తం । ఆయసూయాన్ । సోమతృప్సుషు ॥

అ॥ బహుసోమగిరం= అనేకవిధములైన మనోహరములగు వాక్కులుగల, త్యం=ఆ పూర్వోక్తమైన మేఘమును, సుతృప్తం=జలముచేఁ దృప్తిని బొందినవానిఁగాఁ దెలిసికొని, వశీ=స్వాధీనమేఘముగల, తుగ్రః=సూర్యుఁడు, సోమతృప్సుషు=సోమపానముఁజేసిన యజమానులవిషయమై, ఆయసూయాన్=వర్షమునుఁ గురిపించుటకు బ్రయత్నముఁజేయుచున్నవాఁడై, వక్రియాం=కుటిలమైన, అనఁగా వర్షమునుఁగురియని, తం=ఆ మేఘమును, అన్వేతి=అనుసరించుచున్నాఁడు.

తా॥ మేఘుఁడు విశేషమైన జలముచే నిండియుండియు వర్షమును గురిపింపనప్పుడు వ్యర్థమైన అనేక గర్జితములను జేయుచున్నాఁడుగాని వర్షమును గురిపించుట్లు లేదని తెలిసికొని సూర్యుఁడు తన స్వాధీనమైన మేఘము కలవాఁడుగాన యజమానులు వృష్టికారణమైన యజ్ఞమును జేయుటవలనను వర్షమును గురియనట్టి యా మేఘము వర్షమును గురియునట్లుగాఁ జేయుచున్నాఁడు.

మూ॥ ససంగ్రామస్తమోద్యోత్యోతః । వాచోగాః పిపాతితత్ ।
సతద్గోభిస్తవాత్యేత్యన్యే । రక్షసానన్వితాశ్చయే॥

ప॥ సః । సంగ్రామః । తమోద్యః । అత్యోతః । వాచః । గాః । పిపాతి । తత్ । సః । తత్ । గోభిః । స్తవా । అత్యేతి । అన్యే । రక్షసా । అనన్వితాః । చ । యే ॥

అ॥ సంగ్రాపః=కిరణముల సమూహము కలవాఁడును, తమోద్యః=చీకటిని బోఁగొట్టునట్టివాఁడును, అత్యోతః=అశ్వములచే ధరింపఁబడు వాఁడునగు, సః=సూర్యుఁడు, వాచః=అఱచుచున్న, గాః=అవులు మొదలగు పశువులను, తత్=జలమును, పిపాతి=త్రాగించుచున్నాఁడు, తత్=అప్పుడు, సః=ఆ సూర్యుఁడు, గోభిః=ప్రాణులయొక్క వాక్కులచేత, స్తవా=స్తోత్రమును జేయఁబడినవాఁడగుచు అన్యే=ఇతరులగు దేవతలను, అత్యేతి=అతిక్రమించియుండుచున్నాఁడు, రక్షసాః=రాక్షసజాతిచే, అనన్వితాః=రాక్షసులలోఁ గలియని, యే=ఎవరు కలరో, తైః=వారందఱిచేతను, స్తూయతే=స్తుతింపఁబడుచున్నాఁడు.

తా॥ అనేక కిరణములు కలవాఁడును అంధకారమును బోఁగొట్టువాఁడును నిరాధారమగు ప్రదేశమందు అశ్వములచే ధరింపఁబడినవాఁడునగు సూర్యుఁడు దప్పిచే బాధపడుచు నఱచుచుండెడు పశువులు మొదలగువానికి వర్షము కురిపించి నీరునిచ్చుటచే ఆనీరును ద్రావి దప్పిఁగపోఁగొట్టుకొని సర్వప్రాణులు సంతోషించి యనేకవిధములుగా స్తోత్రముఁజేసి యాసూర్యుని సమస్తదేవతలలో నధికునిగాఁ దలంచిరి. మఱియు దేవతలును రాక్షసజాతియందుఁబుట్టి రాక్షసులలోఁ గలియక దేవతాపక్షపాతులగు రాక్షసులు మొదలగు సమస్తమైనవారును ఆసూర్యునే అధికునిఁగా స్తోత్రముఁజేసిరి.

మూ॥ అన్వేతి పరివృత్త్యాస్తః । ఏవమేతౌస్థో అశ్వినా । తేఏతేద్యుః
పృథివ్యోః । అహరహర్గర్భందధాథే॥ ౨౨॥

ప॥ అను । ఏతి । పరివృత్త్య । అస్తః । ఏవం । ఏతౌ । స్థః । అశ్వినా । తే ఏతే । ద్యుఃపృథివ్యోః । అహరహః । గర్భం । దధాథే॥

అ॥ అస్తః=సూర్యునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై మేఘుఁడు, పరివృత్త్య=వర్షాభావమునుండి మళ్ళి, అన్వేతి=వర్షమును కురియుటయం దనుసరించుచున్నాఁడు, తే=అప్రసిద్ధమైన, ఏతే=ఈ, యేభూమ్యంతరిక్షములుకలవో, తయోః=అటువంటి, ద్యావాపృథివ్యోః=స్వర్గభూములకు, హే అశ్వినా=ఓయశ్వినీదేవతలారా ! ఏతౌ=ఈ మీరు, ఏవం=పూర్వమునందుఁ జెప్పఁబడిన ప్రకారముగా, ఉపదుర్వంతౌ=ఉపకారమును జేయువారై, స్థః=ఉంటుంది, అహరహః = ప్రతిదినమునందు, గర్భం=గర్భమును, దధాథే=ధరింపఁజేయుచుంటిరి ॥

తా॥ మేఘుఁడు సూర్యునివలన ప్రేరేపింపఁబడి వర్షమును గురియుచున్నాఁడు. ఓ యశ్వినీదేవతలారా ! మీరు ఈప్రకారముగా వర్షమును గురిపించి జలసమృద్ధి గలిగించి అందువలన ఆయా ప్రాణులకు తగిన బీజాంకురములను గలిగింపఁ జేయుటవలన భూమ్యంతరిక్షములకు నుపకారమును జేయువారగుచున్నారు.

మూ॥ తయోరేతౌ వత్సావహోరాత్రే । పృథివ్యా అహః । దివో రాత్రిః ॥ తా అవిసృష్టౌ । దంపతీ ఏవభవతః ॥

ప॥ తయోః । ఏతౌ । వత్సౌ । అహోరాత్రే । పృథివ్యాః । అహః । దివః । రాత్రిః । తౌ । అవిసృష్టౌ । దంపతీ । ఏవ । భవతః ॥

అ॥ తయోః = ఆద్యావాపృథివీ స్థలంబులకు ఏతౌ = ఈ, అహోరాత్రే = అహోరాత్రులు, వత్సౌ = బాలురు, తయోః = ఆ యిద్దరిలో, అహః = పగలు, పృథివ్యాః = భూమియొక్క సంతానము, రాత్రిః = రాత్రి, దివః = అంతరిక్ష సంబంధమైన సంతానము, తౌ = ఆయహోరాత్రములు రెండును, అవిసృష్టౌ = విడిచి యుండనివియై, దంపతీ = దంపతులతో సమానమైనవియై, భవతః = అగుచున్నవి.

తా॥ ద్యావాపృథివీ స్థలంబులను అనేకవిధములుగా స్తోత్రము జేయుచు నందులో నొకవిధమును జెప్పుచున్నాఁడు. అహోరాత్రములు రెండును భూమ్యంతరిక్షములకు సంతానముగానున్నవి. అందులోఁ బగలు భూమియొక్క సంతానముగాను రాత్రి స్వర్గముయొక్క సంతానముగా నేర్పడియుండి ఆ యహోరాత్రములు అవినాభావముగా నుండుటచే దంపతీ సమానముగా నుండెనని చెప్పఁబడుచున్నవి.

మూ॥ తయోరేతౌ వత్సౌ । అగ్నిశ్చాదిత్యశ్చ । రాత్రేర్వత్సః । శ్వేత ఆదిత్యః । అహ్నోఽగ్నిః ॥ ౭౫ ॥ తామ్రో అరుణః । తౌ అవిసృష్టౌ । దంపతీఏవభవతః ॥

ప॥ తయోః । ఏతౌ । వత్సౌ । అగ్నిః । చ । ఆదిత్య । చ । రాత్రేః । వత్సః । శ్వేతః । ఆదిత్యః । అహ్నః । అగ్నిః తామ్రః । అరుణః । తౌ । అవిసృష్టౌ । దంపతీ । ఏవ । భవతః ॥

అ॥ తయోః = దంపతులతో సమానమైన ఆయహోరాత్రములకు, ఏతౌ = ఈ, అగ్నిశ్చ = అగ్నిహోత్రుఁడును, ఆదిత్యశ్చ = సూర్యుఁడును, వత్సౌ = పిల్లలు శ్వేతః = తెల్లఁగానుండు, ఆదిత్యః = సూర్యుఁడు, రాత్రేః = రాత్రియొక్క, వత్సః =

పిల్లవాఁడు, తామ్రః = కొంచెము ఎఱ్ఱఁగాను, అరుణః = మిక్కిలి యెఱ్ఱఁగా నుండునట్టి, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, అహ్నః = పగటియొక్క సంతానము, తౌ = ఆదిత్యాగ్నులు, అవిస్పృష్టౌ = కూడ నుండువారై, దంపతీ ఏవ = దంపతులతో సమానులై, భవతః = అగుచున్నారు.

తా॥ పూర్వ మంత్రమునందు భూమ్యంతరిక్షములకు అహోరాత్రములు సంతానముగాఁ జెప్పఁబడెను. ఇప్పుడు అహోరాత్రముల సంతానమును జెప్పుచున్నాఁడు. సూర్యుఁడు అగ్నిహోత్రుఁడు అహోరాత్రముల యొక్క సంతానముగా నుండిరి. వారిద్దఱిలోఁ దెల్లని వర్ణముగల సూర్యుఁడు రాత్రి యంతయుఁ గడచిన పిమ్మటఁ బ్రాతఃకాలమునం దుదయించుటచే రాత్రి యొక్క తనయుఁడుగా నుండెను. ఒకానొక సమయమందుఁ గొంచె మెఱ్ఱని వర్ణముగలవాఁడును ఒకానొక సమయమందు మిక్కిలి యెఱ్ఱని వర్ణము గలవాఁడునగు అగ్నిహోత్రుఁడు పగలు వెళ్ళిన పిమ్మట సాయంకాలము మొదలు రాత్రియంతయు విశేష కాంతి కలవాఁడగుటవలనను లేక పాకాదులను గుఱించియు అగ్నిహోత్రాదులఁ గుఱించియుఁ బగలు ప్రజ్వలింపఁజేయుట వలనను అగ్నిహోత్రుఁడు పగటి యొక్క సంతానముగాఁ జెప్పఁబడెను. వారిద్దఱు పరస్పరము స్నేహముగా నుండుట వలన దంపతులతో సమానముగా నుండిరి.

మూ॥ తయోరేతౌ వత్సౌ । వృత్రశ్చ వైద్యుతశ్చ । అగ్నేర్వృత్రః ।
వైద్యుత ఆదిత్యస్య । తావవిస్పృష్టౌ । దంపతీ ఏవ భవతః ॥

ప॥ తయోః । ఏతౌ । వత్సౌ । వృత్రః । చ । వైద్యుతః । చ । అగ్నేః । వృత్రః । వైద్యుతః । ఆదిత్యస్య । తౌ । అవిస్పృష్టౌ । దంపతీ । ఏవ । భవతః ॥

అ॥ తయోః = ఆయాదిత్య అగ్నులకు, ఏతౌ = ఈ, వృత్రః = ఆవరించునట్టి ధూమము, వైద్యుతః = వేఁడిమివలన, వత్సౌ = తనయు లుద్భవించిరి, తయోః = వారిద్దఱిలోఁ వృత్రః = ఆవరించునట్టి ధూమము, అగ్నేః = అగ్నిహోత్రుని సంతానమయి యుండెను, వైద్యుతః = ఎండ, ఆదిత్యస్య = సూర్యునియొక్క సంతానమయియుండెను, తౌ = ఆ పరితాపధూమములు, అవిస్పృష్టౌ = కూడనుండునవియై, దంపతీ ఏవ = దంపతుల సమానముగానున్నవై, భవతః = అగుచున్నవి.

తా॥ అగ్న్యాదిత్యులకు ధూమాతపములు పుత్త్రులుగానున్నవి. వానిలో ధూమము అగ్నియొక్క సంతానముగాను, ప్రతాపము సూర్యునిసంతాన ముగాను నున్నవి. ఆ రెండు పరస్పరము సంబంధముగా నుండుటవలన దంపతు లలో సమానముగా నుండెను.

మూ॥ తయోరేతౌ వత్సౌ ॥ ౨౬ ॥ ఉష్మాచ నీహారశ్చ । వృత్రస్యో ష్మా ॥ వైద్యుతస్య నీహారః । తౌ తావేవ ప్రతిపద్యేతే ॥

ప॥ తయోః । ఏతౌ । వత్సౌ । ఊష్మా । చ । నీహారః । చ । వృత్రస్య ఉష్మా । వైద్యుతస్య । నీహారః । తౌ । తా । ఏవ । ప్రతిపద్యేతే ॥

అ॥ తయోః=ఆ ధూమాతపములకు, ఊష్మాచ = వేఁడిమియు, నీహారశ్చ= మంచు అనియు, ఏతౌ=ఈ యిద్దఱు సంతానము కలిగియుండెను. ఉష్మా=వేఁడిమి, వృత్రస్య=ధూమముయొక్క సంతానము, నీహారః = మంచు, వైద్యుతస్య=ఆ తపము యొక్క సంతానము, తౌ=ఆ యూష్మనీహారములు, తావేవ=తమకుఁ గారణము లైన ధూమాతపములనే, ప్రతిపద్యేతే=పొందుచున్నవి.

తా॥ ఆ ధూమాతపములకు ఊష్మమనియు నీహారమనియు నిద్దఱు తనయు లుండిరి. వానిలో ఊష్మము ధూమముయొక్క సంతానముగాను నీహారము ఆ తప ముయొక్క సంతానముగాను నుండెను. ఆ యూష్మనీహారములు రెండును తమవలన మరియొక సంతానమును, గలిగింపనే తాము తమకుఁ గారణభూతమైన ధూమము నందు ఊష్మము ఆ తపమునందు నీహారము పొంది లీనమగుచున్నది. ఈ ప్రకార ముగా ద్యావాపృథ్వ్యులకుఁ బరంపరా సంతానముఁ జెప్పఁబడియెను.

మూ॥ సేయగ్ంరాత్రీగర్భిణీ పుత్త్రేణసంవసతి । తస్యావాఏతదుల్బ ణం । యద్రాత్రౌరశ్మయః । యథాగోర్గర్భిణ్యా ఉల్బణం । ఏవమేతస్యా ఉల్బణం॥

ప॥ సా । ఇయం । రాత్రీ । గర్భిణీ । పుత్రేణ । సం । వసతి । తస్యాః । వా । ఏతత్ । ఉల్బణం । యత్ । రాత్రౌ । రశ్మయం । యథా । గోః । గర్భి ణ్యాః । ఉల్బణం । ఏవం । ఏతస్యాః । ఉల్బణం ॥

అ॥ యా = ఏప్రసిద్ధమైన రాత్రికలదో, సా=ఆ ప్రసిద్ధమైన, ఇయం= ఈ, రాత్రీ=రాత్రి, గర్భిణీ=గర్భముకలదై, పుత్రేణ=సూర్యరూపమైన తనయుఁ

నితో, సంవసతి=నివసించుచున్నది, యత్=ఏకారణమువలన, రాత్రి=రాత్రి యందు, రశ్మయః=సూర్యకిరణములు, నదృశ్యంతే=చూడఁబడవో, తస్మాత్=ఆ కారణమువలన, రశ్మయః=సూర్యకిరణములు, తస్యావా=ఆ రాత్రికి, ఏతత్=ఈ, ఉల్బణం=పిండము నాశ్రియించియుండు శుక్లశోణితములుగా నుండెను, యథా= ఏ ప్రకారముగా, గర్భిణ్యాః=గర్భముగల, గోః=ఆవుయొక్క, ఉల్బణం=పిండ సంబంధమైన శుక్లశోణితములు కలవో, ఏవం=ఈ ప్రకారముగా, ఏతస్యాః=ఈ రాత్రికిని, ఉల్బణం=సూర్యకిరణరూపమైన శుక్లశోణితము లు కలవు.

తా॥ రాత్రియందు సూర్యుఁడు సూర్యకిరణములు కనబడకపోవుటవలన రాత్రి యను స్త్రీ గర్భిణియై సూర్యుని గర్భమునందుండు పిండముగాను గిరణములు ఆ పిండము నాశ్రియించియుండు శుక్లశోణితములుగాను ధరించి ప్రాతఃకాలంబున ఆ సూర్యుని తనయుఁడుగా బ్రసవించెను. అది యెట్లుఁగా ఆవు ఏ ప్రకారముగా గర్భముకలదై పిండమును బిండసంబంధమైన శుక్లశోణితములను ధరించియుండునో ఆ రీతిగనే రాత్రియు ధరించియుండెను.

మూ॥ ప్రజయిష్ణుః ప్రజయాచ పశుభిశ్చభవతి । యఏవంవేద । ఏత ముద్యంత మపియంతంచేతి । ఆదిత్యః పుణ్యస్యవత్స ॥

ప॥ ప్రజయిష్ణుః । ప్రజయా । చ । పశుభిః । భవతి। యః । ఏవం । వేద । ఏతం । ఉద్యంతం । అపి । యంతం । చ । ఇతి । ఆదిత్యః పుణ్యస్య । వత్సః ॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారముగా రాత్రి మహిమను, వేద=తెలిసి కొనుచున్నాఁడో, సః=వాఁడు, ప్రజయాచ=సంతానముచేతను, పశుభిశ్చ=పశువుల చేతను, ప్రజయిష్ణుః=బుట్టించువాఁడై, భవతి=అగుచున్నాఁడు, యః=ఎవఁడు, ఏతం=ఈ, ఉద్యంతం=ఉదయించుచున్నట్టియు, యంతమపిచ=అస్తమానమును బొందునట్టియు సూర్యునిగుఱించి, ఇతి ఈప్రకారముగా మహిమను. వేద=తెలిసి కొనుచున్నాఁడో, సః=వాఁడు, పుణ్యస్య=సుకృతముయొక్క, వత్సః=పిల్లవాఁడైన, అనఁగాఁ బుణ్యమూర్తియగు, ఆదిత్యః=సూర్యుఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఈప్రకారముగా రాత్రి సంబంధమగు మహిమను ఎవఁడు తెలిసికొను చున్నాఁడో వాఁడు సంతానము పశువులు గలవాఁడగుచున్నాడు. ఆరాత్రియొక్క సంతానమగు సూర్యునిమహిమను ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సాక్షాత్

పుణ్యస్వరూపియగు సూర్యునితో సమానుఁడై సూర్యుఁడు దయాస్తమయములను బొందనట్టి స్థానములను స్వేచ్ఛగా సంచరించువాఁడగుచున్నాఁడు.

మూ॥ అథపవిత్రాంగిరసః॥ ౪౯॥ ౫౦॥

ప। అథ । పవిత్రాంగిరసః ॥

అ॥ అథ=అనంతరము, పవిత్రాంగిరసః=పవిత్రులైన అంగిరస్సుల సంబంధమగు మంత్రములు, వక్ష్యంతే=చెప్పఁబడఁగలవు.

తా॥ ఈప్రకారము భూమ్యంతరిక్షముల మహిమఁ జెప్పినపిమ్మటఁ బవిత్రమూర్తులైన అంగిరస్సుల సంబంధమగు మంత్రములు చెప్పఁబడుచున్నవి.

—♦ అథఏకాదశానువాకః ప్రారంభః ♦—

మూ॥ పవిత్రవన్తః పరివాజమాసతే। పితైషాంప్రత్నో అభిరక్షతి వ్రతం। మహాస్సముద్రం వరుణస్తిరోదధే। ధీరాఇచ్ఛేకుర్ధరుణేష్వారభం ॥

ప॥ పవిత్రవన్తః । పరి । వాజం । ఆసతే । పితా । ఏషాం । ప్రత్నః । అభి। రక్షతి । వ్రతం । మహాః । సముద్రం । వరుణః । తిరోదధే । ధీరాః । ఇత్ । శేకుః । ధరుణేషు । ఆరభం ।

అ॥ పవిత్రవన్తః = పవిత్రముగల ఋత్విగ్యజమానులు, వాజం = అన్నమును, పర్యాసతే= సేవించుచున్నారు, అనఁగా అన్నమునుగూర్చి యజ్ఞమును జేయుచున్నారు, ఏషాం = ఈ సోమయాజులయొక్క । పితా = పాలకుఁడును । ప్రత్నః= పురాతనుఁడునగు బ్రహ్మ, వ్రతం= ఈ కర్మను, అభిరక్షతి= అంతయును భావించుచున్నాఁడు, వరుణః =జలాధిపతియగు వరుణదేవుఁడు, మహాః = విస్తారమైన సముద్రం= సముద్రమువలెనే అపారమైన అంతరిక్షమును, తిరోదధే= మేఘములచేఁ గప్పివేయుచున్నాఁడు, ధీరాఇత్ = బుద్ధిమంతులే, ధరుణేషు = అగ్నినిధరించియున్న యాగగృహములయందు, ఆరభం = కర్మను ఆరంభించుట కొఱకు శేకుః = సమర్థులు॥

తా॥ పవిత్రవంతులైన ఋత్విగ్యజమానులు అన్నము సమృద్ధిగ నన్నిజంతువులకు గలుగుటకొఱకు వర్షము నిమిత్తమై సోమయాగమును జేయుచుందురు. రక్షకుండును పురాణపురుషుండునగు బ్రహ్మ అట్టికర్మలను గాపాడుచుండును. అనంతరము

వృష్టికారణమైన యజ్ఞమును జేయుటచేత సంతోషించి జలాధిపతియగు వరుణ దేవుఁడు మేఘములను ఆకాశమునందంతటను వ్యాపింపఁజేసి వర్షమును గురిపించు చున్నాడు. కాఁబట్టి ఇట్టికార్యమును బుద్ధిమంతులైనవారేచేయ బ్రయత్నించు చున్నారు.

మూ॥ పవిత్రంతే వితతంబ్రహ్మణస్పతే। ప్రభుర్గాత్రాణిపర్యేషి విశ్వతః। అతప్తతనూర్న తదామోఅశ్నుతే। శృతాస ఇద్వహంతస్తత్సమాశత ॥

ప॥ పవిత్రం। తే। వితతం। బ్రహ్మణస్పతే। ప్రభుః। గాత్రాణి। పర్యేషి। విశ్వతః। అతప్తతనూః। న। తత్। ఆమః। అశ్నుతే। శృతాసః। ఇత్। వహంతః। తత్। సమాశత ॥

అ॥ బ్రహ్మణస్పతే=అన్నమునకు నధిపతివగు నోసోమమా! పవిత్రం=పవిత్రకరమైన పవిత్రము, తే=నీ కొఱకు, వితతం=విస్తరింపఁజేయఁబడినది, తేన=ఆ పవిత్రముచే, త్వం=నీవు, శోధితః=సంస్కారింపఁ జేయఁబడినదానవై, ప్రభుః=సమర్థమైనదాన వగుచు, విశ్వతః = అంతటను, గాత్రాణి = యజ్ఞాంగములను పర్యేషి=వ్యాపించుచున్నాను, యథా=ఏ ప్రకారముగాను, అతప్తతనూః=తపింపఁ జేయఁబడని స్వరూపము గలదియు, ఆమః=పచ్చిదియైన పురోడాశాదికము, తత్= ఆ యజ్ఞాంగమును గుఱించి, నాశ్నుతే=పొందదో, శృతాస ఇత్=వండఁబడిన పురోడాశాదులే, వహంతః=యజ్ఞమును నిర్వహించునవియై, తత్=ఆ యజ్ఞాంగత్వ మును, సమాశత=లెస్సఁగాఁ బొందుచున్నవి.

తా॥ అన్నమును ఇచ్చునట్టి యో సోమమా! నీవు పవిత్రకరమైన పవిత్ర ముచే సంస్కారింపఁబడినదానవై సమర్థమైనదాన వగుచు యజ్ఞమునం దంతట నుప యోగింపఁబడు చున్నావు. అది యెట్లనఁగా పచనముఁ జేయఁబడనిదియై పచ్చిగా నుండు పురోడాశము యజ్ఞమునం దుపయోగింపఁబడదో పచనముఁ జేయఁబడినదే యజ్ఞమున కుపయోగపడునో ఆ రీతి గానే పవిత్రముచే సంస్కారింపఁబడిన సోమము యజ్ఞమున కుపయోగపడును.

మూ॥ బ్రహ్మదేవానాం। అసతస్సద్యే తతక్షుః ॥ ౪౧ ॥ ఋషయ స్సప్తాత్రిశ్చయత్। సర్వేత్రయో అగస్త్యశ్చ। నక్షత్రై శ్శంకృతోవసత్ ॥

బ్రహ్మదేవానాం=అను మంత్రమునకుఁ త్వయగ్నే బృహద్వయః, అను వాకము నందు వ్యాఖ్యానముఁ జేయఁబడినది గాన యిక్కడ చెప్పఁబడలేదు.

ప॥ అసతః। సత్। యే। తతక్షుః। ఋషయః। సప్త। అత్రిః। చ। యత్। సర్వే। అత్రయః। అగస్త్యః। చ। నక్షత్రైః। శంకృతః। అవసన్॥

అ॥ యే=ఏ, సప్త=ఏడుగురు, ఋషయః=మరీచి మొదలగు మునీశ్వరులు కలరో, కించ=మరియు, యత్=ఏ, అగస్త్యశ్చ=అగస్త్యుఁడను మునీశ్వరుఁడు కలఁడో, తే=ఆ, సర్వే=అందఱు మునీశ్వరులు అసతః=జగత్కారణమైన అవ్యక్తమువలన, సత్=వ్యక్తమైన ప్రపంచమును, తతక్షుః=నిర్మించిరి, ఏవం=ఈప్రకారముగా సప్త ఋషులవలెనే, తే=తపస్సంపన్నులైనవారు, అత్రయః=అత్రి మొదలగు మునీశ్వరులతో సమానులై, అగస్త్యః=అగస్త్యునితో సమానులై, శంకృతః=సమస్త ప్రాణులకు మేలును జేయుచు, నక్షత్రైః=నక్షత్రరూపములచే, అవసన్=స్వర్గమునందుండురు.

తా॥ కొందఱు మహానుభావులు సృష్టికర్తలగుటకుఁ దపస్సుఁజేసి పిమ్మట సత్ రజన్మమునందు మరీచి వసిష్ఠుఁడు అత్రి అగస్త్యుఁడు మొదలగు మునీశ్వరులై జనియించి తాము పూర్వజన్మంబునఁ జేసిన తపస్సునకు అనుగుణ్యముగా నవ్యక్తము వలన ఈప్రపంచమును గలిగింపఁజేసిరి. కాఁబట్టి ఏపురుషులు అరుణకేతుకాగ్నిని బూజించుచున్నారో, వారు అత్రి అగస్త్యుఁడు మొదలగు మునీశ్వరులతో సమానులై సమస్త ప్రాణులకు సుఖమును గలుగఁజేయుచు స్వర్గమునందు నక్షత్రరూపముగాఁ దేజశ్శాలులై ప్రకాశించుచుందురు.

మూ॥ అథ సవితుశ్శ్యావాశ్వస్యావర్తికామస్య॥

ప॥ అథ। సవితుః। శ్యావాశ్వస్య। అవర్తికామస్య॥

అ॥ అథ=ఈ ప్రకారము అంగిరస్సులు మొదలగు మునీశ్వరుల వృత్తాంతమును జెప్పినపిమ్మట, సవితుః=మంత్రముల ప్రవర్తకుఁడును, అవర్తికామస్య=వైరాగ్యమే కోరికగాఁగల, శ్యావాశ్వస్య=శ్యావాశ్వుఁడను మునీశ్వరునియొక్క విషయమును జెప్పుచున్నాఁడు.

మూ॥ అమీయఋక్షానిహితాసఉచ్చా । నక్తందదృశ్రేకుహచిద్దివేయుః । అదబ్ధానివరుణస్యవ్రతాని । విచాకశచ్చంద్రమా నక్షత్రమేతి॥

ప॥ అమీ । యే । ఋక్షాః । నిహితాః । ఉచ్చా । నక్తం । దదృశ్రే । కుహచిత్ । దివా । ఈయుః । అదబ్ధాని । వరుణస్య । వ్రతాని । విచాకశత్ చంద్రమాః । నక్షత్రం । ఏతి॥

అ॥ ఉచ్చా=ఉన్నతస్థానమైన అంతరిక్షమునందు, నిహితాః=బ్రహ్మచే నుంచఁబడిన, అమీ=ఈ, యేఋక్షాః=ఏ నక్షత్రములు కలవో, తే=ఆ నక్షత్రములు, నక్తం=రాత్రియందు, దదృశ్రే=కనఁబడుచున్నవి, దివా=పగలు । కుహచిత్= ఒకానొక చోటును, ఈయుః=పొందినవివలెనే యున్నవి, వరుణస్య=నక్షత్రకాంతిని ఆవరించునట్టి సూర్యునియొక్క, వ్రతాని=వ్యాపారములు, అదబ్ధాని=నివారింప శక్యము కానివి, చంద్రమాః=చంద్రుఁడయిన । విచాకశత్=మిక్కిలి ప్రకాశించువాఁడై । నక్షత్రం=నక్షత్రములను, ఏతి=పొందుచున్నాఁడు.

తా॥ బ్రహ్మచే సృజియింపబడి యున్నతమైన యాకాశమునందుఁ బ్రకాశించుచున్న నక్షత్రములు రాత్రులలో మనకగపడుచుఁ బగలు ఎచ్చటికో యేగినట్లుండును. ఎందువలననఁగా పగలు సూర్యుని యనివార్యమైన యుష్ణప్రకాశముచే నక్షత్రకాంతి కప్పబడి కనబడకుండెను. రాత్రియందుఁ జంద్రుఁడు తాను విశేషముగాఁ బ్రకాశింపుచున్నను నక్షత్రములు కూడఁ బ్రకాశించునట్లు ప్రకాశించుచున్నాఁడుగాన నక్షత్రములు రాత్రియందుఁ గనబడుచున్నవి.

మూ॥ తత్సవితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీమహి ॥ ౨౮ ॥ ధియో యోనః ప్రచోదయాత్ ॥

ప॥ తత్ । సవితుః । వరేణ్యం । భర్గః । దేవస్య । ధీమహి । ధియః । యః । నః । ప్ర । చోదయాత్ ॥

అ॥ సవితుః = ప్రేరకుఁడైన, దేవస్య = సూర్యదేవునియొక్క, తత్ = ఆ ప్రసిద్ధమైన, వరేణ్యం = శ్రేష్ఠమైన, భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానముఁ జేయుచున్నాము, యః = ఏసూర్యుఁడు, నః = మాయొక్క, ధియః = బుద్ధులను, ప్రచోదయాత్ = మిక్కిలి ప్రేరేపించుచున్నాఁడో ॥

తా॥ ఏసూర్యుఁడు మాయొక్క బుద్ధివృత్తులను ప్రేరేపించి సమస్త వ్యాపారములను జేయించుచున్నాఁడో, సమస్తకర్మ ప్రేరకుండగు అట్టి సూర్యదేవునియొక్క శ్రేష్ఠమగు తేజస్సును ధ్యానించుచున్నాము.

మూ॥ తత్సవితుర్వృణీమహే। వయందేవస్యభోజనం। శ్రేష్ఠగ్ం సర్వధాతమం। తురంభగస్యధీమహి ॥

ప॥ తత్। సవితుః। వృణీమహే। వయం। దేవస్య। భోజనం। శ్రేష్ఠం। సర్వధాతమం। తురం। భగస్య। ధీమహి ॥

అ॥ వయం = మేము, సవితుః=సూర్యునియొక్క, తత్ = ఆ తేజస్సును, ధీమహి = ధ్యానముఁ జేయుచున్నాము, భోజనం = భోగసాధనమైనదియు, శ్రేష్ఠం = ప్రశస్తమైనదియు, సర్వధాతమం = సర్వప్రపంచమును ధరించునదియు నగు, భగస్యదేవస్య = సూర్యదేవునియొక్క, తత్ = ఆ తేజస్సును, తురం = శీఘ్రముగా, ధీమహి = ధ్యానించుచున్నాము.

తా॥ సమస్త ప్రాణులకు సుఖమును గలిగించునదియుఁ బ్రశస్తమైనదియు సమస్త ప్రపంచమును ధరించియున్నదియునగు సూర్యునియొక్క తేజస్సును మేము శీఘ్రముగా ధ్యానించుచున్నాము.

మూ॥ అపాగూహితసవితాతృభీన్। సర్వాన్దివో అన్ధసః। నక్తం తాన్యభవన్దృశే। అస్థ్యశ్నాసంభవిష్యామః ॥

ప॥ అప। అగూహిత। సవితా। తృభీన్। సర్వాన్। దివః। అందసః। నక్తం। తాని। అభవన్। దృశే। అస్థ్యశ్నా। సంభవిష్యామః।

అ॥ సవితా=సూర్యుఁడు, అంధసః=నక్షత్రములను గుడ్డివానిగాఁ జేయుచుండెడి, సర్వాన్=సమస్తమైన, తృభీన్=తన కిరణములను, దివః=ఆకాశమునుండి, అపాగూహిత=ఆకర్షించి దాఁచియుంచెను, తస్మాత్=ఆ కారణము వలన, తాని= ఆ నక్షత్రములు, నక్తం=రాత్రియందు, దృశే=చూడఁదగినవియై, అభవన్=ఆయెను, వయం=మనము, అస్థ్యశ్నా=ఎముకలు రక్తముచేత, సంభవిష్యామః=పుట్టుచున్నాము ॥

తా॥ సూర్యుఁడు నక్షత్రములను బ్రకాశింపఁ జేయునట్టి తన కిరణముల నన్నియు సాయంకాలంబున ఆకాశంబునుండి యాకర్షించి తన యందు నుపసంహారముఁ జేయుచున్నాఁడుగాన రాత్రియందు నక్షత్రములు కనఁబడుచున్నవి. మనము ఎముకలు రక్తము మొదలగు వానితోఁ బుట్టినప్పటికిని శరీరముచేఁ గప్పబడుట వలన ఆ యెముకలు మొదలగునవి యెట్లు కనఁబడకుండెనో, ఆ రీతిగానే సూర్యుని కాంతిచేఁ గప్పఁబడి నక్షత్రములు పగలు మన కగపడకుండెను.

మూ॥ నామనామైవనామమే ॥ ౫౦ ॥ నపుగ్ంసకం పుమాగ్ స్త్ర్యస్మి । స్థావరోస్మ్యథజంగమః । యజేయక్షియష్టాహేచ ॥

ప॥ నామ । నామ । ఏవ । నామ । మే । నపుంసకం । పుమాన్ । స్త్రీ । అస్మి । స్థావరః । అస్మి । అథ । జంగమః । యజే । యక్షి । యష్టాహే । చ ।

అ॥ మే=నా యొక్క, నామ=పేరు, నామైవనామ = శబ్దమాత్రమే కదా, లోకే=లోకమునందు, యత్=ఏ, నపుంసకం=స్త్రీ పురుష లక్షణరహితమైన శరీరముకలదో, పుమాన్=పురుషుఁడు కలఁడో, స్త్రీ=ఆఁడుదికలదో, తత్సర్వం=అది యంతయు, అహం=పరమాత్మ స్వరూపుఁడనైన నేను, అస్మి=అయితిని, స్థావరః= పర్వతము మొదలగునవియు, జంగమః=మనుష్య పశువులు మొదలగునవియు, అహం=నేను, అస్మి=అయితిని, యజే=వర్తమాన శరీరముచేఁ బూజించుచున్నాను. యక్షి=కడచిన శరీరముచేఁ బూజించితిని, అథ=అనంతరము, యష్టాహేచ=రాఁబోవుశరీరముచేతను పూజించుచున్నాను.

తా॥ పూర్వము సూర్యుఁడు మొదలగు దేవతల మహిమను వర్ణించి యిప్పుడు పరమాత్మను స్తోత్రముఁ జేయుటకుఁ బరమాత్మను సర్వాంతర్యామి గాఁ జెప్పుచున్నాఁడు. లోకములో రాముఁడు గోవిందుఁడు మొదలగు నామములచే వ్యవహరింపఁబడు నామములు శబ్దమాత్రములేగాని వానివలనం బ్రయోజనమేమియు లేదు లోకములోఁ బురుషుఁడనియు స్త్రీ యనియు నపుంసకుఁడనియు నేవ్యవహారము కలదో అది యంతయు నాస్వరూపమే. స్థావరములగు పర్వతాదులు జంగమములగు మనుష్యాదులేవికలవో అవియన్నియు నాస్వరూపమే. వెనుకటి జన్మంబునఁ బూజించినవాఁడను నేనే. ఈజన్మంబునఁ బూజించుచున్నవాఁడను నేనే. రాఁబోవు జన్మంబునఁ బూజించువాఁడను నేనే. ఈలాగున అధ్యాత్మజ్ఞానముచే బ్రహ్మాత్మస్వరూపుండగు వానియొక్క స్వానుభవమును బ్రకటన చేయుచున్నాఁడు.

మూ॥ మయాభూతాన్యయక్షత । పశవోమమభూతాని । అనుబంధ్యోః । స్మి । హం విభుః ॥

ప॥ మయా । భూతాని । అయక్షత । పశవః । మమ । భూతాని । అనుబంధ్యః । అస్మి । అహం । విభుః ॥

అ॥ మయా=నాచేతనే, భూతాని=ప్రాణులు, అక్షయత=యాగమును జేసెను, మమ=నాయొక్క, భూతాని=పృథివ్యాది పంచభూతములే, పశవః=పశువులు మనుష్యులు మొదలగునవి, అభవన్=అయినవి, అహం=నేను, విభుః=అఖండ చైతన్య స్వరూపముచే వ్యాపించువాఁడనై అనుబంధ్యః=ఆయాశరీరములయందు జీవ రూప సంబంధము కలవాఁడనై, అస్మి=అయితిని॥

తా॥ పరమాత్మ స్వరూపుఁడనైన నాచేతనే సమస్తప్రాణులు యజ్ఞమును జేసెను. అనఁగా నేనే ఆయాశరీరములయందుఁ బ్రవేశించి యజ్ఞాదులను జేసితిని. నాచే సృజియింపఁబడిన పృథివి మొదలగు భూతములే దేవమనుష్యతిర్యగాది జంతువులుగా నేర్పడెను. అఖండ చైతన్యస్వరూపమైన నేనే ఆయాశరీరములయందు జీవరూపముగాఁ బ్రవేశించి వ్యాపించియుండి ఆయా శరీరాభిమానమును గలుగఁ జేయుచున్నాను. ఈ ప్రకారముగా జీవాత్మ పరమాత్మలకు నభేదముఁ జెప్పఁబడెను.

మూ॥ స్త్రియస్సతీః। తాఉమేపుగ్ంసఆహుః। పశ్యదక్షణ్వాన్నవి
చేతదంధః। కవిర్యఃపుత్త్రః సఇమాచికేత॥ ౫౧॥ యస్తావి
జానాత్సవితుః పితాసత్॥

ప॥ స్త్రియః। సతీః। తాః। ఉ। మే। పుంసః। ఆహుః। పశ్యత్। అక్షణ్వాన్। న। విచేతత్। అంధః। కవిః। యః। పుత్త్రః। సః। ఇమాః। చికేత। యః। తాః। విజానాత్। సవితుః। పితా। సత్॥

అ॥ యాః=ఏ, స్త్రియః=స్త్రీలు, సతీః=గురుకటాక్షముచే నాత్మజ్ఞానము కలవారగుదురో, తాఉ=ఆస్త్రీలైన, మే=నాయొక్క మతముచే, పుంసః=పురుషులుగా, ఆహుః=చెప్పఁబడుచున్నారు, యః=ఎవఁడు అక్షణ్వాన్=నేత్రములు కలవాఁడై, పశ్యత్=తెలుపు ఎఱుపు నలుపు మొదలగు వర్ణములనే చూచుచు, నవిచేత్=ఆత్మజ్ఞానముకలిగి సద్వస్తువును దెలిసికొన లేనివాఁడాయెనా, సః=వాఁడు, అంధః=గ్రుడ్డివాఁడు, యః=ఏ, పుత్త్రః=కుమారుఁడు, కవిః=వేదశాస్త్ర పారగతుఁడై, ఇమాః=ఈ దృశ్యమానములగు భూతములను, చికేత=ఆత్మగాఁ దెలిసికొనుచున్నాఁడో, యః=ఏకుమారుఁడు, తాః=దృశ్యాదృశ్యములగు సమస్త భూతములను, విజానాత్=ఆత్మస్వరూపముగాఁ దెలిసికొనుచున్నాఁ

డో, సః = అట్టి ఆత్మజ్ఞానియగు కుమారుఁడు, సవితుః = తన జననమునకుఁ గారణ మైన తండ్రికి, పితాసత్ = తండ్రియగుచున్నాఁడు, అనఁగా జ్ఞానమునిచ్చి తరింపఁ జేయుటచే నధికుఁడగుచున్నాడు.

తా॥ లోకములో స్త్రీలు ఆత్మజ్ఞానము కలిగి స్వానుభవము కలవారై యుండి లేని అట్టి స్త్రీలను స్తనవృద్ధ్యాది స్త్రీ లక్షణములున్నను స్త్రీలని చెప్పఁగూడదు. పురుషులనియే చెప్పవలయునని బ్రహ్మవేత్తల యభిప్రాయమైయున్నది. యే పురుషులు గడ్డము మీసములు మొదలగు పురుషలక్షణములు కలవారై యున్నను బురుషులకు నుండదగిన ఆత్మజ్ఞానము లేక స్త్రీ సామాన్యమందుండు మోహాదులుండుట వలన అట్టి పురుషులను బురుషులుగాఁ జెప్పగూడదు. స్త్రీలనియే చెప్పవలయును. కాఁబట్టి ఇక్కడ స్త్రీ పురుష విభాగము లోకవ్యతిరిక్తముగాఁ జెప్పబడెను. మరియు నెవఁడు నేత్రేంద్రియములు కల్గి వివేకముచే నాత్మానుభవమును జేసికొననివాఁడై బాహ్యదృశ్య పదార్థముల నీలపీతాదివర్ణములనే చూచుచున్నాడో వాడు నేత్రములు కలవాడైనను గ్రుడ్డివాడనియే చెప్పవలయును. ఆ ప్రకారము గానే తండ్రి కుమారులలో తండ్రి చదువనివాడై యజ్ఞానియై యుండఁగాఁ గుమారుఁడు సమస్త వేదశాస్త్రములను జదివి యాత్మానుభవము కలవాడయి నేని అప్పుడు తండ్రిని గుమారునిగాను గుమారుని దండ్రిగాను జెప్పవలయును. కాఁబట్టి సమస్త విధములచేతను తత్వజ్ఞానమే యధికమని చెప్పబడియెను.

మూ॥ అన్ధోమణిమవిన్దత్ । తమనఙ్గులిరావయత్ । అగ్రీవః ప్రత్యముంచత్ । తమజిహ్వా అసశ్చత్॥

ప॥ అంధః । మణిం । అవిందత్ । తం । అనంగులిః । అవయత్ । అగ్రీవః । ప్రతి । అముంచత్ । తం । అజిహ్వా । అసశ్చత॥

అ॥ అంధః=బాహ్యవస్తువుల విషయమై గ్రుడ్డివాఁడై, మణిం=మణివలెనే ప్రకాశమానమగు పరమాత్మను, అవిందత్=పొందెను, అనంగులిః=వ్రేళ్ళులేనివాఁడై, తం=అపరమాత్మ యను మణిని, అవయత్=గ్రహించెను, అగ్రీవః=కంఠములేనివాఁడై ప్రత్యముంచత్=కంఠమునందుం చుకొనెను, అజిహ్వః=నాలుక లేనివాఁడై, తం=అపర మాత్మ యను మణిని, అసశ్చత=శ్లాఘించెను॥

తా॥ లోకములో నొకానొక పురుషుఁడు ముందు నేత్రములచే నొకమణిని చూచి పిమ్మట దానిని హస్తముచే తీసికొని కంఠమునందుంచుకొని యానందించి యట్లు ఆమణిని నాలుకచేఁ బొగడునో, అప్రకారముగానే బ్రహ్మజ్ఞాని బాహ్య పదార్థముల విషయమైన యింద్రియ వ్యాపారమును మళ్ళించుటచే బాహ్యప్రపంచ విషయమై గుడ్డివాఁడై పరమాత్మ యను మణిని జ్ఞాననేత్రముచే జూచి యా పరమాత్మను స్వస్వరూపముగా నిశ్చయించుటచే స్వీకారము కలిగి యాపరమాత్మయందు స్థిరత్వముంచుటచే ధారణయుఁ గలిగి పిమ్మట నానందముచేఁ గృతకృత్యుఁడనైతినని మనస్సున భావించుచున్నాఁడు. కాఁబట్టి చక్షురింద్రియము విడిచి దృగావ్యాపారము హస్తేంద్రియమునువిడిచి గ్రహణవ్యాపారమును కంఠస్థానమును విడిచి ధారణవ్యాపారమును జిహ్వేంద్రియమును విడిచి ప్రశంసా వ్యాపారమును జేయుచున్నాఁడు. బ్రహ్మజ్ఞానికి బ్రహ్మజ్ఞానముతోఁగూఁడిన మనో వ్యాపారము కలిగి యుండునని యిందుఁ జెప్పఁబడెను.

మూ॥ ఊర్ధ్వమూల మవాక్ఛాఖం। వృక్షంయోవేద సంప్రతి। నస
జాతుజనశ్శ్రద్ధ్యాత్। మృత్యుర్మామారయాదితి॥

ప॥ ఊర్ధ్వమూలం। అవాక్ఛాఖం॥వృక్షం। యః। వేద। సంప్రతి। న। సః। జాతు। జనః। శ్రద్ధ్యాత్। మృత్యుః। మా మారయాత్। ఇతి॥

అ॥ ఊర్ధ్వమూలం=పైభాగమున మొదలు కలదియు, అవాక్ఛాఖం=క్రిందుగానుండు కొమ్మలు కలదియునగు, వృక్షం=సంసారమను వృక్షమును, యః=ఏ పురుషుఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=అటువంటి, జనః=మనుష్యుఁడు, సంప్రతి=ఇప్పుడు, మృత్యుః=మృత్యువు, మా=నన్ను, మారయాత్ = చంపును, ఇతి=ఈలాగని, జాతు = ఒకానొకప్పుడును, నశ్రద్ధ్యాత్ = అపేక్ష నుంచుకొనఁడు ॥ అనఁగా భయమును బొందఁడు॥

తా॥ ఇక్కడ సంసారమును వృక్షముగాఁ బోల్చుచున్నాఁడు. సర్వ ప్రపంచమునకుఁ గారణమగు పరబ్రహ్మ సర్వోత్కృష్టమగుటచే సంసార వృక్షమునకు మొదలు నూర్ధ్వభాగ మందున్నదనియు ఆ పరబ్రహ్మము వలనఁ గలిగిన బ్రహ్మాది స్తంబపర్యంతము ప్రాణులు ఆ పరబ్రహ్మముకంటె హీనములగుటచే సంసార వృక్షమునకుఁ గొమ్మలు క్రిందుగా నున్నవనియుఁ జెప్పఁబడినవి. కాఁబట్టి శాస్త్ర

స్వభావము గల సంసార వృత్తమును నిజస్థితి నెవఁడు తెలిసికొను చున్నాఁడో, అట్టి పురుషుఁడు నేను మృతినొందెదనను భయమును బొందఁడు. ఎందువలన ననఁగా, నేను నాశనరహితమైన అఖండ పరబ్రహ్మ స్వరూపము. శరీరము జనన మరణములను బొందును గాని నేను బొందనను వివేకజ్ఞానము కలవాఁడై యుండును.

మూ॥ హసితగ్ం రుదితంగీతం ॥ ౧౨ ॥ వీణాపణవలాసితం । మృతం
జీవంచయత్కించిత్ । అంగాని స్నేవవిద్ధితత్ ॥

ప॥ హసితం । రుదితం । గీతం । వీణాపణవలాసితం । మృతం । జీవం । చ । యత్ । కిం । చిత్ । అంగాని । స్నా । ఇవ । విద్ధి । తత్ ॥

అ॥ యత్కించిత్=యేదైనను, హసితం=నవ్వు, రుదితం=రోదనము, గీతం=గానము, వీణాపణవలాసితం=వీణె మద్దెల మొదలగు వానివలనఁ గలిగిన వినోదము, మృతం=మృతినొందుట, జీవంచ=జీవించియుండుట, మొదలగునవి యేవి కలవో, తత్=వాని నన్నిటిని, శరీరగతాని = శరీరమును బొందిన అంగానీవ = అవయవము లనువలెనే, శరీరగతాః=శరీరమును బొందిన, స్నాయవ ఇవ=సన్నని నరములను వలెనే, విద్ధి=తెలిసికొనుము.

తా॥ శరీరమందాత్మభ్రాంతిని బోఁగొట్టుటకు శరీరసంబంధమగు వికారములను జెప్పుచున్నాఁడు, నవ్వు, రోదనము, సంగీతము, పాడుట, వీణె, మృదంగము, మొదలగునవి మోయించి యానందించుట, మృతి నొందుట, జీవించుట, మొదలగునవి యేవ్యాపారములుకలవో వానినన్నిటిని అవయవములు, నాడులు ఎముకలు మొదలగున వెట్లు శరీరసంబంధమైనవో ఆరీతిగానే శరీరవికారములను గానే తెలిసికొన వలయును.

మూ॥ అతృప్యగ్ంస్తృప్యధ్యాయత్ । అస్మాజ్జాతా మేమిథూచరన్ ।
పుత్రోనిర్ ఋత్యావై దేవః । అచేతాయశ్చ చేతనః॥

ప॥ అతృప్యన్ । తృప్తి । అధ్యాయత్ ॥ అస్మాత్ । జాతాః । మే । మిథూచరన్ । పుత్రః । నిర్ ఋత్యాః । వైదేవః । అచేతాః । యః । చ । చేతనః ॥

అ॥ అతృప్యన్=తనయందు సంతోషవృత్తిలేనివాఁడైనను, తృప్తి=సంతోషము కలవాఁడుగా నున్నాఁడు, అధ్యాయత్=తనయధ్యానవృత్తిలేకున్నను, ధ్యానము కలవాఁడుగా నుండెను, అస్మాత్=జడమగు ఈశరీరమువలన జాతాః=పుట్టినసంతో

వరోదనాదులు, మే=నాసంబంధమైనవని తలఁచుచున్నాఁడు, మిథూచరణ=బిజ్జ దముల పరస్పర తాదాత్మ్యమువలన సంచరించునట్లు తలఁచుచున్నాఁడు, యః=ఏయ హంకారము, అచేతాః=జడమై, చేతనః=చైతన్యసంబంధముచేఁ జేతనముగానున్నదో, నిర్బుత్యాః=ప్రతికూలమయిన మాయయుఁ బుత్రినితో సమానమైనదియు, వైదే హః=దేహరహితమైన చైతన్యముయొక్క, చాయతోఁగూడిన, సః=ఆయహంకా రము తలఁచుచున్నది.

తా॥ పరబ్రహ్మమునకు వ్యతిరేకమైన మాయవలనఁ గలిగినదియు దేహసంబం ధరహితమైన చైతన్యముయొక్క ప్రతిబింబముతోఁ గూడి యహంకారము తాను జడ మయినను చేతనము కలదివలె నే వ్యాపారముఁ జేయుచు నేను సంతోషించుచున్నాను దుఃఖించుచున్నాను, ధ్యానముఁజేయుచున్నాను, మోదప్రమోదాదులు నావలన నేపుట్టినవి నేను శరీరముతోఁ గలిసియున్నాను, అను వ్యవహారమును గలిగించితా దాత్మ్య భ్రమచే శరీరధర్మములను ఆత్మయందున్నట్లు తోఁచింపఁజేయుచున్నది.

మూ॥ సతంమణిమ విందత్ । సోనంగులిరావయత్ । సోగ్రివః పత్యముంచత్ ॥ ౫౩॥ సోజిహ్వోఅసశ్చత॥

ప॥ సః । తం । మణిం । అవిందత్ । సః । అనంగులిః । అవయత్ । సః । అగ్రివః । ప్రతి । అముంచత్ । సః । అజిహ్వః । అసశ్చత॥

అ॥ సః=తాదాత్మ్య భ్రమకలిగిన యాపురుషుఁడు, తం=ఆప్రసిద్ధమైన, మణిం=రత్నమును, అవిందత్=పొందును, సః=వాఁడు, అనంగులిః=వ్రేళ్లులేనివాఁడై, అవయత్=స్వీకరించును, సః=వాఁడు, అగ్రివః=కంఠములేనివాఁడైనను, ప్రత్యముం చత్=కంఠమునందుంచుకొనును, సః=వాఁడు, అజిహ్వః=నాలుకలేనివాఁడైనను, అసశ్చత=ప్రశంసఁజేయును

తా॥ ఆత్మజ్ఞానములేక దేహతాదాత్మ్య భ్రమకలిగిన పురుషుఁడు నిరవయవ నిర్వికారమైన తన స్వరూపమును దెలిసికొనలేక ఈ మణినిజూచుచున్నాననియు హస్తముతో గ్రహించుచున్నాననియుఁ గంఠమునందు ధరించుచున్నాననియు జిహ్వ చేఁబ్రశంసఁజేయుచున్నాననియు భావించి చక్షురాదీంద్రియరహితమైన తనయందు చక్షురాదీంద్రియ సహితమైన శరీరధర్మముల నారోపించుకొనుచున్నాఁడు॥

మూ॥ నైతమృషింవిదిత్వానగరంప్రవిశేత్ । యదిప్రవిశేత్ । మిథౌ
చరిత్వాప్రవిశేత్ । తత్సంభవస్య వ్రతం॥

ప॥ న । ఏతం । ఋషిం । విదిత్వా । నగరం । ప్ర । విశేత్ । యది । ప్ర।
విశేత్ । మిథౌ । చరిత్వా । ప్ర । విశేత్ । తత్ । సంభవస్య । వ్రతం॥

అ॥ ఏతం=ఈ, ఋషిం=ఋషివలెనే జ్ఞానమునుగలిగించు ఈ మంత్రములను,
విదిత్వా=తెలిసికొని, నగరం=పట్టణముతో సమానమగు దేహమును, నప్రవిశేత్=
ప్రవేశింపఁగూడదు, లేక జనసమూహముచే సమ్మర్ధము కలిగియుండు పట్టణమున
బ్రవేశింపఁగూడదు యదిప్రవిశేత్=దేహమునుదాదాత్మ్య బుద్ధిచేనచేతఁ పొందెనేని,
మిథౌచరిత్వా=ఈదేహముమిథ్యయనియే, ప్రవిశేత్=వ్యవహరింపవలయును, తత్=
అది, సంభవస్య=సంభవుఁడను మునీశ్వరునియొక్క, వ్రతం=ఆచారమైయున్నది.

తా॥ జ్ఞానమును కలిగించుటచే మునితో సమానమైన ఈ మంత్రముల
యాథార్థ్యమును దెలిసినవాఁడై ఈ శరీరమందచేతఁ వదలి నిర్వ్యాపారుఁడు కావల
యును. లేక శరీరమునందచేతఁ యుంచెనేని శరీరమందసత్యభ్రాంతిచే వ్యవహ
రింపవలయునని సంభవుండను మునీశ్వరునియొక్క మతమైయున్నది.

మూ॥ ఆతమగ్నేరథంతిష్ఠ । ఏకాశ్వమేకయోజనం । ఏకచక్రమే కధు
రం । వాతధ్రాజిగతింవిభో ॥

ప॥ ఆ । తం । అగ్నే । రథం । తిష్ఠ । ఏకాశ్వం । ఏకయోజనం । ఏకచక్రం ।
ఏకధురం । వాతధ్రాజిగతిం । విభో ॥

అ॥ విభో = సమర్థుడవగు, అగ్నే = ఓయగ్నిహోతృఁడా ! ఏకాశ్వం =
ఒక్క గుఱ్ఱము కలదియు, ఏకయోజనం = ఒక నిమిషములో ఆమడదూరము పోవు
నదియు, ఏకచక్రం = ఒక్కచక్రము కలదియు, ఏకధురం = ఒక్కటియగు అశ్వ
బంధనస్థానము కలదియు, వాతధ్రాజిగతిం = వాయువువలెనే వేగముగా వెళ్ళునట్టి,
తం = ఆ ప్రసిద్ధమైన, రథం = రథమును, ఆతిష్ఠ = అధిష్ఠించి నేఁజేయునట్టి కర్మ
నద్దిమరమున్క.

తా॥ సమర్థుండవగు నో యగ్నిహోతృఁడా ! బలముగల అశ్వమును గూర్పఁ
బడినదియు ఒకనిమిషములో నొకయోజనదూరము వెళ్ళుటకుఁదగినంత తేలికగా
నుండునదియు ఒక్కచక్రము కలదియు ఒక్కయశ్వము. కాఁబట్టి అశ్వబంధనస్థా

నము ఒక్కటే కలదియు వాయువుతో సమానముగాఁ బోవునదియునగు రథము నెక్కి నేఁ జేయునట్టి యజ్ఞాదికర్మలయందుఁ బ్రిసన్నుఁడవుగమ్ము.

మూ॥ నరిష్యతి నవ్యథతే ॥ ౫౮ ॥ నాస్యాక్షో యాతుసజ్జతి । యచ్ఛ్వేతా న్రోహితాగ్ శ్చాగ్నేః । రథేయుక్త్వా ధితిష్ఠతి ॥

ప॥ న । రిష్యతి । న । వ్యథతే । న । అస్య । అక్షః । యాతు । సజ్జతి । యత్ । శ్వేతాన్ । రోహితాన్ । అగ్నే । రథే । యుక్త్వా । అధితిష్ఠతి॥

అ॥ సః=ఆ పూర్వమందుఁ జెప్పఁబడినరథము । నరిష్యతి=నశింపదు । నవ్యథతే=ఇటుఅటు కదలిపోదు, అస్య=ఈ రథముయొక్క, అక్షః=ఇరుసు, యాతు=వెళ్ళునట్టి సమయములో । నసజ్జతి=దేనియందు గలిసికొనదు, యత్=ఏ కారణము వలన, శ్వేతాన్=తెల్లనివియు, రోహితాన్=ఎఱ్ఱనివియునగు అశ్వములను, రథే=రథమునందు, యుక్త్వా=కూర్చి, అధితిష్ఠతి=అధిష్ఠించుచున్నాఁడో ॥

తా॥. ఆరుణకేతుశాగ్ని తెల్లనివియు ఎఱ్ఱనివియు బలముగలవియు నేర్పుగల వియునగు గుఱ్ఱములను రథమునందుఁగూర్చి తా నెక్కివచ్చుచుండఁగా నా యశ్వముల గమనముయొక్క నేర్పువలన రథమున కొంతమాత్రిము భంగముకలుగదు. రథము ఇటుఅటు జాతిపోదు, రథముయొక్క యిరుసును దేనియందుఁ గలిసికొనదు.

మూ॥ ఏకయాచ దశభిశ్చ స్వభూతే । ద్వాభ్యా మిష్టయే విగ్ంశత్యాచ । తిసృభిశ్చవహసే త్రిగ్ంశతాచ । నియుద్భిర్వాయవిహాతా విముంచ ॥ ౫౯ ॥ ౧౧ ॥

ప॥ ఏకయా । చ । దశభిః । చ । స్వభూతే । ద్వాభ్యాం । ఇష్టయే । వింశత్యా । చ । తిసృభిః । చ । వహసే । త్రింశతా । చ । నియుద్భిః । వాయో । ఇహ । తాః । విముంచ ॥

అ॥ వాయోః=ఓ వాయువా !, ఏకయాచ=ఒక్కటిగాని, దశభిశ్చ=పది గాని, ద్వాభ్యాం=రెండుగాని, వింశత్యాచ=ఇరువదిగాని, తిసృభిశ్చ = మూఁడుగాని, త్రింశత్యాచ=ముప్పదిగాని, అగు, నియుద్భిః=ఆఁడగుఱ్ఱములచేత, తం=ఆ రథమును. ఇహ=ఇక్కడ, ఇష్టయే = నేఁజేయునట్టి యజ్ఞముకొఱకు, స్వభూతే = నీ సంబంధమైన రథము నెక్కి, వహసే = పొందించుచున్నావు, ఇహ = ఇక్కడికి, ఆగత్య=వచ్చి, తాః=ఆ గుఱ్ఱములను విముంచ = విడిచిపెట్టుము ॥

తా॥ ఓ వాయువా! ఒక్కటిగాని పదిగాని రెండుగాని యిరువదిగాని మూఁడుగాని ముప్పదిగాని ఆఁడగుఱ్ఱములను నీ రథమునకుఁగూర్చి యీ రథము నెక్కి నేఁజేయునట్టి ఈ యజ్ఞప్రదేశమునకు వచ్చి యీ గుఱ్ఱములను రథబంధనమువలన విడిచిపెట్టుము.

ఇతి ఏకాదశానువాకస్సమాప్తః.

—♦ అథద్వాదశానువాక ప్రారంభః ♦—

మూ॥ ఆతనుష్వప్రతనుష్వ । ఉద్ధమాధమ సంధమ । ఆదిత్యేచంద్రవర్ణానాం । గర్భమాధేహియఃపుమాన్ ॥

ప॥ ఆ। తనుష్వ । ప్ర । తనుష్వ । ఉత్ । ధమ । ఆ । ధమ । సం । ధమ। ఆదిత్యే । చంద్రవర్ణానాం । గర్భం । ఆ । ధేహి । యః । పుమాన్ ॥

అ॥ హే ఇంద్ర=ఓ యింద్రుఁడా! త్వం=నీవు । ఆతనుష్వ= నీ స్వరూపమును విస్తరింపఁజేయుము, ప్రతనుష్వ=యజ్ఞముల నీ స్వరూపమును విస్తరింపఁజేయుము, ఉద్ధమ=ఉన్నతముగా ధ్వనిఁజేయుము, అధమ = అభిముగా ధ్వనిఁజేయుము, సంధమ=అనుకూలముగా ధ్వనిఁజేయుము, యః=ఏ నీవు, పుమాన్= పురుషలక్షణములుకలవాఁడో, సః=అట్టువంటి నీవు, ఆదిత్యే = సూర్యునియందు, చంద్రవర్ణానాం=చంద్రునివర్ణమువంటి వర్ణముగల జలములసంబంధమగు, గర్భం=గర్భమును, ఆధేహి=ఉంపుము.

తా॥ ఓ యింద్రుఁడా! నీ స్వరూపమును సర్వజనులకు నగపఱచి యజ్ఞ గ్రహింపుము. యజ్ఞములు సేయునట్టి ప్రదేశమునకువచ్చి ప్రత్యక్షమగుము. నీవు వచ్చునప్పుడు "ఇదిగో నేను వచ్చితిని" అని బిగ్గరగాను అభిముఖముగాను వినుటకు సమకూలముగాను బలుకుము. ఈ ప్రకారముగా నీవు యజ్ఞమునకువచ్చి నావి ర్భాగములనొంది పురుషుఁడు తన బీజమును స్త్రీయందుంచి యేప్రకారము సంతానము కలిగింపఁజేయునో ఆ ప్రకారము చంద్రునివలెనే తెల్లగాప్రకాశించు జలములను బీజముగ సూర్యకిరణములయందుంచి వర్షింపఁజేయుము.

మూ॥ ఇతస్సిక్తగ్ంసూర్యగతం । చంద్రమసే రసంకృధి । వారాదం జనయాగ్నిం । య ఏకోరుద్ర ఉచ్యతే ॥

ప॥ ఇతః । సిక్తం । సూర్యగతం । చంద్రమసే । రసం । కృధి । వారాదం । జనయ । అగ్రే । అగ్నిం । యః । ఏకః । రుద్రః । ఉచ్యతే॥

అ॥ ఇతః=ఈకర్మయందు, సిక్తం=ఇయ్యఁబడినఆజ్యాదిహవిస్సును । సూర్యగతం=సూర్యునిబొందినదిగాఁజేసి, చంద్రమసే=చంద్రునివృద్ధికొఱకు, రసం=సారవంతమైనదానిగా, కృధి=చేయుము, యః=ఏ, రుద్రః=అగ్నిహోత్రుఁడు, ఏకః=ఒక్కఁడై, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడో, వారాదం=వరములనిచ్చునట్టువంటి, అగ్నిం=అగ్నిహోత్రుని, అగ్రే=మాముందు, జనయ=ప్రత్యక్షమగునట్లు సేయుము.

తా॥ ఓయింద్రుఁడా! వరములనిచ్చునట్టియు ఒక్కఁడగు అరుణకేతుకాగ్నిని మాసన్నిధి యందుండునట్లు సేయుము. ఆయగ్నియందు ఆజ్యాదిహవిస్సు నుంచుచున్నాము. ఆహవిస్సును సూర్యుని బొందించి పిమ్మట చంద్రునకు వృద్ధికలుగునట్లుచేయుము అదియెట్లనఁగా అగ్నియందు పడినహవిస్సు సూర్యుని బొంది జలరూపమగును. ఆజలము అంతరిక్షమునందుండు చంద్రునకు భూమియందుండు ఓషధులకుఁ బుష్టినిగలిగించును. కాఁబట్టి యివియన్నియు నీవేచేయుమని యింద్రుని ప్రశంసయైయున్నది.

మూ॥ అసంఖ్యాతాస్సహస్రాణి । స్మర్యతే నచదృశ్యతే॥ ౫౬॥
ఏవమేతన్నిబోధత॥

ప॥ అసంఖ్యాతాః । సహస్రాణి । స్మర్యతే । న । చ । దృశ్యతే । ఏవం । ఏతం । నిబోధత॥

అ॥ సహస్రాణి=అరుణకేతుకాగ్నియొక్క అనేకస్వరూపములు, అసంఖ్యాతాః=లెక్కబెట్టుటకు సమర్థముగాకున్నవి. సః=ఆయారుణకేతుకాగ్ని, స్మర్యతే=శాస్త్రమువలన స్మరింపబడుచున్నాఁడు, నదృశ్యతే=చూడఁబడుటలేదు, ఏవం=ఈ ప్రకారముగా, ఏతం=ఈ యారుణకేతుకాగ్నిని, నిబోధత=తెలిసికొనుఁడు॥.

తా॥ అరుణకేతుకాగ్నియొక్క రూపములు అనేకములై లెక్కపెట్టుటకు శక్యముగాకయున్నవి. ఈ యారుణకేతుకాగ్ని శాస్త్రమువలన వినఁబడుచున్నాఁడుగాని చూడఁబడుటలేదు. ఈ ప్రకారముగా అరుణకేతుకాగ్నియొక్క స్వరూపము దెలిసికొనవలయును.

మూ॥ ఆమంద్రైరింద్రహారిభిః । యాహిమయూరరోమభిః । మాత్వా
కే చిన్నియేమురిన్నపాశినః । దధన్వేవతాఁ ఇహి ॥

ప॥ ఆ । మంద్రైః । ఇంద్ర । హారిభిః । యాహి । మయూరరోమభిః । మా । త్వా । కే । చిత్ । నియేముః । ఇత్ । న । పాశినః । దధన్వా । ఇవ । తాః । ఇహి ॥

అ॥ ఇంద్ర = ఓయింద్రుఁడా ! మంద్రైః = సంతోషహేతువులుగలవియు, మయూరరోమభిః = నెమళ్ళయొక్క వర్ణమువంటి వర్ణముగల వెండ్రుకలు కలవియు హారిభిః = గుఱ్ఱములచేత, ఆయాహి = నేఁజేయు యజ్ఞప్రదేశమునకు రమ్ము, త్వా = నిన్ను, కేచిత్ = ఏజనులును, మానియేముః = అడ్డుపెట్టరు, పాశినఃఇత్ = గుఱ్ఱముల పగ్గములను బట్టుకొనినవారును, ననియేముః = అడ్డుపెట్టకుందురుగాక, అనఁగా ఆలస్యముచేయుట రూపమైన అభ్యంతరమును గలిగింపకుందురుగాక, దధన్వేవ = సమస్తమైన కోరికలను ఇచ్చువాఁడవై, తాః = అపూర్వోక్తమైన మేముండు ప్రదేశములకు, ఇహి = రమ్ము ॥

తా॥ ఓయింద్రుఁడా సంతోషముకలవియు నెమలిరంగుతో సమానమైన వెండ్రుకలు కలవియునగు గుఱ్ఱములనెక్కి మేము యజ్ఞములఁ జేయునట్టి ప్రదేశములకురమ్ము. ఈ ప్రకారము నీవు వచ్చునప్పుడు ఏమనుష్యులు నిన్ను అడ్డుపెట్టకుందురుగాక, నీ గుర్రముల కళ్ళెములను బట్టువారు నీ రాగమనమునకు ఆలస్యము కలిగింపకుందురు. నీవు సమస్తమైన కోరికల నిచ్చువాఁడవై మేముచేయు యజ్ఞప్రదేశమునకే తెంచి మాకు వరములనిమ్ము—

మూ॥ మామంద్రైరింద్రహారిభిః । యామిమయూరరోమభిః । మా
మా కే చిన్నియేమురిన్నపాశినః । నిధన్వేవతాఁ ఇమి ॥

ప॥ ఆ । మంద్రైః । ఇంద్ర । హారిభిః । యామి । మయూరరోమభిః । మా । మా । కే । చిత్ । నియేముః । ఇత్ । న । పాశినః । నిధన్వా । ఇవ । తాన్ । ఇమి ॥

అ॥ మంద్రైః = సంతోషముఁజూపునవియు, మయూరరోమభిః = నెమలివర్ణముతో సమానమైన, హారిభిః = సంబంధమగు గుఱ్ఱములచే, ఇంద్ర = ఓయింద్రుడా! ఆయామి = నీతోఁగూడ నీలోకమునకు వచ్చుచున్నాను, కేచిత్ = ఎవరైనను, మా = నన్ను, మానియేముః = అడ్డంకు పెట్టకుందురుగాక, పాశినఇత్ = అశ్వముల కళ్లెములపట్టు

కొనినవారును, వనిరేముః=ఆటంక పెట్టకుందురుగాక, లేక అలస్యము చేయకుందురు గాక, నిధస్త్వేవ=దొరకఁబడిన నిధికలవాఁడువలెనే సంతోషించినవాఁడనై, తాన్=ఆలోకములను, ఇమి=పొందెదను.

తా॥ ఓయింద్రుఁడా! సంతోషముతోఁగూడినవియు నెమిలివర్ణమువంటి వర్ణముగల వెండ్రుకలు కలిగిన గుఱ్ఱములనెక్కి నీవు రాఁగానే నేను ఆగుఱ్ఱములమీఁద నీతోఁగూడ నీలోకమునకు వచ్చెదను. ఈలోపల నన్ను నెవరైనను అడ్డగింపకుందురు గాక. గుఱ్ఱములను బట్టుకొనువారు ఆలస్యము చేయకుందురుగాక. అనంతరము ఆస్వర్గలోకముపొంది ధననిక్షేపము పొందినవాఁడు వలెనే సంతోషించెదను.

మూ॥ అణుభిశ్చమహద్భిశ్చ ॥ ౫౭ ॥ నిఘృష్వైరసమాయుతైః ।
కాలైర్హరిత్వమాపన్నైః । ఇంద్రాయాహిసహస్రయుక్ ॥

ప॥ అణుభిః । చ । మహద్భిః । చ । నిఘృష్వైః । అసమాయుతైః । కాలైః । హరిత్వం । ఆపన్నైః । ఇంద్ర । ఆయాహి । సహస్రయుక్ ॥

అ॥ అణుభిః = క్షణము మొదలగునవి యగుటచే సూక్ష్మములయినవియు, మహద్భిః = సంవత్సరాదులచే స్థూలమయినవియు, నిఘృష్వైః = ప్రకాశించునవియు, అసమాయుతైః = పరస్పరము సంబంధములేనివియు, హరిత్వం = అశ్వస్వరూపము పొందినవియునగు, కాలైః = కాలములచేత, ఇంద్ర = ఓయింద్రుఁడా! సహస్రయుక్ = సహస్రనేత్రములుకల, త్వం = నీవు, ఆయాహి = ఇటురమ్ము ॥

తా॥ ఓ యింద్రుఁడా! సహస్ర నేత్రములు కల నీవు క్షణము ముహూర్తము మొదలగునవి యగుటచే సూక్ష్మములైనవియు సంవత్సరము యుగము మొదలగునవి యగుటచే స్థూలమైనవియు బ్రకాశించునవియుఁ బరస్పరము సంబంధము లేనివియు నీ గుఱ్ఱముగా నేర్పడినవియు నగు కాలముచే నిక్కడకురమ్ము. ఇక్కడ కాలములకు స్వరూపము లేకపోవుటచే గమనము సంభవింపదుగాన కాలాభిమానదేవతలను గ్రహింపవలయును. కాలాభిమాన దేవతలే ఇంద్రునకు నశ్వములైరి. ప్రకాశితయును గాలాభిమానదేవతలకుఁ జెప్పవలయును.

మూ॥ అగ్నిర్వైభ్రాష్టివసనః । వాయుశ్శ్వేతసికద్రుకః । సంవత్సరోవిషూవర్ణైః । నిత్యాస్తేనుచరాస్తవ ॥

ప॥ అగ్నిః । విభ్రాష్టివసనః । వాయుః । శ్వేతసికద్రుకః । సంవత్సరః । విషూవర్ణైః । నిత్యాః । తే । అనుచరాః । తవ ॥

అ॥ విభ్రాష్టివసనః=ప్రకాశించునట్టి వస్త్రముగల అగ్నిః=అగ్నిహోత్రుఁడు, శ్వేతసికద్రుకః=తెల్లని యిసుకను బితుకునట్టి, అనగా అనేకవిధమైన పరాగమును గలిగించు, వాయుః=వాయువు, విషూవర్ణైః=వసంతము, గ్రీష్మము, మొదలగు వానిచే ననేక వర్ణములు కాలముతోఁ గూడిన, సంవత్సరః=సంవత్సరము, అను, యే=ఏ ముగ్గురుకలరో, తే=ఆ ముగ్గురు, తనవ=నీకు, నిత్యాః=ఎల్లప్పుడుండునట్టి, అనుచరాః=భృత్యులు.

తా॥ ఓ యిన్ద్రుడా! ప్రకాశించునట్టి వస్త్రముగల యగ్నిహోత్రుడనేక విధములుగా ధూళిని బుట్టించునట్టి వాయువు వసంతము గ్రీష్మము మొదలగువానిచే ననేక వర్ణములుగానున్న సంవత్సరము ఈ ముగ్గురినిన్ను ఎల్లప్పుడు సేవించుచుండెడి భృత్యులుగా నున్నారు.

మూ॥ సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోం । ఇంద్రాగచ్ఛహారివ ఆగచ్ఛమేధాతిథేః । మేషవృషణశ్వస్యమేనే ॥౫౮॥ గౌరావస్కందిన్నహల్యాయై జార । కౌశికబ్రాహ్మణ గౌతమబ్రువాణ॥

ప॥ సుబ్రహ్మణ్య । ఓం । సుబ్రహ్మణ్య । ఓం । సుబ్రహ్మణ్య । ఓం । ఇంద్ర । ఆగచ్ఛ । హారివ । ఆగచ్ఛ । మేధాతిథేః । మేష । వృషణశ్వస్య । మేనే। గౌరావస్కందిన్ । అహల్యాయై । జార । కౌశికబ్రాహ్మణ । గౌతమబ్రువాణ ॥

అ॥ ఓం సుబ్రహ్మణ్య=ఓ వేదములయందు ఇష్టమైనవాఁడా!, ఓఁసుబ్రహ్మణ్య=ఓ వేదములయందు యిష్టమైనవాఁడా!, ఇంద్ర=పరమైశ్వర్యము కల వాఁడా!, ఆగచ్ఛ=నేజేయునట్టి కర్మప్రదేశమునకు రమ్ము, హారివ=హారియను పేరు గల గుఱ్ఱములు కలవాఁడా! మేధాతిథేః = మేధాతిథియనుముని సంబంధమైన, మేష = మేషస్వరూపుఁడా, వృషణశ్వస్య = వృషణశ్వుఁడను మునియొక్క, మేనే = కుమారికయగు మేనకయందాసక్తికలవాఁడా!, గౌరావస్కందిన్ = యజ్ఞములయందు గౌరమృగస్వరూపమును బొందువాఁడా! అహల్యాయై = అహల్యకొఱకు, జార = వ్యభిచరించినవాఁడా! కౌశికబ్రాహ్మణ = కౌశికమునీశ్వరుకొద్ద

బ్రాహ్మణస్వరూపమును ధరించియున్నవాఁడా! గౌతమబ్రువాణ = గౌతమ మునిని స్తోత్రముజేసినవాఁడా! ఆగచ్ఛ = నేఁజేయు కర్మప్రదేశమునకురమ్ము॥

తా॥ వేదములయందుఁ బ్రియమైనవాఁడా! (ఆదరంబున మూఁడుఁపర్యాయములుజెప్పఁబడియెను) అధికైశ్వర్యముకలవాఁడా! హరియనుపేరుగలవియు శుక్లకృష్ణపక్షాధిదేవతలే అశ్వములుగాఁగలవాఁడా! మేధాతిథియను మునీశ్వరుని మేషస్వరూపముచే హరించినవాఁడా! వృషణశ్వుఁడను మునికుమారికయగు మేనకయందాసక్తికలవాఁడా! యజ్ఞములయందు గౌరమృగస్వరూపమును ధరించి హవిస్సులను భుజించువాఁడా! గౌతమమునియొక్క భార్యయగు నహల్యతో సంభోగించినవాఁడా! కౌశికుఁడను మునియొద్ద బ్రాహ్మణస్వరూపమును ధరించియున్నవాఁడా! గౌతమమునీశ్వరుని స్తోత్రముఁజేసినవాడా! నేజేయు యజ్ఞప్రదేశమునకురమ్ము. అని దేవేంద్రుని ప్రియకరమైన నామములతోఁ బిలుచుచున్నాఁడు.

మూ॥ అరుణాశ్వాఇహాగతాః। వసవః పృథివిక్షితః। అష్టౌదిగ్వాస
సోగ్నయః। అగ్నిశ్చజాతవేదాశ్చేత్యేతే॥

ప॥ అరుణాశ్వాః। ఇహ। ఆగతాః। వసవః। పృథివిక్షితః। అష్టౌ। దిగ్వాససః। అగ్నయః। అగ్నిశ్చజాతవేదాశ్చ। ఇతి। ఏతే॥

అ॥ అరుణాశ్వాః = ఎఱ్ఱని గుఱ్ఱములుకలవారును, వసవః = ప్రపంచస్థితికిఁగారణమైనవారును, పృథివిక్షితః = భూమియందుండు నట్టివారును, దిగ్వాససః = దిక్కులే వస్త్రములుగాఁ గలవారును, అగ్నిశ్చజాతవేదాశ్చేతి = అగ్నిశ్చజాతవేదాశ్చ అను మంత్రంబునఁ జెప్పఁబడిన పేర్లుగల, ఏతే = ఈ అష్టౌ = ఎనమండ్రయిన అగ్నయః = అగ్నిహోత్రులు, ఇహ = ఈ కర్మయందు, ఆగతాః = రాఁబడిరి॥

తా॥ ఎఱ్ఱని గుఱ్ఱములు కలవారును బ్రపంచమునకు గారణమైనవారును భూమియందుండువారును దిక్కులే వస్త్రములుగాఁ గలవారును అగ్నిశ్చజాతవేదాశ్చ అను మంత్రంబునఁ జెప్పఁబడిన పేర్లు గలవారునగు ఈ యెనమండ్రు అగ్నిహోత్రులు నేఁజేయునట్టి కర్మ ప్రదేశమునకు వచ్చియుందురుగాక.

మూ॥ తామ్రాశ్వాస్తామ్రరథాః। తామ్రవర్ణాస్తథాసితాః। దండ
హస్తాఃఖాదద్గతః। ఇతోరుద్రాః పరాంగతాః॥ గీ॥ ఉక్త
గ్ స్థానం ప్రమాణంచ పురఇత॥

ప॥ తామ్రాశ్వాః । తామ్రరథాః । తామ్రవర్ణాః । తథా । అసితాః । దండ హస్తాః । ఖాదగ్దతః । ఇతః । రుద్రాః । పరాం । గతాః । ఉక్తం । స్థానం । ప్రమాణం । చ । పురః । ఇత ॥

అ॥ తామ్రాశ్వాః = ఎఱ్ఱని గుఱ్ఱములు కలవారును, తామ్రరథాః = ఎఱ్ఱని రథములు కలవారును, తామ్రవర్ణాః=ఎఱ్ఱని కాంతి కలవారును, తథా=ఆ ప్రకార ముగానే, అసితాః=తెలుపులేనివారును, దండహస్తాః=దండములు చేతులయందు కలవారును, ఖాదగ్దతః=భక్షణం జేయుచున్న దంతములు కలవారును, అగు, రుద్రాః=ఓ యేకాదశ రుద్రులారా ! ఇతః=ఈ స్థానమునుండి, పరాం=ఉత్కృష్టలోకమగు స్వర్గమును, గతాః=పొందితిరి, యుష్మాకం=మీయొక్క, స్థానం= స్థానము, ప్రమాణం= ప్రమాణము, ఉక్తం = శాస్త్రములయందుఁ జెప్పఁబడినది, పురః=మీ పట్టణములను, ఇత=పొందుఁడు ॥

తా॥ ఎఱ్ఱనిగుఱ్ఱములు కలవారును ఎఱ్ఱనిరథములు కలవారును ఎఱ్ఱని కాంతి కలవారును కొంచెమైనను దెలుపులేనివారును దండములు చేతులయందు కలవారును హవిస్సును భక్షించుచున్న దంతములు కలవారునునగు నో రుద్రులారా ! యీ లోక మునుండి యున్నతస్థానమగు స్వర్గలోకమునందుంటిరి. మీ స్థానము దాని సంబంధ మైన ప్రమాణము శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టి మీరు మీ పుణ్యలోకంబున నివసించియుండుఁడు.

మూ॥ బృహస్పతిశ్చ సవితాచ । విశ్వరూపై రిహాగతాం । రథే నోదకవర్త్మనా । అప్సుషా ఇతి తద్ద్వయోః ॥

ప॥ బృహస్పతిః । చ । సవితా । చా । విశ్వరూపైః । ఇహ । ఆగతాం । రథేన । ఉదకవర్త్మనా । అప్సుషా । ఇతి । తత్ । ద్వయోః ॥

అ॥ అప్సుషా=ఉదకములను గలిగింపఁ జేయునట్టి, బృహస్పతిశ్చ=బృహస్పతి యు, సవితా చ=సూర్యుఁడు, ఉదకవర్త్మనా = జలముయొక్క మార్గముగల, రథేన=రథముచేత, విశ్వరూపైః = అనేక విధములైన గుఱ్ఱములతోఁగూడి, ఇహ= ఈ కర్మప్రదేశమునకు, ఆగతాం=వత్తురుగాక, ఇతి=ఈప్రకారముగా, ద్వయోః= వారిద్దఱియొక్క, తత్=స్వరూపము, ఉక్తం=చెప్పఁబడినది.

తా॥ ఉదకములను గలిగింపఁజేయునట్టి బృహస్పతియు సూర్యుఁడును అనేక విధములైన గుఱ్ఱములతోఁగూడిన రథము నెక్కి జలముగురియునట్టి యాకాశమార్గం బునఁజేయునట్టి యజ్ఞప్రదేశమునకు వత్తురుగాక. ఈప్రకారముగా బృహస్పతి సూర్యులస్వరూపముఁ జెప్పఁబడినది.

మూ॥ ఉక్తో వేషో వాసాగ్ంసిచ । కాలావయవానామితః ప్రతీచ్యా।
వాసాత్యాఇత్యశ్వినోః । కోన్తరిక్షే శబ్దాంకరోతీతి । వాసిష్ఠో రౌ
హిణో మీమాగ్ంసాంచక్రే । తస్యైషాభవతి ॥

ప॥ ఉక్తః । వేషః । వాసాంసి । చ । కాలావయవానాం । ఇతః । ప్రతీచ్యా వాసాత్యౌ । ఇతి । అశ్వినోః । కః । అన్తరిక్షే । శబ్దం । కరోతి । ఇతి వాసిష్ఠః । రౌహిణః । మీమాంసాం । చక్రే । తస్య । ఏషా । భవతి॥

అ॥ కాలావయవానాం = కాలమునకు నవయవములుగానుండు వసంతర్తువు మొదలగువానియొక్క, వేషః = వేషము, ప్రతీచ్యా = వెఱకటి యనువాకముల యందు, ఉక్తః = చెప్పఁబడినది, వాసాంసి = వస్త్రములు, ఉక్తాని = చెప్పఁబడి నవి, వాసాత్యౌఇతి=వాసాత్యౌఅనుమంత్రములో, అశ్వినోః=అశ్వినీదేవతలయొక్క వేషమువస్త్రములుచెప్పబడినవి. వాసిష్ఠః=వసిష్ఠునిగోత్రమునందుఁ బుట్టినవాఁడును, రౌహిణః=రౌహిణుఁడు అనుమునీశ్వరపుత్త్రుఁడు, అంతరిక్షే=ఆకాశమునందు, శబ్దం=శబ్దమును, కః=ఎవఁడు, కరోతి=చేయుచున్నాఁడు, ఇతి=ఈప్రకారముగా, మీమాంసాం=విచారణమను, చక్రే=చేసెను॥

తా॥ కాలమునకు నవయవములగు వసంతాదిర్తువులయొక్కయు నశ్వినీదేవతల యొక్కయు నాకార విశేషములు వస్త్రములు మొదలగు వానినిగుఱించి పూర్వ మందుఁజెప్పఁబడిన అనువాకములయందుఁ జెప్పఁబడినది. వసిష్ఠుని వంశంబునఁబుట్టిన రౌహిణుఁడను మునికుమారుఁడు ఆకాశంబున నొకవిధమైన ధ్వనినివిని యిక్కడనెవఁ డును మనుష్యుఁడులేఁడు శబ్దమెందువలన వినబడుచున్నదని విచారణఁజేయు చున్నాఁడు.

మూ॥ వాశ్రేవవిద్యుతి॥

ప॥ వాశ్రా । ఇవ । విద్యుత్ । ఇతి॥

అ॥ వాశ్రా=వాసనస్వభావముగల । గౌరివ=ఆవువలెనే, విద్యుత్=మెఱుపు మిమాతి=శబ్దమునుజేయుచున్నది. ఇతి=ఈలాగున నిశ్చయించుకొనెను.

తా॥ వాసనను బట్టి గ్రహించు నావు దూడను గూర్చి అఱచునట్లు వలెనే సూర్య కాంతి రూపమైన మెఱుపు మేఘము నందున్న దియై ధ్వని జేయుచున్న దని నిశ్చయించు కొనెను.

మూ॥ బ్రహ్మణ ఉదరణమసి । బ్రహ్మణఉదరణమసి । బ్రహాణ అస్త రణమసి । బ్రహ్మణ ఉపస్తరణమసి॥ ౬౦॥౧౨॥

ప॥ బ్రహ్మణః । ఉదరణ । అసి । బ్రహ్మణః । ఉదీరణం । అసి । బ్రా హ్మణః । ఆస్తరణం । అసి । బ్రహ్మణః । ఉపస్తరణం । అసి॥

అ॥ హేఇష్టకే=ఓయిష్టదేవతా ! త్వం=నీవు, బ్రహ్మణః=బ్రహ్మకు, ఉద రణం=లోభరాహిత్యమైనదానవై, అసి=అయితివి, బ్రహ్మణః=బ్రహ్మకు, ఉదీ రణం=గుణములచే నితరములకంటె నధికమైనదానవై, అసి=అయితివి, బ్రహ్మణః= బ్రహ్మకు । ఆస్తరణ=ఆసనమైనదానవు, అసి=అయితివి, బ్రహ్మణః=బ్రహ్మకు, ఉపస్తరణ=ఆచ్ఛాదనమైనదానవు, అసి=అయితివి॥

తా॥ ఓయిష్టదేవతా ! నీవు బ్రహ్మయొక్క లోభములేని గుణస్వరూపము గాను గుణములచేత నితరమైన వానికంటె నధికమైన దానవుగాను బ్రహ్మకు నాసన మైన దానవుగాను బ్రహ్మకు నాచ్ఛాదనమైన దానవుగా నైతివి.

ఇతి ద్వాదశానువాకస్సమాప్తః॥

## —♦ అథ త్రయోదశోఽనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ అష్టయోనీమష్టపుత్రాం । అష్టపత్నీమిమాంమహీం । అహం వేదనమే మృత్యుః । నచామృత్యురఘాహారత్॥

ప॥ అష్టయోనీం । అష్టపుత్రాం । అష్టపత్నీం । ఇమాం । మహీం। అహం । వేద । న । మే । మృత్యుః । చ । అమృత్యుః । అఘాః । అహారత్॥

అ॥ అష్టయోనీ=మూలప్రకృతి మొదలగు నెనిమిది కారణములుగాఁగలదియు, అష్టపుత్రాం = మిత్రావరుణుఁడు మొదలగు నెనమండ్రు పుత్త్రులుఁగలదియు, అష్ట పత్నీం=ఇంద్రుఁడు మొదలగు నెనమండ్రు దిక్పతుల నధిపతులుగాఁగలదియునగు, ఇమాం=ఈమహీం=భూమిని, అహం=నేను, వేద=గుర్తెఱుఁగుదును, మే=నాకు;

మృత్యుః=మరణము, నభవేత్=లేకపోవుఁగాక, అమృత్యుః=అపమృత్యువు, అఘాః=దుఃఖములను, నచాహరత్=సంభవింపఁ జేయకుండుఁగాక॥

తా॥ మూలప్రకృతి, మహత్తు, అహంకారము, శబ్దాదిపంచ తన్మాత్రలు, ఈ యెనిమిది కారణముగాఁ గలదియు ముందు చెప్పఁబోవు మిత్రావరుణుఁడు మొదలగు యెనమండ్రు తనయులుగాఁ గలదియు నింద్రుఁడు మొదలగు యెనమండ్రు దిక్పాలకులు నధిపతులుగాఁ గలదియు నగు ఈ భూమియొక్క యథార్థ స్థితిని మంత్ర ప్రవర్తకుండనగు నేను వివేకజ్ఞానముచేఁ దెలిసికొంటిని గాన నాకు మరణములేదు. అకాలమృత్యువుయును, నన్ను బాధింపదు. కాఁబట్టి నేను ముక్తిని జెందఁగలను.

మూ॥ అష్టయోన్యష్టపుత్రం । అష్టపది దమన్తరిక్షం । అహంవేద
నమే మృత్యుః । నచామృత్యు రఘాహరత్ ॥

ప॥ అష్టయోని । అష్టపుత్రం । అష్టపత్ । ఇదం । అంతరిక్షం । అహం । వేద । న । మే । మృత్యుః । న । చ । అమృత్యుః । అఘాః । అహరత్ ॥

అ॥ అష్టయోని=మూల ప్రకృతి మొదలగు యెనిమిది కారణము గాఁగలదియు, అష్టపుత్రం=మిత్రావరుణుఁడు మొదలగు యెనమండ్రుగురు తనయులు గలదియు, అష్టపత్=ఇంద్రుఁడు మొదలగు నష్ట దిక్పాలకుల నధిపతులుగాఁ గలదియు నగు, ఇదం=ఈ, అంతరిక్షం=ఆకాశమును, అహం=నేను, వేద=ఎఱుఁగుదును, మే=నాకు, మృత్యుః=మరణము, నాస్తి=లేదు, అమృత్యుః=అపమృత్యువు, అఘాః=దుఃఖములను, నచాహరత్=సంభవింపఁ జేయకుండుఁగాక ॥

తా॥ మూలప్రకృతి మొదలగు యెనిమిది కారణముగాఁ గలదియు మిత్రావరుణుఁడు మొదలగు యెనమండ్రు తనయులుగలదియు నింద్రుఁడు మొదలగు నష్టదిక్పాలకులు నధిపతులుగా గలదియునగు నీ యాకాశమును నేను వివేకదృష్టిచేఁ దెలిసికొంటిని గాన నాకుమృత్యువులేదు. అకాలమరణమును సంభవింపదు. కాఁబట్టి నేను ముక్తిని జెందఁగలను.

మూ॥ అష్టయోనీమష్టపుత్రాం । అష్టపత్నీమమూందివం॥ ౾౧॥
అహంవేదనమేమృత్యుః । నచామృత్యురఘాహరత్ ॥

ప॥ అష్టయోనీం । అష్టపుత్రాం । అష్టపత్నీం । అమూం । దివం । అహం । వేద । న । మే । మృత్యుః । న । చ । అమృత్యుః । అఘాః । అహారత్,

తా॥ పైనఁజెప్పబడిన మంత్రములవలెనే అర్థము తాత్పర్యముఁ జెప్పుకొనవలయును. యిక్కడ స్వర్గవిషయముగా తెలిసికొనవలయును.

మూ॥ సుత్రామాణం మహీమూషు॥

ప॥ సుత్రామాణం । మహీమూషు॥

అ॥ సుత్రామాణం = సుత్రామాణం అనుమంత్రము, మహీమూషు = మహీమూషు, మాతరం=అనుమంత్రము, ఏతౌ = ఈ మంత్రములురెండు, వైశ్వానరోన ఊత్యా=అనుఅను వాకమునందు వ్యాఖ్యానముఁ జేయఁబడినవి॥

తా॥ సుత్రామాణం అనుమంత్రము మహీమూషు మాతరం అనుమంత్రము వైశ్వానరోన ఊత్యా అనెడు అనువాకమునందు వ్యాఖ్యానముఁ జేయఁబడినవి.

మూ॥ అదితిర్ద్యౌరదితిరంతరిక్షం । అదితిర్మాతాసపితా సపుత్రః ।
విశ్వేదేవాఅదితిఃపంచజనాః । అదితిర్జాతమదితిర్జనిత్వం॥

ప॥ అదితిః । ద్యౌః । అదితిః । అంతరిక్షం । అదితిః । మాతా । సః । పితా । సః । పుత్రః । విశ్వే । దేవాః । అదితిః । పంచజనాః । అదితిః । జాతం । అదితిః । జనిత్వం॥

అ॥ అదితిః = అదితియనుదేవత, ద్యౌః = స్వర్గము, అదితిః = అదితి, అంతరిక్షం = ఆకాశము, అదితిః = అదితి, మాతా = తల్లి, సః = ఆయదితి, పితా = తండ్రి, సః = ఆయదితి, పుత్రః = తనయుఁడు, విశ్వే = సమస్తమైన, దేవాః= దేవతలు, అదితిః = అదితి, పంచజనాః = బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు కిరాతులు మొదలగువారు, అదితిః = అదితి, జాతం = సృజింపఁబడిన సమస్తప్రపంచము, అదితిః = అదితి, జనిత్వం = పుట్టుటయు, అదితిః = అదితియే॥

తా॥ స్వర్గము ఆకాశము భూమి తల్లి తండ్రి కుమారుడుఁ సమస్తమైన దేవతలు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు కిరాతులు మొదలగు సంకరజాతులు ఇదియని చెప్పనేల సృజింపఁబడిన సమస్త ప్రపంచము పుట్టుటయు గిట్టుటయు మొదలగునంతయు నదితియను దేవతగాఁజెప్పబడియెను.

మూ॥ అష్టౌ పుత్రాసో అదితేః । యేజాతాస్తన్వఃపరి
దేవాంఉపప్రైత్సప్తభిః ॥ ౬౨ ॥ పరామార్తాండమాస్యత్ ॥

ప॥ అష్టౌ । పుత్రాసః । అదితేః । యే । జాతాః । తన్వః । పరి । దేవాన్ ।ఉప ప్రై । ఐత్ । సప్తభిః । పరా । మార్తాండం । అస్యత్ ॥

అ॥ అదితేః = అదితియను దేవతకు, అష్టౌ = ఎనమండ్రు, పుత్రాసః = కుమారులు, సంతి = కలరు, యే = ఎవరు, తన్వఃపరి = శరీరమువలన, జాతాః = పుట్టిరో, సా = ఆయదితి, సప్తభిః = ఏడుగురైన తనయులతోఁగూడ, దేవాన్ = దేవతలను, ఉపప్రైత్ = పొందెను, మార్తాండం = సూర్యుని, పరాస్యత్ = విడిచిపెట్టెను.

తా॥ అదితియను దేవత యెనమండ్రు పుత్రులను గని వారిలో సూర్యుఁడను నొక తనయుని విడిచి మిగిలిన యేడుగురు పుత్రులతోను గూడి స్వర్గలోకమునకు వెళ్లి దేవతలయొద్ద నివసించుచుండెను.

మూ॥ సప్తభిః పుత్రైరదితిః । ఉపప్రైత్పూర్వ్యంయుగం ।. ప్రజాయై
మృత్యవేతత్ । పరామార్తాండమాభరదితి ॥

ప॥ సప్తభిః । పుత్రైః । అదితిః । ఉప । ప్ర । ఐత్ । పూర్వ్యం । యుగం । ప్రజాయై । మృత్యవే । తత్ । పరా । మార్తాండం । ఆభరత్ । ఇతి॥

అ॥ అదితిః=అదితియను దేవత, సప్తభిః = ఏడుగురైన, పుత్రైః=కుమారులచేత, ప్రజాయై=సంతానముకొఱకు, పూర్వ్యంయుగం = పూర్వకాలమందుఁ బతిసంయోగమును, ఉపప్రైత్=పొందెను, మార్తాండం = సూర్యుని, పరాభరదితియత్=విడిచిపెట్టెనదన్నమాటయేదికలదో, తత్=అది, మృత్యవే = మృత్యువుయొక్క ప్రీతినిమిత్తము చేయఁబడినది.

తా॥ మార్తాండుని విడిచిపెట్టుట గుఱించియు నేడుగురు పుత్రులను దీసికొని స్వర్గమునకు వెళ్లుట గుఱించియుఁ గారణమును జెప్పుచున్నాఁడు. అదితి పూర్వకాలంబున సంతానముకొఱకుఁ బెనిమిటితో సంభోగముఁ జేయఁగా రెండు అండము లుద్భవించెను. వానిలో నొకయండము మృతప్రాయమై యుండుటచే నిది మృత్యుప్రీతికరమైనదనియు, దీనివలనఁ బ్రజావృద్ధి కలుగ నేరదనియుఁ దలఁచి విడిచిపెట్టెను. మృతప్రాయమెట్లనిన. "మృతం అండయాదీయ జన్మనాస మార్తాండః" ఎవనిజననముచే నండము మృతమైనదో వాఁడు మార్తాండుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అతనినే మనము సూర్యుఁడని చెప్పుచున్నాము. మఱియు రెండవ యండమువలన నేడుగురు సుతులుదయించి యండమునకు భంగము కలిగింపకుం

డుటచే వీరు ప్రజావృద్ధికరులని తలఁచి ఆ యేడుగురు పుత్త్రులను దీసికొని స్వర్గమున కేగుచెంచెను. ఈ ప్రకారముగా వారిని గురించి కారణముఁ జెప్పఁబడినది.

మూ॥ తానను క్రమిష్యామః ॥

ప॥ తాన్ । అను । క్రమిష్యామః ॥

అ॥ తాన్=ఆ యెనమండ్రను, అనుక్రమిష్యామః=క్రమముగా నామములను జెప్పుచున్నాము.

తా॥ వరుసఁగా నా యెనమండ్రి యొక్క నామములను జెప్పుచున్నాము.

మూ॥ మిత్రశ్చ వరుణశ్చ । ధాతా చార్యమా చ । అగ్ంశుశ్చ భగశ్చ ।
ఇంద్రశ్చ వివస్వాగ్ంశ్చేత్యేతే ॥

ప॥ మిత్రః । చ । వరుణః । చ । ధాతా । చ । అర్యమా । చ । అంశుః । చ । భగః । చ । ఇంద్రః । వివస్వాన్ । చ । ఇతి । ఏతే ॥

అ॥ మిత్రశ్చ=మిత్రుఁడు, వరుణశ్చ=వరుణుఁడు, ధాతాచ=ధాత, అర్యమాచ=అర్యముఁడు, అంశుశ్చ=అంశువు, భగశ్చ=భగుఁడు, ఇంద్రశ్చ=ఇంద్రుఁడు, వివస్వాంశ్చ=మార్తాండుఁడు, ఇతి=ఈ ప్రకారముగా పేర్లచేఁ జెప్పఁబడుచున్న ఏతే=ఈ యెనమండ్రు పుత్త్రులు కలరు.

తా॥ మిత్రుఁడు వరుణుఁడు ధాత అర్యముఁడు అంశువు, భగుఁడు ఇంద్రుఁడు వివస్వంతుఁడు, అనఁగా మార్తాండుఁడు అను యెనిమిది నామములచేతను ఆ యదితి యొక్క యెనమండ్రు సుతులు చెప్పఁబడుచున్నారు.

మూ॥ హిరణ్యగర్భోహాగ్ం సశ్శుచిషత్ । బ్రహ్మజజ్ఞానం తదిత్ప
దమితి ॥

ప॥ హిరణ్యగర్భః । హాంసశ్శుచిషత్ । బ్రహ్మజజ్ఞానం । తదిత్పదం । ఇతి ।

అ॥ హిరణ్యగర్భః=హిరణ్యగర్భః అను మంత్రము, ఊర్ధ్వా అస్య అనునట్టి యనువాకమునందు వ్యాఖ్యానముఁ జేయఁబడినది, హాగ్ం సశ్శుచిషత్=హాగ్ంసశ్శుచిషత్ అనునట్టి మంత్రము, ఇంద్రస్యవజ్రోఽసి అనెడు అనువాకమునందు వ్యాఖ్యానముఁ జేయఁబడెను, బ్రహ్మజజ్ఞానం=బ్రహ్మజజ్ఞానం అనెడు మంత్రము, ధ్యేష్ఠా ద్విత్వా అనునట్టి యనువాకమునందు వ్యాఖ్యానముఁ జేయఁబడెను, తదిత్పదమితి=

తదిత్పదమ్మను నట్టి మంత్రము, ఉదస్తాంప్సీత్సవితా అనునట్టి యనువాకమునందుఁ జెప్పఁబడినది.

తా॥ హిరణ్యగర్భః అనుమంత్రము. ఊర్ధ్వా అస్య అనునట్టి యనువాకమునందును హాగ్ంసశ్శుచిషత్ అనుమంత్రము ఇంద్రస్యవజ్రోసి అనెడు ననువాకమునందును బ్రహ్మజజ్ఞానం అనెడు మంత్రము భృగ్వాద్వికా అనునట్టి యనువాకమునందును దదిత్పదం అనెడు మంత్రము ఉదస్తాంప్సీత్సవితా దనెడు ననువాకమునందును వ్యాఖ్యానముఁ జేయఁబడినవి.

మూ॥ గర్భః ప్రాజాపత్యః అథపురుష స్సప్తపురుషః॥ ౬౩॥ ౧౩॥

ప॥ గర్భః । ప్రాజాపత్యః । అథ । పురుషః । సప్త పురుషః॥

అ॥ గర్భః=గర్భము, ప్రాజాపత్యః=ప్రజాపతి సంబంధమైనదిగాఁ జెప్పఁబడినది, అథ=అనంతరము, పురుషః=సూర్యుఁడను పురుషుఁడు, సప్తపురుషః=తనకు భృత్యులైన నక్షత్ర, మాస, అర్ధమాస, ఋతు, సంవత్సర, అహో, రాత్రి, ములను నేడుగురు పురుషులు కలవాఁడుగా ముందు చెప్పఁబోవు ననువాకమునందుఁ జెప్పఁబడుచున్నాఁడు

తా॥ ప్రజాపతి సంబంధమైన గర్భమగు సూర్యునకుఁ బైని జెప్పిన యేడుగురను సహోదరులనుగాఁ జెప్పుచున్నాఁడు.

ఇతి త్రయోదశోనువాకస్సమాప్తః

## — అథ చతుర్దశోనువాకః ప్రారభ్యతే —

మూ॥ యోసౌతపన్నుదేతి । సస ర్వేషాంభూతానాం ప్రాణానాదాయోదేతి । మామేప్రజాయామాపశూనాం । మామమ ప్రాణానాదాయోదగాః ॥

ప॥ యః । అసౌ । తపన్ । ఉదేతి । సః । సర్వేషాం । భూతానాం । ప్రాణాన్ । ఆదాయ । ఉదేతి మా । మే । ప్రజాయాః । మా । పశూనాం। మా । మమ । ప్రాణాన్ । ఆదాయ । ఉదగాః ॥

అ॥ యః=ఏ, అసౌ=ఈ, తపన్=సూర్యుఁడు, ఉదేతి=ఉదయించుచున్నాఁడో, సః=ఆసూర్యుడు, సర్వేషాం=సమస్తమైన, భూతానాం=భూతములయొక్క

ప్రాణాన్=ప్రాణములను ఆదాయ=తీసికొని, ఉదేతి=ఉదయించుచున్నాడు, హే ఆదిత్య=ఓసూర్యుడా. మే=నాయొక్క, ప్రజాయాః = సంతానముయొక్కయు, పశూనాం=పశువులయొక్కయు ప్రాణాన్=ప్రాణములను, ఆదాయ=గ్రహించి, మోదగాః=ఉదయింపకుము. మమ=నాయొక్కయు, ప్రాణాన్=ప్రాణములను, ఆదాయ=గ్రహించి, మోదగాః ఉదయింపకుము॥

తా॥ ఈ యుదయించునట్టి సూర్యుడు సమస్తప్రాణుల ప్రాణములను దీసికొనుచున్నాడు. అనగా నాయుర్దాయమును క్షీణింపజేయుచున్నాడు. అది యెట్లనగా దినము మాసము సంవత్సరము మొదలగునవి సూర్యునివలన కలుగుట వలన నొక్కొక్కదినము గడచినకొలది ప్రతిజీవునకు నుండునట్టి యాయుర్దాయములో నొక్కొక్కదినము తగ్గిపోవుచున్నది. కాబట్టి సూర్యుడాయుర్దాయమును క్షీణింపజేయువాడగుచున్నాడు గాన దేహధారి యీ ప్రకారముగా సూర్యుని ప్రార్థించుచున్నాడు. ఓసూర్యుడా! నా యొక్కయు నాసంతానముయొక్కయు నా పశువులయొక్కయు నాయుర్దాయమును క్షీణింపజేయకుము.

మూ॥ అసౌయోస్తమేతి । ససర్వేషాంభూతా నాంప్రాణా నాదా
యాస్తమేతి । మామేప్రజాయాంమాపశూనాం । మామ
మప్రాణానాదాయాస్తంగాః॥

ప॥ అసౌ । యః । అస్తం । ఏతి । సః । సర్వేషాం । భూతానాం । ప్రాణాన్ । ఆదాయ । అస్తం । ఏతి । మా । మే । ప్రజాయాః । మా । పశూనాం । మా । మమ । ప్రాణాన్ । ఆదాయ । అస్తం । గాః॥

అ॥ అస్తం=అస్తమానమును, ఏతి=పొందుచున్నాడో, అస్తం=అస్తమానమును, మాగాః=పొందకుము, మిగిలిన పదములకు పైనిజెప్పిన యర్థమువలెనే యర్థము జెప్పుకొనవలయును. ఇకముందు మంత్రములయందు నిదేప్రకారము అర్థము జెప్పుకొనవలయును. తాత్పర్యముకూడ నదేరీతిగా జెప్పుకొనవలయును. ఇక్కడ నస్తమించుచున్న సూర్యునిగురించి చెప్పబడినది.

మూ॥ అసౌయ ఆపూర్యతి । ససర్వేషాంభూతానాం ప్రాణైరాపూ
ర్యతి॥ ౬౮॥ మామేప్రజాయామాపశూనాం । మామమప్రా
ణైరాపూరిష్ఠాః॥

ప॥ అసౌ । యః । ఆ । పూర్యతి । సః । సర్వేషాం । భూతానాం । ప్రాణైః । ఆ । పూర్యతి । మా । మే । ప్రజాయాః । మా । పశూనాం । మా । మమ ప్రాణైః । ఆ । పూరిష్ఠాః ॥

అ॥ యావత్=ఎంతలోపల । ఆ పూర్యతి=ఉదయించుటకొఱకుఁ గిరణములచే నిండింపబడుచున్నాఁడో, మాపూరిష్ఠాః=నిండింపబడకుము.

మూ॥ అసౌయోపక్షీయతి । ససర్వేషాంభూతానాం ప్రాణైరపక్షీయతి । మామేప్రజాయామాపశూనాం । మామమప్రాణైరపక్షేష్ఠాః ॥

ప॥ అసౌ । యః । అప । క్షీయతి । సః । సర్వేషాం । భూతానాం । ప్రాణైః । అప । క్షీయతి । మా । మే । ప్రజాయాః । మా । పశూనాం । మా । మమ । ప్రాణైః । అప । క్షేష్ఠాః॥

అ॥ అపక్షీయతి=అస్తమానమును బొందుటకొఱకు, గిరణములచే శూన్యుఁడగుచున్నాఁడు.

మూ॥ అమూని నక్షత్రాణి । సర్వేషాంభూతానాం ప్రాణైరపప్రసర్పంతిచోత్సర్పంతిచ । మామేప్రజాయామాపశూనాం। మామమప్రాణైర పప్రసృపతమోత్సృపత॥౽౭॥

ప॥ అమూని । నక్షత్రాణి । సర్వేషాం । భూతానాం । ప్రాణైః । అప । ప్రసర్పంతి । చ । ఉత్ । సర్పంతి । చ । మా । మే । ప్రజాయాః । మా । పశూనాం । మా । మమ । ప్రాణైః । అప । ప్రసృపత । మా । ఉత్సృపత॥

అ॥ అమూని=ఈ, నక్షత్రాణి, నక్షత్రములు, సర్వేషాం=సమస్తమైన, భూతానాం=భూతములయొక్క, ప్రాణైః=ప్రాణములతోఁగూడ, అపప్రసర్పంతి పగలు అస్తమించిన కాంతి గలవగుచున్నవి. ఉత్సర్పంతిచ=రాత్రియందుఁ గాంతి ప్రసారము కలవగుచున్నవి. హేనక్షత్రాణి=ఓ నక్షత్రములారా ! మే=నాయొక్క, ప్రజాయాః=సంతానముయొక్కయు, పశూనాం=పశువులయొక్కయు మమ=నాయొక్కయు ప్రాణైః=ప్రాణములతోఁ గూడినవారలై, మా పప్రసృపత=అస్తమింపకుఁడు, మోత్సృపత=రాత్రులయందుదయింపకుఁడు.

తా॥ ఈ నక్షత్రములు సమస్తమైన ప్రాణుల ప్రాణములతోఁగూడి పగలస్తమించుచున్నవి. రాత్రులయందుఁగాంతి సహితమైనవిగ్రాణ ప్రాణములతోఁ

గూడను దయించుచున్నవి. అనఁగా రాత్రిపగలు ప్రవృత్తిచే నాయొక్క క్షయమును జేయుచున్నవి. ఓ నక్షత్రములారా! నాయొక్కయు నా పశువులయొక్కయు నా సంతానముయొక్కయు నాయుర్దాయ క్షయమును మీ యొదయాస్తమయములవలన గలిగింపకుఁడు.

మూ॥ ఇమేమాసాశ్చార్ధమాసాశ్చ। సర్వేషాం భూతానాం ప్రాణైరపప్రసర్పంతిచోత్సర్పంతిచ। మామేప్రజాయామాపశూనాం। మామమప్రాణైరపప్రసృపతమోత్సృపత॥

ప॥ ఇమే। మాసాః। చ। అర్ధమాసాః। చ॥

అ॥ ఇమే = ఈ, మాసాశ్చ = మాసములు, అర్ధమాసాశ్చ = పక్షములు॥

తా॥ మిగిలినపదములకుఁబదచ్ఛేదము అర్ధము తాత్పర్యముపైని జెప్పినమంత్రమువలెనే చెప్పుకొనవలయును.

మూ॥ ఇమఋతవః। సర్వేషాం భూతానాం ప్రాణైరపప్రసర్పంతిచోత్సర్పంతిచ। మామేప్రజాయామాపశూనాం। మామమ. ప్రాణైరపప్రసృపత మోత్సృపత॥

ప॥ ఇమే। ఋతవః॥ ఈ మంత్రమునందునను పైనిజెప్పిన ప్రకారముగానే చెప్పుకొనవలయును.

అ॥ ఇమే = ఈ, ఋతవః = ఋతువులు॥ ఇక్కడ ఋతువులనుగుఱించి చెప్పఁబడినది.

మూ॥ అయగ్ంసంవత్సరః। సర్వేషాం భూతానాం ప్రాణైరపప్రసర్పతిచోత్సర్పతిచ॥ ౭౩॥ మామేప్రజాయామాపశూనాం। మామమ ప్రాణైరపప్రసృపమోత్సృప॥

ప॥ అయం। సంవత్సరః। సర్వేషాం। భూతానాం। ప్రాణైః। అప। ప్రసర్పతి। చ। ఉత్సర్పతి। చ। మా। మే। ప్రజాయాః। మా। పశూనాం। మా। మమ। ప్రాణైః। అప। ప్రసృప। మా। ఉత్సృప॥

అ॥ అయం = ఈ, సంవత్సరః = సంవత్సరము, అపప్రసర్పతి = సంకోచమును బొందుచున్నది, ఉత్సర్పతి=వృద్ధిని బొందుచున్నది, మాపప్రసృప=సంకోచమును బొందకుము, మోత్సృప=వృద్ధిని బొందకుము. మిగిలిన పదములకుఁ బూర్వ

మదలెనే చెప్పుకొనవలయును. ఇంక్రమందు నేకవచన బహువచన పదములకుం బైని జెప్పిన ప్రకారముగాం జెప్పుకొనవలయును.

మూ॥ ఇదమహః । సర్వేషాం భూతానాం ప్రాశ్రైరపప్రసర్పతి
చోత్సర్పతిచ । మామేప్రజాయామాపశూనాం । మామమ
ప్రాశ్రైరపప్రసృపమోత్సృప ॥

ప॥ ఇదం । అహః ॥=.........ఉత్సృప ॥

అ॥ ఇదం=ఈ, అహః=పగలు, ఇక్కడ పగటిని గుఱించి చెప్పంబడినది.

మూ॥ ఇయగ్ంరాత్రిః । సర్వేషాంభూతానాం ప్రాశ్రైరపప్రసర్పతి
చోత్సర్పతిచ । మామే ప్రజాయామాపశూనాం । మామమ
ప్రాశ్రైరపప్రసృపమోత్సృప ॥

ప॥ ఇయం । రాత్రిః ॥ .........ఉత్సృప ॥

అ॥ ఇయం=ఈ, రాత్రిః=రాత్రి, రాత్రిని గుఱించి చెప్పంబడినది.

మూ॥ ఓం భూర్భువస్సువః । ఏతద్వోమిథునంమానో మిథునగ్ంరీ
ఢ్వం ॥ ౬౬ ॥ ౧౪ ॥

ప॥ ఓం । భూః । భువః । స్వః । ఏతత్ । వః ।' మిథునం । మా । నః ।
మిథునం । రీఢ్వం ॥

అ॥ ఓం=ఓమ్ అను ప్రణవము వలనం బ్రతిపాదింపంబడు పరమాత్మయే, భూః=భూలోక స్వరూపుండు, భువః=భువర్లోక స్వరూపుండు, స్వః=స్వర్లోక స్వరూపుండు, ఆసీత్=ఆయెను, వః=మీయొక్క, ఏతత్=ఈ, మిథునం=పరస్పర సంబంధమేది కలదో, తత్=ఆ సంబంధము, నః=మాయొక్క, మిథునం=స్త్రీ పురుష సంబంధమును, మారీఢ్వం=వియోగమును జేయకుండుంగాక ॥

తా॥ ఓంకార ప్రతిపాద్యుండగు పరమాత్మయే స్వర్గమర్త్య పాతాళములను లోకత్రయ స్వరూపుండై యుండెను. నక్షత్ర, మాస, అర్ధమాస, ఋతు, సంవత్సర, దివా, రాత్రులను ఓ యేడుగురు పురుషులారా! ప్రణవ ప్రతిపాద్య పరమాత్మ స్వరూపుండగు సూర్యునితోం గూడ మీ కుండునట్టి సంబంధము స్త్రీ పురుష సంసర్గరూపమైన మాద్వంద్వమును భంగముం జేయకుండుండు.

ఇతి చతుర్దశోనువాకస్సమాప్తః

—♦ అథ పంచదశోనువాక ప్రారంభః ♦—

మూ॥ అథా దిత్యస్యాఽష్ట పురుషస్య॥

ప॥ అథ । ఆదిత్యస్య । అష్టపురుషస్య ॥

అ॥ అథ=అనంతరము, అష్టపురుషస్య అష్టమూర్తుల స్వరూపుండగు, ఆదిత్యస్య, సూర్యునియొక్క, ధ్యానముఁ జేయఁబడుచున్నది.

తా॥ సూర్యునకు నక్షత్రము మొదలగు నేడుగురు పురుషుల సహకారిత్వముఁ జెప్పిన పిమ్మట వసుగణము రుద్రగణము మొదలగు నెనిమిది గణముల స్వరూపుండగు, సూర్యుని ధ్యానముఁ జేయఁబడుచున్నది.

మూ॥ వసూనామాదిత్యానాగ్ । స్థానేస్వతేజసాభాని॥

ప॥ వసూనాం । ఆదిత్యానాం । స్థానే । స్వతేజసా । భాని॥

అ॥ వసూనాం=అష్టవసువుల స్వరూపమైన, ఆదిత్యానాం=సూర్యులయొక్క స్థానే=స్థానమందు, తిష్ఠన్=ఉన్నవాఁడనై, అహం=నేను, స్వతేజసా=స్వకీయమైన తేజస్సుచేత, భాః=ప్రకాశించు వాఁడనయ్యెదను.

తా॥ అష్టవసువుల స్వరూపులగు ద్వాదశాదిత్యుల స్థానమందున్నవాడనై వారి యనుగ్రహముకలనఁ బొందఁబడిన కాంతిగలవాఁడనై ప్రకాశించుచున్నాను.

మూ॥ రుద్రాణామాదిత్యానాగ్ స్థానే స్వతేజసాభాని ॥

ప॥ రుద్రాణాం । ఆదిత్యానాం । స్థానే । స్వతేజసా । భాని॥

అ॥ రుద్రాణాం=ఏకాదశరుద్రస్వరూపులగు, మిగిలిన పదములకుఁ బైని మంత్రమువలెనే చెప్పుకొనవలయును.

మూ॥ ఆదిత్యానామాది త్యానాగ్స్థానే స్వతేజసాభాని॥

ప॥ ఆదిత్యానాం । ఆదిత్యానాం । స్థానే । స్వతేజసా । భాని॥

అ॥ ఆదిత్యానాం=ద్వాదశాదిత్యుల స్వరూపమగు, ఆదిత్యానాం=పరమాత్మ యొక్క శరీరవిశేషములయొక్క॥

మూ॥ సతాగ్ం సత్యానాం । ఆదిత్యానాగ్ స్థానేస్వతేజసాభాని ॥

ప॥ సతాం । సత్యానాం । ఆదిత్యానాం । స్థానే । స్వతేజసా । భాని ॥

అ॥ సతాం=సత్పురుషులగు మహర్షుల స్వరూపులయినట్టియు, సత్యానాం= సత్యమును బలుకునట్టివారి స్వరూపులగు ॥

మూ॥ అభిధూన్వతామభిఘ్నతాం। వాతవతాం మరుతాం। ఆదిత్యానాగ్స్థానేస్వతేజసాభాని ॥

ప॥ అభిధూర్వతాం। అభిఘ్నతాం। వాతవతాం। మరుతాం। ఆదిత్యానాం। స్థానే। స్వతేజసా। భాని ॥

అ॥అభిధూన్వతాం=అంతటను వర్షమును బ్రచురింపఁజేయునట్టియు, అభిఘ్నతాం=ప్రాణులను బాధించునట్టివియు, వాతవన్తః= తీవ్రవేగముగల, మరుతాం= వాయువులయొక్క ॥

మూ॥ ఋభూణామాదిత్యానాగ్ స్థానేస్వతేజసాభాని ॥

ప॥ ఋభూణాం। ఆదిత్యానాం। స్థానే। స్వతేజసా। భాని ॥

అ॥ ఋభూణాం=దేవయాని విశేషులైనట్టివారి స్వరూపులైన ॥

మూ॥ విశ్వేషాందేవానాం। ఆదిత్యానాగ్ స్థానేస్వతేజసాభాని ॥

ప॥ విశ్వేషాం। దేవానాం। ఆదిత్యానాం। స్థానే। స్వతేజసా। భాని ॥

అ॥ విశ్వేషాందేవానాం = విశ్వేదేవస్వరూపులగు।

మూ॥ సంవత్సరస్యసవితుః। ఆదిత్యస్యస్థానేస్వతేజసాభాని ॥

ప॥ సంవత్సరస్య। సవితుః। ఆదిత్యస్య। స్థానే। స్వతేజసా। భాని ॥

అ॥ సవితుః = వ్యవహారహేతువైన, సంవత్సరస్య = సంవత్సరస్వరూపుఁడగు, ఆదిత్యస్య = సూర్యునియొక్క ॥

మూ॥ ఓంభూర్భువస్స్వః। రశ్మయోవోమిథునం మానోమిథునగ్ంరీఢ్వం ॥ ౬౭। ౧౫॥

ప॥ఓం। భూః। భువః। స్వః। రశ్మయః। వః। మిథునం। మా। నః। మిథునం। రీఢ్వం ॥

అ॥ ఓం = ప్రణవప్రతిపాద్యుఁడగు పరమాత్మయే, భూర్భువస్స్వః=భూరాద్యాదిలోకత్రయస్వరూపుఁడయ్యెను, రశ్మయః = ఓకిరణములారా!, వః = మీయొక్క మిథునం=పరస్పర సంబంధము, నః=మాయొక్క, మిథునం=స్త్రీపురుష సంబంధమైన ద్వంద్వమును, మారీఢ్వం=వియోగమును జేయుకుఁడు ॥

తా॥ ఏకాదశ రుద్రస్వరూపులును పరమాత్మ స్వరూపులును వర్షమునంతటను గురిపింపఁజేయునట్టియుఁ బ్రాణులను జలిచే బాధపెట్టునవియు విశేషవేగముగల వియు నగు వాయుస్వరూపములును సత్యమును బలుకునట్టివారును సత్పురుషులను మహర్షుల స్వరూపులును దేవతలలో నొకజాతియగు ఋభువుల స్వరూపులును విశ్వేదేవతల స్వరూపులును వ్యవహారమునకు హేతువైన సంవత్సర స్వరూపులు నగు సూర్యుల స్థానమందున్నవాఁడవై వారివలనఁ బొందఁబడిన సామర్థ్యము గలవాఁడవై ప్రకాశించుచున్నాను. అట్టువంటి యాదిత్యుల యందుండునట్టియుఁ బ్రణవము చేఁబ్రతిపాదనఁ జేయఁబడు పరమాత్మయే భూరాదిలోకత్రయముల యందు వ్యాపించి యుండెను. కాఁబట్టి లోకత్రయ స్వరూపుండును బ్రణవ ప్రతిపాద్యుం డును బరమాత్మ స్వరూపుండు నగు సూర్యుని సంబంధమగు నోకిరణములారా! మీకు సూర్యునకు నెట్టువంటి యవిచ్ఛిన్నమగు సంబంధము కలదో అట్టి సంబంధ మును మా దంపతులకుఁ గలుగఁజేయుఁడు.

ఇతి పంచ దశోనువాకస్సమాప్తః

—♦ అథషోడశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ ఆరోగస్యస్థానేస్వతేజసాభాని । భ్రాజస్యస్థానే స్వతేజసా భాని । పటరస్యస్థానేస్వతేజసాభాని । పతంగస్యస్థానే స్వతే జసాభాని । స్వర్ణరస్యస్థానే స్వతేజసాభాని । జ్యోతిషీమత స్యస్థానే స్వతేజసాభాని । విభాసస్యస్థానే స్వతేజసాభాని । కశ్యపస్యస్థానే స్వతేజసాభాని । ఓం భూర్భువస్స్వః । ఆపో వోమిథునం మానోమిథునగ్ం రీఢ్వం ॥ ౭౮ ॥ ౧౬ ॥

ప॥ ఆరోగస్య । స్థానే । స్వతేజసా । భాని । భ్రాజస్య । స్థానే । స్వతే జసా । భాని । పటరస్య । స్థానే । స్వతేజసా । భాని । పతంగస్య । స్థానే । స్వతేజసా । భాని । స్వర్ణరస్య । స్థానే । స్వతేజసా । భాని । జ్యోతిషీమతస్య । స్థానే । స్వతేజసా । భాని । విభాసస్య । స్థానే । స్వతేజసా । భాని । కశ్యపస్య । స్థానే । స్వతేజసా । భాని । ఓం । భూః । భువః । స్వః । ఆపః । వః । మిథు నం । మా । నః । మిథునం । రీఢ్వం॥

అ॥ ఆరోగస్య=ఆరోగుఁడను సూర్యునియొక్క, స్థానే=స్థానమునందు, తిష్ఠన్=ఉన్నట్టువంటివాఁడనై, స్వతేజసా=నాయొక్క తేజస్సుచేత, భాని=ప్రకాశించుచున్నాను॥

తా॥ ఆరోగుఁడను సూర్యుని సన్నిధానమందున్నవాఁడనై ఆయన యనుగ్రహమువలనఁ బొందఁబడిన కాంతిచేఁ ప్రకాశించుచుందును. ఈప్రకారముగానన్ని వాక్యములకుఁ బదార్థ తాత్పర్యములు చెప్పుకొనవలయును.

అ॥ భ్రాజస్య=భ్రాజుఁడను సూర్యునియొక్క, పటరస్య=పటరుఁడను సూర్యునియొక్క, పతంగస్య=పతంగుఁడను సూర్యునియొక్క, స్వర్ణరస్య=స్వర్ణరుఁడను సూర్యునియొక్క, జ్యోతిషీమతస్య=జ్యోతిషీమతుఁడను సూర్యునియొక్క, విభాసస్య=విభాసుఁడను, సూర్యునియొక్క, కశ్యపస్య=కశ్యపుఁడను సూర్యునియొక్క, స్థానే=స్థానమునందు, తిష్ఠన్ = ఉన్నట్టువంటివాఁడనై, స్వతేజసా=నాయొక్క కాంతిచేత, భాని=ప్రకాశించుచున్నాను॥

తా॥ భ్రాజుఁడు పటరుఁడు పతంగుఁడు స్వర్ణరుఁడు జ్యోతిషీమతుఁడు విభాసుఁడు కశ్యపుఁడు అనునట్టి సూర్యుల సన్నిధానమందున్నవాఁడనై వారియనుగ్రహమువలనఁ బొందఁబడిన కాంతిగలవాఁడనై ప్రకాశించెదను. అట్టువంటి సూర్యుతే ప్రణవ ప్రతిపాదకమైన పరమాత్మ స్వరూపముగాఁ జెప్పబడియెను. ఓయుదకములారా ! అట్టువంటి సూర్యునకు మీకున్నట్టి సంబంధమువలెనే మాదంపతులకును నవిచ్ఛిన్నమైన సంబంధము గలుగునట్లు చేయుఁడు

ఇతి షోడశోనువాక స్సమాప్తః

## —♦ అథ సప్తదశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ అథవాయోరేకాదశపురుషస్యైకాదశస్త్రీకస్య॥

ప॥ అథ । వాయోః । ఏకాదశపురుషస్య । ఏకాదశస్త్రీకస్య॥

అ॥ అథ=అనంతరము, ఏకాదశపురుషస్య=పదునొకండు పురుషస్వరూపములు గలవాఁడును, ఏకాదశస్త్రీకస్య=పదునొకండు స్త్రీస్వరూపములు కలవాఁడునగు, వాయోః=వాయువుయొక్క నామములు చెప్పబడుచున్నవి॥

తా॥ పూర్వాను వాకములో సూర్యుని మూర్తి విశేష ములజెప్పిన పిమ్మట నీయను వాకములో వాయువుయొక్క పదునొకండు పురుష స్వరూపములు పదునొకండు స్త్రీస్వరూపములు చెప్పబడుచున్నవి.

మూ॥ పరిభ్రాజమానానాగ్ రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాసి। వ్యవతానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। వాసుకి వైద్యుతానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। రజతానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। పరుషాణాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। శ్యామానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। కపిలానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। అతిలోహితానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। ఊర్ధ్వానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని ॥ ౬౯ ॥ అవపతంతానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। వైద్యుతానాగ్ం రుద్రాణాగ్ స్థానే స్వతేజసాభాని। పరిభ్రాజమానీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। వ్యవదాతీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। వాసుకి వైద్యుతీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। రజతానాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। పరుషాణాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। శ్యామానాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। కపిలానాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। అతిలోహితీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। ఊర్ధ్వానాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। అవపతన్తీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। వైద్యుతీనాగ్ం రుద్రాణీనాగ్ స్థానే స్వతేజసాభాని। ఓంభూర్భువస్సువః। రూపాణివో మిథునం మానో మిథునగ్ం రీఢ్వం॥ ౭౦ ॥ ౧౭ ॥

అ॥ పరిభ్రాజమానానాం = పరిభ్రాజమానులను పేరుగలవారును, వ్యవదాతానాం = వ్యవదాతులను పేరుగలవారును, వాసుకి వైద్యుతానాం = వాసుకి వైద్యుతులను పేరుగలవారును, రజతానాం = రజతులను పేరుగలవారును, పరుషాణాం=

పురుషులను పేరుగలవారును, శ్యామానాం = శ్యాములను పేరుగలవారును। కపిలానాం = కపిలులను పేరుగలవారును, అతిలోహితానాం = అతిలోహితులను పేరుగలవారును। ఊర్ధ్వానాం = ఊర్ధ్వలను పేరుగలవారును, అవపతన్తానాం = అవపతంతులను పేరుగలవారును, వైద్యుతానాం = వైద్యుతులను పేరుగలవారునగు, రుద్రాణాం = ఏకాదశ పురుషస్వరూప రుద్రులయొక్క, స్థానే = స్థానమునందు, తిష్ఠన్ = ఉన్నటువంటివాఁడనై। స్వతేజసా = నాయొక్క కాంతిచేత, భాని = ప్రకాశించుచున్నాను॥ ఈ ప్రకారముగానే స్త్రీ లింగములలో నిర్దిష్టమై ఈ నామములచేఁ జెప్పఁబడు పదునొకండు వాక్యములకు నర్థముఁ జెప్పుకొనవలయును. రూపాణి = స్త్రీ పురుషస్వరూపమైన రూపములు.

తా॥ ప్రభ్రాజమానులు వ్యవదాతులు వాసుకివైద్యుతులు రజతులు పరుషులు శ్యాములు కపిలులు అతిలోహితులు ఊర్ధ్వలు అవపతంతులు వైద్యుతులు అను నామములచే బదునొకండు పురుషస్వరూపములు పదునొకండు స్త్రీ స్వరూపములు గల ఏకాదశరుద్రుల స్వరూపముగా వాయువు చెప్పఁబడినది. అట్టి వాయుస్వరూపమైన రుద్రుల యనుగ్రహమువలనఁ బొందఁబడిన కాంతిగలవాఁడనై ప్రకాశించుచున్నాను. అటుకంటెఁ రుద్రులకంటె నభిన్నమైన వాయువు ప్రణవప్రతిపాద్యుడను లోకత్రయవ్యాపియునగు పరమాత్మస్వరూపముగాఁ జెప్పఁబడినది. అట్టి వాయుసంబంధమగు నోరూపములారా! మా దంపతుల సంబంధమగు ద్వంద్వమును వియోగము కలుగకుండునట్లు సేయుఁడు. అన్ని పదములకుఁ బదచ్ఛేదము అర్థము చెప్పబడనందున ఇటువంటి వాక్యములు మాటిమాటికి వచ్చుచుండుటవలనఁ చెప్పఁబడియుండలేదు. వెనుకటివాక్యములు పరిశీలన జేసినయెడల నన్నియుఁ దెలిసికొనవచ్చును.

ఇతి సప్తదశోనువాకస్సమాప్తః

## —♦ అథాఽష్టాదశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ అథాగ్నేరష్టపురుషస్య।

ప॥ అథ । అగ్నేః । అష్టపురుషస్య ॥

అ॥ అథ=అనంతరము, అష్టపురుషస్య=ఎనమండ్రు పురుషుల స్వరూపములు గల, అగ్నేః=అగ్నిహోత్రునియొక్క, మంత్రములు చెప్పఁబడుచున్నవి.

తా॥ రుద్రాభిన్నమైన వాయువును గురించి చెప్పినపిమ్మట అష్టమూర్తులు గల యగ్నిహోత్రునియొక్క మంత్రములు చెప్పఁబడుచున్నవి.

మూ॥ అగ్నేః పూర్వదిశ్యస్యస్థానే స్వతేజసాభాని। జాతవేదసఉప దిశ్యస్యస్థానే స్వతేజసాభాని। సహోజసోదక్షిణదిశ్యస్యస్థానే స్వతేజసాభాని।అజిరాప్రభవ ఉపదిశ్యస్థానేస్వతేజసాభాని— వైశ్వానరస్యాపరదిశ్యస్యస్థానే స్వతేజసాభాని। నర్యాపస ఉపదిశ్యస్యస్థానే స్వతేజసాభాని। పఙ్క్తిరాధస ఉదగ్దిశ్యస్య స్థానేస్వతేజసాభాని। విసర్పిణ ఉపదిశ్యస్థానేస్వతేజసాభాని— ఓంభూర్భువస్సువః । దిశోవోమిథునం మానోమిథునగ్ం రీఢ్వం ॥ ౭౧ ॥ ౧౮

ప॥ అగ్నేః । పూర్వదిశ్యస్యస్థానే । స్వతేజసా । భాని । జాతవేదసః । ఉప దిశ్యస్య । స్థానే । స్వతేజసా । భాని । సహోజసః । దక్షిణదిశ్యస్య । స్థానే ।స్వతే జసా । భాని । అజిరాప్రభవః । ఉపదిశ్యస్య । స్థానే । స్వతేజసా । వైశ్వానరస్య । అపరదిశ్యస్య । స్థానే । స్వతేజసా । భాని । నర్యాపసః । ఉపదిశ్యస్య । స్థానే । స్వతేజసా । భాని । పఙ్క్తిరాధసః । ఉదగ్దిశ్యస్య । స్థానే । స్వతేజసా । భాని । విసర్పిణః । ఉపదిశ్యస్య । స్థానే । స్వతేజసా । భాని । ఓం । భూః । భువః । స్వః । దిశః । వః । మిథునం । మా । నః । మిథునం । రీఢ్వం ॥

అ॥ పూర్వదిశ్యస్య=తూర్పుదిక్కునందున్నటువంటి, అగ్నేః=అగ్నియనుపేరు గల యగ్నిహోత్రునియొక్క, స్థానే=స్థానమందు, తిష్ఠత=ఉన్నటువంటివాఁడవై, స్వతేజసా=వారివలన బొందఁబడిన కాంతిచేత । భాని = ప్రకాశించుచున్నాను. ఈ ప్రకారముగా నన్నిపదములకుఁ జెప్పుకొనవలయును॥ ఉపదిశ్యస్య=ఆగ్నేయ దిక్కునందున్నటువంటి, జాతవేదసః= జాతియవేదునియొక్క, .........ప్రకాశించుచున్నాను, దక్షిణదిశ్యస్య=దక్షిణ దిక్కునందున్నటువంటి, సహోజసః=సహోజుని యొక్క,......ప్రకాశించు చున్నాను, ఉపదిశ్యస్య= నైరృతి దిక్కునందున్నటువంటి, అజిరాప్రభవః=అజిరాప్రభుని యొక్క,...... ప్రకాశించుచున్నాను, అపరదిశ్యస్య = పశ్చిమ దిక్కునందున్నటువంటి, వైశ్వాన రస్య=వైశ్వానరునియొక్క,......ప్రకాశించుచున్నాను, ఉపదిశ్యస్య= వాయువ్య

దిక్కునందున్నటువంటి, సర్వ్యాపసః = సర్వ్యాపసునియొక్క ...... ప్రకాశించుచున్నాను, ఉదగ్దిశ్యస్య=ఉత్తర దిక్కునందున్నటువంటి, పంక్తిరాధసః = పంక్తిరాధసునియొక్క,......ప్రకాశించుచున్నాను, ఉపదిశ్యస్య = ఈశాన్యదిక్కునందున్నటువంటి, విసర్పిణః=విసర్పియొక్క,......ప్రకాశించుచున్నాను, హేదిశః= ఓ దిక్కులారా! వః=మీయొక్క, మిథునం=అగ్ని మొదలగు యెనమండ్రు అగ్నిహోత్రులకు మీకుఁగల సంబంధము, నః=మాయొక్క, మిథునం=సంబంధమును, మారీఢ్వం=వియోగమును గలిగింపఁజేయకుఁడు.

తా॥ తూర్పు దిక్కునందున్న యగ్నియను పేరుగల యగ్నిహోత్రునియొక్కయు వాగ్నేయవిదిక్కునందున్న జాతవేదసుఁడను పేరుగల యగ్నియొక్కయు, దక్షిణ దిక్కునందున్న సహోజసుఁడను పేరుగల యగ్నియొక్కయు నైరృతివిదిక్కునందున్న అజిరాప్రభువను పేరుగల యగ్నియొక్కయుఁ బశ్చిమ దిక్కునందున్న వైశ్వానరుఁడను పేరుగల యగ్నియొక్కయు వాయువ్యవిదిక్కునందున్న సర్వ్యాపసుఁడను పేరుగల యగ్ని యొక్కయు, నుత్తర దిక్కునందున్న పంక్తిరాధసుఁడను పేరుగల యగ్నియొక్కయు ఈశాన్యవిదిక్కునందున్న విసర్పియను పేరుగల యగ్నియొక్కయు స్థానములయందుండి వారి యనుగ్రహమువలనఁ బొందఁబడిన కాంతి గలవాఁడనై ప్రకాశించుచున్నాను. ప్రణవ ప్రతిపాద్యుండును లోకత్రయ స్వరూపుండునగు పరమాత్మ యీ యగ్నిహోత్రులకంటె నభిన్నుఁడుగా నుండెను. కాఁబట్టి యోదిక్కులారా! మీకు నగ్ని మొదలగు యెనిమిది నామములచేఁ జెప్పఁబడు నగ్నిహోత్రములకుఁ గల యవినాభావ సంబంధము వలెనే మాదంపతులయొక్కయు సంబంధమును భంగమును గలిగింపకుందురుగాక ॥

ఇత్యష్టాదశానువాకస్సమాప్తః

—◆ అథైకోనవింశోఽనువాకః ప్రారభ్యతే ◆—

మూ॥ దక్షిణపూర్వస్యాం దిశివిసర్పీనరకః । తస్మాన్నః పరిపాహి ।
దక్షిణాపరస్యాందిశ్య విసర్పీనరకః । తస్మాన్నః పరిపాహి ।
ఉత్తరపూర్వస్యాందిశివిషాదీనరకః । తస్మాన్నః పరిపాహి ।
ఉత్తరాపరస్యాందిశ్యవిషాదీనరకః । తస్మాన్నః పరిపాహి ।
ఆయస్మిన్త్సప్తవాసవాఇంద్రియాణిశతక్రతవిత్యేతే॥ [illegible]

ప॥ దక్షిణపూర్వస్యాం । దిశి । విసర్పీ । నరకః । తస్మాత్ । నః । పరి । పాహి । దక్షిణాపరస్యాం । దిశి । అవిసర్పీ । నరకః । తస్మాత్ । నః । పరి । పాహి । ఉత్తరపూర్వస్యాం । దిశి । విషాదీ । నరకః । తస్మాత్ । నః । పరి । పాహి । ఉత్తరాపరస్యాం । దిశి । అవిషాదీ । నరకః । తస్మాత్ । నః । పరి । పాహి । ఆయస్మిన్త్సప్తవాసవాః ! ఇంద్రియాణిశతక్రతో । ఇతి । ఏతే॥

అ॥ దక్షిణపూర్వస్యాం=దక్షిణదిక్కు తూర్పుదిక్కులకుమధ్యయందైన, దిశి=ఆగ్నేయదిక్కునందు, విసర్పీ=విసర్పియను పేరుగల, నరకః=నరకము, అస్తి=కలదు, తస్మాత్ = ఆనరకమువలన, నః = మమ్ములను, పరిపాహి = అంతటునురక్షింపుము, దక్షిణాపరస్యాం=దక్షిణదిక్కునకు రెండవప్రక్కనుందు విదిక్కగు, దిశి=నైర్రృతి దిక్కునందు, అవిసర్పీ=అవిసర్పియను పేరుగల, నరకః = నరకము, అస్తి = కలదు, తస్మాత్=ఆనరకమువలన, నః=మమ్ములను, పరిపాహి=అంతటునురక్షింపుము, ఉత్తర పూర్వస్యాం = ఉత్తరదిక్కు తూర్పుదిక్కులకు మధ్యమందు, దిశి = ఈశాన్య దిక్కునందు విషాదీ = విషాదియను పేరుగల, నరకః = నరకము, అస్తి = కలదు, తస్మాత్ = ఆ నరకమువలన, నః = మమ్ములను, పరిపాహి = రక్షింపుము, ఉత్తరాపరస్యాం = ఉత్తర దిక్కునకు రెండవప్రక్క నందు విదిక్కగు, దిశి = వాయవ్యదిక్కునందు, అవిషాదీ = అవిషాదియను పేరుగల, నరకః=నరకము, అస్తి=కలదు, తస్మాత్ = ఆ నరకమువలన, నః = మమ్ములను, పరిపాహి = అంతటను రక్షింపుము, ఆయస్మిన్త్సప్తవాసవా ఇతి = ఆయస్మిన్ త్సప్తవాసవాః అనునట్టిదియు, ఇంద్రియాణిశతక్రతావితి = ఇంద్రియాణిశతక్రతో అనునట్టిదియు నగు, ఏతే = ఈ రెండు మంత్రములు, ఇంద్రం వో విశ్వతస్పరీ అనునట్టి యను వాకమునందు వ్యాఖ్యానముఁజేయఁబడినవి.

తా॥ ఆగ్నేయదిక్కునందు విసర్పియను నరకము నైర్రృతి దిక్కునందు అవిసర్పియను నరకము వాయవ్యదిక్కునందు అవిషాదియను నరకము ఈశాన్యదిక్కునందు విషాదియను పేరుగల నరకముకలదు. ఆ నరకములవలన మమ్ములను రక్షింపుమని యువ్వ దేవతను ప్రార్థించుచున్నాఁడు. బాధవలన నిటునటు చలించుచుందురు గాన విసర్పియను పేరుగల నరకమనియు దుఃఖాతిశయమువలన గదలుటకును సమర్థులు గాకుందురు గనుక నవి సర్పియను నరకమనియు ఎందునిమిత్త మిటువంటి పాపముఁ జేసితిమని ప్రాణులు దుఃఖించుచుందురు గనుక విషాదియను నరకమనియు దుఃఖాతి

శేయుమువలన అట్టువంటి విచారమును జేయుటకును సమర్థులుగారు గనుక అవిషారి యను నరకమనియు వ్యుత్పత్తులు చెప్పఁబడినవి. ఆయస్మిన్ త్స్ప్రవాసవాః, ఇంద్రియాణి శతక్రతో, అను రెండు మంత్రములు ఇంద్రింవో విశ్వతస్పరి, అనునట్టి అనువాకమునందు వ్యాఖ్యానము చేయఁబడినవి.

ఇత్యేకోనవింశోనువాకస్సమాప్తః

## —♦ అథవింశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ ఇంద్రఘోషావోవసుభిః పురస్తాదు పదధతాం। మనోజవసోవః పితృభిర్దక్షిణత ఉపదధతాం। ప్రచేతావోరుద్రైః పశ్చాదుపదధతాం। విశ్వకర్మావ ఆదిత్యైరుత్తరత ఉపదధతాం। త్వష్టావోరూపైరు పరిష్టాదు పదధతాం। సంజ్ఞానవః పశ్చాదితి॥

ప॥ ఇంద్రఘోషాః । వః । వసుభిః । పురస్తాత్ । ఉపదధతాం । మనోజవసః । వః । పితృభిః । దక్షిణతః । ఉపదధతాం । ప్రచేతాః । వః । రుద్రైః । పశ్చాత్ । ఉపదధతాం। విశ్వకర్మా । వః । ఆదిత్యైః । ఉత్తరతః. । ఉపదధతాం। త్వష్టా । వః । రూపైః । ఉపరిష్టాత్ । ఉపదధతాం। సంజ్ఞానః। వః । పశ్చాత్ । ఇతి॥

అ॥ పురస్తాత్=తూర్పుదిక్కునందు, ఇంద్రఘోషాః=ఇంద్రఘోషులు మొదలగువారు, వసుభిః=వసువులను దేవతలతోఁగూడినవారై, వః=మిమ్ములను, ఉపదధతాం=సేవించుచుందురు, దక్షిణతః=దక్షిణదిక్కున, మనోజవసః=మనోజవసులు మొదలగువారు, పితృభిః=పితృదేవతలతోఁగూడినవారై, వః=మిమ్మును, ఉపదధతాం=సేవించుచుందురు, పశ్చాత్=పడమటిదిక్కున, ప్రచేతాః=వరుణుఁడు, రుద్రైః=రుద్రులను దేవతలతోఁగూడినవాఁడై, వః=మిమ్మును, ఉపదధతాం=సేవించుచుండును, ఉత్తరతః=ఉత్తరదిక్కున, విశ్వకర్మా=విశ్వకర్మ, ఆదిత్యైః= దేవతలతోఁగూడినవాఁడై, వః=మిమ్ములను, ఉపదధతాః = సేవించుచుండును, ఉపరిష్టాత్= పైభాగమున, త్వష్టా=బ్రహ్మ, రూపైః=రూపప్రధానులగు దేవతలతోఁగూడినవాఁడై

వః=మిమ్ములను, ఉపదధతాం=సేవించుచుండును. సంజ్ఞానం=యథార్థజ్ఞానము, వః=మిమ్ములను, పశ్చాత్=వెనుకనంటియుండును, ఇతి=ఈ ప్రకారముగా ఈ మంత్రములయందుఁజెప్పఁబడినది.

తా॥ జలరూపముగు నోయిష్టదేవతలారా! తూర్పుదిక్కున ఇంద్రుఁడు ఘోషుఁడు మొదలగువారు ఇతరమైన దేవతలంగూడియు దక్షిణదిక్కున మనోజవసుడుఁ మొదలగువారు పితృదేవతలతోఁగూడియుఁ బశ్చిమదిక్కున వరుణుఁడురుద్రులతోఁగూడియు ఉత్తరమున విశ్వకర్మఆదిత్యులతోఁ గూడియుఁ పైభాగమున బ్రహ్మరూపప్రధానులగు దేవతలతోఁగూడియు సేవించుచుందురు. యథార్థజ్ఞానము మిమ్ములనెప్పుడు నాశ్రయించియుండును. అని ఈప్రకారముగా నీయాఱుమంత్రముల యందుఁ జెప్పఁబడినది.

మూ॥ ఆదిత్యస్సర్వోఽగ్నిః పృథివ్యాం । వాయురంతరిక్షే । సూర్యో దివి । చంద్రమాదిక్షు । నక్షత్రాణి స్వలోకే ॥

ప॥ ఆదిత్యః । సర్వః । అగ్నిః ॥ పృథివ్యాం । వాయుః । అంతరిక్షే । సూర్యః । దివి । చంద్రమాః । దిక్షు । నక్షత్రాణి । స్వలోకే ॥

అ॥ ఆదిత్యః=సూర్యసంబంధమగు, సర్వః=సమస్తమైన, అగ్నిః=వేఁడిమి, పృథివ్యాం=భూమియందున్నదియై, వః=మిమ్ములను, ఉపదధాతు=సేవించుఁగాక వాయుః=వాయువు, అంతరిక్షే=ఆకాశమందున్నదియై, వః=మిమ్ములను, ఉపదధాతు=సేవించుగాక, సూర్యః=సూర్యుఁడు, దివి=స్వర్గమందున్నవాఁడై, వః=మిమ్ములను, ఉపదధాతు=సేవించుఁగాక, చంద్రమాః=చంద్రుఁడు, దిక్షుదిక్కులయందున్నవాఁడై, వః=మిమ్ములను, ఉపదధాతు=సేవించుఁగాక, నక్షత్రాణి=నక్షత్రములు, స్వలోకే=తమతమ లోకములయందున్నవియై, వః=మిమ్ములను, ఉపదధాతు=సేవించుగాక॥

తా॥ సూర్యసంబంధమగు వేఁడిమి యంతయు భూమియందున్నదియై వాయువు ఆకాశమందున్నదియై సూర్యుఁడు స్వర్గమందున్నవాఁడై చంద్రుఁడు దిక్కులయందున్నవాఁడై నక్షత్రములు తమతమ లోకములయందున్నవియై మిమ్ములను సేవించుచుండుఁగాక.

మూ॥ ఏవాహ్యేవ। ఏవాహ్యగ్నే। ఏవాహివాయో। ఏవాహీన్ద్ర। ఏవాహిపూషన్। ఏవాహిదేవాః॥ ౭౩ ॥ ౨౦ ॥

ప॥ ఏవాః। హి।ఏవ। ఏవాః। హి। అగ్నే। ఏవాః। హి। వాయో। ఏవాః। హి। ఇంద్ర। ఏవాః। హి। పూషన్ ।ఏవాః। హి। దేవాః॥

అ॥ ఏవ = సంచరించు స్వభావముగలయో సూర్యుఁడా ! ఏవాః = పొందఁదగిన సమస్త కోరికలు, త్వంహి = నీవేకదా, అగ్నే = అగ్నిహోత్రుఁడా ! ఏవాః= పొందఁదగిన సమస్త కోరికలు, త్వంహి = నీవేకదా, వాయో = వాయువా ! నీవే కదా, ఇంద్ర = ఓయిందుఁడా !॥ .........నీవేకదా, పూషన్ = పూషుఁడను సూర్యుఁడా, .........నీవేకదా॥ దేవాః = ఓదేవతలారా ! ఏవాః = పొందఁదగిన సమస్తకోరికలు, యూయంహి = మీరేకదా,

తా॥ ఓ సూర్యుఁడా ! ఓ యగ్నీ ! ఓ వాయువా ! ఓ యింద్రుఁడా ! పూషుఁడను ఓ సూర్యుఁడా ! ఓ దేవతలారా ! పొందఁదగిన సమస్తమైన కోరికలు మీరే అయితిరి కదా ॥

ఇతి వింశోనువాక స్సమాప్తః.

—♦ అథైకవింశోనువాకః ప్రారభ్యతే॥ ♦—

మూ॥ ఆపమాపామపస్సర్వాః। అస్మాదస్మాదితోఽముతః। అగ్నిర్వాయుశ్చసూర్యశ్చ। సహసంచస్కరర్ధియా। వాయ్వశ్వారశ్మిపతయః। మరీచ్యాత్మానోఅద్రుహః। దేవీర్భువనసూవరీః। పుత్రవత్త్వాయమేసుత। మహానామ్నీర్మహామానాః। మహసోమహసస్స్వః॥ ౭౪ ॥ దేవీః పర్జన్యసూవరీః। పుత్రవత్త్వాయమేసుత। అపాశ్న్యుష్ణిమపారక్షః। అపాశ్న్యుష్ణిమపారఘం। అపాఘ్రామపచావర్తిం। అపదేవీరితోహిత। వజ్రందేవీరజీతాగ్శ్చ। భువనందేవసూవరీః। ఆదిత్యానదితిందేవీం। యోనినోర్ధ్వముదీషత॥ ౭౫॥ భద్రంకర్ణేభిశ్శృణుయామదేవాః। భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః।స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః। వ్యశేమదేవహితం యదాయుః॥ స్వస్తినఇంద్రోవృద్ధశ్రవాః। స్వస్తినఃపూషావిశ్వవేదాః। స్వస్తినస్తార్క్ష్యోఅరిష్టనేమిః। స్వస్తి

నోబృహస్పతిర్దధాతు। కేతవోఅరుణాసశ్చ। ఋషయోవాతర
శనాః। ప్రతిష్ఠాగ్ంశతధాహి। సమాహితాసోసహస్రధాయ
సం। శివానశ్శన్తమాభవన్తు। దివ్యాఆపఓషధయః। సుమృడీ
కాసరస్వతి। మాతేవ్యోమసందృశి॥ ౭౬॥ ౨౧॥ అవతారిక॥
(ఈయనువాకము మొదలు బృహస్పతిర్దధాతు అనువాక్యము
వఱకును శివానశ్శన్తమాభవన్తు, మొదలు చివరవఱకునుండు
వాక్యములు మొదటియనువాకమునందు నున్నవిగాన ఇక్క
డపదార్థతాత్పర్యములు, చెప్పలేదు. మిగిలిన వాక్యములకు
జెప్పఁబడును.)

ప॥ కేతవః। అరుణాసః। చ। ఋషయః। వాతరశనాః। ప్రతిష్ఠాం। శతధా।
హి। సమాహితాసః। సహస్రధాయసం॥

అ॥ కేతవః = కేతుగణమనియు, అరుణాసః = అరుణగణమనియు, వాతరశ
నాః = వాతరశనులనియుఁ జెప్పబడు, ఋషయః = మునీశ్వరులు, సమాహితాసః =
అప్రమత్తులై, శతధాహి = అనేకవిధములుగా, ప్రతిష్ఠాం = స్థితికి గారణమైనదియు,
సహస్రధాయసం = అనేకవిధములగు ఫలములను ధరించియున్నదియునగు నిష్టదేవ
తను సేవించుచుందురు.

తా॥ కేతు, అరుణ, వాతరశన, అను నామములచేఁ జెప్పబడు మునిగణములు
స్థిరమైన మనస్సుగలవారై యనేక ప్రకారములుగాఁ బ్రతిష్ఠకారణమైనదియు ననేక
ఫలముల నిచ్చునదియునగు జలరూపమైన యిష్టకను సేవించుచున్నారు.

ఇత్యేకవిగ్ంశోనువాకస్సమాప్తః

—♦ అథద్వావింశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ యోపాం పుష్పంవేద। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్భ
వతి॥ చంద్రమావా అపాంపుష్పం। పుష్పవాన్ప్రజావాన్ప
శుమాన్భవతి। యఏవంవేద॥

ప॥ యః। అపాం। పుష్పం। వేద। పుష్పవాన్। ప్రజావాన్। పశుమాన్।
భవతి। చంద్రమాః। వా। అపాం। పుష్పం। పుష్పవాన్। ప్రజావాన్। పశు
మాన్। భవతి। యః। ఏవం। వేద॥

అ॥ యః=ఎవఁడుఁ అపాం=ఉదకములయొక్క, పుష్పం=పుష్పమును, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, పుష్పవాన్=పుష్పములు కలవాఁడును, ప్రజావాన్=సంతానము కలవాఁడును, పశుమాన్=పశువులు కలవాఁడును, భవతి= అగుచున్నాఁడు, చంద్రమావా=చంద్రుఁడు, అపాం=ఉదకములయొక్క, పుష్పం= పుష్పమై, అభవత్=అయెను, యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, పుష్పవాన్=పుష్పములు కలవాఁడును, ప్రజావాన్=సంతానము కలవాఁడును, పశుమాన్=పశువులు కలవాఁడును, భవతి= అగుచున్నాఁడు ॥

తా॥ ఎవఁడు జలముయొక్క పుష్పమును దెలిసికొనుచున్నాఁడో వాఁడు పుష్పములు కలవాఁడును సంతానము కలవాఁడును పశుసమృద్ధి కలవాఁడును అగు నని చెప్పిరి. కాఁబట్టి యిక్కడ జలములయొక్క పుష్పమేదియని విచారణఁజేయఁగా, అమృతకళావిశిష్టుఁడును సర్వప్రాణి సంతోషకరుఁడునగు చంద్రుఁడు జలములయందు బుట్టెనుగాన జంద్రునిఁజెప్పిరి. కాఁబట్టి యెవఁడు చంద్రుని జలసంబంధమగు పుష్పముగాఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడు భోగార్థమై చంపకాది పుష్పములు కలవాఁడును సంతానము కలవాఁడును పశువులు కలవాడునగును.

మూ॥ యోఽపామాయతనం వేద । ఆయతనవాన్భవతి । అగ్నిర్వా అపామాయతనం । ఆయతనవాన్భవతి । యోఽగ్నేరాయతనం వేద ॥ ౨౨ ॥ ఆయతనవాన్భవతి । ఆపో వా అగ్నేరాయతనం । ఆయతనవాన్భవతి । య ఏవం వేద॥

ప॥ యః । అపాం । ఆయతనం । వేద । ఆయతనవాన్ । భవతి । అగ్నిః । వా । అపాం । ఆయతనం । ఆయతనవాన్ । భవతి । యః । అగ్నేః । ఆయతనం । వేద । ఆయతనవాన్ । భవతి । ఆపః । వా । అగ్నేః । ఆయతనం । ఆయతనవాన్ భవతి । యః । ఏవం । వేద॥

అ॥ యః=ఎవఁడు, అపాం=ఉదకములయొక్క, ఆయతనం = స్థానమును వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానముకలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, అగ్నిర్వా = అగ్నిహోత్రుఁడు, అపాం = ఉదకములకు, ఆయతనం=స్థానము, ఇతి=ఈలాగని, యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో,

సః=వాఁడు, ఆయతనవాన్=స్థానము కలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, యః=ఎవఁడు, అగ్నేః=అగ్నియొక్క, ఆయతనం=స్థానమును, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, ఆపోవా=జలములు, అగ్నేః=అగ్నికి, ఆయతనం=స్థానము, ఏవం=ఈ ప్రకారముగా యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానము కలవాఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఎవఁడుజలములకుఁ గారణమేదియని విచారణఁ జేయుచున్నాఁడోఁ వాఁడుపునరావృత్తి రహితమైన స్థానమును బొందుచున్నాఁడో, విచారణఁజేసిన పిమ్మట "అగ్నేరాపః" అనునట్టి శ్రుతిప్రమాణమువలన జలములకు నగ్నియే కారణమనియు నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు పునరావృత్తి రహితమైన పదమును బొందును. ఈ యగ్నికి నాధారమేదియని తిరిగి విచారణఁజేయఁగా నవాంతర సృష్టియందు "ఆపోవా ఇదమగ్రేసలిలమాసీత్" అనుశ్రుతి ప్రమాణమువలన సృష్టికి మొదట జలములుండి ప్రపంచమునకుఁ గారణమైనవియనియు నట్టి ప్రపంచాంతర్వర్తియైన యగ్నికి జలములే కారణమనియు నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడుపునరావృత్తిరహితమైన స్థానమును బొందుచున్నాఁడు. ఇక్కడ నగ్నివలన జలములుపుట్టినవని చెప్పుట మహాసృష్టియందనియు నగ్నికిజలము లాధారమని తిరిగిచెప్పుట అవాంతరసృష్టియందనియుఁ దెలిసికొనవలయును. ఇదేప్రకారముగా ఈయనువాకమునందు ముందుచెప్పబోవు వాక్యముల యందంతటను దెలిసికొనవలయును.

మూ॥ యో౽పామాయతనం వేద। ఆయతనవాన్భవతి। వాయుర్వా అపామాయతనం। ఆయతనవాన్భవతి। యో వాయోరాయతనం వేద। ఆయతనవాన్భవతి ॥ ౨౮ ॥ ఆపో వై వాయో రాయతనం। ఆయతనవాన్భవతి। య ఏవం వేద ॥

ప॥ యః। అపాం। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। వాయుః। వా। అపాం। ఆయతనం। ఆయతనవాన్। భవతి। యః। వాయోః। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। ఆపః। వై। వాయోః। ఆయతనం। ఆయతనవాన్। భవతి। యః। ఏవం। వేద॥

అ॥ యః = ఎవడు, అపాం = ఉదకములయొక్క, ఆయతనం = స్థానమును, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, ఆయతనవాన్ = స్థానము గలవాడు, భవతి = అగుచున్నాడు, వాయుర్వా = వాయువు, అపాం = ఉదకములకు, ఆయతనం = స్థానమని యెవడు తెలిసికొనుచున్నాడో, సః = వాడు, ఆయతనవాన్ = స్థానముకలవాడు, భవతి = అగుచున్నాడు, యః = ఎవడు, వాయోః = వాయువుయొక్క, ఆయతనం = స్థానమును, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, ఆయతనవాన్ = స్థానముకలవాడు, భవతి = అగుచున్నాడు, ఆపోవై = జలములు, వాయోః = వాయువునకు, ఆయతనం = స్థానమని, యః=ఎవడు, వేద=తెలిసికొనుచున్నాడో, సః=వాడు, ఆయతనవాన్= స్థానముగలవాడు, భవతి=అగుచున్నాడు.

తా॥ "వాయోరగ్నిః" అనుశ్రుతి ప్రమాణము వలన వాయువు వలన నగ్నియు నగ్ని వలన జలమును బుట్టినదని చెప్పుటచేత మహాసృష్టియందు జలమునకు నగ్ని ద్వారా వాయువు కారణమనియు నవాంతర సృష్టియందు జలమే యన్నింటికిం గారణమనియు నెవడు తెలిసికొనుచున్నాడో వాడు పునరావృత్తి రహితమైన పదవిని బొందును.

మూ॥ యోపామాయతనంవేద। ఆయతనవాన్భవతి। అసౌవై తపన్నపామాయతనం। ఆయతనవాన్భవతి। యోముష్యతపత ఆయతనంవేద। ఆయతనవాన్భవతి। ఆపోవా ఆముష్యతపత ఆయతనం ॥ ౭౯ ॥ ఆయతనవాన్భవతి। యఏవంవేద ॥

ప॥ యః। అపాం। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। అసౌ। వై। తపన్। అపాం। ఆయతనం। ఆయతనవాన్। భవతి। యః। అముష్య। తపతః। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। ఆపః। వై। అముష్య। తపతః। ఆయతనం। ఆయతనవాన్। భవతి। యః। ఏవం। వేద ॥

అ॥ యః=ఎవడు, అపాం=ఉదకముల యొక్క, ఆయతనం=స్థానమును, వేద=తెలిసికొనుచున్నాడో, సః=వాడు, ఆయతనవాన్=స్థానము కలవాడు, భవతి=అగుచున్నాడు, అసౌ = ఈ, తపన్ = ప్రకాశించుచున్న సూర్యుడు, అపాం=ఉదకములకు, ఆయతనంవై=స్థానముకదా, ఈ ప్రకాశముగాం తెలిసికొని

నవాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, యః= ఎవఁడు, అముష్య=ఈ, తపతః=ప్రకాశించుచున్న సూర్యునియొక్క, ఆయతనం= స్థానమును, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానము కలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, ఆపః=జలములు, అముష్య=ఈ, తపతః= ప్రకాశించుచున్న సూర్యునకు, ఆయతనం=స్థానమని, యః=ఎవఁడు, వేద=తెలిసి కొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానముకలవాఁడు, భవతి=అగు చున్నాఁడు.

తా॥ ఆదిత్యాజ్జాయతే వృష్టిః, అను ప్రమాణమువలన సూర్యునివలన వర్షము గల్గునని చెప్పఁబడియున్నది గాన జలములకు సూర్యుఁడు స్థానమనియుఁ బైనిచెప్పిన రీతిగా జలములు సూర్యునకును స్థానమనియు నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు పునరావృత్తిరహితమైన స్థానమును బొందును.

మూ॥ యోఽపామాయతనం వేద। ఆయతనవాన్భవతి। చంద్ర మావా అపామాయతనం। ఆయతనవాన్భవతి। యశ్చంద్ర మస ఆయతనం వేద ఆయతనవాన్భవతి। ఆపోవై చంద్రమస ఆయతనం ఆయతనవాన్భవతి ॥ ౮౦ ॥ యఏవం వేద॥

ప॥ యః। అపాంఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। చంద్రమాః। వై। అపాం। ఆయతనం। ఆయతనవాన్। భవతి। యః। చంద్రమసః। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। ఆపః। వై। చంద్రమసః। ఆయతనం। ఆయతన వాన్। భవతి। యః। ఏవం వేద॥

అ॥ యః = ఎవఁడు, అపాం = ఉదకములయొక్క, ఆయతనం = స్థానమునుఁ వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, చంద్రమాః = చంద్రుఁడు, అపాం = ఉదకములకు, ఆయతనమితి = స్థానమని యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు, ఆయతనవాన్= స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, యః = ఎవఁడు, చంద్రమసః = చం ద్రునియొక్క, ఆయతనం = స్థానమును, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, ఆపః = జల ములు, చంద్రమసః = చంద్రునకు, ఆయతనం = స్థానమని, యః = ఎవఁడు, వేద =

తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ =స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు ॥

తా॥ మంచువర్షించునట్టి శీతలకిరణములు చంద్రుని సంబంధమైనవగుటచేతఁ జంద్రుఁడు జలములకు స్థానమనియు బూర్వమందుఁ జెప్పినరీతిగా జలములు చంద్రునకు స్థానమనియు నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు పునరావృత్తి రహితమైన స్థానమును బొందును.

మూ॥ యోఽపామాయతనం వేద । ఆయతనవాన్భవతి । నక్షత్రాణివా అపామాయతనం । ఆయతనవాన్భవతి । యోనక్షత్రాణామా యతనం వేద । ఆయతనవాన్భవతి । ఆపోవై నక్షత్రాణామాయ తనం । ఆయతనవాన్భవతి । యఏవం వేద ॥ ౨౧ ॥

ప॥ యః । అపాం । ఆయతనం । వేద । ఆయతనవాన్ । భవతి । నక్షత్రాణి । వై । అపాం । ఆయతనం । ఆయతనవాన్ । భవతి । యః । నక్షత్రాణాం । ఆయతనం । వేద । ఆయతనవాన్ । భవతి । ఆపః । వై । నక్షత్రాణాం । ఆయతనం । ఆయతనవాన్ । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ యః=ఎవఁడు, అపాం=ఉదకములయొక్క, ఆయతనం=స్థానమును, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానముకలవాఁడు, భవతి=అగుచున్నాడు, నక్షత్రాణివై=నక్షత్రములు, అపాం=ఉదకములకు, ఆయతనం=స్థానము, అని యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు, ఆయతనవాన్=స్థానముకలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, యః=ఎవఁడు, నక్షత్రాణాం=నక్షత్రముల యొక్క, ఆయతనం=స్థానమును, వేద=తెలిసికొనుచున్నాడో, సః=వాడు, ఆయతనవాన్=స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, ఆపోవై = ఉదకములు, నక్షత్రాణాం=నక్షత్రములకు, ఆయతనం=స్థానమని, యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్=స్థానముకలవాడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ మృగశీర్ష మొదలుకొని వర్షమును గురియునట్టి కొన్ని నక్షత్రము లుండుటచేతను వానిలోఁబుష్యమి మొదలు విశాఖ పర్యంతము విశేషముగా వర్షమును గురియునట్టి నక్షత్రము లగుటచేతను నక్షత్రములుదకమునకు స్థానమనియుఁబూర్వమందు

జెప్పబడిన రీతిగా నుదకము నక్షత్రములకు స్థానమనియు నెవఁడు తెలిసికొను చున్నాఁడో వాఁడు పునరావృత్తి రహితమైన స్థానమును బొందును.

మూ॥ యోఽప్సామాయతనం వేద । ఆయతనవాన్భవతి । పర్జన్యోవా అపామాయతనం । ఆయతనవాన్భవతి । యః పర్జన్యస్యాయతనం వేద । ఆయతనవాన్భవతి । ఆపో వై పర్జన్యస్యాయతనం । ఆయతనవాన్భవతి । యఏవం వేద॥

ప॥ యః । అపాం । ఆయతనం । వేద । ఆయతనవాన్ । భవతి । పర్జన్యః । వై । అపాం । ఆయతనం । ఆయతనవాన్ । భవతి । యః । పర్జన్యస్య । ఆయతనం । వేద ఆయతనవాన్ । భవతి । ఆపః । వై । పర్జన్యస్య । ఆయతనం । ఆయతనవాన్ । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ యః = ఎవఁడు, అపాం = ఉదకములయొక్క, ఆయతనం= స్థానమును వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకల వాఁడు, భవతి = అగుచున్నాఁడు, పర్జన్యః = మేఘము, అపాం = ఉదకములకు, ఆయతనం = స్థానము, అని తెలిసికొనినవాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, యః = ఎవఁడు, పర్జన్యస్య = మేఘముయొక్క, ఆయతనం = స్థానమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాడు, ఆపః = ఉదకములు, పర్జన్యస్య = మేఘమునకు, ఆయతనం = స్థానము, అని యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు ॥

తా॥ మేఘమువలన వర్షముగురియుట లోకప్రసిద్ధమైయున్నది గాన మేఘముదకమునకు స్థానమనియు నీ జలముల తపించునట్టి సూర్యకిరణములద్వారా మేఘమగుటచే జలము మేఘమునకు నాధారమనియు లేక పూర్వమందువన్నిటికి నాధారముఁజెప్పినట్లుగానైన నాధారమనియు నెవఁడు తెలిసికొనుచున్నాడో వాఁడు పునరావృత్తిరహితమైన స్థానమును బొందఁగలఁడు.

మూ॥ యోఽపామాయతనం వేద ॥ ౮౨ ॥ ఆయతనవాన్భవతి । సంవత్సరోవా అపామాయతనం । ఆయతనవాన్ భవతి । యస్సంవత్స

రస్యాయతనం వేద। ఆయతనవాన్భవతి। ఆపో వై సంవత్సర స్యాయతనం। ఆయతనవాన్భవతి। యఏవం వేద॥

ప॥ యః। అపాం। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। సంవత్సరః। వై। అపాం। ఆయతనం। ఆయతనవాన్। భవతి॥ యః। సంవత్సరస్య। ఆయతనం। వేద। ఆయతనవాన్। భవతి। ఆపః। వై। సంవత్సరస్య। ఆయతనం। ఆయతన వాన్। భవతి। యః। ఏవం। వేద॥

అ॥ యః = ఎవఁడు, అపాం = ఉదకములయొక్క, ఆయతనం = స్థానమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, సంవత్సరః = సంవత్సరము, అపాం = ఉదకములకు, ఆయతనం = స్థానము, అని తెలిసికొనినవాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు భవతి=అగుచున్నాఁడు, యః=ఎవఁడు, సంవత్సరస్య=సంవత్సరముయొక్క, ఆయ తనం=స్థానమును, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్= స్థానముకలవాఁడు, భవతి=అగుచున్నాఁడు, ఆపః=ఉదకములు, సంవత్సరస్య=సం వత్సరమునకు, ఆయతనం=స్థానము, అని, యః=ఎవఁడు, వేద=తెలిసికొనుచు న్నాఁడో, సః=వాఁడు, ఆయతనవాన్ = స్థానముకలవాఁడు, భవతి, అగు చున్నాఁడు॥

తా॥ వర్షర్తువునందు వర్షము గురియుటచేతను ఆవర్షర్తువు సంవత్సరాంతః పాతియగుటచేతను సంవత్సరముదకమునకు స్థానమనియు సంవత్సరమునకును జలము కారణమనియు నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడుపునరావృత్తి రహితమైన స్థానముపొందును.

మూ॥ యోఽప్సు నావం ప్రతిష్ఠితాం వేద। ప్రత్యేవతిష్ఠతి॥ ౧౭॥ ఇమే వై లోకా అప్సు ప్రతిష్ఠితాః। తదేషాఽభ్యనూక్తా॥

ప॥ యః। అప్సు। నావం। ప్రతిష్ఠితాం। వేద। ప్రతి। ఏవ। తిష్ఠతి। ఇమే। వై। లోకాః। అప్సు। ప్రతిష్ఠితాః। తత్। ఏషా। అభి। అనూక్తా॥

అ॥ ఇమే=ఈ, లోకాః=లోకములు, అప్సు=ఉదకములయందు, ప్రతిష్ఠి తాః=నిలిచియున్నవి, యః=ఎవఁడు, ఏతేషాం=ఈలోకముయొక్క స్థితిని, అప్సు=

ఉదకములయందు, ప్రతిష్ఠితాం = ఉంచబడిన, నావం=ఓడనుగాను, అనఁగా నోడ యొక్క స్థితివంటి స్థితినిగాను, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, ప్రతితిష్ఠత్యేవ=స్థితిగలవాఁడగుచున్నాఁడు ॥

తా॥ ఉదకము సమస్త ప్రపంచమునకు నాధారమగుటచేత జలమునందు ఓడ యేప్రకారముగా నుండునో ఆ ప్రకారముగానే ఈ లోకము లన్నియు నున్నవని యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు స్థిరమైన ప్రతిష్ఠ గలవాఁడగుచున్నాఁడు. ఓడ నీళ్ళయందున్నదియై ఇటు అటు కదలుచున్నది. సమస్తలోకములు నీళ్ళయందు కదలక స్థిరముగా నున్నవి.

మూ॥ అపాగ్ంరసముదయగ్ంసన్ । సూర్యేశుక్రగ్ంసమాభృతం ।
అపాగ్ంరసస్యయోరసః । తంవోగృహ్ణామ్యుత్తమమితి ॥

ప॥ అపాం । రసం । ఉదయం । సన్ । సూర్యే । శుక్రం । సమాభృతం । అపాం । రసస్య । యః । రసః । తం । వః । గృహ్ణామి । ఉత్తమం । ఇతి ॥

అ॥ అపాంరసం=ఉదకసారమగు లోకత్రయము, ఉదయంసన్=ఉద్భవించిన దగుచుండఁగా, సూర్యే=సూర్యునియందు, శుక్రం = నిర్మలమగు ప్రకాశము, సమాభృతం=సంపాదింపఁబడినది, అపాంరసస్య = ఉదకసారమగు లోకత్రయము యొక్క, యః=ఏ, రసః=సోమరసముకలదో, వః=మీ సంబంధమగు, ఉత్తమం= శ్రేష్ఠమగు, తం=ఆ సోమరసమును, గృహ్ణామి=గ్రహించుచున్నాను.

తా॥ అపఏవ ససర్జాదౌ, అను స్మృతి ప్రమాణమువలనఁ బ్రథమమునఁ బరమాత్మ తన వీర్యమును జలమందు విడిచిపెట్టినట్లును ఆ వీర్యము బంగారు గ్రుడ్డుగా ఘనీభవింపఁగా నా గ్రుడ్డు వలన నీలోకము లన్నియుద్భవించినట్లును జెప్పఁబడినదిగాన ఈ లోకములుదకసారముగాఁ జెప్పఁబడియె. అట్టి యుదకసారములగు నీ లోకముల పోషణకొఱకు సూర్యప్రకాశ మేర్పడెను. ఉదకసారములగు లోకములలో రసములలో నుత్తమ రసమగు సోమరసమును మేము పొంది స్థిరమగు స్వర్గలోకనివాసమును బొందఁగలము.

మూ॥ ఇమేహ్యేతేలోకా అపాగ్ంరసః। తేముష్మిన్నాదిత్యే సమాభృతాః॥

ప॥ ఇమే । వై । లోకాః । అపాం । రసః । తే । అముష్మిన్ । ఆదిత్యే । సమాభృతాః॥

అ॥ ఇమేవై=ఈ, లోకాః = లోకములు, అపాం = ఉదకముల యొక్క, రసః=రసము, తే=ఆలోకములు, అముష్మిన్=ఈ, ఆదిత్యే=సూర్యునియందు, సమాభృతాః=ఆశ్రయించియున్నవి.

తా॥ ఈ లోకములు జలముల సారముగాఁ జెప్పబడినవి. ఈ లోకములు సూర్యుని యధీనమందున్నవి. అనఁగా సూర్యుఁడు వర్షమును గురిపించి పోషించుటవలన లోకములకు నాధారుఁడైయున్నాఁడు.

మూ॥ జానుదఘ్నీ ముత్తరవేదింఖాత్వా । అపాం పూరయిత్వాగుల్ఫదఘ్నం । ౮౮॥ పుష్కరపర్ణైః పుష్కరదండైః పుష్కరైశ్చ సగ్గ్‌స్తీర్య । తస్మిన్విహాయసే । అగ్నిం ప్రణీయోపసమాధాయ॥

ప॥ జానుదఘ్నీం । ఉత్తరవేదీం । ఖాత్వా । అపాం । పూరయిత్వా । గుల్ఫదఘ్నం । పుష్కరపర్ణైః । పుష్కరదండైః । పుష్కరైః । చ । సంస్తీర్య । తస్మిన్ । విహాయసే । అగ్నిం । ప్రణీయ । ఉపసమాధాయ ॥

అ॥ జానుదఘ్నీం = మోకాలిలోఁతుగల, ఉత్తరవేదీం = ఉత్తరదిక్కుననొకవేదికను, ఖాత్వా = త్రవ్వి, గుల్ఫదఘ్నం = చీలమండలోఁతు గానుండునట్లు, అపాం = ఉదకములయొక్క, పూరయిత్వా = నిండించి, అనఁగా జలమునుంచి, తతః = దానిపైని, పుష్కరపర్ణైః = తామరాకులచేతను, పుష్కరదండైః =తామరకాడలచేతను, పుష్కరైశ్చ = తామరపువ్వులచేతను, సంస్తీర్య = కప్పి, తస్మి = ఆ, విహాయసే = ఆకాశమునందు, అగ్నిం = అగ్నిహోత్రమునుంచి, ప్రణీయ = మండింపఁజేసి, ఉపసమాధాయ = ధ్యానాదిక్రియలను జేయవలయును.

తా॥ సూర్యునిగుఱించి యజ్ఞమును జేయఁదలఁచినవారు మోకాలిలోఁతుగల నగ్నిహోత్రికుండమును ద్రవ్వియందులోఁ జీలమండలలోఁతున జలమునుంచి దానిపైని దామరాకులను దానిపైని దామరకాడలను వానిపైని దామరపూలనుంచి మంచిగా నేర్పఱిచి దానిపైభాగమున నుండు నాకాశమునందు " అనఁగా నాయుంచెయుంటు "

అగ్నిహోత్రమునుంచి ప్రజ్వరింపఁజేసి యథావిధిగా మంత్రములచే సంస్కరింపఁజేసి పిమ్మట నగ్నికిఁ బరిసమూహ్యము చేయవలయును.

మూ॥ బ్రహ్మవాదినోవదన్తి । కస్మాత్ప్రణీతేయమగ్నిశ్చీయతే। సాప్ర ణీతేయమప్సుహ్యాయంచీయతే । అసౌభువనేప్యనాహితాగ్ని రేతాః । తమభిత ఏతాఅభీష్టకా ఉపదధాతి॥

ప॥ బ్రహ్మవాదినః । వదన్తి । కస్మాత్ । ప్రణీ । తే । అయం । అగ్నిః । చీయతే । సాప్రణీతే । అయం । అప్సు । హి । అయం । చీయతే । అసౌ । భువనే । అపి । అనాహితాగ్నిః । ఏతాః । తం । అభితః । ఏతాః । అభీష్టకాః । ఉప । దధాతి ॥

అ॥ కస్మాత్ = ఏకారణమువలన, అయం = ఈ అగ్నిః= అగ్నిహోత్రము, ప్రణీతే = సంస్కరింపఁబడిన దగుచుండగా, చీయతే = ప్రోగుఁజేయఁబడుచున్నది, ఇతి = ఈప్రకారము ప్రశ్నఁజేయఁగా, సాప్రణీతే= జలముతోఁగూడిన యగ్ని సంస్కరింపఁబడిన దగుచుండఁగా, అయం = ఈ, అప్సు = జలములయందు, చీయతే= ప్రోగుఁజేయఁబడుచున్నది, అసౌ = ఈయగ్ని, భువనేపి = దేవయజనము లేని లోకము నందును, ఏతాః = దాఁటివెళ్ళును, అనాహితాగ్నిః = ఆహితాగ్ని కాకపోవును, ఇతి = ఈలాగని, తం = ఆ సంస్కరింపఁబడిన యగ్నిని, అభితః = అంతటను, ఏతాః = ఈ, అభీష్టకాః = జలాధిదేవతలు, ఉపదధాతి = ఆవరించియుండెను. ఇతి = ఈ ప్రకారముగా, బ్రహ్మవాదినః = బ్రహ్మవేత్తలు, వదన్తి = ప్రశ్నోత్తర రూపముగాఁ బ్రసంగముఁజేసిరి.

తా॥ కొన్ని కార్యములయందు ముందుగా నగ్నిని బరిసమూహ్యముఁజేసి పిమ్మట మంత్రములచే సంస్కరింపఁజేయుచున్నారు. ఇక్కడ ముందుగా నగ్నిని సంస్కరింపఁజేసి పిమ్మటఁ బరిసమూహ్యముఁజేయవలెనని చెప్పుట యేమి హేతువు. అని బ్రహ్మవేత్తలలో కొందఱు ప్రశ్నఁజేయఁగా మఱికొందఱు సమాధానమును జెప్పుచున్నారు. ఇతరకర్మలయందగ్నికి జలసంబంధములేదు. ఇక్కడ జలసంబంధ మైన యగ్నినిగుఱించి చెప్పఁబడెను గావున నాక్షేపణలేదనిరి. మఱియు మీ పక్ష మున ముందుగానే యగ్నిని సంస్కరింపఁజేయవలయునని యున్నయెడల బిమ్మట బరిసమూహ్యముఁజేయుట యేమికారణము ? మానరాదా ? అని ప్రశ్నఁజేయఁగా

సమాధానముఁ జెప్పుచున్నారు. ఇతరకర్మలయందైన యగ్నికి జలమువలన భయము లేదు. ఈ యగ్ని జలసహితమైన ప్రదేశమునందుంచఁబడుటచేత జలమువలన భయపడి దేవయజనములేని లోకమునకు వెళ్ళునేమోయనియు నట్లు వెళ్లుటచేతన నాహితాగ్ని యగునినియు నుద్దేశ్యముచే నగ్ని పరిసమూహ్యముచేసి జలాధిదేవతలను రక్షణకొఱకు నేర్పఱచిరి. ఈ ప్రకారముగా నాక్షేపసమాధానరూపమైన ప్రసంగమును బ్రహ్మవేత్తలు ప్రశంసఁజేసిరి.

మూ॥ అగ్నిహోత్రే దర్శపూర్ణమాసయోః । పశుబంధేచాతుర్మాస్యేషు ॥ ౮౫ ॥ అథోఆహుః । సర్వేషు యజ్ఞక్రతుష్వితి ॥

ప॥ అగ్నిహోత్రే । దర్శపూర్ణమాసయోః । పశుబంధే । చాతుర్మాస్యేషు । అథః । ఆహుః । సర్వేషు । యజ్ఞక్రతుషు । ఇతి ॥

అ॥ దర్శపూర్ణమాసయోః = దర్శపూర్ణమాసములను చెప్పఁబడు నిష్టులయందును, అగ్నిహోత్రే=నిత్యాగ్నియందును, పశుబంధే=ఛాగము మొదలగు పశువుల సంబంధమగు యజ్ఞములయందును, చాతుర్మాస్యేషు=చాతుర్మాస్య సంబంధమగు నగ్నిహోత్రములయందును, ఆరుణకేతుకః = ఆరుణకేతుకాగ్ని, ఉక్తః= చెప్పఁబడెను, అథః=ఇదియేకాదు, సర్వేషు=సమస్తమైన, యజ్ఞక్రతుషు, యజ్ఞములయందు, ఉక్తః=చెప్పఁబడెను, ఇతి=ఈలాగని, ఆహుః=బ్రహ్మవేత్తలు చెప్పిరి॥

తా॥ ఈ యారుణకేతుకాగ్ని యే యే కర్మలయందు ఉపయోగింపఁబడునో యని ప్రశ్న కలుగఁగా బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. అగ్నిహోత్రములయందును, అమావాస్యయందునను పూర్ణిమయందునను జేయుచుండెడి దర్శపూర్ణమాసలను ఇష్టులయందును మేక మొదలగు పశువుల సంబంధమగు యజ్ఞములయందును ఇదియది చెప్పనేల సమస్తమైన యజ్ఞములయందును నారుణకేతుకాగ్ని యుపయోగింపఁబడునని బ్రహ్మవేత్తలు చెప్పిరి.

మూ॥ ఏతద్ధస్మవా ఆహుశ్శండిలాః । కమగ్నించినుతే । సత్రియమగ్నించిన్వానః । సంవత్సరం ప్రత్యక్షేణ॥

ప॥ ఏతత్ । హ । స్మ । వై । ఆహుః । శండిలాః । కం । అగ్నించినుతే సత్రియం । అగ్నిం । చిన్వానః । సంవత్సరం । ప్రత్యక్షేణ॥

అ॥ శండిలాః=శండిల మహాముని సంతతి మునీశ్వరులు, ఏతత్=ఈ యారుణ కేతుకాగ్ని యొక్క ఫలమును నిశ్చయించుట కొఱకు, అహుఃపాస్మై=పరస్పరము ముందు ఈ చెప్పఁబోవు ప్రకారముగా సంభాషించిరి, అది యెట్లనఁగా, సత్రియం=యజ్ఞసంబంధమగు, అగ్నిం=అగ్నిహోత్రమును, కం=ఏమి ఫలము నుద్దేశించి, చినుతే=హోమాదిక్రియచేఁ బూజించుచున్నాఁడు, అని ప్రశ్నఁజేయఁగా, సత్రియం=యజ్ఞసంబంధమగు, అగ్నిం=అగ్నిహోత్రమును, చిన్వానః=పూజించినవాఁడై, ప్రత్యక్షేణ=ప్రత్యక్షముగా, సంవత్సరం=సంవత్సరము వలన, గలుగు ఫలమును బొందును. అని కొందఱు ప్రత్యుత్తర మిచ్చిరి.

తా॥ శండిలుఁడను నొక మునీశ్వరుఁడు కలఁడు. ఆయన సంతతివారందఱు శండిలులు అని చెప్పఁబడుదురు. అట్టి శండిలులు ఆరుణకేతుకాగ్నిని బూజించిన యేమి ఫలము గలుగునని ఫలమును నిశ్చయించుట కొఱకు ఈముందు చెప్పఁబోవు ప్రకారముగాఁ బ్రశ్నోత్తరముతో సంభాషించిరి. అది యెట్లనఁగా, యజ్ఞసంబంధమగు నగ్నిని ఏమి ఫలమును గుఱించి హోమాదిక్రియలచేఁ బూజించెదరని ప్రశ్న చేయఁగా యజ్ఞమందు నగ్నిహోత్రమునందు హవిస్సుల నుంచుటచే దేవతలు తృప్తి నొంది వర్షమును గురిపింతురు. అందు వలన సమస్త సస్యములు ఫలించును. కాఁబట్టి సంవత్సరము సుఖింపఁదగిన ఫలమును ప్రత్యక్షముగాఁ బొందునని యుత్తర మిచ్చిరి.

మూ॥ కమగ్నిం చినుతే । సావిత్రమగ్నిం చిన్వానః । అముమాదిత్యం ప్రత్యక్షేణ ॥

ప॥ కం । అగ్నిం । చినుతే । సావిత్రం । అగ్నిం । చిన్వానః । అముం । ఆదిత్యం । ప్రత్యక్షేణ ॥

అ॥ సావిత్రం=సూర్యదేవతాకమైన యగ్నిహోత్రమును, కం = ఏమిఫలము నపేక్షించి, చినుతే = యజించుచున్నాఁడు, అని ప్రశ్నఁవేయఁగా, సావిత్రం=సూర్యదేవతాకమైన, అగ్నిం=అగ్నిని, చిన్వానః=పూజించినవాఁడై, అముం=ఈ, ఆదిత్యం=సూర్యుని, ప్రత్యక్షేణ=ప్రత్యక్షముగాఁ బొందుచున్నాడు, అని ప్రత్యుత్తరమిచ్చిరి.

తా॥ సూర్యుని గుఱించి చేయఁబడు నగ్నిహోత్రమువలన నేమిఫలముగలుగునని ప్రశ్నఁ జేయఁగా సూర్యుని హవ్యాదులచేఁ బూజించుటవలన సూర్యునిఁ బ్రత్య

క్రమముఁ జేసికొని తన్మండల మధ్యవర్తియగు పరమాత్మను బొందునని ప్రత్యుత్తర మిచ్చిరి.

మూ॥ కమగ్నించినుతే ॥ ౮౬ ॥ నాచికేతమగ్నించిన్వానః । ప్రాణా న్ప్రత్యక్షేణ॥

ప॥ కం । అగ్నిం । చినుతే । నాచికేతం । అగ్నిం । చిన్వానః । ప్రాణాన్ ప్రత్యక్షేణ॥

అ॥ నాచికేతం = వాయు సంబంధమగు, అగ్నిం = అగ్నిని, కం = ఏమి ఫలము నపేక్షించి, చినుతే= పూజించుచున్నాఁడు, అని ప్రశ్న జేయఁగా, నాచి కేతం = వాయుసంబంధమగు, అగ్నిం = అగ్నిని । చిన్వానః = పూజించినవాఁడై, ప్రాణాన్ = ప్రాణవాయును, ప్రత్యక్షేణ = ప్రత్యక్షము గా, ఆప్నోతి=పొందు చున్నాఁడు, ఇతి ఈప్రకారముగా నుత్తరమిచ్చిరి.

తా॥ నాచికేతాగ్నిని బూజించుటచేనేమి ప్రయోజనమని ప్రశ్నఁజేయఁగా నాచికే తాగ్ని యనఁగా వాయుదేవతాకమగునగ్ని గనుకనట్టి వాయువును బూజించుటవలనఁ బ్రాణవాయువును బలపఱుచుట రూపమైన ప్రత్యక్షఫలమును బొందునని ప్రత్యు త్తర మిచ్చిరి.

మూ॥ కమగ్నించినుతే । చాతుర్హోత్రియమగ్నించిన్వానః । బ్రహ్మ ప్రత్యక్షేణ॥

ప॥ అగ్నిం । చినుతే । చాతుర్హోత్రియం । అగ్నిం । చిన్వానః । బ్రహ్మ, ప్రత్యక్షేణ॥

అ॥ అగ్నిం = చాతుర్హోతాగ్నిని, కం = ఏమిఫలము నపేక్షించి । చినుతే = పూజించుచున్నాఁడు, అని ప్రశ్న జేయఁగా, చాతుర్హోత్రియం, చాతుర్హోతాగ్నిని। చిన్వానః=పూజించినవాఁడై, బ్రహ్మ = వేదపురుషుని, ప్రత్యక్షేణ = ప్రత్యక్ష ముగాఁ బొందుచున్నాఁడు, అనిప్రత్యుత్తరమిచ్చిరి.

తా॥ చాతుర్హోతాగ్నిని పూజించుటవలన నేమిఫలము గలుగునని ప్రశ్నఁ జేయఁగా "బ్రహ్మవై చతుర్హోతారః" అని చెప్పుటవలనఁ జతుర్హోతాగ్ని బ్రహ్మ దేవతాకమైనది గానఁ బరమాత్మస్వరూపమగు వేదపురుషునిఁబొందును.

మూ॥ కమగ్నిం చినుతే। వైశ్వసృజమగ్నించిన్వానః। శరీరం ప్రత్య క్షేణ॥

ప॥ కం। అగ్నిం। చినుతే। వైశ్వసృజం। అగ్నిం। చిన్వానః। శరీరం। ప్రత్యక్షేణ॥

అ॥ అగ్నిం = వైశ్వసృజాగ్నిని, కం= ఏమిఫలమునపేక్షించి, చినుతే=పూజించు చున్నాఁడు, అని ప్రశ్నఁజేయఁగా, వైశ్వసృజం = విశ్వసృట్సంబంధమగు, అగ్నిం = అగ్నిని, చిన్వానః = పూజించినవాఁడై, శరీరం = శరీరమును, ప్రత్యక్షేణ= ప్రత్యక్షముగాఁ బొందుచున్నాడు అని ప్రత్యుత్తరమిచ్చిరి.

తా॥ విశ్వసృట్సంబంధమగు నగ్నిని బూజించుటవలన బ్రహ్మసంబంధమగు శరీరమును బొందుచున్నాఁడని ప్రత్యుత్తరమిచ్చిరి.

మూ॥ కమగ్నించినుతే। ఉపానువాక్యమాశుమగ్నించిన్వానః॥౭౭॥ ఇమాన్లోకాన్ప్రత్యక్షేణ॥

ప॥ కం। అగ్నిం। చినుతే। ఉపానువాక్యం। ఆశుం। అగ్నిం। చిన్వానః। ఇమాన్। లోకాన్। ప్రత్యక్షేణ॥

అ॥ అగ్నిం = అగ్నిని, కం = ఏమిఫలము నపేక్షించి, చినుతే = పూజించు చున్నాఁడు (అని ప్రశ్నఁజేయఁగా, ఉపానువాక్యం = ఉపానువాక్యమను కాండ యందుఁ జెప్పఁబడు నగ్నిహోత్రిని, చిన్వానః = పూజించినవాఁడై, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను, ప్రత్యక్షేణ = ప్రత్యక్షముగాఁ బొందుచున్నాఁడు, అని సమాధానముఁజెప్పిరి.

తా॥ "యదేకేన స్థాపతి" అనునట్టి యుపానువాక్యకాండయందుఁ జెప్పఁ బడు నగ్నిని బూజించుటవలన నేమి ప్రయోజనమనఁగా నుపానువాక్యకాండ యందుఁ జెప్పఁబడిన యగ్నిహోత్రమును బూజించుటచే సమస్తలోకములను సంచ రించునట్టిశక్తి కలుగునని ప్రత్యుత్తర మిచ్చిరి.

మూ॥ కమగ్నించినుతే। ఇమమారుణకేతు మగ్నిం చిన్వాన ఇతి। య ఏవాసౌ। ఇతశ్చా ముతశ్చావ్యతీపాతీ। తమితి॥

ప॥ కం। అగ్నిం। చినుతే। ఇమం। ఆరుణకేతుకం। అగ్నిం। చిన్వానః। ఇతి। యః। ఏవ। అసౌ। ఇతః। చ। అముతః। చ। అవ్యతీపాతీ। తం। ఇతి

అ॥ అగ్నిం= అగ్నిని, కం = ఏమిఫలము నపేక్షించి, చినుతే = పూజించుచున్నాఁడు, ఇతి=ఈ ప్రకారము ప్రశ్నఁజేయఁబడఁగా, యః=ఎవఁడు, ఇమం=ఈ, అరుణకేతుకమను పేరుగల, అగ్నిం=అగ్నిని, చిన్వానః = పూజించుచున్నాఁడో, అసౌ । ఇతశ్చ=ఇటు, అముతశ్చ = అటు, అవ్యతీపాతీ = కదలకసంచరించు నే మార్యుఁడుకలఁడో, తం=ఆసూర్యుని, ఆప్నోతి=పొందుచున్నాఁడు, ఇతి=ఈలాగునని సమాధానముఁ జెప్పిరి.

తా॥ అరుణకేతుకాగ్నిని బూజించుటవలన నేమిప్రయోజనమని ప్రశ్నఁజేయఁగా నారుణకేతుకాగ్నిని బూజించినవాఁడు ఈలోకమును అతిక్రమించి వెళ్లక నిక్కడనే ప్రకాశించుచున్నసూర్యుని బొందుచున్నాఁడని సమాధానముఁ జెప్పిరి. ఈ ప్రకారముగా శండిలమహామునిసంతతివారు అరుణకేతుకాగ్నియొక్క ఫలనిర్ధారణఁజేసిరి.

మూ॥ యో౽గ్నేర్మిథూయా వేద । మిథునవాన్భవతి । ఆపోవా అగ్నేర్మిథూయాః । మిథునవాన్భవతి । యఏవం వేద ॥ ౮౮ ॥౨౨॥

ప॥ యః । అగ్నేః । మిథూయాః । వేద । మిథునవాన్ । భవతి । ఆపః । వై । అగ్నేః । మిథూయాః । మిథునవాన్ । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ యః=ఎవఁడు, అగ్నేః=అగ్నిహోత్రునియొక్క, మిథూయాః = మిథునగమనములను, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, మిథునవాన్=స్థిరమైన దాంపత్య ధర్మముగలవాఁడు, భవతి = అగుచున్నాఁడు, ఆపోవై = ఉదకములు, అగ్నేః = అగ్నిహోత్రునియొక్క, మిథూయాః=మిథున విషయములఁ గలవి, యః=ఎవఁడు, ఏవం = ఈ ప్రకారముగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, మిథునవాన్ = దాంపత్య ధర్మముగలవాఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా॥ ఈ ప్రకారముగా నగ్నిహోత్రునకు జలములకును బరస్పర సంబంధరూపమగు మిథునభావము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు స్థిరమైన దాంపత్యధర్మము గలవాఁ డగుచున్నాఁడు.

ఇతి ద్వావింశోనువాకస్సమాప్తః.

—♦ అథ త్రయోవింశోనువాకప్రారంభః ♦—

మూ॥ ఆపోవాఇదమాసన్థ్సలిలమేవ। సప్రజాపతిరేకః పుష్కరపర్ణే సమభవత్। తస్యాన్తర్మనసికామ స్సమవర్తత। ఇదꣳ సృజేయమితి। తస్మాద్యత్పురుషో మనసాభిగచ్ఛతి। తద్వాచా వదతి। తత్కర్మణా కరోతి। తదేషాభ్యనూక్తా॥

ప॥ ఆపః। వై। ఇదం। ఆసన్। సలిలం। ఏవ। సః। ప్రజాపతిః। ఏకః। పుష్కరపర్ణే। సం। అభవత్। తస్య। అంతః। మనసి। కామః। సం। అవర్తత। ఇదం। సృజేయం। ఇతి। తస్మాత్। యత్। పురుషః। మనసా। అభి। గచ్ఛతి। తత్। వాచా। వదతి। తత్। కర్మణా। కరోతి। తత్। ఏషా। అభి। అను। ఉక్తా॥

అ॥ ఇదం=ఈ కనఁబడునట్టి ప్రపంచము, ఆపోవై=జలమయముగా, ఆసన్=ఉండెను, సలిలమేవ=జలభూత మొక్కటియే యుండెను, జలమయముగా నుణ్డ దని చెప్పుటచేత భూమి మొదలగు మఱి యొక భూత మున్నదని సందేహము గలుగునేమోయని యొక్క జలభూతమే యున్నది గాని మఱియొక భూతము లేదని చెప్పుట కొఱకు ఏవకారముతోఁగూడ సలిలశబ్దము తిరిగి చెప్పఁబడినది, తత్ర=ఆ జలమునందు, పుష్కరపర్ణే=తామరాకునందు, సః=ఆ ప్రసిద్ధుడగు, ఏకః=ఒక్కడగు, ప్రజాపతిః=జగదీశ్వరుడు, సమభవత్=ఉండెను, తస్య=ఆ భగవంతునికి, అన్తర్మనసి=మనస్సులో, ఇదం=ఈ ప్రపంచమును, సృజేయం=పుట్టింతును, ఇతి=ఈ రూపమైన, కామః=కోరిక, సమవర్తత=ఆవిర్భవించెను, తస్మాత్=ఆ కారణమువలన, పురుషః=మనుష్యుఁడు, యత్=దేనిని, మనసా=మనస్సుచే, అభిగచ్ఛతి=పొందుచున్నాడో, తత్=ఆ కార్యమును గుఱించి, వాచా=వాక్కుతో, వదతి=పలుకుచున్నాడు, తత్=ఆ కార్యమును, కర్మణా=శరీరవ్యాపారముచేఁ జేయుచున్నాఁడు, తత్=దానినిగుఱించి, అనఁగాఁ గోరిక ముందుగా నుదయించునని చెప్పుట గుఱించి, ఏషా=ఈ మంత్రము, అభ్యనూక్తా=అనుసరించి చెప్పఁబడినది.

తా॥ ఈ యనువాకమునందు సృష్టినిగుఱించి చెప్పుటవలన అరుణకేతుకాగ్నిని దవంగభూతములైన జలములను ప్రశంసఁజేయుచున్నాఁడు. ఇప్పుడు మనచేఁ జూడఁబడునట్టి ప్రపంచమంతయు సృష్టికిఁ బూర్వంబున జలమయముగానే యుండెనుగాని

మఱియొక భూమ్యాదిభూతమేదియు లేదు. అట్టి జలమధ్యంబునఁ దామరాకునందు భగవంతుండొక్కఁడే యుండెను. అట్టి భగవంతునకు ఈ ప్రపంచమంతయుఁ సృజియింపవలయునను నిచ్ఛ యుదయించెను. కాఁబట్టి ఆ భగవంతునిచే సృజింపంబడిన ప్రతిమనుష్యుఁడు ఈ కార్యమును జేయవలయునని మొదట మనస్సులోఁ దలఁచి ఆ కార్యమును గుఱించిన కొన్ని మాటలను నోటితోఁ జెప్పుచుఁ బిమ్మట శరీర వ్యాపారముతోఁ జేయుచున్నాఁడు. ఇందునుగుఱించి మఱియొక శాఖయందీ చెప్పఁబోవు ప్రకారముగాఁ జెప్పఁబడియెను.

మూ॥ కామ స్తదగ్రే సమవర్తతాధి। మనసోరేతః ప్రథమం యదాసీత్ ॥౯౯॥ సతోబన్ధుమసతినిరవిన్దన్। హృదిప్రతీష్యాకవయోమనీషేతి॥

ప॥ కామః। తత్। అగ్రే। సమవర్తత। అధి। మనసః। రేతః। ప్రథమం। యత్। ఆసీత్। సతః। బంధుం। అసతి। నిరవిన్దన్। హృది। ప్రతీష్య। కవయః। మనీషాః। ఇతి॥

అ॥ యత్ = ఎప్పుడు, మనసః=మనస్సువలన, రేతః = కార్యము, ప్రథమం= ముందుగా, ఆసీత్ = ఆయెనో, తత్ = అప్పుడు, అగ్రే = అప్రజాపతిసమక్షమందు, కామః = ప్రపంచసృష్టివిషయమైనకోరిక, అధిసమవర్తత = ఆవిర్భవించెను, మనీషాః = స్వేచ్ఛాప్రవృత్తిగల, కవయః = ప్రజాపతులు, హృది = మనస్సునందు, ప్రతీష్య = ప్రత్యేకముగా విశ్చయించి, సతః=మనకు నగపడుచున్న ఈప్రపంచమునకు, బంధుం = ఉత్పత్తికారణమైన కోరికను, అసతి=అవ్యక్తమునందు, నిరవిన్దన్= తెలిసికొనిరి.

తా॥ ఎప్పుడు ప్రజాపతిమనస్సువలన బీజరూపము బయలువెడలెనో అప్పుడు అది ప్రపంచ సృష్టిరూపమైన యిచ్ఛారూపమగు కార్యముముందుగా నావిర్భవించెను. ప్రతికల్పమునందుఁ గలుగుచుండెడి సృష్టికర్తలు తమమనస్సులయందు విచారించినవారై ప్రళయకాలమందుఁ బ్రాణులకర్మలతోఁగూడ నవ్యక్తము పరమాత్మయందు లీనమై తిరిగి ప్రపంచనిర్మాణ సమయము సమీపించి నప్పుడు ప్రాణికర్మవిశిష్టమైన యవ్యక్త మావిర్భవింపఁగాఁ బ్రజాపతికిఁ బ్రపంచనిర్మాణ విషయమైన కోరిక గలుగుచున్నది గావున నవ్యక్తము వాంఛకుఁగారణమని తెలిసికొనిరి.

మూ॥ ఉపైనం తదుపనమతి। యత్కామో భవతి। య ఏవం వేద॥

ప॥ ఉప। ఏనం। తత్। ఉప। నమతి। యత్కామః। భవతి। యః। ఏవం। వేద॥

అ॥ యః = ఎవఁడు, ఏవం = ఈప్రకారముగా ప్రజాపతి యొక్క కామప్రశంసను, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, యత్కామః=దేని యందుఁ గోరికగలవాఁడై, భవతి = అగుచున్నాఁడో, తత్ = ఆవస్తువు, ఏనం = ఈ తెలిసికొనినవానిని। ఉపోపనమతి = మిక్కిలి త్వరగాఁ బొందుచున్నది, అత్యంతసమీపార్థమందు రెండు ఉపశబ్దములు చెప్పఁబడినవి.

తా॥ ఈప్రకారముగా నెవఁడు ప్రజాపతియొక్క కోరిక ప్రశంసను దెలిసికొనుచున్నాఁడో వాఁడు తనకోరిన దంతయు మిక్కిలి త్వరలోఁ బొందఁగలఁడు.

మూ॥ స తపోఽతప్యత। స తపస్తప్త్వా। శరీరమధూనుత। తస్య యన్మాగ్ంసమాసీత్। తతోఽరుణాః కేతవో వాతరశనా ఋషయ ఉదతిష్ఠన్॥ ౯౦॥ యే నఖాః। తే వైఖానసాః। యే వాలాః। తే వాలఖిల్యాః। యో రసః। సోఽపాం॥

ప॥ సః। తపః। అతప్యత। సః। తపః। తప్త్వా। శరీరం। అధూనుత। తస్య। యత్। మాంసం। ఆసీత్। తతః। అరుణాః। కేతవః। వాతరశనాః। ఋషయః। ఉత్। అతిష్ఠన్। యే। నఖాః। తే। వైఖానసాః। యే। వాలాః। తే। వాలఖిల్యాః। యః। రసః। సః। అపాం॥

అ॥ సః=ఆప్రజాపతి, తపః=తపస్సును, అనఁగా మనమిప్పుడేమి సృజింపవలయునను యాలోచనను, అతప్యత=చేసెను, సః=ఆప్రజాపతి, ఇత్థం=ఈప్రకారముగ, తపః=ఆలోచనరూపమైన తపస్సును, కృత్వా=చేసి, శరీరం=తనదేహమును, అధూనుత=కదలించెను, తస్య=కదలింపబడిన ప్రజాపతిశరీరముయొక్క, యత్=ఏ, మాంసం=మాంసము, ఆసీత్=కలదో, తతః=ఆమాంసమువలన, అరుణాః అరుణులనియు, కేతవః=కేతులనియు, వాతరశనాః=వాతరశనులనియుఁ జెప్పఁబడు మునిగణములు, ఉదతిష్ఠన్=ఉద్భవించెను, యే=ఏ, నఖాః=గోళ్లుకలవో, తే=ఆగోళ్లు, వైఖానసాః=వైఖానసులనుమునీశ్వరులుగా, అభవన్=అయినవి, యే=ఏ,

వాలాః=వెండ్రుకలుకలవో, తే=ఆవెండ్రుకలు, వాలఖిల్యాః=వాలఖిల్యులను మునీశ్వరులుగా, అభవన్=అయినవి, యః=ఏ, రసః=శరీరమునందుసారముకలదో, సః=ఆ సారము, అపాం=జలమధ్యమున నొకకూర్మము గాన్నుండెను.

తా॥ బ్రహ్మకుఁ గోరికయుదయించినపిమ్మటఁ గలిగినసృష్టిని జెప్పుచున్నాఁడు. ఆ ప్రజాపతి యిప్పుడేవస్తువును సృజింపవలయునని కొంతకాలమాలోచించి పిమ్మటఁ దనదేహమును గదలింపఁగా నాబ్రహ్మదేహము నందుండు మాంసమువలన అరుణులు కేతులు వాతరశనులు అనుమూఁడువిధములైన ఋషిసంఘములుద్భవించెను. పిమ్మట నాప్రజాపతియొక్క గోళ్లవలన వైఖానసులనియు వెండ్రుకలవలన వాలఖిల్యులనియుఁ జెప్పఁబడుమునులుద్భవించిరి. ఆ బ్రహ్మయొక్క శరీరమునందుండు సారము ఒకతాఁబేలై జలమధ్యమున సంచరించుచుండెను.

మూ॥ అంతరతః కూర్మం భూతగ్ం సర్పంతం। తమబ్రవీత్। మమ వై త్వఙ్మాగ్ంసా। సమభూత్॥ ౯౧॥ నేత్యబ్రవీత్। పూర్వః మే వాహామిహాసమితి। తత్పురుషస్యపురుషత్వం। స సహస్రశీర్షాపురుషః। సహస్రాక్షస్సహస్రపాత్। భూత్వోదతిష్ఠత్। తమబ్రవీత్। త్వంవై పూర్వగ్ంసమభూః। త్వమిదంపూర్వః కురుష్వేతి॥

ప॥ అంతరతః। కూర్మం। భూతం। సర్పంతం। తం। అబ్రవీత్। మమ। వై। త్వఙ్మాంసా। సం। అభూః। న। ఇతి। అబ్రవీత్। పూర్వం। ఏవ। అహం। ఇహ। ఆసం। ఇతి। తత్। పురుషస్య। పురుషత్వం। సః। సహస్రశీర్షా। పురుషః। సహస్రాక్షః। సహస్రపాత్। భూత్వా। ఉత్। అతిష్ఠత్। తం। అబ్రవీత్। త్వం। వై। పూర్వం। సం। అభూః। త్వం। ఇదం। పూర్వః। కురుష్వ। ఇతి॥

అ॥ సః = ఆబ్రహ్మ। అంతరతః = జలములో, భూతం = ఉన్నట్టువంటిదియు, సర్పంతం = సంచరించుచున్నదియునగు, కూర్మం = తాఁబేలును, దృష్ట్వా = చూచి, త్వం = నీవు, మమ = నాయొక్క, త్వఙ్మాంసాత్ = చర్మమువలనను మాంసమువలనను, సమభూః = పుట్టితివి, ఇతి = ఈ ప్రకారముగ, తం = ఆ కూర్మమునుగుఱించి, అబ్రవీత్ = పలికెను, సః = ఆకూర్మము, తథా = అప్రకారము, న = కాదు ఇతి = ఈ లాగునఁ బలికెను, పూర్వమేవ = నీకంటె బూర్వమునుండియు, అహం,

కెను, ఇహ = ఈ జలమునందు, ఆసం = ఉంటిని, ఇతి=ఈ ప్రకారముగా, అబ్రవీత్ = పలికెను, తత్ = ఆ కారణమువలన, పురుషస్య = పరాత్పురుషునియొక్క, పురుషత్వం = పురుషాకారము, సంపన్నం = సిద్ధించినదని తెలిసికొనెను, సః = ఆ కూర్మము, సహస్రశీర్షా = అనేకశిరస్సులు కలవాఁడును, సహస్రాక్షః = అనేక నేత్రములు కలవాఁడును, సహస్రపాత్ = అనేకపాదములు కలవాఁడునగు, పురుషో భూత్వా = పురుషుఁడై, ఉదతిష్ఠత్ = బయలువెడలెను, అనఁగాఁ బ్రత్యక్షమాయెను, ఈ ప్రకారము ప్రత్యక్షమైన భగవంతునిఁజూచి, సః = ఆబ్రహ్మ, త్వంవై= నీవే, పూర్వం = పూర్వకాలమందును, సమభూః = ఉంటివి, పూర్వః = మొదటి వాఁడవగు, త్వం = నీవు, ఇదం = ఈ జగత్తును, కురుష్వ = చేయుము, ఇతి = ఈ లాగున, తం = ఆ భగవంతునిగురించి, అబ్రవీత్ = పలికెను.

తా॥ జలమందు సంచరించుచున్న కూర్మమునుజూచి నాశరీర సంబంధమగు చర్మము మాంసములయందుండు సారమే నీవయితివి అని బ్రహ్మపలుకఁగా, నీవు చెప్పినట్లుగాదు, నీకంటెఁ బూర్వమునుండియు నే నిక్కడ నుంటినని కూర్మము తిరిగి పలికెను. అప్పుడు ఆ కూర్మమును బరాత్పురుషునిఁగాఁ దలఁచెను. అంతట నా కూర్మము అనేక శిరస్సులను అనేక నేత్రముల ననేకపాదములను ధరించి పురుష స్వరూపముతోఁ బ్రత్యక్షమాయెను. అప్పుడా బ్రహ్మ చూచి మా యందఱకంటె నీవే పూర్వుఁడవుగాన నీ ప్రపంచనిర్మాణమును నీవే సేయుమని యా భగవంతునితో పలికెను.

మూ॥ సఇత ఆదాయాపః ॥ ౯౨ ॥ అంజలినాపురస్తాదుపా దధాత్ ।
ఏవాహ్యేవేతి । తత ఆదిత్య ఉదతిష్ఠత్ । సాప్రాచీదిక్ ॥

ప॥ సః । ఇతః । ఆదాయ । అపః । అంజలినా । పురస్తాత్ । ఉప । ఆదధాత్ । ఏవాహ్యేవ । ఇతి । తతః । ఆదిత్యః । ఉత్ । అతిష్ఠత్ । సా । ప్రాచీ । దిక్ ॥

అ॥ సః=ఆపరమేశ్వరుఁడు, ఇతః= సృష్టికిఁబూర్వము నుండియు నున్నట్టి మహాజలమునందే, అపః= జలమును, అంజలినా = దోసిలితో, ఆదాయ= తీసికొని, ఏవాహ్యేవేతి = ఏవాహ్యేవ అనుమంత్రము నుచ్చరించి, పురస్తాత్ = మనము తూర్పుదిక్కుగా వ్యవహరించు దిక్కునందు, ఉపాదధాత్=అభిమంత్రించి విడిచి.

పెట్టెను, తతః=ఆ వైపునుండి, ఆదిత్యః=సూర్యుఁడు, ఉదతిష్ఠత్ = బయలుదేరె లెను, సా=అది, ప్రాచీదిక్=తూర్పుదిక్కు అని చెప్పఁబడుచున్నది.

తా॥ పైని జెప్పినప్రకారముగా బ్రహ్మపలికిన పిమ్మట నా పరమేశ్వరుఁడు సృష్టికిఁబూర్వమునుండియు నున్నట్టి యా మహాజలములోనుంచి దోసిలితోఁ గొంచె ముదకమును గ్రహించి 'ఏవాహ్యేవ' అనుమంత్రము నుచ్చరించి యభిమంత్రించి మన మిప్పుడు తూర్పుదిక్కుగా వ్యవహరించునట్టి దిశయందు విడిచిపెట్టెను. పిమ్మట ఆ దిక్కునుండి సూర్యుఁడు బయలువెడలెను. అట్టి దిక్కు తూర్పుదిక్కుగాఁ జెప్పఁ బడుచుండెను.

మూ॥ అథారుణః కేతుర్దక్షిణత ఉపాదధాత్ । ఏవాహ్యగ్న ఇతి ।
తతో వా అగ్నిరుదతిష్ఠత్ । సా దక్షిణాదిక్ ॥

ప॥ అథ । అరుణః । కేతుః । దక్షిణతః । ఉపాదధాత్ । ఏవాహ్యగ్నే । ఇతి । తతః । వై । అగ్నిః । ఉత్ । అతిష్ఠత్ । సా । దక్షిణా । దిక్ ॥

అ॥ అథ = అనంతరము, అరుణఃకేతుః = భగవంతుండగు అరుణకేతుఁడు, దక్షిణతః=దక్షిణ దిక్కున, ఏవాహ్యగ్న ఇతి = ఏవాహ్యగ్నే, అను మంత్రముచే నభిమంత్రించి, ఉపాదధాత్=విడిచిపెట్టెను, తతః=ఆ దిక్కువలన, అగ్నిః=అగ్ని హోత్రుఁడు, ఉదతిష్ఠత్=బయలువెడలెను, సాదిక్=అదిక్కు, దక్షిణా=దక్షిణ మని చెప్పఁబడుచున్నది.

తా॥ సూర్యుఁడు పుట్టిన పిమ్మట నా భగవంతుండగు అరుణకేతువు పూర్వ మువలెనే దోసిలితో నుదకమును దీసికొని మనము దక్షిణ దిక్కుగా వ్యవహరించు నట్టి దిక్కునందు విడిచిపెట్టెను. అప్పుడాదిక్కునుండి యగ్ని బయలువెడలెను. ఆదిక్కునకు దక్షిణమను పేరుపెట్టెరి.

మూ॥ అథారుణః కేతుః పశ్చాదుపాదధాత్। ఏవాహివాయో ఇతి॥
౯-3 ॥ తతో వాయురుదతిష్ఠత్ । సాప్రతీచీదిక్ ॥

ప॥ అథ । అరుణః । కేతుః । పశ్చాత్ । ఉపాదధాత్ । ఏవాహివాయో । ఇతి । తతః । వాయుః । ఉత్ । అతిష్ఠత్ । సా । ప్రతీచీ । దిక్ ॥

అ॥ అథ=అనంతరము, అరుణఃకేతుః=అరుణకేతువు, ఏవాహివాయో ఇతి= ఏవాహివాయో, అను మంత్రము నుచ్చరించి, పశ్చాత్=మనము పడమర యనెడు

భావించునట్టి దిక్కునందు, ఉపాదధాత్=జలమును విడిచిపెట్టెను, తతః=ఆదిక్కునుండి, వాయుః=వాయువు, ఉదతిష్ఠత్=బయలువెడలెను, సాదిక్ = ఆదిక్కు, ప్రతీచీ=పడమరయని చెప్పఁబడుచున్నది.

తా॥ అగ్ని పుట్టిన పిమ్మట భాగవంతుఁడు తిరిగి జలమును దోసిలితోఁ దీసికొని పడమర దిక్కున, ఏవాహివాయో, అను మంత్రము నుచ్చరించి విడిచిపెట్టఁగా నప్పుడు వాయువు బయలు వెడలెను. ఆదిక్కు పడమరయని చెప్పబడు చుండెను.

మూ॥ అథారుణః కేతు రుత్తరత ఉపాదధాత్ । ఏవాహీంద్రేతి । తతోవా ఇంద్ర ఉదతిష్ఠత్ । సోదీచీదిక్॥

ప॥ అథః । అరుణః । కేతుః । ఉత్తరతః । ఉపాదధాత్ । ఏవాహీంద్ర । ఇతి । తతః । వై । ఇంద్రః । ఉత్ । అతిష్ఠత్ । సా । ఉదీచీ । దిక్ ॥

అ॥ అథ = అనంతరము, అరుణః కేతుః = అరుణకేతువు, ఏవాహీంద్రేతి = ఏవాహీంద్ర, అనుమంత్రము నుచ్చరించి, ఉత్తరతః = మనచే నుత్తరదిక్కుగా వ్యవరింపఁబడు దిక్కునందు, ఉపాదధాత్ = విడిచిపెట్టెను, తతః = అనంతరము, ఇంద్రః = ఇంద్రుఁడు, ఉదతిష్ఠత్ = బయలు వెడలెను, సాదిక్ = ఆదిక్కు, ఉదీచీ = ఉత్తరదిక్కుగా వ్యవహరింపఁబడుచున్నది.

తా॥ వాయువు పుట్టిన పిమ్మట భాగవంతుఁడు మనచే నుత్తరదిక్కు అని, వ్యవహరింపఁబడునట్టి దిశయందు 'ఏవాహీంద్ర' అనుమంత్రము నుచ్చరించి జలమును విడిచిపెట్టెను. అప్పుడా దిక్కునుండి యింద్రుఁడు బయలువెడలెను. ఆ దిక్కు ఉత్తరదిక్కుగాఁ జెప్పఁబడుచున్నది.

మూ॥ అథారుణః కేతుర్మధ్య ఉపాదధాత్ । ఏవాహిపూషన్నితి । తతోవై పూషోదతిష్ఠత్ । సేయందిక్॥ ౬౮॥

ప॥ అథః । అరుణః । కేతుః । మధ్యే । ఉపాదధాత్ । ఏవాహిపూషన్ । ఇతి । తతః । వై । పూషా । ఉత్ । అతిష్ఠత్ । సా । ఇయం । దిక్ ॥

అ॥ అథః = అనంతరము, అరుణఃకేతుః = అరుణకేతువు, ఏవాహిపూషన్ ఇతి = 'ఏవాహిపూషన్' అనుమంత్రము నుచ్చరించి, మధ్యే = మధ్యమందు, ఉపాదధాత్ = విడిచిపెట్టెను, తతః = ఆదిక్కునుండి, పూషా = పూషుఁడు

అనుమార్యేఁడు, ఉదతిష్ఠత్ = బయలు వెడలెను, సాదిక్ = అదిక్కు, ఇయం = ఈక్రింది దిక్కుగాఁ జెప్పఁబడుచున్నది, అదియే భూమిగా నిప్పుడు చెప్పఁబడు చున్నది.

తా॥ ఇంద్రుఁడుద్భవించిన పిమ్మట నరుణకేతువు దోసిలితో జలమును గ్రహించి 'ఏవాహిపూర్వక' అను మంత్రము నుచ్చరించి మధ్యగా విడిచిపెట్టెను. అదియే భూమియని క్రిందుగానుండు దిక్కుగా వ్యవహరింపఁబడు చున్నది.

మూ॥ అథారుణః కేతురుపరిష్టా దుపాదధాత్ । ఏవాహిదేవా ఇతి । తతో దేవమనుష్యాః పితరః । గంధర్వాప్సరసశ్చోదతిష్ఠన్ । సోర్ధ్వాదిక్ ॥

ప॥ అథ । అరుణః । కేతుః । ఉపరిష్టాత్ । ఉపాదధాత్ । ఏవాహిదేవాః । ఇతి । తతః । దేవమనుష్యాః । పితరః । గంధర్వాప్సరసః । చ । ఉత్ । అతిష్ఠన్ । సా । ఊర్ధ్వా । దిక్ ॥

అ॥ అథ = అనంతరము, అరుణఃకేతుః = అరుణకేతువు, ఏవాహిదేవాఇతి = 'ఏవాహిదేవాః'. అనుమంత్రము నుచ్చరించి, ఉపరిష్టాత్ = పైభాగమున, ఉపాదధాత్ = విడిచిపెట్టెను, తతః = ఆ పైభాగమునుండి, దేవమనుష్యాః = దేవతలు మనుష్యులు, పితరః = పితృదేవతలు, గంధర్వాప్సరసశ్చ = గంధర్వులు అప్సరసస్త్రీలు, ఉదతిష్ఠన్ = బయలుదేఱివచ్చిరి, సాదిక్ = అదిక్కు, ఊర్ధ్వా = ఊర్ధ్వదిక్కని చెప్పఁబడుచున్నది, అనఁగాఁ బైగానుండుదిక్కు.

తా॥ అనంతర మారుణకేతువు తిరిగి దోసిలితో జలమును గ్రహించి, "ఏవాహిదేవాః," అను మంత్రము నుచ్చరించి పైగా విడిచిపెట్టెను. అప్పుడు పై భాగమునుండి దేవతలు మనుష్యులు పితృదేవతలు గంధర్వులు అప్సరసలు మొదలగు సమస్తమైన దేవత లుద్భవించిరి. అది యూర్ధ్వదిక్కు అని చెప్పఁబడియెననఁగా పైఁగా నుండుదిక్కు. 20 వ అనువాకములో "ఏవాహ్యేవ," అనువాక్యము మొదలు ఆయావాక్యములు అక్కడ వ్యాఖ్యానము సేయఁబడినవి గాన ఇక్కడ అర్థములు చెప్పఁబడలేదు. తిరిగీ యిక్కడ చెప్పుట ప్రయోజనమేమనఁగా, ఆ యా దేవతాకమంత్రమును స్మరించి పిలువగా నాయాదేవతలు లుద్భవించిరనియు

నా దేవత ఉద్భవించిన దిక్కులు తూర్పు మొదలుగా నాలుగు దిక్కులు పైదిక్కు క్రిందుదిక్కు కలసి యాఱుదిక్కులుగా నేర్పడి యది మొదలు తూర్పు మొదలగు నామములచే వ్యవహరింపఁబడుచున్నవి.

మూ॥ యావిప్రుషో విపరాపతన్ । తాభ్యో సురారక్షాగ్ంసిపిశాచా శ్చోదతిష్ఠన్ । తస్మాత్తేపరాభవన్ । విప్రుడ్భ్యోహి తేసమ భవన్ । తదేషాభ్యనూక్తా॥ ౯౧॥

ప॥ యాః । విప్రుషః । వి । పరాపతన్ । తాభ్యః । అసురాః । రక్షాంసి । పిశాచాః । చ । ఉత్ । అతిష్ఠన్ । తస్మాత్ । తే । పరాభవన్ । విప్రుడ్భ్యః । హి । తే । సం । అభవన్ । తత్ । ఏషా । అభ్యనూక్తా॥

అ॥ యాః=ఏ, విప్రుషః=జలబిందువులు, విపరాపతన్ = చెదరిపడినవో, తాభ్యః=ఆ బిందువులవలన, అసురాః=అసురులనియు, రక్షాంసి=రాక్షసులనియు, పిశాచాశ్చ=పిశాచములనియుఁ పేరుగల రాక్షసులు, ఉదతిష్ఠన్=ఆవిర్భవించిరి, యస్మాత్=ఏకారణము వలన, విప్రుడ్భ్యః=చెదరిపోయిపడిన బిందువులవలన, తే=అసురులు మొదలగువారు, సమభవన్ = పుట్టిరో, తస్మాత్ = ఆకారణము వలన, తే=ఆ యసురులు మొదలగువారు, పరాభవన్=పరాజయమును బొంది హీనజాతులుగా నుండిరి, తత్=దానికే, ఏషా=ఈ చెప్పఁబోవు మంత్రము, అభ్యనూక్తా=చెప్పుచున్నది.

తా॥ ఆ భగవంతుఁడు సూర్యుఁడు మొదలగు వారిని సృజించుట కొఱకు దోసిలితోఁ దీసికొనిన జలమునుండి చెదరి ఇటు అటు పడిన యే బిందువులు కలవో ఆ బిందువులు వలన అసురులనియు రాక్షసులనియుఁ పిశాచములనియుఁ పేరుగల మూఁడు తెగలు గల రాక్షసు లుద్భవించిరి. దోసిలిలోనుండు జలమునందుఁ గలియక నిటు అటు చెదరిపోయి పడిన బిందువుల వలనఁ బుట్టినవారు కాఁబట్టి యా రాక్షసులను దేవతలలోఁ గలియక వేఱుగానుండి హీనులగుచు దేవతల వలనఁ బరాజయమును బొందుచున్నారు. జలము వలన నీ ప్రపంచము వృద్ధిపొందుటను గురించి ముందు చెప్పఁబోవు మంత్రము చెప్పుచున్నది.

మూ॥ ఆపోహయద్బృహతీర్గర్భమాయన్ । దక్షందధానా జనయంతీ స్స్వయంభుం । తతఇమేధ్యసృజ్యంత సర్గాః । అద్భ్యోవా ఇద గ్ం సమభూత్ । తస్మాదిదగ్ంసర్వం బ్రహ్మస్వయంభ్వితి ।

ప॥ ఆపః । యత్ । బృహతీః । గర్భం । ఆయన్ । దక్షం । దధానాః । జనయంతీః । స్వయంభుం । తతః । ఇమే । అధి । అసృజ్యన్త । సర్గాః । అద్భ్యః । వై । ఇదం । సం । అభూత్ । తస్మాత్ । ఇదం । సర్వం । బ్రహ్మ । స్వయంభు । ఇతి ॥

అ॥ బృహతీః = ప్రౌఢమయినవియు, దక్షం = వృద్ధిస్వభావముగల గర్భమును దధానాః = ధరించునవియు, స్వయంభుం = పరమేశ్వరుఁడగు కూర్మమును, జనయంతీః = పుట్టింపఁజేసినవియు, అనఁగాఁ గానిపింపఁజేసినవియు, ఆపః = జలములు, యత్ = ఏ, గర్భం = జగద్రూపమగు గర్భమును, ఆయన్ = పొందినవో, తతః = విరాట్స్వరూపమగు నాగర్భమువలన, ఇమే = ఈ, సర్గాః = భూరాదిలోకములు, అధ్యసృజ్యన్త = సృజింపఁబడినవి, యస్మాత్ = ఏకారణమువలన, అద్భ్యోవై = జలములవలననే, ఇదం = ఈ ప్రపంచమంతయు, సమభూత్ = ఆవిర్భవించెనో, తస్మాత్ = ఆ కారణమువలన, ఇదం=ఈ, సర్వం = సమస్తప్రపంచము, స్వయంభు= స్వతస్సిద్ధముగానుండు, బ్రహ్మైవ = బ్రహ్మస్వరూపముగానున్నది, ఇతి = ఈ ప్రకారముగాఁ జెప్పఁబడినది.

తా॥ మహాస్వరూపముగా నున్నవియు, వృద్ధిస్వభావముగల గర్భమును ధరించినదియు, స్వతస్సిద్ధముగానుండు పరమాత్మయగు కూర్మమును ఆవిర్భవింపఁజేసినదియు నగు జలములు ప్రపంచరూపమగు గర్భమునుధరించినవి. కాఁబట్టి ఆయుదకముల వలననే యీలోకము లన్నియు సృజియింపఁబడినవి. జలములయందున్నట్టియు ఆద్యంతములులేక భూతభవిష్యద్వర్తమాన కాలములయందెప్పుడు నుండునట్టి పరమాత్మ యగు కూర్మముచే నీప్రపంచమంతయు సృజియింపఁబడుటవలన నీ ప్రపంచమంతయు స్వతస్సిద్ధముగానుండు పరమాత్మ స్వరూపముగాఁ జెప్పఁబడియున్నది.

మూ॥ తస్మాదిదగ్ం సర్వగ్ం శిథిలమివాధ్రువమివాభవత్ ॥

ప॥ తస్మాత్ । ఇదం । సర్వం । శిథిలం । ఇవ । అధ్రువం । ఇవ । అభవత్ ॥

అ॥ తస్మాత్ = శిథిలస్వభావముగల జలమువలనపుట్టిన । ఇదం=ఈ, సర్వం= ప్రపంచమంతయు, శిథిలమివ = నశించునదివలెనే, అధ్రువమివ = అసత్యమయినది వలెనే, అభవత్ = ఆయెను.

తా॥ నశించు స్వభావముగల జలములవలనఁ బుట్టినది కాఁబట్టి పాషాణాదుల వలెనే స్థిరముగానుండక నశించునదివలెనే కనబడుచున్నది. ఇందువలనఁ బ్రపంచమునకు నసత్కార్యత్వము యుక్తిచే సాధింపఁబడినది.

మూ॥ ప్రజాపతిర్వావతత్ । ఆత్మనాత్మానం విధాయ । తదేవాను
ప్రావిశత్ ॥

ప॥ ప్రజాపతిః । వా । అవ । తత్ । ఆత్మనా । ఆత్మానం । విధాయ । తత్ ।
ఏవ । అను । ప్ర । అవిశత్ ॥

అ॥ తత్ = ఆప్రపంచము, ప్రజాపతిర్వావ = బ్రహ్మస్వరూపమైనదే, సః=
ఆ ప్రజాపతి, ఆత్మనా =తనచేతనే, ఆత్మానం=తనను, విధాయ=జగద్రూపముగాఁ
జేసి, తదేవ = ఆ ప్రపంచమునే, అను = అనుసరించి, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా॥ ఇక్కడ నసత్కార్యమునందుఁ జేతనాంశ సంబంధమును జెప్పుచు
న్నాఁడు. ఈయసత్కార్యమగు ప్రపంచమంతయు నశించిపోవునదియేనా? నిల్చి
యుండునది యేదైనాయున్నదా? అని ప్రశ్న కలుగఁగా బ్రహ్మమతియొక్క సాధ
నములేకయే తాను దనస్వరూపము జగదాకారణముగాఁ బరిణమింపఁ జేసి ఆయాశరీ
రములయందు జీవరూపముగాఁ బ్రవేశించి ప్రకాశించుచున్నాఁడు. కాఁబట్టి యీ ప్ర
పంచమునందు అసత్కార్యమగు నామరూపాంశము నశించుననియు జీవరూపముగా
నున్న సచ్చిదానందాంశము నిల్చియుండుననియుఁ దెలిసికొనవలయును.

మూ॥ తదేషాభ్యనూక్తా ॥ ౯౬ ॥

ప॥ తత్ । ఏషా । అభి । అను । ఉక్తా ॥

అ॥ తత్ = ఆవిషయమునుగూర్చి, ఏషా =ఈ చెప్పఁబోవు మంత్రము, అభ్య
నూక్తా = అనుసరించి చెప్పఁబడినది.

తా॥ దీనినిగూర్చి ముందు మంత్రములోఁ జెప్పఁబడుచున్నది.

మూ॥ విధాయలోకాన్విధాయభూతాని । విధాయసర్వాః ప్రదిశోది
శశ్చ । ప్రజాపతిః ప్రథమజాఋతస్య । ఆత్మనాత్మానమభి
సంవివేశేతి ॥

ప॥ విధాయ । లోకాన్ । విధాయ । భూతాని । విధాయ । సర్వాః । ప్రది
శః । దిశః । చ । ప్రజాపతిః । ప్రథమజాః । ఋతస్య । ఆత్మనా । ఆత్మానం । అభి ।
సం । వివేశ । ఇతి ॥

అ॥ ఋతస్య = పరబ్రహ్మముయొక్క సమీపమువలన, ప్రథమజః = మొదటఁగాఁబుట్టిన, ప్రజాపతిః = బ్రహ్మ, లోకాన్ = భూలోకము మొదలగు మూఁడులోకములను, విధాయ = చేసి, భూతాని = ప్రాణులను విధాయ=సృజియించి, సర్వాః=సమస్తమయిన, దిశః=తూర్పు మొదలగు ముఖ్య దిక్కులను, ఆగ్నేయము మొదలగు విదిక్కులను, విధాయ=సృజియించి, ఆత్మనా = తనచేతను,ఆత్మానం=తనస్వరూపమును, అభిసంవివేశ = ప్రపంచము వందంతటను బ్రవేశింపఁజేసెను,ఇతి = ఈప్రకారముగాఁ జెప్పఁబడినది.

తా॥ గుణరహితమైన పరబ్రహ్మమువలన గుణవిశిష్టుఁడగు బ్రహ్మ ముం దుగాఁ బుట్టి మూఁడులోకములను దూర్పు మొదలగు ముఖ్యదిక్కులను, ఆగ్నేయాది విదిక్కులను సమస్త ప్రాణిశరీరములను సృజియించి తన స్వరూపమును దనం తటనే సమస్త ప్రపంచమునందుఁ బ్రవేశపెట్టి చేతనముగలవిగా సమస్త ప్రాణుల జేసెనని చెప్పఁబడెను.

మూ॥ సర్వమేవేదమాప్త్వా। సర్వమవరుధ్య। తదేవానుప్రవిశతి। యఏవంవేద ॥ ౯౭ ॥ ౨౩ ॥

ప॥ సర్వం । ఏవ । ఇదం । ఆప్త్వా । సర్వం । అవరుధ్య । తత్ + ఏవ । అను । ప్ర । విశతి । యః । ఏవం । వేద ॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో సః=వాఁడు, ఇదం = ఈ, సర్వం = సమస్త ప్రపంచమును, బ్రహ్మైవ = బ్రహ్మ స్వరూపమయేవే, ఇతి=ఈలాగని, ఆప్త్వా=పొంది, అనఁగా తెలిసికొని, సర్వం= సమస్త ప్రపంచమును, అవరుధ్య = అరికట్టి, అనఁగా స్వాధీనముఁజేసికొని, తదేవ= ఆ ప్రపంచము వందంతరాత్మగా నున్న నిర్గుణ పరబ్రహ్మను, అనుప్రవిశతి = ప్రవే శించుచున్నాఁడు, అనఁగాఁ దత్స్వరూపుఁడుగా నుండును.

తా॥ ఈ ప్రకారముగా నేర్పడిన సృష్టివిధానము నెవఁడు తెలిసికొను చున్నాఁడో వాఁడు సమస్తప్రపంచమును బరబ్రహ్మముకంటెన భిన్నముగాఁదెలిసి కొని స్వాధీనప్రపంచుఁడై ప్రపంచాత్మరాత్మయగు పరబ్రహ్మమును బొందు చున్నాఁడు.

ఇతి త్రయోవింశోఽనువాకస్సమాప్తః—

మూ॥ ప్రజాపతిర్వావతత్ । ఆత్మనాత్మనం విధాయ । తదేవాను
ప్రావిశత్ ॥

ప॥ ప్రజాపతిః । వా । అవ । తత్ । ఆత్మనా । ఆత్మానం । విధాయ । తత్ । ఏవ । అను । ప్ర । అవిశత్ ॥

అ॥ తత్ = ఆప్రపంచము, ప్రజాపతిర్వావ = బ్రహ్మస్వరూపమైనదే, సః= ఆ ప్రజాపతి, ఆత్మనా =తనచేతనే, ఆత్మానం=తనను, విధాయ=జగద్రూపము గాఁ జేసి, తదేవ = ఆ ప్రపంచమునే, అను = అనుసరించి, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా॥ ఇక్కడ నసత్కార్యమునందుఁ జేతనాంశ సంబంధమును జెప్పుచున్నాఁడు. ఈయసత్కార్యమగు ప్రపంచమంతయు నశించిపోవునదియేనా ? నిల్చియుండునది యేదైనాయున్నదా ? అని ప్రశ్న కలుగఁగా బ్రహ్మమతియొక్క సాధనము లేకయే తాను దనస్వరూపము జగదాకారణముగాఁ బరిణమింపఁ జేసి ఆయాశరీరములయందు జీవరూపముగాఁ బ్రవేశించి ప్రకాశించుచున్నాఁడు. కాఁబట్టి యీ ప్రపంచమునందు అసత్కార్యమగు నామరూపాంశము నశించుననియు జీవరూపముగానున్న సచ్చిదానందాంశము నిల్చియుండుననియుఁ దెలిసికొనవలయును.

మూ॥ తదేషాభ్యనూక్తా ॥ ౯౬ ॥

ప॥ తత్ । ఏషా । అభి । అను । ఉక్తా ॥

అ॥ తత్ = ఆవిషయమునుగూర్చి, ఏషా =ఈ చెప్పఁబోవు మంత్రము, అభ్యనూక్తా = అనుసరించి చెప్పఁబడినది.

తా॥ దీనినిగూర్చి ముందు మంత్రములోఁ జెప్పఁబడుచున్నది.

మూ॥ విధాయలోకాన్విధాయభూతాని । విధాయసర్వాః ప్రదిశోది
శశ్చ । ప్రజాపతిః ప్రథమజాఋతస్య । ఆత్మానాత్మనమభి
సంవివేశేతి ॥

ప॥ విధాయ । లోకాన్ । విధాయ । భూతాని । విధాయ । సర్వాః । ప్రదిశః । దిశః । చ । ప్రజాపతిః । ప్రథమజాః । ఋతస్య । ఆత్మనా । ఆత్మానం । అభి । సం । వివేశ । ఇతి ॥

అ॥ ఋతస్య = పరబ్రహ్మముయొక్క సమీపమువలన, ప్రథమజః = మొదటఁగాఁబుట్టిన, ప్రజాపతిః = బ్రహ్మ, లోకాన్ = భూలోకము మొదలగు మూఁడులోకములను, విధాయ = చేసి, భూతాని = ప్రాణులను విధాయ=సృజియించి, సర్వాః=సమస్తమయిన, దిశః=తూర్పు మొదలగు ముఖ్య దిక్కులను, ఆగ్నేయము మొదలగు విదిక్కులను, విధాయ=సృజియించి, ఆత్మనా = తనచేతను,ఆత్మానం=తనస్వరూపమును, అభిసంవివేశ = ప్రపంచము నందంతటను బ్రవేశింపఁజేసెను,ఇతి = ఈప్రకారముగాఁ జెప్పఁబడినది.

తా॥ గుణరహితమైన పరబ్రహ్మమువలన గుణవిశిష్టుఁడగు బ్రహ్మ ముందుగాఁ బుట్టి మూఁడులోకములను దూర్పు మొదలగు ముఖ్యదిక్కులను, ఆగ్నేయాది విదిక్కులను సమస్త ప్రాణిశరీరములను సృజియించి తన స్వరూపమును దనంతటనే సమస్త ప్రపంచమునందుఁ బ్రవేశపెట్టి చేతనముగలవిగా సమస్త ప్రాణుల జేసెనని చెప్పఁబడెను.

మూ॥ సర్వమేవేదమాప్త్వా। సర్వమవరుధ్య। తదేవానుప్రవిశతి। యఏవంవేద ॥ ౯౭ ॥ ౨౩ ॥

ప॥ సర్వం। ఏవ। ఇదం। ఆప్త్వా। సర్వం। అవరుధ్య। తత్ + ఏవ। అను। ప్ర। విశతి। యః। ఏవం। వేద ॥

అ॥ యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో సః=వాఁడు, ఇదం = ఈ, సర్వం = సమస్త ప్రపంచమును, బ్రహ్మైవ = బ్రహ్మ స్వరూపమయేవే, ఇతి=ఈలాగని, ఆప్త్వా=పొంది, అనఁగా తెలిసికొని, సర్వం= సమస్త ప్రపంచమును, అవరుధ్య = అరికట్టి, అనఁగా స్వాధీనముఁజేసికొని, తదేవ= ఆ ప్రపంచము నందంతరాత్మగా నున్న నిర్గుణ పరబ్రహ్మను, అనుప్రవిశతి = ప్రవేశించుచున్నాఁడు, అనఁగాఁ దత్స్వరూపుఁడుగా నుండును.

తా॥ ఈ ప్రకారముగా నేర్పడిన సృష్టివిధానము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సమస్తప్రపంచమును బరబ్రహ్మముకంటెను భిన్నముగాఁదెలిసికొని స్వాధీనప్రపంచుఁడై ప్రపంచాత్మరాత్మయగు పరబ్రహ్మమును బొందుచున్నాఁడు.

ఇతి త్రిశోఽనువాకస్సమాప్తః—

—♦అథచతుర్విగ్ంశోఽనువాకః ప్రారభ్యతే♦—

మూ॥ చతుష్టయ్య ఆపోగృహ్ణాతి। చత్వారివాఅపాగ్ం రూపాణి। మేఘోవిద్యుత్। స్తనయిత్నుర్వృష్టిః। తాన్యేవావరున్ధే॥

ప॥ చతుష్టయ్యః। అపః। గృహ్ణాతి। చత్వారి। వై। అపాం। రూపాణి। మేఘః। విద్యుత్। స్తనయిత్నుః। వృష్టిః। తాని। ఏవ। అవరున్ధే॥

అ॥ చతుష్టయ్యః = నాలుగుస్థానముల యందుండునట్టి, అపః = జలములను, గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడు, మేఘః = మేఘము, విద్యుత్ = మెఱుపు, స్తనయిత్నుః = ఉరుము, వృష్టిః = వర్షము, అని, అపాం = ఉదకములకు, రూపాణి= స్థానస్వరూపములు, చత్వారి = నాలుగువిధములయినవి, ఈ ప్రకారముగాఁ దెలిసికొనినవాఁడు, తాన్యేవ = ఆమేఘాదిస్థానములను, అవరున్ధే = అరికట్టుచున్నాఁడు.

తా॥ ఉదకములయొక్క స్థానములు నాలుగువిధములై యున్నవి. అవియేవనఁగా = మేఘము, మెఱుపు, ఉఱుము, వర్షము, ఈ నాలుగు మేఘసంబంధముచే నొక్కటే యయినప్పటికి నామభేదములచే నాలుగువిధములుగాఁ జెప్పఁబడెను. వానివలనఁ గలుగునట్టి యుదకమును బ్రతిజంతువు గ్రహించుచున్నది, ఈ యథార్థమును దెలిసినవాఁడు మేఘాదులను స్వాధీనముఁ జేసికొనువాఁడగును.

మూ॥ ఆతపతివర్ష్యాగృహ్ణాతి। తాఃపురస్తాదుపదధాతి। ఏతావై బ్రహ్మవర్చస్యా ఆపః। ముఖతఏవ బ్రహ్మవర్చసమవరున్ధే। తస్మాన్ముఖతో బ్రహ్మవర్చసితరః॥ ౯౦॥

ప॥ ఆతపతి। వర్ష్యాః। గృహ్ణాతి। తాః। పురస్తాత్। ఉప। దధాతి। ఏతాః। వై। బ్రహ్మవర్చస్యాః। అపః। ముఖతః। ఏవ। బ్రహ్మవర్చసం। అవరున్ధే। తస్మాత్। ముఖతః। బ్రహ్మవర్చసితరః॥

అ॥ ఆతపతి = ఎండగలప్రదేశమందు, వర్ష్యాః = వర్షింపఁబడిన, అపః = జలములను, గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడు, తాః = ఆజలమును, పురస్తాత్ = తూర్పుదిక్కునందు, ఉపదధాతి = సమ్యంత్రకముగా నుంచుచున్నాఁడు, ఏతాః = ఈ రెండుగల ప్రదేశమునందుఁగురియఁబడిన, అపః = జలములు, బ్రహ్మవర్చస్యాః = బ్రహ్మవర్చస్సుకలవి, ముఖతఏవ = అగ్నిముఖముగానుండు తూర్పుదిక్కు

నందు, బ్రహ్మవర్చసం = బ్రహ్మవర్చస్సును, అవరున్ధే = అరికట్టుచున్నాఁడు, తస్మాత్ = ఆ కారణమువలన, ముఖతః = ముఖమునందు, బ్రహ్మవర్చసితరః = విశేషమైన బ్రహ్మవర్చస్సుకలవాఁడగును.

తా॥ ఎండకాయునట్టి ప్రదేశమునందు వర్షింపఁబడిన జలములు ప్రకాశము గలస్థలమందుఁ బడుటచేత బ్రహ్మవర్చస్సు గలవగుచున్నవి. అట్టియుదకము నొక పాత్రియందుంచి తెచ్చి యా జలమును యజ్ఞమును జేయునట్టి ప్రదేశమునకుఁ దూర్పు దిక్కున సమంత్రకముగా నుంచినట్లాయెనా యగ్నిహోత్రియునకుఁ దూర్పుదిక్కు ముఖముకాఁ బట్టి ముఖమునందు బ్రహ్మవర్చస్సు గలిగియుండునట్లుగనే లోకములో బ్రాహ్మణుఁడు ముఖమువలననే వేదశాస్త్రాది పఠనముం జేయుటవలన బ్రాహ్మణునియొక్క ముఖమునందు విశేషమైన బ్రహ్మవర్చస్సు కలిగియుండును.

మూ॥ కూప్యాగృహ్ణాతి । తాదక్షిణత ఉపదధాతి । ఏతావై తేజస్వినీరాపః । తేజఏవాస్యదక్షిణతో దధాతి । తస్మాద్దక్షిణతోర్ధస్తేజస్వితరః ॥

ప॥ కూప్యాః । గృహ్ణాతి । తాః । దక్షిణతః । ఉప । దధాతి । ఏతాః । తేజస్వినీః । ఆపః । తేజః । ఏవ । అస్య । దక్షిణతః । దధాతి । తస్మాత్ । దక్షిణతః । అర్ధః । తేజస్వితరః ॥

అ॥ కూప్యాః = నూతియందైన యుదకములను, గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడు, ఏతాః=ఈ నూతియందుండు, ఆపః=జలములు, తేజస్వినీః = నిత్యము గృహకృత్యము లనేక విధములుగా నుపయోగించును కాఁబట్టి తేజస్సు కలవి, తాః=అటువంటి జలములను, దక్షిణతః=యజ్ఞముఁజేయు ప్రదేశమునకు దక్షిణ దిక్కున, ఉపదధాతి=సమంత్రకముగా నుంచుచున్నాఁడు, తస్మాత్=ఆకారణము వలన, అస్య=ఈ యగ్నిహోత్రి స్థలమునకు, దక్షిణతః = దక్షిణభాగమునందు, తేజః=తేజస్సు, ఉపదధాతి = కలుగుచున్నది, యస్మాత్ = ఏకారణము వలన, ఇత్థంప్రవృత్తం = అగ్నిహోత్రమునకు దక్షిణభాగమునందు తేజస్సు కలిగెనో, తస్మాత్=ఆ కారణము వలన, అర్ధః=శరీరములో సగమైన, దక్షిణః=దక్షిణభాగము తేజస్వితరః=మిక్కిలి తేజస్సు కలది.

తా॥ నూతిలోనుండు నీళ్ళు గృహకృత్యములకు విశేషముగా నుపయోగించుటచేఁ దేజస్సు కలవియగును. అట్టి యుదకమును దెచ్చి యగ్నిహోత్రమునకు దక్షిణభాగమునందు సమంత్రకముగాఁ జల్లఁబడినేని యగ్నిస్థలమునకుఁ దేజస్సు కలిగినట్లుగానే ప్రతి మనుష్యుని దక్షిణభాగము తేజస్సు కలిగియుండుటచేతఁ గుడి భాగము మంచిదని చెప్పఁబడినది.

మూ॥ స్థావరాగ్గృహ్ణాతి। తాః పశ్చాదుపదధాతి। ప్రతిష్ఠిస్థావరాః।
పశ్చాదేవ ప్రతితిష్ఠతి॥

ప॥ స్థావరాః। గృహ్ణాతి। తాః। పశ్చాత్। ఉప। దధాతి। ప్రతిష్ఠితాః। వై। స్థావరాః। పశ్చాత్। ఏవ। ప్రతి తిష్ఠతి॥

అ॥ స్థావరాః = ప్రవహింపక యుండు మడుఁగులయందైన జలములను, గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడు, తాః = ఆ జలములను, పశ్చాత్ = పడమరదిశ యందు, ఉపదధాతి = సమన్త్రకముగా నుంచుచున్నాఁడు, స్థావరాః = మడుఁగుల యందుండునట్టి యాజలములు, ప్రతిష్ఠితాః = తన సంబంధముగల వారినందఱను స్థితి గలవారినిగాఁ జేసి, పశ్చాత్ = అనంతరము, ప్రతితిష్ఠత్యేవ = స్థితిగలదగుచున్నవి.

తా॥ నదులయందో కానొకచోటఁ బ్రవహింపక లోఁతుగానుండు నీళ్ళుగల మడుఁగులుండును. అట్టి మడుఁగులలోనుండు జలములను దెచ్చి యజ్ఞముఁ జేయు ప్రదేశమునకుఁ బశ్చిమదిక్కున సమన్త్రకముగాఁ జల్లవలయును. ఆ జలములు మడుఁగులయందెట్లు చలింపక తాముండునో, ఆ తీరుననే మడుఁగులయందైన జలముల నుంచుటవలనఁ దమ సంబంధముగలవారిని నాశనరహితమైన స్థితిగలవారినిగాఁ జేసి యనంతరము తాము స్థిరమైన స్థితికలవియగును.

మూ॥ వహన్తీర్గృహ్ణాతి॥ ౧౦౦ ॥ తా ఉత్తరత ఉపదధాతి। ఓజసా వా
ఏతా వహన్తీరి వోద్గతీరివ ఆకూజతీరివ ధావన్తీః। ఓజ ఏవా
స్యోత్తరతో దధాతి। తస్మాదుత్తరోఽర్ధ ఓజస్వితరః॥

ప॥ వహన్తీః। గృహ్ణాతి। తాః। ఉత్తరతః। ఉప దధాతి। ఓజసా। వై। ఏతాః। వహన్తీః। ఇవ। ఉద్గతీః। ఇవ। ఆకూజతీః। ఇవ। ధావన్తీః। ఓజః। ఏవ। అస్య। ఉత్తరతః। దధాతి। తస్మాత్। ఉత్తరః। అర్ధః। ఓజస్వితరః॥

అ॥ వహన్తీః=ప్రవహించునట్టి నదీజలమును, గృహ్ణాతి=గ్రహించుచున్నాడు, తాః = ఆజలములను, ఉత్తరతః = యజ్ఞప్రదేశమున నుత్తరదిశయందు, ఉపదధాతి= సమన్త్రకముగా నుంచుచున్నాడు, ఏతాః = ఈ జలములు, ఓజసా వై = బలము చేత, ధావన్తీరివ = పరుగెత్తుచున్న వానివలెను, వహన్తీరివ = తమయందు జాతిపడిన కొయ్యలు మొదలగువానిని మోసికొనిపోవుచున్న వానివలెను, ఉద్గతీరివ = రాలు మొదలగునవి తగులుటచే నెగిరిపడుచున్న వానివలెను, ఆకూజతీరివ = ధ్వనిఁజేయు చున్నవానివలెను, ఉన్నవి, అస్య = ఈ జలముయొక్క, ఓజఏవ = అట్టిబలమును, ఉత్తరతః=ఉత్తరదిశయందు, దధాతి = కలుగఁజేయున్నది. తస్మాత్=ఆ కారణము వలన, ఉత్తరః=ఎడమదియగు అర్ధః=శరీరములో సగభాగము, తేజస్వితరః=మిక్కిలి శ్రేష్ఠమైనది.

తా॥ నదులయందుండు జలములనుదెచ్చి యజ్ఞప్రదేశమున నుత్తరదిశయందు సమన్త్రకముగా నుంపవలయును. ఆ జలములు ఏ బలముచేఁ బరుగెత్తునవియుఁ దమయందు జాతిపడిపోయిన కొయ్య మొదలగువానిని దీసికొనిపోవునవియు రాలు మొదలగునవి తగులుటచే నెగిరిపడి దుముకునవియు నందువలననే ధ్వనిఁజేయునవియు నై యుండునో, అట్టిబలము నుత్తరదిశయందుఁ గలిగించును. కాఁబట్టి మనుష్యున కును ఎడమపార్శ్వము పాదప్రక్షాళనము మొదలగు కొన్నికార్యములయందు బల వత్తరముగాఁ జెప్పఁబడినది.

మూ॥ సంభార్యా గృహ్ణాతి । తా మధ్య ఉపదధాతి । ఇయం వై సంభార్యాః । అస్యామేవ ప్రతితిష్ఠతి ॥

ప। సంభార్యాః । గృహ్ణాతి । తాః । మధ్యే । ఉప । దధాతి । ఇయం । వై । సంభార్యాః । అస్యాం । ఏవ । ప్రతి । తిష్ఠతి ॥

అ॥ సంభార్యాః=గృహమునందు ఘటాదిపాత్రలలో నుంపఁబడిన జలములను, గృహ్ణాతి=గ్రహించుచున్నాడు, తాః = ఆజలములను, మధ్యే = నాలుగుదిక్కుల మధ్యను, ఉపదధాతి=ఉంచుచున్నాడు. ఇయం వై=ఈభూమి, సంభార్యాః= దాఁచియుంపఁబడిన జలములుగలది, అస్యామేవ = ఈభూమియందు వలెనే ప్రతితిష్ఠతి=స్థితిని పొందుచున్నది.

తా॥ గృహములయందు ఘటాదులయందు దాఁచియుంపఁబడిన జలములను దెచ్చి నాలుగు దిక్కులమధ్యగాఁ జల్లవలయును. అది యేతీరుగా నుండుననిన భాండంబనఁదగిన యీ భూమిలోనుండు జలములఁ జల్లినట్లుగానే యుండును గాన భూమియొక్క ప్రతిష్ఠ గలదగుచున్నది.

మూ॥ పల్వల్యాగృహ్ణాతి । తాఉపరిష్టాదుపాదధాతి ॥ ౧౦౧ ॥ అసౌ వైపల్వల్యాః । అముష్యామేవ ప్రతితిష్ఠతి ॥

ప॥ పల్వల్యాః । గృహ్ణాతి । తాః । ఉపరిష్టాత్ । ఉప । ఆ । దధాతి । అసౌ । వై । పల్వల్యాః । అముష్యాం । ఏవ । ప్రతి । తిష్ఠతి ॥

అ॥ పల్వల్యాః=జలము లెప్పుడును స్వల్పముగానైన నుండునట్టి ప్రదేశమునం దుండు జలములను, గృహ్ణాతి=గ్రహించుచున్నాఁడు, తాః=ఆ జలములను, ఉపరిష్టాత్=ఇష్టకములపైని, ఉపాదధాతి=చల్లుచున్నాఁడు, అసౌ=ఈ స్వర్గము, పల్వల్యాః=ఎల్లప్పుడు నుండు జలము గలది, అముష్యామేవ = ఈ స్వర్గలోకమునందు, ప్రతి తిష్ఠతి=ప్రతిష్ఠ గలవాఁడగుచున్నాఁడు.

తా॥ వేసవికాలమందైన యెండకుఁ గొంచెము దరిద్రరూపముగా నుండి యెల్లప్పుడు త్రవ్వఁబడక జలము పొందఁదగిన స్థలము పల్వలమని చెప్పఁబడుచున్నది. అట్టి స్థలమునందుండు నీళ్ళు పల్వలములు అని చెప్పుదురు. అట్టి జలములను దెచ్చి యిష్టకలపైఁ జల్లిన యెడల స్వర్గలోక స్థితిని బొందుచున్నాఁడు. అది యెట్లనఁగా, వర్షాకాలంబున మేఘములయందు నితరకాలములయందు నావిరిరూపముగా సూర్య కిరణములయందు జలముండుటచే నెల్లప్పుడు జలముగలదియై పల్వల సదృశముగా నుండు స్వర్గలోక స్థితిని బొందుచున్నాఁడు.

మూ॥ దిక్షూపదధాతి । దిక్షువా ఆపః । అన్నంవా ఆపః । అద్భ్యోవాఅన్నంజాయతే । యదేవాద్భ్యోన్నం జాయతే । తదవరున్ధే ॥

ప॥ దిక్షు । ఉప । దధాతి । దిక్షు । వై । ఆపః । అన్నం । వై । ఆపః । అద్భ్యః । వై । అన్నం । జాయతే । యత్ । ఏవ । అద్భ్యః । అన్నం । జాయతే । తత్ । అవ రున్ధే ॥

అ॥ దిక్షు = దిక్కులయందు, ఉపదధాతి = ఉంపబడుచున్నవి, దిక్షువై = దిక్కులయందు, ఆపః = జలమున్నవి, ఆపః = జలములు, అన్నంవై = అన్నము, ఆపః = జలమైనది, అద్భ్యః = జలములవలన, అన్నంవై = అన్నము, జాయతే = పుట్టుచున్నది, యత్ = ఏ కారణమువలన, అన్నం = అన్నము, అద్భ్యః= జలముల వలన, జాయతే = కలుగుచున్నదో, తత్ = ఆ కారణమువలన, అరుద్ధే = అన్నము నాక్రమించువాఁడు, అనఁగాఁబొందువాఁడు, అగుచున్నాడు.

తా॥ దిక్కులయందు నుదకమునుజల్లబడుచు నెందువల్లననఁగా దిక్కుల యందంతటను మేఘములావరించి యుండి వర్షమును గురియుటచే దిక్కులయం దుదకము అన్నమని చెప్పఁదగియున్నది. ఆ యుదకములవలన నన్నము కలుగుటచే దిక్కులన్నమును గలిగించుట కాధారమైయున్నవిగాన దిక్కులయం దుదకసమార్జనముచే నన్నమును బొందువాఁడగును.

మూ॥ తంవాఏతమరుణా కేతవో వాతరశనా ఋషయోఽచిన్వన్ ।
తస్మాదారుణకేతుకః ॥

ప॥ తం । వై । ఏతం । అరుణాః । కేతవః । వాతరశనాః । ఋషయః । అచిన్వన్ । తస్మాత్ । అరుణకేతుకః ॥

అ॥ తం=అపూర్వోక్తమైన, ఏతంవై ఈయగ్నిని, అరుణాః=అరుణులనియు కేతవః=కేతులనియు, వాతరశనాః = వాతరశనులనియుఁ జెప్పఁబడు, ఋషయః= మునీశ్వరులు, అచిన్వన్=పూజించిరి, తస్మాత్=ఆ కారణమువలన, అరుణకేతుకః= అరుణకేతువు అని యగ్నిహోత్రుఁడు చెప్పఁబడుచున్నాఁడు ॥

తా॥ అరుణులనియు కేతులనియు వాతరశనులనియు మునీశ్వరులు మూడువిధములుగానుండిరి. అట్టి యరుణులు మొదలగుమునీశ్వరులచేతఁ బూజింపబడినవాఁడు గాన నగ్నిహోతుృఁడు అరుణకేతుకాగ్ని యని చెప్పఁబడుచున్నాఁడు.

మూ॥ తదేషాభ్యనూక్తా॥

ప॥ తత్ । ఏషా । అభి । అను । ఉక్తా॥

అ॥ తత్=ఆవిషయమునుగురించి, ఏషా=ఈమన్త్రము, అభ్యనూక్తా=అనుసరించి చెప్పఁబడినది.

తా॥ ఈయగ్నికి నారుణకేతుక సంబంధమును జెప్పుటనుగురించి మరియొక శాఖయందుఁ జెప్పఁబడినట్లుగా ముందుచెప్పఁబోవు మన్త్రమునందుఁ జెప్పుచున్నాడు.

మూ॥ కేతవో అరుణాసశ్చ । ఋషయో వాతరశనాః । ప్రతిష్ఠాగ్ంశతధాహి । సమాహితాసో సహస్రధాయసమితి॥

ప॥ కేతవః । అరుణాసః । చ । ఋషయః । వాతరశనాః । ప్రతిష్ఠాం । శతధా । హి । సమాహితాసః । సహస్రధాయసం । ఇతి॥

అ॥ కేతవః=కేతులనియు, అరుణాసశ్చ=అరుణులనియు, వాతరశనాః=వాతరశనులనియుఁజెప్పఁబడు, ఋషయః=మునీశ్వరులు, సమాహితాసః=స్వస్థచిత్తము గలవారై, శతధాహి=నూఱువిధములుగా, లేక అనేకవిధములుగా, ప్రతిష్ఠాం=ప్రతిష్ఠకుఁగారణమైనదియు, సహస్రధాయసం=అనేకఫలములను ధరించియున్నదియు నగు నగ్నినిబూజించిరి, ఇతి=ఈప్రకారముగాఁ జెప్పఁబడియున్నది.

తా॥ కేతువులు అరుణులు వాతరశనులు అనునట్టి మూఁడువిధములుగల మునీశ్వరులు స్వస్థమైన మనస్సుగలవారై యనేకవిధములుగాఁ బ్రతిష్ఠకుఁగారణమైనదియు ననేకఫలములను ధరించియున్నదియు నగునగ్నిని బూజించిరని యితరశాఖలయందుఁజెప్పఁబడియున్నది.

మూ॥ శతశశ్చైవసహస్రశశ్చప్రతితిష్ఠతి । యఏతమగ్నించినుతే యఉచైన మేవంవేద॥ ౧౦౨॥

ప॥ శతశః । చ । ఏవ । సహస్రశః । చ । ప్రతి । తిష్ఠతి । యః । ఏతం । అగ్నిం । చినుతే । యః । ఉ । చ । ఏనం । ఏవం । వేద॥

అ॥ యః=ఎవఁడు, ఏతం=ఈ, అగ్నిం=అగ్నిని, చినుతే=పూజించుచున్నాఁడు, యశ్చ=ఎవఁడు, ఏనం=ఈ యగ్నిని, ఏవం=ఈ ప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, శతశశ్చ=అనేక విధములుగాను, సహస్రశశ్చ=అనేకవేల విధములుగాను, ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠను బొందుచున్నాఁడు.

తా॥ ఇటువంటివానిగా నగ్ని నెవఁడు తెలిసికొనుచున్నాఁడో మఱియుఁ బూజించుచున్నాఁడో వాఁడు అనేక విధములుగాఁ బ్రతిష్ఠ పొందువాఁడగుచున్నాఁడు.

ఇతి చతుర్వింశోఽనువాకస్సమాప్తః

—♦ అథపంచవిగ్ంశో౽నువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ జానుదఘ్నీ ముత్తరవేదీంఖాత్వా । అపాం పూరయతి । అపా
గ్ంసర్వత్వాయ ॥

ప॥ జానుదఘ్నీం । ఉత్తరవేదీం । ఖాత్వా । అపాం । పూరయతి ।
అపాం । సర్వత్వాయ ॥

అ॥ జానుదఘ్నీం=మోఁకాలిలోఁతుగల, ఉత్తరవేదీం = ఉత్తర దిక్కునందు
అగ్నిహోత్రకుండమును, ఖాత్వా = త్రవ్వి, అపాం = ఉదకములయొక్క, సర్వ
త్వాయ=సర్వవ్యాపకత్వముకొఱకు, అపాం=ఉదకములయొక్క, అనఁగా నుదకము
లను, పూరయతి=నిండించుచున్నాఁడు.

తా॥ మోఁకాలిలోఁతు గల యగ్నికుండము నుత్తరదిక్కునఁ ద్రవ్వి దానిలోఁ
జలమండ లోఁతున నీళ్ళు యుంపవలయును. ఎందువల్లననఁగా గర్తముదకమయ
త్వమైనట్టుగానే సర్వపదార్థములకు జలవ్యాపకత్వము సిద్ధించుట కొఱకుఁ జేయు
చున్నాఁడు.

మూ॥ పుష్కరపర్ణ గ్ం రుక్మం పురుష మిత్యుపదధాతి । తపో వై
పుష్కరపర్ణం । సత్యగ్ం రుక్మః । అమృతం పురుషః । ఏతావ
ద్వావాస్తి । యావదేతత్ । యావదేవాస్తి ॥ ౧౦౩ ॥ తద
వరున్ధే ॥

ప॥ పుష్కరపర్ణం । రుక్మం । పురుషం । ఇతి । ఉప । దధాతి । తపః ।
వై । పుష్కరపర్ణం । సత్యం । రుక్మః । అమృతం । పురుషః । ఏతావత్ । ఏవా ।
వా । అస్తి । యావత్ । ఏతత్ । యావత్ । ఏవ । అస్తి । తత్ । అవరున్ధే ॥

అ॥ పుష్కరపర్ణం=తామరాకును, రుక్మం=బంగారమును, పురుషం=విరా
ట్పురుషుని, ఇతి=ఈప్రకారముగా, ఉపదధాతి=ఉపధానముఁ జేయుచున్నాఁడు,
పుష్కరపర్ణం=తామరాకు, తపోవై=తపస్స్వరూపమైనది, రుక్మః=బంగారము,
సత్యం=నాశనములేని స్వరూపముగలది, పురుషః=విరాట్పురుషుఁడు, అమృతం=
నాశనములేనివాఁడు, ఏతావత్=ఇంతైన, యావత్=ఏసత్యాదికము, అస్తి=కలదో,

ఏతత్=ఇదియే, ఏతత్=ఈ, యావత్=ఏపుష్కరపర్ణ సంబంధమగు సత్యాదికము, అస్తికలదో, తత్=దానిని, అవరున్ధే=అరికట్టుచున్నాఁడు.

తా॥ తామరాకు పవిత్రమగుటచేఁ దపస్స్వరూపముగాను బంగారము కరఁగించినను నశింపనిదగుటచే సత్యస్వరూపము కలదిగాను విరాట్పురుషుఁడు ఆద్యంతములు లేనివాఁడగుటచే నమృతస్వరూపుఁడుగాను జెప్పఁబడిరిగాన నా తామరాకును బంగారమును విరాట్పురుషుని ధ్యానముఁజేయవలయును. అలాచేసినయెడల నాతావు శాకు మొదలగువానియొక్క యే పవిత్రత్వాదులక్షలవో వానినన్నింటిని బొందు వాఁ డగుచున్నాఁడు.

మూ॥ కూర్మముపదధాతి । అపామేవమేధమవరున్ధే । అథోస్వర్గస్య లోకస్యసమష్ట్యై ॥

ప॥ కూర్మం । ఉప । దధాతి । అపాం । ఏవం । ఏధం । అవరున్ధే । అథః । స్వర్గస్య । లోకస్య । సమష్ట్యై ॥

అ॥ కూర్మం = తాఁబేలుని, ఉపదధాతి = ధ్యానముఁజేయుచున్నాఁడు, అపాం=ఉదకములయొక్క, ఏధమేవ=సారమునే, అవరున్ధే=అరికట్టుచున్నాఁడు, అథః=మఱియు, స్వర్గస్యలోకస్య=స్వర్గలోకముయొక్క, సమష్ట్యై=ప్రాప్తికొఱకు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ జలములయందు భగవంతుని సారమైయున్న తాఁబేలుని సమన్త్రకముగా యజ్ఞరూపకమైన ధ్యానముఁజేసిన యెడల సమస్తవస్తువుల సారమును మఱియుస్వర్గ లోకమును బొందువాఁడగును.

మూ॥ ఆపమాపామపస్సర్వాః । అస్మాదస్మాదితోఽముతః । అగ్నిర్వా యుశ్చసూర్యశ్చ । సహసంచస్కరర్ధియా ఇతి । వాయ్వశ్వా రశ్మి పతయః॥

తా॥ ఈ మన్త్రమునకు ప్రథమానువాకములో నర్థతాత్పర్యాదులు చెప్పఁబడినవి.

మూ॥ లోకంపృణచ్ఛిద్రంపృణ॥ ౧౦౪॥ యాస్తిస్రః పరమజాః॥

ప॥ లోకం । పృణ । ఛిద్రం । పృణ । యాః । తిస్రః । పరమజాః॥

అ॥ లోకం=లోకమును, పృణ=నిండింపుము, ఛిద్రం=రంధ్రమును, పృణ=నిండింపుము, యాః=ఏ, తిస్రః=మూడైనవి, పరమజాః=ఘనమైనజన్మగలమాతృగణములను, పృణ=నిండింపుము॥

తా॥ ఓ జలరూపమైన యిష్టకా! లోకమంతయును నీవునిండియుండినదానవై యీ యగ్నిహోత్రసంబంధమగు రంధ్రములను నిండింపుము ఉత్తమ మధ్యమ అధమ భేదములచే మూడువిధములుగా నుండుఘనమైన నీ మాతృగణములను నిండింపుము.

మూ॥ ఇన్ద్రఘోషావోవసుభిరేవాహ్యావేతి॥

ప॥ ఇన్ద్రఘోషావోవసుభిః । ఏవాహ్యావ । ఇతి॥

అ॥ ఇన్ద్రఘోషావోవసుభిః ఇతి=ఇన్త్రఘోషావోవసుభిః పురస్తాత్ అనుమంత్రములచేతను, ఏవాహ్యావేతి=ఏవాహ్యావ మొదలగుమన్త్రములచేతను ఇష్టకను పధానముచేయవలయును.

తా॥ ఇన్ద్ర ఘోషావోవసుభిపురస్తాత్, ఏవాహ్యావ, మొదలగు మన్త్రములను చేత నిష్టకనుపధానము చేయవలయును.

మూ॥ పంచచితయ ఉపదధాతి । పాఙ్క్తోఽగ్నిః । యావానేవాగ్నిః । తంచినుతే॥

ప॥ పంచ । చితయః । ఉప । దధాతి । పాఙ్క్తః । అగ్నిః । యావాన్ । ఏవ । అగ్నిః । తం । చినుతే॥

అ॥ పంచ, ఐదైన, చితయః=కత్త్యములను, ఉపదధాతి=ఉపధానముఁ జేయుచున్నాఁడు, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, పాఙ్క్తః=పంచకత్త్య పంక్తిగలవాఁడగుచున్నాఁడు, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, యావాన్=ఏ పంచకత్త్యములు కలవాఁడగునో, తం=ఆయగ్నిని, చినుతే=పూజించుచున్నాడు.

తా॥ మోఁకాలిలోఁతున గొయ్యి త్రవ్వి యా గోఁతిలోఁ జలమండలలోతున్న నీళ్ళుంచి దానిపైని దామరాకులను దామరకాడలను దామరపుష్పములనుంచి దా[illegible]

దిష్టకనుంచి తిరిగి తామరాకులను గాడలను బువ్వలనుంచి దానియందిష్టకనుంచి యీ ప్రకారముగా నైదు అంతర్యులను గలుగునట్లు జేయుటచేఁ బంచకత్యులుగల యగ్ని ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్ని సభ్యా, వసథ్యరూపముగు నామములచే జెప్పఁబడినవాడై పంచచితులు కలవాఁడగును. అట్టి పంచకత్యాన్వితుడగు నగ్నినే పూజింపవలయును.

మూ॥ లోకంపృణయాద్వితీయా ముపదధాతి । పంచపదావై విరాట్ । తస్యావాఇయంపాదః । అంతరిక్షంపాదః । ద్యౌః పాదః । దిశఃపాదః । పరోరజాః పాదః ॥

ప॥ లోకంపృణయా । ద్వితీయాం । ఉప । దధాతి । పంచపదా । వై । విరాట్ । తస్యావైః । ఇయం । పాదః । అంతరిక్షం । పాదః । ద్యౌః । పాదః । దిశః । పాదః । పరోరజాః । పాదః ॥

అ॥ లోకంపృణయా = లోకం పృణయా అనునట్టి, ద్వితీయాం = రెండవ యిష్టకను, ఉపదధాతి = ఉపధానముఁజేయవలయును, సా=ఆయిష్టము, విరాట్ = విరాట్స్వరూపమైనదియు, పంచపదావై = అయిదుపాదములు కలదియునైయున్నది. తస్యాః = అ యిష్టకమునకు, ఇయం = ఈ భూలోకము, పాదః = ఒకపాదము, అన్తరిక్షం = ఆకాశము, పాదః = ఒకపాదము, ద్యౌః = స్వర్గము, పాదః = పాదము, దిశః = దిక్కులు, పాదః = ఒకపాదము, పరోరజాః = రజోగుణముకంటె వేరుగానుండు పరమాత్మ, పాదః = ఒకపాదము॥

తా॥ సర్వవ్యాపకత్వముగల, లోకంపృణ, అనునట్టియు రంధ్రములయందు వ్యాపకత్వముగల, ఛిద్రంపృణ, అనునట్టియు రెండు యిష్టకలుకలవు. వానిలో సర్వ వ్యాపకత్వము కలిగియుండుటచే, లోకంపృణ, అనునట్టి యిష్టకను సేవింపవలయును. ఆ యిష్టక సర్వవ్యాపకము గలదగుటచే విరాట్పురుషుని దేహస్వరూపమై అయిదు పాదములు గలదగుచున్నది. అదియేవనఁగా, ఈ భూలోకము ఒక పాదము ఆకాశము ఒకపాదము స్వర్గ మొకపాదముదిక్కు లొకపాదము రజోగుణాత్మకంబగు సంసారము నతిక్రమించియుండు చైతన్యమొకపాదము కలుగుటచే నైదుపాదములు [illegible]యున్నది.

మూ॥ విరాజ్యేవ ప్రతితిష్ఠతి। యఏతమగ్నించినుతే। యఉచైనమేవంవేద ॥ ౧౦౫ ॥ ౨౫ ॥

ప॥ విరాజి । ఏవ । ప్రతి । తిష్ఠతి । యః । ఏతం । అగ్నిం । చినుతే । యః । ఉ । చ । ఏనం । ఏవం । వేద ॥

అ॥ యః = ఎవఁడు, ఏతం = ఈ, అగ్నిం = అగ్నిని, చినుతే = పూజించుచున్నాఁడో, యశ్చ = ఎవఁడు, ఏనం = ఈ యగ్నిని, ఏవం = ఇటువంటి మహిమ గలవానిగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, విరాజి = విరాట్పురుషుని దేహభూతుఁడై, లేక, అన్నముగలవాఁడై, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠను బొందుచున్నాడు.

తా॥ ఎవఁడు ఈ యగ్నిహోత్రుని బూజించుచున్నాఁడో లేక ఎవఁడీ యగ్నిహోత్రునిట్టి మహిమగలవానిగాఁ దెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడు అన్నముకలవాఁడగును లేక విరాట్పురుషుని దేహస్వరూపుండగును.

ఇతి పంచవిగ్ంశోనువాకస్సమాప్తః.

—♦ అథషడ్విగ్ంశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ అగ్నింప్రణీయోప సమాధాయ । తమభితఏతా అభీష్టకా ఉపదధాతి । అగ్నిహోత్రేదర్శపూర్ణమాసయోః । పశుబన్ధే చాతుర్మాస్యేషు । అథోఆహుః । సర్వేషుయజ్ఞక్రతుష్వితి॥

ప॥ అగ్నిం । ప్రణీయ । ఉప । సమాధాయ । తం । అభితః । ఏతాః । అభీష్టకాః । ఉప । దధాతి । అగ్నిహోత్రే । దర్శపూర్ణమాసయోః । పశుబన్ధే । చాతుర్మాస్యేషు । అథః । ఆహుః । సర్వేషు । యజ్ఞక్రతుషు । ఇతి॥

తా॥ ఈ మంత్రమునకు అర్థము తాత్పర్యము, యోపాంపుష్పంవేద, అనుసట్టి యను వాకమునందుఁ జెప్పఁబడినవి. కొన్ని ఫలవిశేషములను ప్రతవిశేషములను జెప్పఁదలఁచి తిరిగి యీ యనువాకమునందీ మంత్రమును జెప్పెను.

మూ॥, అథహస్మాహారుణస్స్వాయంభువః । సావిత్రస్సర్వోఽగ్నిరిత్యననుషంగం మన్యామహే। నానావాఏతేషాం వీర్యాణి॥

ప॥ అథ । హ । స్మ । ఆహ । అరుణః । స్వాయంభువః। సావిత్రః। సర్వః । అగ్నిః । ఇతి । అననుషంగం । మన్యామహే । నానా । వై । ఏతేషాం । వీర్యాణి॥

అ॥ అథ=అనంతరమందు, సర్వః=సమస్తమైన, అగ్నిః=అగ్నిహోత్రము, సావిత్రః=సావిత్రిమను అగ్నిపూర్వకమైనది, ఇతి=ఈలాగని, స్వాయంభువః=స్వయంభువుమారుఁడగు, అరుణః=అరుణుడను మునీశ్వరుఁడు, ఆహస్మ=పలికెను, ఈ ప్రశ్నఁజేయఁగా సమాధానముఁ జెప్పుచున్నారు, అననుషంగం=సంబంధము లేక పోవుటచే, మన్యామహే=తలఁచుచున్నాము, ఏతేషాం=ఈ యగ్నులయొక్క, వీర్యాణి=ఫలములు, నానా వై=అనేకవిధములుగా నేర్పడియున్నవి.

తా॥ అరుణకేతుకాగ్నికి మరియొకయగ్ని సంబంధము లేకపోవుటచేఁ గ్రతువునందు అంగత్వమున్నదా ? లేదా ? అనువిచారణమును ఆక్షేపసమాధానములతోఁ జెప్పుచున్నాఁడు. సావిత్రాగ్ని మొదలు అరుణకేతుకాగ్ని పర్యంతము పూర్వాగ్నులకు నుత్తరోత్తరాగ్నులతో సంబంధముఁ జెప్పుటవలన సర్వాగ్నులకు సావిత్రాగ్ని సంబంధముండుటచేఁ గ్రతువునందంగముగా సావిత్రాగ్నికిఁ జెప్పవచ్చును. అరుణకేతుకాగ్ని కితరమైన యగ్నులతో సంబంధము లేకపోవుటచేఁగ్రతువునందు అరుణకేతుకాగ్నికి సంగత్వమెట్లు చెప్పెదరని స్వయంబుకుమారుండగు అరుణుఁడను మునిఁప్రశ్నఁజేయఁగా ఈ యగ్నులయొక్క ఫలములు వేఱు వేఱుగా నున్నవి. కాఁబట్టి పరస్పర సంబంధమును గ్రహింప నక్కరలేదని యితరమునీశ్వరులు సమాధానముఁజెప్పిరి. ఈ యగ్నులయొక్క ఫలములు 'యోపాంపుష్పంవేద' అనునట్టి యనువాకమునందుఁ "కమగ్నించినుతే" అనునట్టి వాక్యము మొదలు చివరవరకు నుండు వాక్యములలోఁజెప్పఁబడియున్నవి.

మూ॥ కమగ్నించినుతే ॥ ౧౦౬ ॥ సత్రియమగ్నించిన్వానః ॥

ప॥ కం । అగ్ని । చినుతే । సత్రియం । అగ్నిం । చిన్వానః ॥

అ॥ సత్రియం = పన్నెండు దినములు మొదలగు దినములయందుఁ జేయఁబడునట్టి యజ్ఞము నందుండునట్టి, అగ్నిం = అగ్నిని, చిన్వానః = పూజించినవాఁడై, కం = ఏమిఫలము నుద్దేశించి, అగ్నిం = అగ్నిహోత్రమును బూజించు చున్నాఁడు॥

తా॥ పన్నెండు మొదలగు దినములయందుఁ జేయునట్టి యజ్ఞము నందుండు యగ్నిని ఏమిఫలమునపేక్షించి పూజించుచున్నాఁడు

మూ॥ కమగ్నించినుతే। సావిత్రమగ్నించిన్వానః ॥

ప॥ కం। అగ్నిం। చినుతే। సావిత్రం। అగ్నిం। చిన్వానః॥

అ॥ సావిత్రం = సావిత్రియను పేరు, అగ్నిం = అగ్నిహోత్రమును, చిన్వానః = పూజించువాఁడై, కం = ఏమిఫలమునపేక్షించి, అగ్నిం = అగ్నిని, చినుతే= పూజించుచున్నాఁడు

తా॥ సావిత్రాగ్నినే ఫలము నపేక్షించి పూజించు చున్నాడు.

మూ॥ కమగ్నించినుతే। నాచికేతమగ్నించిన్వానః ॥

ప॥ కం। అగ్నిం। చినుతే। నాచికేతం। అగ్నిం చిన్వానః॥

అ॥ నాచికేతం = నాచికేతమను పేరుగల, అగ్నిం - అగ్నిని, చిన్వానః= పూజించుచున్నవాఁడై, కం, ఏమిఫలము నపేక్షించి, అగ్నిం = అగ్నిని, చినుతే= పూజించు చున్నాడు.

తా॥ నాచికేతాగ్నినే ఫలము నపేక్షించి పూజించుచున్నాడు.

మూ॥ కమగ్నించినుతే। చాతుర్హోత్రియమగ్నించిన్వానః।

ప॥ కం। అగ్నిం। చినుతే। చాతుర్హోత్రియం। అగ్నిం। చిన్వానః॥

అ॥ చాతుర్హోత్రిం=చాతుర్హోత్రియమనునట్టి, అగ్నిం = అగ్నిని, చిన్వానః= పూజించు చున్నవాఁడై, కం = ఏమి ఫలమునపేక్షించి, అగ్నిం = అగ్నిని, చినుతే = పూజించు చున్నాఁడు.

తా॥ చాతుర్హోత్రియమను నగ్ని నేమిఫలమునపేక్షించి పూజించుచున్నాఁడు.

మూ॥ కమగ్నించినుతే। వైశ్వసృజమగ్నించిన్వానః ॥

ప॥ కం। అగ్నిం। చినుతే। వైశ్వసృజం। అగ్నిం। చిన్వానః॥

అ॥ వైశ్వసృజం = వైశ్వసృజమను పేరుగల, అగ్నిం = అగ్నిని, చిన్వానః = పూజించువాఁడై, కం = ఏమి ఫలము నపేక్షించి, అగ్నిం = అగ్నిని, చినుతే = పూజించుచున్నాఁడు.

తా॥ వైశ్వసృజమను పేరుగల యగ్నిహోత్రము నేమి ఫలము నపేక్షించి పూజించుచున్నాఁడు.

మూ॥ కమగ్నించినుతే ॥ ౧౦౭ ॥ ఉపానువాక్యమాశు మగ్నించి నాన్వః ॥

ప॥ కం। అగ్నిం । చినుతే । ఉపానువాక్యం । ఆశుం । అగ్నిం । చిన్వానః ॥

అ॥ ఆశుం=అధికమైన, ఉపానువాక్యం = ఉపానువాక్యమను పేరుగల, అగ్నిం = అగ్నిని, చిన్వానః = పూజించువాఁడై, కం = ఏమి ఫలము నపేక్షించి, అగ్నిం=అగ్నిహోత్రమును, చినుతే-పూజించుచున్నాఁడు.

తా॥ ఉపాను వాక్యమనునట్టి కాండయందుఁ జెప్పఁబడిన యగ్నిహోత్రము ఉపానువాక్యమని చెప్పఁబడును. అటువంటి యగ్నిని ఏమిఫలమున పేక్షించి పూజించుచున్నాఁడు.

మూ॥ కమగ్నించినుతే। ఇమమారుణకేతుక మగ్నించిన్వానఇతి ॥

ప॥ కం। అగ్నిం । చినుతే । ఇమం । ఆరుణకేతుకం। అగ్నిం। చిన్వానః। ఇతి ।

అ॥ ఆరుణకేతుకం = ఆరుణకేతుకమను పేరుగల, అగ్నిం = అగ్నిని, చిన్వానః = పూజించువాఁడై, కం = ఏమిఫలమునపేక్షించి, అగ్నిం = అగ్నిని, చినుతే= పూజించుచున్నాడు, ఇతి = ఈ ప్రకారముగా ప్రశ్న చేసిరి.

తా॥ఆరుణకేతుకాగ్ని నేమిఫలము నపేక్షించి పూజించుచున్నాఁడు. ఈ ప్రకారముగా నారుణకేతుకాగ్నికిఁ గ్రత్వంగత్వముండుట యెందుకని ప్రశ్నఁజేసిన అరుణుఁడు అను మునీశ్వరు నితరమును లడిగిరి. అనఁగా సంవత్సర దేవతాప్రాప్తి మొదలగు ఫలములను ఆయాయగ్నులు వేఱువేఱుగా నిచ్చుచుండిరి గాన అగ్ను లందఱకును గ్రత్వంగత్వ మొండవలయునని యితరమునీశ్వరుల యభిప్రాయమై యున్నది.

మూ॥ వృషావాఅగ్నిః। వృషాణౌసగ్గ్ స్ఫాలయేత్। హన్యేతాస్య యజ్ఞః। తస్మాన్నానుమజ్యః॥

ప॥ వృషా । వై । అగ్నిః । వృషాణౌ । సం । స్ఫాలయేత్ । హన్యేత । అస్య । యజ్ఞః । తస్మాత్ । న । అనుమజ్యః ॥

అ॥ అగ్నిః = అగ్నిని సేవించు యజమానుఁడు, వృషావై = రేతస్సునుండి సంతానమును బుట్టింపఁదగి యున్నాఁడు, వృషాణౌ = వృషణములను, సంస్ఫాలయేత్ = పీడించెనేని, అస్య = ఇతనియొక్క, యజ్ఞః = యజ్ఞము, హన్యేత=కొట్టఁబడును, అనఁగా నశించును, తస్మాత్ = ఆకారణమువలన, నానుమజ్యః = సంబంధముఁ జెప్పఁగూడదు,

తా॥ అగ్నిని బూజించువాఁడు వీర్యమునుండి సంతానము కలిగింప సమర్థుడై యున్నాఁడుగాన నగ్నులకు సంబంధమును జెప్పిన యెడల యజమానుని వృషణద్వయమునకుఁ బీడకలుగును. ఇతని యజ్ఞము నశించును. కాఁబట్టి యగ్ని సంబంధముఁ జెప్పఁదగదు. అగ్నులన్నియు స్వతంత్రములైనవి. కాఁబట్టి అరుణకేతుకాగ్నికిఁ గ్రతువునం దంగత్వముఁ జెప్పవలయునని కొందఱు మునీశ్వరులు సిద్ధాంతపఱిచిరి.

మూ॥ సోత్తరవేదిషు క్రతుషు చిన్వీత । ఉత్తరవేద్యాగ్ హ్యగ్ని
శ్చీయతే ॥

ప॥ సోత్తరవేదిషు । క్రతుషు । చిన్వీత । ఉత్తరవేద్యాం । హి । అగ్నిః । చిన్వీత ॥

అ॥ సోత్తరవేదిషు = ఉత్తరవేదికగల, క్రతుషు = పశుబంధాదిక్రతువుల యందు, చిన్వీత = పూజింపవలయును, అగ్నిః=అరుణకేతుకాగ్ని, ఉత్తరవేద్యాం = ఉత్తరవేదికయందు, చీయతేహి = పూజింపఁబడుచున్నాఁడుగదా ॥

తా॥ అరుణకేతుకాగ్ని యుత్తరవేదికయందుఁ బూజింపఁబడుచున్నాఁడుగాన యుత్తరవేదికగల పశుబంధాది క్రతువులయం దారుణకేతుకాగ్నిని బూజింపవలయును.

మూ॥ ప్రజాకామశ్చిన్వీత॥ ౧౦౮॥ ప్రజాపత్యోర్వా ఏషోగ్నిః । ప్రజా
ప్రజాపత్యాః ప్రజాఃవాన్భవతి । య ఏవం వేద॥

ప॥ ప్రజాకామః । చిన్వీత । ప్రాజాపత్యః । వై । ఏషః । అగ్నిః । ప్రాజాపత్యాః । ప్రజాః । ప్రజావాన్ । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ ప్రజాకామః = సంతానమును గోరువాఁడు, చిన్వీత = పూజింపవలయును, ఏషః = ఈ, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, ప్రాజాపత్యః = ప్రజాపతిసంబంధమైనవాఁడు, ప్రజాః = మనుష్యులు, ప్రాజాపత్యాః = ప్రజాపతిసంబంధమైనవారు, యః=ఎవఁడు, ఏవం = ఈప్రకారముగా, వేద= తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, ప్రజావాన్=సంతానముకలవాఁడు, భవతి = అగుచున్నాఁడు॥

తా॥ సంతానమును గోరువాఁడు ఈ యగ్నిని బూజింపవలయును. ఎందువలననగా, అగ్ని ప్రజాపతిచేఁ సృజింపబడుటచే ప్రాజాపత్యుఁ డయ్యెను. మనుష్యులును ప్రజాపతిచే సృజింపఁబడినవారగుటచేఁ బ్రాజాపత్యులైరి. ప్రాజా

పత్యసంబంధముండుటచే ప్రజాసంబంధమగు ఫలము నిచ్చువాఁ డగుచున్నాఁడు. ఈ ప్రకారముగా నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సంతానము కలవాఁ డగుచున్నాఁడు.

మూ॥ పశుకామ శ్చిన్వీత । సంజ్ఞానంవా ఏతత్పశూనాం । యదాపః । పశూనామేవ సంజ్ఞానేఽగ్నిం చినుతే । పశుమాన్భవతి । యఏవంవేద ॥ ౧౯ ॥

ప॥ పశుకామః । చిన్వీత । సంజ్ఞానం । వై । ఏతత్ । పశూనాం । యత్ । ఆపః । పశూనాం । ఏవ । సంజ్ఞానే । అగ్నిం । చినుతే । పశుమాన్ । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ పశుకామః=పశువులను గోరువాఁడు, చిన్వీత=జలసంబంధమగు యజ్ఞమును జేయవలయును, యత్ ఆపః=జలములుకలవో, ఏతత్=ఈజలము, పశూనాం=పశువులకు, సంజ్ఞానాం=జ్ఞానసాధనమైనది, పశూనాం=పశువులయొక్క, సంజ్ఞానే=జ్ఞానముకలుగుండఁగా, అగ్నిం=అగ్నిని, చినుతే=పూజించినవాఁ డగుచున్నాఁడు, యః=ఎవఁడు, ఏవం=ఈప్రకారముగా, వేద=తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, పశుమాన్=పశువులు కలవాఁడు, భవతి=అగుచున్నాఁడు ॥

తా॥ జలసంబంధమగు యజ్ఞమును జేసినట్లాయెనా పశువులు కలవాఁడగును. ఎందువల్ల ననఁగా - పశువులు దాహముగలవై యెక్కడ జలముండునో వెతకి తెలిసికొనుచున్నవి కాఁబట్టి జలము పశువులకు జ్ఞానసాధనమైనది. అట్టి జలసంబంధమగు యజ్ఞమునుజేసి నట్లాయెనా - అగ్నివలన జలముపుట్టినది కాఁబట్టి యగ్నిని బూజించినవాఁ డగుచున్నాఁడు. ఈ ప్రకారముగా నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు పశువులు కలవాఁ డగుచున్నాఁడు.

మూ॥ వృష్టికామశ్చిన్వీత । ఆపోవై వృష్టిః పర్జన్యోవర్షుకో భవతి । యఏవంవేద ॥

ప॥ వృష్టికామః । చిన్వీత । ఆపః । వై । వృష్టిః । పర్జన్యః । వర్షుకః । భవతి । యః । ఏవం । వేద ॥

అ॥ వృష్టికామః=వర్షమునుగోరువాఁడు, చిన్వీత=యజ్ఞమును జేయవలయును, ఆపోవై=ఉదకములు, వృష్టిః=వర్షముగానైనవి, యః=ఎవఁడు, ఏవం=ఈప్రకార

ముగా, వేద=తెలిసికొనుచున్నాడో, తస్య=అతనికి, పర్జన్యః=మేఘము, వర్షుకః= వర్షమును గురియునదియై, భవతి=అగుచున్నది.

తా॥ ఉదకములు సూర్యకిరణములద్వారా మేఘముగా నొంది వర్షించుచున్నవి. కాఁబట్టి వర్షమును గోరువాఁడు జలసంబంధమగు యజ్ఞమును జేయవలయును. ఈ ప్రకారముగా నెవఁడు తెలిసికొనుచున్నాడో వానికి సంభవించును.

మూ॥ ఆమయావీచిన్వీత । ఆపోవై భేషజం। భేషజమేవాస్మైకరోతి సర్వమాయురేతి ॥

ప॥ ఆమయావీ । చిన్వీత । ఆపః । వై । భేషజం । ఏవ । అస్మై కరోతి సర్వం । ఆయుః । ఏతి ॥

అ॥ ఆమయావీ=తాపముచేఁ బీడితుఁడైనవాఁడు, చిన్వీత=యజ్ఞముఁ జేయవలయును, ఆపోవై=ఉదకములు, భేషజం=ఔషధము, అస్మై=ఇతనికొరకు, భేషజం=ఔషధమునుగా, కరోతి=చేయుచున్నది, ఏనః=ఇతను, సర్వం=సమస్తమైన ఆయుః=ఆయుస్సును, ఏతి=పొందుచున్నాఁడు.

తా॥ తాపమనురోగముచేఁ పీడింపఁబడినవాఁడు, జలములనుగుఱించి యజ్ఞమును జేయవలయును. తాపమును నివారణచేయునట్టివిగాన ఔషధముగానుండి యజ్ఞమును జేయువానికి నారోగ్యము గలిగించి దీర్ఘాయుర్దాయము నొందించును.

మూ॥ అభిచరగ్గ్శ్చిన్వీత । వజ్రోవా ఆపః ॥౧౧౦॥ వజ్రమేవభ్రాతృవ్యేభ్యః । ప్రహారతి । స్తృణుతఏనం ॥

ప॥ అభిచరన్ । చిన్వీత । వజ్రః । వై । ఆపః । వజ్రం । ఏవ । భ్రాతృవ్యేభ్యః । ప్రహారతి । స్తృణుతే । ఏనం ॥

అ॥ అభిచరన్ = ఇతరులచేఁదిరస్కరింపఁబడినఁవాఁడు, చిన్వీత= యజ్ఞమును జేయవలయును, ఆపః = ఉదకములు, వజ్రోవై = వజ్రాయుధము, యః = ఎవఁడు, ఏనం = ఇతనిగుఱించి, స్తృణుతే = ప్రయోగించుచున్నాఁడో, భ్రాతృవ్యేభ్యః = అట్టివంటిజ్ఞాతి సాముదాయములవలన బ్రయోగింపఁబడిన, వజ్రం = వజ్రాయుధమును, ప్రహారతి = పోగొట్టుచున్నాఁడు.

తా॥ ఎవరైనను జ్ఞాతిసాముదాయములవలన వజ్రాయుధము కొందలగునని ప్రయోగింపఁబడి తిరస్కరింపఁ బడెనేని ఈ జలసంబంధమగు యజ్ఞమును జేయవల

దయును. అలాగునంజేసినయెడల జలముతే వజ్రస్వరూపమును బొంది శత్రువులచే బ్రయోగింపఁబడిన యాయుధములను బోఁగొట్టును.

మూ॥ తేజస్కా మోయశస్కామః । బ్రహ్మవర్చసకామ స్స్వర్గకామ శ్చిన్వీత । ఏతావద్వావాస్తి । యావదేతత్ । యావదేవాస్తి । తదవరున్ధే ॥

ప॥ తేజస్కామః । యశస్కామః । బ్రహ్మవర్చసకామః । స్వర్గకామః । చిన్వీత । ఏతావత్ । వావా । అస్తి । యావత్ । ఏతత్ । యావత్ । ఏవ । అస్తి । తత్ । అవ । రున్ధే ॥

అ॥ తేజస్కామః = తేజస్సును గోరువాఁడును, యశస్కామః = కీర్తిని గోరువాఁడును, బ్రహ్మవర్చసకామః = బ్రహ్మవర్చను గోరువాఁడును, స్వర్గకామః = స్వర్గమునుగోరువాఁడును, ఏతావద్వావా = ఈ సమస్తమయిన యజ్ఞములను జేయుచున్నాఁడు, యావత్ = సంతానము మొదలు స్వర్గపర్యంతమగు నే ఫలము చెప్పఁబడినదో, ఏతత్ = ఇదియే, అస్తి = ఉత్తమఫలముగానున్నది, యావదేవ = ఏ యుత్తమ ఫలముగలదో, తత్ = ఆ ఫలమును, అవరున్ధే = అరికట్టుచున్నాఁడు, అనగాఁ బొందుచున్నాఁడు॥

తా॥ సంతానము పొందుట పశువులను బొందుట స్వర్గమునుబొందుట మొదలగు నేఫలములుకలవో ఆఫలములను తేజస్సును గీర్తిని బ్రహ్మవర్చస్సును మొదలగు సమస్తఫలములను గోరునట్టివాఁ డీజలసంబంధమగు యజ్ఞమునుజేసిన యెడలఁ బొందు వాఁడగుచున్నాఁడు.

మూ॥ తస్యైతద్వ్రతం । వర్షతినధావేత్ ॥ ౧౧ ॥ అమృతంవా ఆపః। అమృతస్యానన్తరిత్యై॥

ప॥ తస్య । ఏతత్ । వ్రతం । వర్షతి । న । ధావేత్ । అమృతం । వై । ఆపః । అమృతస్య । అనన్తరిత్యై॥

అ॥ తస్య = ఆయజ్ఞమును జేయువానికి, ఏతత్ = ఈ, వ్రతం = వ్రతము చెప్పఁబడినది, ఆపః = ఉదకములు, అమృతంవై = అమృతస్వరూపమైనవి, అమృతస్య = అమృతముయొక్క, అనన్తరిత్యై = సంభవించుకొఱకు, వర్షతి = వర్షించుచుండగా, నధావేత్ = నడువఁగూడదు॥

తా॥ అరుణకేతుకాగ్నిని గురించి యజ్ఞమును జేయువాఁడీ ముందు చెప్పినట్లుగా నియమ ముండవలయును. అది యేదియనఁగా వర్షము గురియుచుండఁగా నడువఁగూడదు. ఏలయనఁగా. జలములు అమృతస్వరూపము కాఁబట్టి వర్షములో నడచు సమయమున వర్షధారను విడిచిపెట్టి పోవలసి వచ్చును, ఇక్కడ జలమును విడిచిపెట్టినట్లుగానే పరలోకంబున స్వర్గముకూడ పొందుట దుర్లభమగును.

మూ॥ నాప్సుమూత్రపురీషం కుర్యాత్ । ననిష్ఠీవేత్ । నవివసన స్స్నాయాత్ । గుహ్యోవా ఏషోఽగ్నిః । ఏతస్యాగ్నేరనతిదాహాయ॥

ప॥ న । అప్సు । మూత్రపురీషం । కుర్యాత్ । । న । నిష్ఠీవేత్ న । వివసనః। స్నాయాత్ । గుహ్యః । వై । ఏషః । అగ్నిః । ఏతస్య । అగ్నేః । అనతిదాహాయ ॥

అ॥ ఏతస్య= ఈ, అగ్నేః = అగ్నియొక్క, అనతిదాహాయ = దహింపకుండుటకొఱకు, అప్సు = జలములయందు, మూత్రపురీషం = మలమూత్రములను, నకుర్యాత్ = చేయఁగూడదు, అనఁగా విడువఁగూడదు, ననిష్ఠీవేత్ = ఉమ్మివేయ గూడదు, వివసనః = వస్త్రమును విడిచినవాఁడై, నస్నాయాత్ = స్నానముఁ జేయ గూడదు, ఏషః = ఈ, అగ్నిః = అరుణకేతుకాగ్ని, గుహ్యః = ఎవరికి నగపడనివాఁడై యుండును ॥

తా॥ అరుణకేతుకాగ్ని నీళ్ళయందు నెవరికిని దెలియఁబడకుండ నుండును. కాఁబట్టి నీళ్ళలో మలమూత్రములను విడువఁగూడదు. ఉమ్మివేయఁగూడదు. బట్టను విడిచి దిగంబరశరీరముతో నీళ్ళలో దిగి స్నానముఁ జేయఁగూడదు. అలాగు మలమూత్రము మొదలగునవి నీళ్ళలోఁ జేసినయెడల యగ్ని దహింపఁజేయును.

మూ॥ నపుష్కర పర్ణాని హిరణ్యం వాధితిష్ఠేత్ । ఏతస్యాగ్నే రన భ్యారోహాయ ॥

ప॥ న । పుష్కరపర్ణాని । హిరణ్యం । వా । అధి । తిష్ఠేత్ । ఏతస్య । అగ్నేః । అనభ్యారోహాయ ॥

అ॥ ఏతస్య=ఈ, అగ్నేః=అరుణకేతుకాగ్నియొక్క, అనభ్యారోహాయ= అధిష్ఠింపకయుండుటకొఱకు, పుష్కరపర్ణాని=తామరాకులను, హిరణ్యం=బంగారమును, నాధితిష్ఠేత్=అధిష్ఠింపఁగూడదు॥

తా॥ తామరాకులయందునను బంగారమందునను అగ్నియుండును. కాఁబట్టి వానిని గాలితోఁ ద్రొక్కఁగూడదు. అట్లు త్రొక్కినయెడల నగ్నిని ద్రొక్కుటయే యనిరి.

మూ॥ నకూర్మస్యాశ్నీయాత్ । నోదకస్యాఘాతుకాన్యేనమోదకాని భవన్తి । అఘాతుకా ఆపః । యఏతమగ్నిం చినుతే । యఉచైన మేవంవేద ॥ ౧౧౨ ॥ ౨౬ ॥

ప॥ న । కూర్మస్య । అశ్నీయాత్ । న । ఉదకస్య । అఘాతుకాని । ఏనం । ఓదకాని । భవన్తి । అఘాతుకాః । ఆపః । యః । ఏతం । అగ్నిం । చినుతే । యః । ఉ । చ । ఏనం । ఏవం । వేద ॥

అ॥ కూర్మస్య = తాఁబేలుయొక్క ఏ యవయవమైనను, నాశ్నీయాత్ = భక్షింపఁగూడదు, ఉదకస్య = జలసంబంధమగు ఏ జంతువునైనను, నాశ్నీయాత్ = భక్షింపఁగూడదు, యః = ఎవఁడు, ఏతం = ఈ, అగ్నిం = అగ్నిని, చినుతే = పూజించుచున్నాఁడో, యశ్చ = ఎవఁడు ఏనం = ఈ యారుణకేతుకాగ్నిని, ఏవం = ఈ ప్రకారముగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, ఏనం= ఇతనిని గూర్చి, ఓదకాని = జలజంతువులు, అఘాతుకాని = హింసచేయనివియై, భవన్తి = అగుచున్నవి, ఆపః = ఉదకములు అఘాతుకాః = హింసచేయనివియై, భవన్తి = అగుచున్నవి.

తా॥ తాఁబేలుని మరియు జలమందుండు చేఁపలు మొదలగు వానిని భక్షింపఁగూడదు. ఈ ప్రకారముగా నారుణకేతుకాగ్ని మహిమను దెలిసికొనుచున్నాఁడో ఆరుణకేతుకాగ్నిని బూజించుచున్నాఁడో అట్టివానిని జలములుగాని జలజంతువులుగాని బాధింపవు.

ఇతిషడ్విగ్ంశోఽనువాకస్సమాప్తః

—♦ అథసప్తవిగ్ంశోఽనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ ఇమానుకంభువనాసీషధేమ । ఇన్ద్రశ్చవిశ్వేచదేవాః ॥

ప॥ ఇమాః । నుకం । భువనా । సీషధేమ । ఇన్ద్రః । చ । విశ్వే । చ । దేవాః ॥

అ॥ ఇన్ద్రశ్చ = ఇంద్రుడును, విశ్వేదేవాశ్చ = విశ్వేదేవతలును, వయంచ=

మేమున్నా, ఇమాః = ఈ, భువనాః = లోకములను, సుకం = సుఖముగునట్లుగా, సీనధేమ = సాధించుచున్నాము.

తా॥ ఇంద్రుడు విశ్వదేవతలు, మేము ఈ లోకములను సుఖముగా నుండు నట్లు అరుణకేతు కారాధన వలనఁ జేయుచున్నాము,

మూ॥ యజ్ఞంచనస్తన్వంచ ప్రజాంచ। ఆదిత్యైరిన్ద్రస్స హాసీమ ధాతు ॥

ప॥ యజ్ఞం। చ। నః। తన్వం। చ। ప్రజాం। చ। ఆదిత్యైః। ఇంద్రః। సహా। సీమధాతు ॥

అ॥ ఇంద్రః = ఇంద్రుడు, ఆదిత్యైస్సహా = దేవతలతోఁ గూడినవాఁడై, నః = మాయొక్క, యజ్ఞంచ = యజ్ఞమును, తన్వంచ = శరీరమును, ప్రజాంచ = సంతానమును, సీమధాతు = సుఖముగా నుండునట్లు చేయుఁగాక॥

తా॥ ఇంద్రుడు దేవతలతోఁ గూడినవాడై మా యజ్ఞమును మా శరీరమును మా సంతానమును సుఖముగా నుండునట్లు చేయుచుండునుగాక.

మూ॥ ఆదిత్యైరిందస్స గణోమరుద్భిః। అస్మాకంభూత్వవితా తనూనాం।

ప॥ ఆదిత్యైః। ఇంద్రః। సగణః। మరుద్భిః। అస్మాకం। భూతు। అవితా। తనూనాం॥

అ॥ ఆదిత్యైః = అదితి పుత్త్రులగు, మరుద్భిః = దేవతలతోఁగూడిన వాఁడగుటచేత, సగణః = దేవసమూహముకల, ఇంద్రః = దేవేంద్రుడు, అస్మాకం = మాయొక్క, తనూనాం = శరీరములయొక్క, అవితా = రక్షకమైనది, భూతు = అగుఁగాక ॥

తా॥ అదితి తనయులగు దేవతలతోఁగూడిన వాఁడగుటచేత దేవగణములు కల యింద్రుడు మా శరీరములను రక్షించు చుండుఁగాక ॥

మూ॥ ఆప్లవస్వప్రప్లవస్వ। ఆండీభవజమాముహుః। సుఖాదీందుః ఖనిధనాం। ప్రతిముంచస్వస్వాంపురం ॥ ౧౧౩ ॥

ప॥ ఆ। ప్లవస్వ। ప్ర। ప్లవస్వ। ఆండీభవ। చ। మా। ముహుః। సుఖాదీం। దుఃఖనిధనాం। ప్రతి। ముంచస్వ। స్వాం। పురం ॥

అ॥ మహాః = మాటిమాటికి, మాప్లవస్వ = జన్మపరంపరలోనికి రాఁబోకుము, మాప్రిప్లవస్వ = మరణపరంపరను బొందకుము, మాండీభవ = బ్రహ్మాండమధ్యమందుఁ దిరుగుచున్నవాఁడవై యుండకుము, సుఖాదీం = సుఖము ప్రారంభము గలదియు, దుఃఖనిధనాం = మరణమను దుఃఖమంతముగా గలదియునగు, స్వాం = స్వకీయమైన, పురం = పట్నముతో సమానమగు శరీరమును, ప్రతిముంచస్వ = విడిచిపెట్టుము.

తా॥ జీవునికి ఋషిబోధచేయుచున్నది. ఓ జీవుఁడా! నీవీజన్మ పరంపరను మాటిమాటికిఁ బొంది చచ్చుచుఁ బుట్టుచు నీ బ్రహ్మాండమందుఁ దిరుగుచుండకుము. నీ శరీర మెటువంటిదనఁగా. సుఖముగాఁ దోఁచఁబడుచుండెడి నీతల్లిదండ్రుల సంగమసుఖలనఁ గలిగినదియు మరణరూపమైన దుఃఖముగలదియునగు నీ శరీరమునందు భ్రాంతివదలి వివేకజ్ఞానము కలవాఁడ వగుము.

మూ॥ మరీచయస్స్వాయంభువాః । యేశరీరాణ్యకల్పయన్ । తే తేదేహంకల్పయన్తు । మాచ తేఖ్యాస్మతీరిషత్ ॥

ప॥ మరీచయః । స్వాయంభువాః । యే । శరీరాణి । అకల్పయన్ । తే । తే । దేహం । కల్పయన్తు । మా । చ । తే । ఖ్యాతిః । స్మ । రిషత్ ॥

అ॥ స్వాయంభువాః = స్వయంబువు పుత్రులగు, మరీచయః = మరీచి మొదలగు, యే = ఏ మునీశ్వరులు, శరీరాణి = ప్రపంచము నందుండుశరీరములను, అకల్పయన్ = కల్పించిరో, తే = ఆమరీచిమొదలగువారు, తే = నీయొక్క, దేహం = శరీరమును, కల్పయన్తు = కల్పింతురుగాక, తే = నీయొక్క, ఖ్యాతిశ్చ = ప్రసిద్ధియు, మారిషత్స్మ = నశింపకుండుఁగాక ॥ ఇక్కడమూలములోనుండు 'స్మతి' అను రెండక్షరములను వ్యత్యాసము చేయవలయును.

తా॥ స్వయంబుతనయులగు మరీచి మొదలగువారు సృష్టిని జేయువారై ప్రపంచమును నిర్మించిరి. అట్టిమునీశ్వరు నీ శరీరమును బరోపకారమును జేయుటకై నిగాఁగల్పింతురుగాక. నీ యొక్క ప్రసిద్ధిని నశింపక చిరకాలముండునట్లు చేయుదురుగాక ॥

మూ॥ ఉత్తిష్ఠతమాస్వప్త । అగ్నిమిచ్ఛధ్వంభారతాః । రాజ్ఞస్సోమస్యతృప్తాసః । సూర్యేణసయుజోషసః ॥

ప॥ ఉత్తిష్ఠత । మా । స్వప్త । అగ్నిం। ఇచ్ఛధ్వం । భారతాః । రాజ్ఞః । సో
మస్య । తృప్తాసః । సూర్యేణ । సయుజోషసః॥

అ॥ హేఋత్విజః = ఓఋత్విక్కులారా !, యూయం = మీరు, ఉత్తి
ష్ఠత = లెండు, మాస్వప్త = నిద్రచాలింపుఁడు, భారతాః = హవిస్సును భరించు
వారగుదురుగాక, రాజ్ఞః = ప్రకాశించుచున్న, సోమస్య = సోమరసముయొక్క,
పానేన = పానముచేత, తృప్తాసః = తృప్తిని బొందువారై, సూర్యేణ = సూర్యు
నితో, సయుజోషసః = సమానకాంతి గలవారలగుదురుగాక, అగ్నిం= అరుణకేతు
కాగ్నిని బూజించుటను, ఇచ్ఛధ్వం = ఇచ్ఛయింపుఁడు.

తా॥ ఓ ఋత్విక్కులారా ! మీరు సోమపానముచేసి సూర్యునితో సమాన
కాంతిగల వారగుదురుగాన మాంద్యమును విడిచి యుత్సాహము నవలంబించి హవి
స్సును గ్రహించినవారలై యారుణకేతుకాగ్నిని బూజింపుఁడు.

మూ॥ యువాసువాసాః

ప॥ యువా । సువాసః ॥

అ॥ యువా=మీరు, సువాసాః=మంచివస్త్రములను ధరియింపుఁడు, పరిశుద్ధ
మైన వస్త్రములను ధరియింపుడు.

మూ॥ అష్టాచక్రానవద్వారా॥ ౧౧౮ దేవానాం పూరయోధ్యా।
తస్యాగ్ంహిరణ్మయః కోశః। స్వర్గోలోకో జ్యోతిషావృతః॥

ప॥ అష్టాచక్రా। నవద్వారా। దేవానాం। పూః। అయోధ్యా। తస్యాం।
హిరణ్మయః। కోశః। స్వర్గః। లోకః। జ్యోతిషా। వృతః॥

అ॥ అయోధ్యా = భేదింపశక్యముగాని, దేవానాం = దేవతలయొక్క,
పూః = పట్నముతో సమానమైన శరీరము, అష్టాచక్రా = ఎనిమిదిచక్రములు గల
దియు, నవద్వారా = తొమ్మిదిద్వారములు గలదియునైయున్నది, తస్యాం = ఆశరీర
మునందు, హిరణ్మయః = బంగారు మయమైనదియు, స్వర్గః = సుఖస్వరూపమైన
దియు, కోశః = అవకాశస్వరూపమైనదియు, జ్యోతిషా=ప్రకాశించుచున్న, జీవ
చైతన్యముచేత, ఆవృతః=ఆవరింపఁబడిన, లోకః=స్థానవిశేషముకలదు.

తా॥ ఎవరిచేతను భేదింప శక్యముకానిదియు నెనిమిది చక్రములచే భావింప
బడుచున్నదియు దొమ్మిదిద్వారములుగల దేవతలపట్నమునందు సువర్ణస్వరూపముగల

దియు సుఖస్వరూపమైనదియుఁ దేజస్సుచే నావరింపఁబడిన స్థానము కలదనే యా జీవుల సంబంధమైనదియు నవాహతము మొదలగు నెనిమిది చక్రములు గలదియు ముఖద్వారము మొదలగు నేడు రంధ్రములూర్ధ్వకాయమందునను రెండు రంధ్రములు అధఃకాయమందునను గలసి తొమ్మిదిరంధ్రములుగలదియు జ్ఞానముచే భేదింపదగిన సూక్ష్మకారణ శరీరములతోఁ గూడిన యీ స్థూలశరీరమందు సుఖస్వరూపమైన జీవ చైతన్యముచే బ్రకాశింపబడుచున్న సువర్ణమయము గానుండు కోశమువంటి స్థానము కలదు.

మూ॥ యో వై తాం బ్రహ్మణో వేద । అమృతేనావృతాం పురీం । తస్మై । బ్రహ్మచ బ్రహ్మా । చ । బ్రహ్మా । చ । ఆయుః కీర్తిం ప్రజాం దదుః ॥

ప॥ యః । వై । తాం । బ్రహ్మణః । వేద । అమృతేన । ఆవృతాం । పురీం । తస్మై । బ్రహ్మ । చ । బ్రహ్మ । చ । ఆయుః । కీర్తిం । ప్రజాం । దదుః ॥

అ॥ బ్రహ్మణః = సచ్చిదానంద స్వరూప పరబ్రహ్మము యొక్క, అమృతేన = సుఖస్వరూపమైన యానందముచే, ఆవృతాం = ఆవరింపఁబడిన, తాం = అపూర్వోక్తమైన, పురీం = పట్నముతో సమానమైన శరీరస్థితిని, యః = ఎవఁడు, వేద = తెలిసికొను చున్నాడో, తస్మై = అతనికొఱకు, బ్రహ్మచ = పరబ్రహ్మము, బ్రహ్మాచ=సృష్టినిజేయు ప్రజాపతియు, ఆయుః = ఆయుర్దాయమును, కీర్తిం=కీర్తిని, దదుః = ఇచ్చెదరు॥

తా॥ సచ్చిదానంద స్వరూపుని యానందముచే నావరింపఁబడిన యీశరీరస్థితి నెవఁడు తెలిసికొనుచున్నాఁడో అట్టివానికి సృష్టికర్తయగు బ్రహ్మయు పరబ్రహ్మయు నాయుర్దాయమును గీర్తిని యిచ్చెదరుగాక॥

మూ॥ విభ్రాజమానాగ్ం హరిణీం । యశసాసంపరీవృతాం । పురగ్ం హిరణ్మయీం బ్రహ్మా॥ ౧౧౫॥ వివేశాపరాజితా॥

ప॥ విభ్రాజమానాం । హరిణీం । యశసా । సం । పరీవృతాం । పురం । హిరణ్మయీం । బ్రహ్మా । వివేశ । అపరాజితా॥

అ॥ విభ్రాజమానాం = మిక్కిలి ప్రకాశించుచున్నదియు, హరిణీం= పాపములను హరించునదియు, యశసా = కీర్తిచేతను, సంపరీవృతాం = ఆవరింపఁబడినది,

యము, హిరణ్మయీం = సువర్ణవర్ణముగా నుండునదియు, అపరాజితాం = పరాజయ లేనిదియునగు పురంపట్టణ సమానమైన శరీరమును, బ్రహ్మ = ప్రజాపతి, వివేశ = ప్రవేశించెను.

తా॥ మిక్కిలి ప్రకాశించునదియుఁ బాపములను నశింపజేయునదియు ప్రపంచ నిర్మాణరూపమగు కీర్తిచే వ్యాపించి యున్నదియు సువర్ణమయముగా నుండునదియు బట్నముతో సమానమైన శరీరమును శరీరములో బ్రహ్మ ప్రవేశించెను.

మూ॥ పరాజేత్యజ్యామయీ। పరాజేత్యనాశకీ। ఇహచాముత్రచా న్వేతి। విద్వాన్దేవాసు రానుభయాన్ ॥

ప॥ పరాజ్। ఏతి। అజ్యామయీ। పరాజ్। ఏతి। అనాశకీ। ఇహ। చ। అముత్ర।చ। అను। ఏతి। విద్వాన్। దేవాసురాన్। ఉభయాన్।

అ॥ విద్వాన్ = పరబ్రహ్మముయొక్క యథార్థమును దెలిసినవాఁడు, అజ్యామయీ = ఆయుర్భంగము వ్యాధిలేనివాడై, పరాజ్ = పునరావృత్తి రహితుఁడై, ఏతి = పరబ్రహ్మమును బొందుచున్నాఁడు, అనాశకీ = అపమృత్యువు లేనివాఁడై, పరాజ్ = పరతత్వమును, ఏతి = పొందుచున్నాఁడు, ఇహచ = ఈ లోకమునం దును, అముత్రచ = పరలోకమునందును, దేవాసురాన్ = దేవతలు రాక్షసులగు, ఉభయాన్= రెండు సమూహములను, అన్వేతి= అనుసరించి పొందుచున్నాఁడు-

తా॥ పరబ్రహ్మము యథార్థము తెలిసినవాఁడు, ఆయుర్దాయక్షీణము, వ్యాధి అపమృత్యువు, మొదలగునవి లేనివాఁడై ఇహలోక పరలోకముల యందుండు సమస్త దేవతల యొక్కయు సమస్తప్రాణుల యొక్కయు స్వరూపుఁడై పునరావృత్తిలేని వాఁడై పరబ్రహ్మ చైతన్యమును బొందుచున్నాఁడు.

మూ॥ యత్కుమారీమన్ద్రయతే। యద్యోషిద్యత్పతి వ్రతా। అరిష్టం యత్కించ క్రియతే। అగ్నిస్తదను వేధతి ॥

ప॥ యత్। కుమారి। మన్ద్రయతే। యత్ యోషిత్। యత్। పతివ్రతా। అరిష్టం। యత్। కిం। చ। క్రియతే। అగ్నిః। తత్। అను। వేధతి॥

అ॥ కుమారీ=వివాహముగాని చిన్నది, యత్=ప్రథమసంభోగరూపమగు నేపాపమునుగురించి, మన్ద్రయతే=సంతోషించుచున్నదో, యోషిత్=వయస్సుతో నుండుస్త్రీ, యత్ = పరపురుష సంభోగమగు ఏపాపమునుగురించి, మన్ద్రయతే

సంతోషించుచున్నదో, పతివ్రతా = పతివ్రతయగు స్త్రీయును, యత్=భర్తృసం. యోగము లేకపోవుటచే దేహత్యాగరూపమైన యేపాపమునుగుఱించి, మన్ద్రియతే= సంతోషించుచున్నదో, అరిష్టం=దానాదులచే నాశనముపొందని, యత్కించిత్= ఏదైననొక పాపముకలదో, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, తత్=ఆ పాపములన్నియును, అను=క్రమముగా, సేధతి=పోఁగొట్టుచున్నాఁడు.

తా॥ పెండ్లికానిచిన్నది పురుషునితో సంభోగింప వలయుననుగోరికచే నేపాపమును బొందుచున్నదో యుక్తవయస్సుగలస్త్రీయును బరపురుషునితో సంభోగింప వలయునను కోరికచే నేపాపమును బొందుచున్నదో పతివ్రతయగుస్త్రీయును బెనిమిటితో సంభోగము లేకపోవుటచే శరీరమును విడిచిపెట్టవలయునను కోర్కెచే నేపాపమును బొందుచున్నదో మరియుఁ బురుషుఁడును దానాదులచే నశింపని యే పాపమును జేయుచున్నాఁడో ఆ పాపములన్నియు నగ్నిహోత్రుఁడు క్రమముగా నశింపఁ జేయుచున్నాఁడు.

మూ॥ అశ్రృతాసశ్శృతాసశ్చ॥ ౧౧౽ ॥ యజ్వానో యేత్యయజ్వనః।
స్వర్యంతో నాపేక్షన్తే। ఇన్ద్రమగ్నించ యేవిదుః॥

ప॥ అశ్రృతాసః। శృతాసః। చ॥ యజ్వానః। యే। అపి। అయజ్వనః। స్వర్యంతః। న। అపేక్షంతే। ఇన్ద్రం। అగ్నిం। చ। యే। విదుః॥

అ॥ అశ్రృతాసశ్చ=పరిపక్వముగాని చిత్తముగలవారును, శృతాశ్చ=పరిపక్వమైన చిత్తముగలవారును, యజ్వానః = యజ్ఞముఁజేసినవారును, యేపి = ఏ, అయజ్వానః=యజ్ఞముచేయనివారును, యే=ఎవరు, ఇంద్రం = పరమైశ్వర్యయుక్తుఁడగు నారుణకేతుకాగ్నిని, విదుః=తెలిసికొనుచున్నారో, తే=వారు, స్వర్యంతః=స్వర్గము పొందినవారై, నాపేక్షంతే=మఱియొక సాధనమును గోరరు॥

తా॥ పరిపక్వమైన మనస్సుగలవారుగాని పరిపక్వముగాని మనస్సుగలవారుగాని యజ్ఞమును జేసినవారుగాని యజ్ఞమును జేయనివారుగాని మఱియెవరైనను బరమైశ్వర్యయుక్తుఁడగు నారుణకేతుకాగ్నిని ధ్యానముఁ జేసినవారై మఱియొక సాధనమును బొందకయే మోక్షమును బొందఁగలరు॥

మూ॥ సికతా ఇవసంయన్తి। రశ్మిభిస్సముదీరితాః। అస్మాల్లోకాద ముష్మాచ్చ। ఋషిభిరదాత్పృశ్నిభిః॥

ప॥ సికతాః । ఇవ । సంయన్తి । రశ్మిభిః । సం । ఉదీరితాః । అస్మాత్ । లోకాత్ । అముష్మాత్ । చ । ఋషిభిః । అదాత్ । పృశ్నిభిః ॥

అ॥ జీవాః=జీవులు, రశ్మిభిః=త్రాళ్లవలెనుండు కర్మలచేత, సముదీరితాః=ప్రేరేపింపఁబడినవారై, అస్మాత్=ఈ, లోకాత్ = లోకమునుండియు, అముష్మాత్=పరలోకమునుండియు, సికతా ఇవ=ఇసుక రేణువులవలెనే, సంయన్తి=కలసికొనుచున్నారు, తేషాం=ఆ జీవులయొక్క, అనుగ్రహాయ=అనుగ్రహముకొఱకు, పరమేశ్వరః=పరమేశ్వరుఁడు, పృశ్నిభిః = యథార్థమును బ్రకటనఁ జేయునట్టి, ఋషిభిః=మంత్రములచేత, జ్ఞానం=జ్ఞానమును, అదాత్=ఇచ్చుచున్నాఁడు.

తా॥ బంధించుటకుఁ ద్రాళ్ళు యేతీరుగా నుండునో ఆ తీరుగానే జీవులను బంధించి సంసారమునందుఁ బడవేయునట్టి కర్మలచేత గాలిచేతఁ గొట్టుకొనిపోఁబడి రాశిగాఁ బడియున్న యిసుక రేణువులవలెనే, జీవులు ఈ లోకమునుండియుఁ బరలోకమునుండియు నక్కడక్కడ సమూహముగా నుండియుండిరి. అట్టి జీవులయందనుగ్రహము కలవాఁడై పరమేశ్వరుఁడు యథార్థమును బ్రకటించునట్టి మన్త్రములచేత జ్ఞానము నిచ్చుచున్నాఁడు.

మూ॥ అపేతవీతవిచసర్పతాతః । యేత్రస్థపురాణా యేచనూతనాః ।
అహోభిరద్భిరక్తుభిర్వ్యక్తం ॥ ౧౧౭ ॥ యమోదదాత్వవసానమస్మై ॥

ప॥ అపేత । వీత । వి । చ । సర్పత । అతః । యే । అత్రస్థపురాణాః । యే । చ ॥ నూతనాః । అహోభిః । అద్భిః అక్తుభిః । వ్యక్తం। యమః । దదాతు । అవసానం । అస్మై ॥

అ॥ అత్రస్థపురాణాః = ఇక్కడున్న ప్రాచీనులైన, యే = ఏయమదూతలు కలరో, నూతనాః = నవీనులైన, యే = ఏయమదూతలు కలరో, తే = అట్టువంటి ఓయమదూతలారా !, యూయం = మీరు, అతః = ఈస్థానమునుండి, అపేత = వెళ్ళిపొండి, వీత = విడివిడిగాఁబొండి, విసర్పత= మిక్కిలి దూరముగాఁబొండి అహోభిః = పగళ్లచేతను, అక్తుభిః = రాత్రులచేతను, అద్భిశ్చ = జలాధిదేవతలచేతను, వ్యక్తం= మిక్కిలి కూడుకొని యుండు, అవసానం= ఈస్థానమును, యమః= యముఁడు. అస్మై = ఈయజమానునికొఱకు, దదాతు = ఇచ్చుఁగాక॥

తా॥ ఈయజ్ఞమును జేయునట్టి ప్రదేశమునందుఁ బ్రారంభించుటకంటె బూర్వమునుండిగాని తర్వాతగాని వచ్చియున్నయో యమదూతలారా! మీరు ఈస్థానమునుండి చెల్లాచెదరై దూరముగా వెళ్ళిపొండు. ఈస్థానము రాత్రియుఁ బవలును వేద మంత్రముల పఠనచే నిండియున్నది. ఈస్థానము నీయజమానుని కొఱకు యముఁడిచ్చి యున్నాఁడు.

మూ॥ నృమణంతు నృపాత్వర్యః । అకృష్టా ఏపచకృష్ణజాః । కుమారీ
షుకనీనీషు । జారిణీషుచయేహితాః ॥

ప॥ నృ । మణంతు । నృ । పాతు । అర్యః । అకృష్టాః । యే । చ। కృష్టజాః। కుమారీషు । కనీనీషు । జారిణీషు । చ । యే । హితాః ॥

అ॥ నృ = గర్హితులైన మనుష్యులు, మణంతు = ఈస్థానమునుండి తేచిపో దురుగాక, నృ = అటువంటి మనుష్యులయొక్క, అర్యః = ప్రభువును, పాతు = ఇక్కడనుండి తేచిపోయినమమ్ములను రక్షించుఁగాక, అనఁగా నిక్కడనుండి తేచి పోయిన మాకు మేలగునని తాత్పర్యము, యేచ = ఎవరు, అకృష్టాః=దుష్కులమందుఁ బుట్టియుఁ గర్మానర్హులై యుండిరో, కుమారీషు = వివాహముకాని స్త్రీలయందు, యేచ = ఎవరు, హితాః = కలిగిరో, కనీనీషు = వివాహముకాని స్త్రీలకు బుట్టిన పెండ్లియైన స్త్రీలయందు, యేచ = ఎవరు, హితాః = కలిగిరో, జారిణీషు = వ్యభిచారముగల స్త్రీలయందు, యేచ = ఎవరు, హితాః = కలిగిరో, తేసర్వే = వారందఱును, ఇతః = ఈస్థానమునుండి, విసర్పంతు = దూరముగా తేచిపోదురుగాక॥

తా॥ పరులను బీడించుచు జీవించునట్టివారు లేక యెప్పుడు పరులకు నౌకరి చేసియే జీవింప వలయునని యెడివారును అట్టి వారి ప్రభువును దుష్టకులమందుఁ బుట్టిన వారును మంచి కులమందుఁ బుట్టియు కర్మానర్హులైన యంగవికలము కలవారును పెండ్లికాని స్త్రీల యందుఁబుట్టినవారును పెండ్లయిన స్త్రీలైనను ఆ స్త్రీలు పెండ్లి కాని స్త్రీలకుఁ బుట్టిరేని అట్టి స్త్రీల యందుఁ బుట్టినవారును వ్యభిచారముఁజేయు నట్టి స్త్రీల యందుఁ బుట్టినవారును మొదలుగాఁగల యెవరు కలరో వారందఱును ఈయజమానుఁడు చేయునట్టి యజ్ఞప్రదేశము నుండి వెడలిపోదురుగాక.

మూ॥ రేతః పీత్వా ఆండపీతాః । అంగారేషుచ యేహుతాః। ఉభ
యాన్పుత్రపౌత్రకాన్ । యువేహం యమరాజగాన్ ॥

# అరుణ మంత్రార్థః

ప॥ శితః । పీతాః । అండపీతాః । అంగారేషు । చ । యే । హుతాః । ఉభయాన్ పుత్రపౌత్రకాన్ । యావే । అహం । యమరాజగాన్ ॥

అ॥ శితః పీతాః = శిశువును ద్రాగునట్టి వారును, అండపీతాః = అండ సంబంధమగు నుదకమును ద్రాగువారును, గారేషు=అగ్నిహోత్రమునందు, హుతాః= అశాస్త్రీయముగా హోమము జేయువారును, యే = ఏదురాచారులు కలరో, తాన్ = వారిని, ఉభయాన్ = రెండు విధములైన, పుత్రపౌత్రకాన్ = దురాచారముగల పుత్రులను మనుమలను, అహం, = నేను, అస్మాత్ = ఈ స్థానమునుండి, పృథక్కరోమి = వేఱుగా జేయుచున్నాను, కించ = ఇదియే కాదు, యమరాజగాన్ = యమునిచే నరకము నందుబడునట్లు చేయుచున్నాను.

తా॥ గర్భమందున్న శిశువు తల్లిదండ్రుల సంగము సంబంధమగు రేతస్సును పానము జేసినవారును మఱియు అండము బాపరించి యందు జలపానము జేసిన వారును శాస్త్ర విధినివిడిచి హోమము జేసినవారు నెవరు కలరో అట్టివారిని దుర్మార్గముగా సంచరించు తనయులను మనుమలను ఇక్కడ నుండి యావతలకు వెళ్లగొట్టుచున్నాను. మఱియు జన్మాంతమున వారికి సుగతి లేక నరకమందు యమునిచే బడవేయునట్లుగా జేయుచున్నాను.

మూ॥ శతమిన్నుశరదః

మూ॥ శతమిన్నుశరదో అన్తిదేవాయత్రానశ్చక్రాజరసంతనూనాం ।
పుత్రాసోయత్రపితరోభవన్తి మానోమధ్యారీరిషతాయుర్గన్తోః॥

ప॥ శతం । ఇత్ । ను । శరదః । అన్తి । దేవాః । యత్ర । నః । చక్ర । జరసం । తనూనాం । పుత్రాసః । యత్ర । పితరః । భవన్తి । మానః । మధ్యా । రీరిషత । ఆయుర్గంతోః ॥

అ॥ దేవాః=ఓ దేవతలారా! శతమిన్ను=నూరైనప్పటికిని, శరదః=సంవత్సరములు, అన్తి=స్వల్పమయినవి, యత్ర=ఏ సంవత్సరములయందు, నః=మాయొక్క తనూనాం=శరీరములకు, జరసం=ముదిమిని, చక్ర=చేసితిరో, కించ=ఇట్లు చేయనగా యత్ర=ఏముదిమియందు, పుత్రాసః=తనయులు, పితరః=తండ్రులై, భవన్తి=అగుచున్నారో; అనగా పోషణయందు సమర్థులగుచున్నారో, ఆయుర్గంతోః = పూర్ణాయుర్దాయమును పొందవలెనను కోరికగలవారగుటవలన, నః = మమ్ములను, మధ్యా= ఆయుర్దాయమధ్యమున, మారీరిషత=హింస చేయకుడు.

తా॥ ఓ దేవతలారా ! నూఱుసంవత్సరము లాయుర్దాయమును మాకునిచ్చినను పోషణసమర్థులగు తనయులులేనిది స్వల్పాయుర్దాయముగానే యెంచుచున్నాము. ఇఁక నేమన మాతనయులెప్పుడు పోషించుటయందు సమర్థులగుదురో అప్పుడే మది మితో కూడిన సంపూర్ణాయుర్దాయమునుగాఁ దలంచుచున్నాము. కాఁబట్టి మా తనయులు పోషించుటయందు సమర్థులగు పర్యంతమీలోపల మా యాయుర్దాయమునకు భంగముకలిగింపకుఁడు.

మూ॥ అదోయద్బ్రహ్మవిలబం। పితౄణాంచయమస్యచ। వరుణస్యా శ్వినోరగ్నేః। మరుతాంచవిహాయసాం॥

ప॥ అదః। యత్। బ్రహ్మ। విలబం। పితౄణాం। చ। యమస్య। చ। వరుణస్య। అశ్వినోః। అగ్నేః। మరుతాం। చ। విహాయసాం॥

అ॥ యత్=ఏ, బ్రహ్మ=జగత్కారణమగు బ్రహ్మకలఁడో, అదః=ఈ బ్రహ్మ, పితౄణాంచ=పితృదేవతలకును, యమస్యచ=యమునకును, వరుణస్య=వరుణునకును, అశ్వినోః = అశ్వినీదేవతలకును, అగ్నేః = అగ్ని దేవతకును, మరుతాం= వాయువులకును, విహాయసాం=ఆకాశమునందు సంచరించు యక్షులు గంధర్వులు మొదలగు వారికిని, విలబం=పట్టుకొమ్మగా నున్నాఁడు.

తా॥ జగత్కారణమైన పరబ్రహ్మయే పితృదేవతలకు యమునకు వరుణునకు అశ్వినీదేవతలకు నగ్నిహోత్రునకు వాయువునకు నంతరిక్షమున సంచరించు యక్షులు గంధర్వులు మొదలగు వారికి నాధారమై పట్టుకొమ్మగా నున్నాఁడు.

మూ॥ కామప్రయవణంమే అస్తు। సహ్యేవాస్మినసనాతనః। ఇతినా కోబ్రహ్మశ్రవోరాయోధనం। పుత్రానాపో దేవీరిహాహితాః॥ ౧౧౮॥-౨౭॥

ప॥ కామప్రయవణం। మే। అస్తు। సః। హి। ఏవ। అస్మి। సనాతనః। ఇతి। నాకః। బ్రహ్మశ్రవః। రాయః। ధనం। పుత్రాన్। ఆపః। దేవీః। ఇహ। ఆహితాః॥

అ॥ బ్రహ్మ= పరబ్రహ్మము, మే=నాకు, కామప్రయవణం= కామముల నిచ్చువాఁడై, అస్తు=అగుఁగాక, సనాతనః=పురాతనుఁడగు, సహ్యేవ=ఆ బ్రహ్మయే, అస్మి=అయితిని, ఇతి = ఈ కారణమువలన, నాకః = దుఃఖనివృత్తికర్తయైన

బ్రహ్మశ్రవః=బ్రహ్మవిషయకమైన వాక్యశ్రవణమే, రాయః=ధనము, ధనం=ప్రీతికరమగు భార్యాపుత్త్రాది ధనము, దేవీః=ప్రకాశించునట్టి, అపః=ఓ జలాధిదేవతలారా! ఇహ=ఈ కర్మయందు, పుత్త్రాః=తనయులను, ఆహితా=కలిగింపుఁడు.

తా॥ పురాతనుండగు ననఁగా సర్వకాలములయందు నుండునట్టి బ్రహ్మయే నేనైతినిగాన సమస్త కోరికలను బొందువాఁడనైతిని. ఈ ప్రకారముగా దుఃఖ నివృత్తిని జేయు బ్రహ్మ సంబంధమగు వాక్యములను వినుటయే బంగారు మొదలగు ధనము ప్రీతికరమగు భార్యాపుత్త్రాదులను బొందువాఁడ నయ్యెదను. ఓజలాధి దేవతలారా! మీరు ఈయజ్ఞకర్మయందు పూజింపఁబడి ప్రీతులై యజమానునికిఁ బుత్త్రులను గలుగునట్లుగాఁ జేయుఁడు.

మూ॥ విశీర్ష్ణీంగృధ్రశీర్ష్ణీంచ। అపేతోనిర్‌ఋతిగ్ంహథః। పరిబాధగ్గ్ శ్వేత
కుక్షుం। నిజంఘగ్ంశబలోదరం॥

ప॥ విశీర్ష్ణీం। గృధ్రశీర్ష్ణీం। చ। అప। ఇతః। నిర్‌ఋతిం। హథః। పరిబాధం। శ్వేతకుక్షుం। నిజంఘం। శబలోదరం॥

అ॥ విశీర్ష్ణీం = శిరస్సులేనిదియు, గృధ్రశీర్ష్ణీం = గద్దయొక్క శిరస్సువంటి శిరస్సుగలదియు, నిర్‌ఋతిం = రాక్షసస్వభావము గల యమంగళమును, పరిబాధం = పరిబాధయను పేరు గలవానిని, శ్వేతకుక్షుం = శ్వేతకుక్షియను వానిని, నిజంఘం = నిజంఘుమను పేరుగలవానిని, శబలోదరం = శబలోదరమను పేరుగలవానిని, ఇతః = ఈస్థానమునుండి, అపహథః = వెళ్లఁగొట్టుము॥

తా॥ ఓయగ్నిహోత్రుఁడా! శిరస్సులేనిదియు గద్దతలవంటి తలగలదియు రాక్షస స్వభావముగలదియు నగు నమంగళమును ఇక్కడనుండి వెళ్లఁగొట్టుము. మఱియుఁ బరిబాధయనియు శ్వేతకుక్షుయనియు నిజంఘుయనియు శబలోదర యనియుఁ బేరుగల అలక్ష్మియొక్క యనుచరుల నిక్కడనుండి వెడలఁగొట్టుము. పరిబాధాది పేర్లు సార్థకనామములైనవి. బాధించువాఁడు, తెల్లనివర్ణముగల కుక్షి గలవాఁడు, క్రిందకి వ్రేలాడుచున్న పిక్కలుగలవాఁడు, తెలుపువర్ణముతో మిశ్ర ముమైనరంగు గల యుదరముగలవాఁడు అని క్రమముగా నన్వయించుకొనవల యును.

మూ॥ సతాన్వాచ్యాయయాసహ । అగ్నే నాశయసంధృశః । ఈర్ష్యాసూయేబుభుక్షాం । మన్యుంకృత్యాంచదీధిరే । రథేనకిగ్ంశుకావతా । అగ్నే నాశయ సంధృశః ॥ ౧౧౯॥ ౨౮॥

ప॥ సః । తాన్ । వాచ్యాయయా । సహ । అగ్నే । నాశయ । సంధృశః । ఈర్ష్యాసూయే । బుభుక్షాం । మన్యుం । కృత్యాం । చ । దీధిరే । రథేన । కింశుకావతా । అగ్నే । నాశయ । సంధృశః॥

అ॥ అగ్నే = ఓ యగ్నిహోతృఁడా !, సః = అపూర్వోక్తమైన, త్వం = నీవు, సంధృశః=మాకుఁబీడను జేయుటకు విచారించునట్టి, తాన్=అపరిబాధాదులను, వాచ్యాయయా సహ = జనులచే నిందింపఁబడు పరిబాధాదులకుఁ దల్లియగు నలక్ష్మితోఁ గూడ, నాశయ = నశింపఁ జేయుము, యే = ఏ పరిబాధాదులు, ఈర్ష్యాసూయే = ఈర్ష్యను అసూయను, బుభుక్షాం = విశేషముగా నాహారమును భక్షింప వలెనను కోరికను, మన్యుం = కోపమును, కృత్యాం = దుష్ట ప్రవర్తనను, దీధిరే = వృద్ధిపొందించు చున్నవో, అగ్నే = ఓయగ్నిహోతృఁడా !, త్వం = నీవు, తాన్= అపూర్వోక్తమైన, సంధృశః= బాధను విచారించు పరిబాధాదులను, కించుశావతా= చిలుకల వలెనే యెగిరిపోవునట్టి రాక్షసులుగల, రథేన = వారి సంబంధమగు రథములతోఁ గూడ, నాశయ = నశింపఁజేయుము.

తా॥ ఓయగ్నిహోతృఁడా ! మాకుఁ బీడను జేయవలయునని విచారించు చుండు పరిబాధాదులను వారి తల్లియగు నమంగళముతోఁగూడ నశింపఁజేయుము. మఱియు నితరుల గుణములను సహింపకపోవుట యను ఈర్ష్యఁయును ఇతరగుణములయందు దోషారోపణఁ జేయుట యను అసూయయు విశేషముగా భోజనేచ్ఛయుఁ గోపము దుష్ప్రవర్తనయు మొదలగు గుణములను వృద్ధిని జేయుచుండు పరిబాధాదులను బ్రాణులకు నుపద్రవము జేయు నెక్కుడుగల పక్షులవలె నుండు రాక్షసులతోఁ గూడిన వారి రథముతోఁగూడ నశింప జేయుము.

మూ॥ పర్జన్యాయ ప్రగాయత । దివస్పుత్రాయమీఢుషే । సనో యవసమిచ్ఛతు ॥

ప॥ పర్జన్యాయ । ప్రగాయత । దివస్పుత్రాయ । మీఢుషే । సః । నః । యవసం । ఇచ్ఛ । తు ॥

అ॥ దివస్పుత్రాయ = స్వర్గమునందుఁ బుట్టినట్టియు, మీఢుషే=వర్షముచే భూమిని తడుపునట్టి, పర్జన్యాయ = మేఘునికొఱకు, ప్రగాయత = మిక్కిలి స్తోత్రమును జేయుఁడు, సః =ఆమేఘుడు, నః = మాకు, యవసం = భక్ష్యమును, ఇచ్ఛతు = ఇచ్చుటకొఱకు నిచ్ఛయించుఁగాక ॥

తా॥ ఓఋత్విక్కులారా! స్వర్గమునందుండు నట్టియు భూమిని వర్షము తడుపునట్టియు మేఘుని స్తోత్రముఁ జేయుఁడు. ఆమేఘుఁడు అన్నాది రూపమగు నాహారమును మాకుఁ గలిగించుట కొఱకు ఇచ్ఛయించును.

మూ॥ ఇదంవచః పర్జన్యాయస్వరాజే । హృదోఅస్త్వన్తరంతద్యుయోత।
మయోభూర్వాతో విశ్వకృష్టయస్సన్త్వస్మే । సుపిప్పలా ఓషధీర్దేవగోపాః॥

ప॥ ఇదం । వచః । పర్జన్యాయ । స్వరాజే । హృదః । అస్తు । అంతరం। తత్ । యుయోత । మయోభూః । వాతః । విశ్వకృష్టయః । సన్తు । అస్మే । సుపిప్పలాః । ఓషధీః । దేవగోపాః ॥

అ॥ స్వరాజే = స్వయముగాఁ బ్రకాశించుచున్న । పర్జన్యాయ = మేఘుని కొఱకు మేముస్తుతించిన, ఇదం । ఈ, వచః = వాక్యము, హృదః = మనస్సు యొక్క, అంతరం = లోపల, అస్తు = అగుఁగాక, తస్మాత్ = ఆకారణమువలన, తత్ =ఆవాక్యము, యుయోత= కూర్పింపఁజేయుఁడు, వాతః= వాయువు, అస్మే= మాకొఱకు, మయోభూః = సుఖమును గలిగించువాఁడు, భవతు = అగుఁగాక, విశ్వకృష్టయః సమస్తమైన కర్షకులును, కర్షకశబ్దమువలన సమస్తమైన మనుష్యులు అని చెప్పఁబడిన వలయును, ఓషధీః = ఓషధులు, సుపిప్పలాః = మంచిఫలముల నొసఁగు నవియై, దేవగోపాః = హవిస్సునిచ్చుటచేత దేవతలను పోషించునవియైన, సంతు = అగుఁగాక.

తా॥ ఓఋత్విక్కులారా! తనంతటతాను బ్రకాశించుచున్న మేఘునికొఱకు మేముచేసిన స్తోత్రము మేఘుని హృదయమందుండునట్లుగా మీరు ప్రవేశింపఁజేయుఁడు. మావిషయమై వాయువు సమస్తమైన మనుష్యులు ధాన్యాదిరూపమగు ఫలమును గలిగించునవియు హవిస్సునిచ్చుటచే దేవతలను పోషించునవియు నగు నోషధులను సుఖముగ గలిగించుచుండుఁగాక॥

మూ॥ యో గర్భమోషధీనాం । గవాం కృణోత్యర్వతాం । పర్జన్యః పురుషీణాం॥ ౧౨౦॥౨౯॥

ప॥ యః । గర్భం । ఓషధీనాం । గవాం । కృణోతి । అర్వతాం । పర్జన్యః । పురుషీణాం॥

అ॥ యః = ఏ, పర్జన్యః = మేఘుఁడు, ఓషధీనాం = వ్రీహ్యాదులకు, గవాం = ఆవులకు, అర్వతాం = అశ్వములకు, పురుషీణాం = మనుష్యస్త్రీలకు, గర్భం = గర్భమును, కృణోతి = చేయుచున్నాఁడో, సః = ఆ మేఘుడు మయోభూః = సుఖమునుగలిగించువాఁడు, భవతు = అగుఁగాక॥

తా॥ వ్రీహి మొదలగు సస్యాదులకును గోవులకును అశ్వములకును మనుష్యస్త్రీలకును గర్భమును గలిగించునట్టి మేఘుఁడు మాకు సుఖమును గలిగించుఁగాక॥

ఇత్యేకోన త్రింశోऽనువాకః సమాప్తః

అథ త్రింశోऽనువాకః ప్రారభ్యతే

మూ॥ పునర్మామైత్వింద్రియం । పునరాయుః । పునర్భగః । పునర్బ్రాహ్మణమైతుమా । పునర్ద్రవిణమైతుమా॥

ప॥ పునః । మాం । ఐతు । ఇన్ద్రియం । పునః । ఆయుః । పునః । భగః । పునః । బ్రాహ్మణం । ఐతు । మా । పునః । ద్రవిణం । ఐతు । మాం॥

అ॥ ఇన్ద్రియం=ఇన్ద్రియము, పునః=తిరిగి, మాం=నన్ను, ఐతు=పొందుఁగాక, ఆయుః=ఆయుర్దాయము, పునః=తిరిగి, మా=నన్ను, ఐతు=పొందుగాక, భగః=సౌభాగ్యము, పునః=తిరిగి, మాం=నన్ను, ఐతు=పొందుఁగాక, బ్రాహ్మణం=బ్రహ్మవర్చస్సు, పునః = తిరిగి, మా = నన్ను, ఐతు = పొందుఁగాక, ద్రవిణం = ధనము, పునః = తిరిగి, మా = నన్ను, ఐతు = పొందుఁగాక॥

తా॥ నా సంబంధమగు నింద్రియములు ఆయుర్దాయము సౌభాగ్యము బ్రహ్మవర్చస్సు ధనము మొదలగునవి యన్నియును వృద్ధిపొంది నన్ను నాశ్రయించి వదలకుండుఁగాక॥

మూ॥ యన్మేద్య రేతః పృథివీమస్కాన్ । యదోషధీరప్యసరద్యదాపః । ఇదంతత్పునరాదదే । దీర్ఘాయుత్వాయవర్చసే ॥

ప॥ యత్ । మే । అద్య । రేతః । పృథివీం । అస్కాన్ । యత్ । ఓషధీః । అపి । అసరత్ । యత్ । అపః । ఇదం । తత్ । పునః । అదదే । దీర్ఘాయుత్వాయ । వర్చసే ॥

అ॥ అద్య=ఇప్పుడు, మే=నాయొక్క, యత్=ఏ, రేతః = రేతస్సు, పృథివీం=భూమిని, అస్కాన్=స్రవించినదో, ఓషధీః=ఓషధి, యత్ = ఏ రేతస్సును, అసరత్=పొందెనో, అపః=జలములు, యత్=ఏ రేతస్సును, అసరన్=వ్యాపించినవో, తత్=అపూర్వోక్తమైన, ఇదం = ఈ రేతస్సును, దీర్ఘాయుత్వాయ=చిరకాలాయుర్దాయము కలుగుటకొఱకును, వర్చసే=బ్రహ్మవర్చస్సుకొఱకును, పునః=తిరిగి, అదదే=స్వీకరించుచున్నాను, అనఁగావ్యర్థముగా స్రవింపఁజేయను.

తా॥ ఇప్పుడు నాసంబంధమగు రేతస్సు ప్రమాదవశముచే వ్యర్థముగా భూమియందుఁగాని ఔషధులయందుఁగాని జలములయందుఁగాని విడిచిపెట్టుటవలన నసారోగ్యమగునుగాన నట్టివ్యాపారమును స్తంభించి దీర్ఘాయుర్దాయమును వర్చస్సును బొందువాఁడనయ్యెదను.

మూ॥ యన్మే రేతఃప్రసిచ్యతే । యన్మఆజాయతేపునః । తేనమామమృతంకురు । తేనసుప్రజసంకురు॥ ౧.౨౧॥ 30॥

ప॥ యత్ । మే । రేతః । ప్ర । సిచ్యతే । యత్ । మే । ఆ । జాయతే । పునః । తేన । మాం । అమృతం । కురు । తేన । సుప్రజసం । కురు॥

అ॥ మే=నాయొక్క, యత్=ఏ, రేతః=వీర్యము, ప్రసిచ్యతే=గర్భమునందుంపఁబడుచున్నదో, మే=నాయొక్క, యత్=ఏ, రేతః=రేతస్సు, పునః=తిరిగి, ఆజాయతే=సంతానరూపముగాఁబుట్టుచున్నదో, తేన=ఆసంతానరూపమగురేతస్సుచేత, మాం=నన్ను, అమృతం = సుఖముకలవానిగా, కురు =చేయుము, తేన = ఆసంతానరూపమగు వీర్యముచేత, మాం = నన్ను, సుప్రజసం = మంచి పుత్త్రపౌత్రులు మొదలగు సంతానము కలవానిగా, కురు= చేయుము॥

తా॥ ఓ మేఘుఁడా! నా సంబంధమగు వీర్యము భార్యయొక్క గర్భమునందుంపఁబడి తిరిగి సంతానరూపముగాఁ బుట్టినదై నన్ను సుఖము కలవానిగాను బుత్త్రపౌత్రులు మొదలగు మంచి సంతానము గలవానిగాను జేయుము.

ఇతి త్రింశోనువాకస్సమాప్తః.

అధ ఏకత్రింశోఽనువాకః ప్రారభ్యతే

మూ॥ అధ్వ్ర్యస్తిరోధాజాయత । తవవైశ్రవణస్సదా । తిరోధేహి సపత్నాన్నః । యే అపోశ్నంతికేచన ॥

ప॥ అధ్వర్యః । తిరోధా । అజాయత । తవ । వైశ్రవణః । సదా । తిరోధేహి । సపత్నాన్ । నః । యే । అపః । అశ్నంతి । కేచన॥

అ॥ కుబేర=ఓకుబేరుఁడా!, వైశ్రవణః=విశ్రవసుని తనయుఁడు, తవ=నీయొక్క, అధ్వర్యః=కర్మలకు, సదా=ఎల్లప్పుడు, తిరోధాజాయత=నాశకుఁడాయెను, యేకేచన=ఎవరైననుగాందఱు, నః=మాయొక్క, అపః=కర్మలను, అశ్నంతి=నశింపజేయుచున్నారో, తాన్=అటువంటి, నః=మాయొక్క, సపత్నాన్=శత్రువులను, తిరోధేహి=నాశనము జేయుము.

తా॥ ఓ కుబేరుఁడా! నీవు విశ్రవస్సుయొక్క సంతానమగు నే వైశ్రవణుని గ్రహించితివో అతను నీ యొక్క యభీష్ట సంబంధమగు కర్మలను నశింపఁ జేయుచున్నాఁడుగాన నా వైశ్రవునిచే మా సంబంధమగు శత్రువులను నశింపజేయింపుము, మఱియు మా కర్మల నెవరు భంగముఁజేయుచున్నారో వారిని నశింపు జేయుము.

మూ॥ త్వాష్ట్రీంమాయాంవైశ్రవణః । రథగ్ంవిహస్రిబంధురం । పురుశ్చక్రగ్ంసహస్రాశ్వం । ఆస్థాయాయాహినోబలిం ॥

ప॥ త్వాష్ట్రీం । మాయాం । వైశ్రవణః । రథం । సహస్రబంధురం । పురుశ్చక్రం । సహస్రాశ్వం । ఆస్థాయ । ఆయాహి । నః । బలిం ॥

అ॥ కుబేర=ఓకుబేరుఁడా! త్వం=నీవు, వైశ్రవణః=వైశ్రవణునితో గూడినవాడవై, సహస్రబంధురం=విశేషమైన భారమును వహించునదియును, పురుశ్చక్రం=అనేక చక్రములుగలదియు, సహస్రాశ్వం=అనేకములగు గుఱ్ఱములుగల దియుఁగు, రథం=రథమును, ఆస్థాయ=ఎక్కి, త్వాష్ట్రీం=బ్రహ్మసంబంధమగు, మాయాం=మాయవలెనే, నః=మాయొక్క, బలిం=పూజనుగుఱించి, ఆయాహి=రమ్ము॥

తా॥ ఓ కుబేరుఁడా! నీవు వైశ్రవుణితోఁ గూడినవాఁడవై విశేషమైన భారమును వహింపగలదియు ననేక చక్రములు గలదియు ననేకములైన గుఱ్ఱములతోఁ గూడినదియునగు రథమునెక్కి మేము చేయుపూజాప్రదేశమునకు రమ్ము ॥

మూ॥ యస్మైభూతాని బలిమావహన్తి । ధనంగావో హస్తిహిరణ్య మశ్వాన్ ॥ ౧౨౨॥ అసామసుమతౌ యజ్ఞియస్య । శ్రియం బిభ్రతోన్నముఖీం విరాజం ॥

ప॥ యస్మై । భూతాని । బలిం । ఆ । వహన్తి । ధనం ॥ గావః । హస్తి హిరణ్యం । అశ్వాన్ । అసామ । సుమతౌ । యజ్ఞియస్య । శ్రియం । బిభ్రతః । అన్నముఖీం । విరాజం ॥

అ॥ భూతాని=సమస్తమైనభూతములు, యస్మై=ఏకుబేరునికొఱకు, ధనం= ధనమును, గావః=గోవులును, హస్తిహిరణ్యం = గజరూపమగు ధనమును, అశ్వాన్= గుఱ్ఱములును, అనునట్టి, బలిం=పూజను, ఆవహన్తి = సంపాదింపఁజేయుచున్నారో, తస్య=అటువంటి, యజ్ఞియస్య=పూజాద్రవ్యముచేఁ బూజింపఁబడుచుండెడివాఁడును, అన్నముఖీం = అన్నము ప్రధానముగాఁగలదియు, విరాజం = మిక్కిలి ప్రకాశించు నదియునగు, శ్రియం=సంపత్తును, బిభ్రతః=ధరియించుచుండెడి, కుబేరస్య=కుబే రునియొక్క, సుమతౌ=అనుగ్రహబుద్ధియందు, అసామ=ఉన్నవారమైతిమి.

తా॥ సమస్తమైన భూతములు ఏ కుబేరునకు ధనము పశువులు గుఱ్ఱములు ఏనుఁగులు మొదలగువానిని గానుకలుగా సమర్పించి పూజించుచున్నారో అన్నము మొదలుగాఁగలదియు విశేషముగాఁ బ్రకాశించునదియునగు సంపత్తు కలవాఁడును బూజాద్రవ్యములచేఁ బూజింపఁదునట్టి యా కుబేరుని యనుగ్రహము కలవారమై హస్త్యశ్వాది సంపత్తు కలవారమగుదుము ॥

మూ॥ సుదర్శనే చక్రౌంచేచ । మైనాకేచ మహాగిరౌ । శతద్వాట్టారగమన్తా । సగ్ంహార్యం నగరన్తవ ॥

ప॥ సుదర్శనే । చ । క్రౌంచే । చ । మైనాకే । చ । మహాగిరౌ । శతద్వాట్టారగమన్తా । సంహార్యం । నగరం । తవ ॥

అ॥ సుదర్శనే = సుదర్శనమను పేరుగల, మహాగిరౌ = గొప్ప పర్వతమందునను, క్రౌంచే = క్రౌంచమను పేరుగల, మహాగిరౌచ = గొప్పపర్వతమందునను; మైనాకే =

మైనాకమను పేరుగల, మహాగిరౌచ = గొప్పపర్వతమునందునను, సత ద్వారా
రకమస్తా = నూఱుద్వారములు ప్రాకారములు నడుమతగిన వీధులుగల, తవ=నీయొక్క-
నగరం = పట్టణమును, సంహార్యం = విడిచిపెట్టి మాయందు ననుగ్రముకలవాఁడవై
యిటురమ్ము॥

తా॥ ఓ కుబేరుఁడా! సుదర్శనమనియుఁ గ్రౌంచమనియు మైనాకమనియుఁ
బేరులుగల గొప్పపర్వతములయందు నూఱుద్వారములును నూఱుప్రాకారములును
నూఱువీధులును గలిగియుండు నీసంబంధమైన పట్టణములను విడిచిపెట్టి మాయం
దనుగ్రహముకలవాఁడవై యిటురమ్ము॥

మూ॥ ఇతిమన్త్రాః । కల్పోతఊర్ధ్వం॥

ప॥ ఇతి । మన్త్రాః । కల్పః । అతః । ఊర్ధ్వం॥

అ॥ ఇతి = ఈ ప్రకారముగా, మన్త్రాః = మన్త్రములు చెప్పఁబడినవి, అతః=
దీనికంటె, ఊర్ధ్వం = తర్వాత, కల్పః = అనుష్ఠానవిధాయకమైన బ్రాహ్మణభాగము
చెప్పఁబడుచున్నది.

తా॥ ఈప్రకారముగా, అద్భ్యస్తిరోధాజాయత, అనువదిమొదలు, పగ్ం
హార్యంనగరంతవ, అను వాక్యపర్యంతము మన్త్రములు చెప్పఁబడినవి. ఇఁకముందు
యదిబలిగ్ంహరేత్, అనుగ్రంథము మొదలు అనుష్ఠానవిధాయకమైన బ్రాహ్మణ
భాగము చెప్పఁబడుచున్నది.

మూ॥ యదిబలిగ్ంహరేత్ । హిరణ్యనాభయే వితుదయే కౌబే
రాయాయంబలిః॥ ౧౨౩॥ సర్వభూతాధి పతయేనమఇతి।
అథబలిగ్ం హృత్వోపతిష్ఠేత॥

ప॥ యది । బలిం । హరేత్ । హిరణ్యనాభయే । వితుదయే । కౌబేరాయ ।
అయం । బలిః । సర్వభూతాధిపతయె । నమః । ఇతి అథ । బలిం । హృత్వా । ఉప ।
తిష్ఠేత॥

అ॥ బలిం=భూజాద్రవ్యమును, హరేద్యది=సమర్పించినట్లాయెనా, యది=అను
పదముచే బలినివ్వవచ్చును, ఇయ్యకపోవచ్చును, హిరణ్యనాభయే = బంగారము
[illegible] గలవాఁడును, అనఁగా సమస్తాభరణముచే నలంకరింపఁబడినవాఁడు,

వితుదయే = బంగారము దుర్లభమగునట్లుజేసి యందఱను బీడించునట్టివాఁడును కౌబేరాయ=కుబేరుని సంబంధియును, సర్వభూతాధిపతయే = సమస్త భూతములకు నధిపతియునగు, వైశ్రవణాయ = వైశ్రవణుని కొఱకు, నమః = నమస్కారము, అయం=ఈ, బలిః=పూజాద్రవ్యము వైశ్రవణుని బొందుఁగాక, ఇతి = ఈలాగున, బలిం=పూజాద్రవ్యమును, హృత్వా=పొందింపఁజేసి, అథ=అనంతరము, ఉపతిష్ఠేత= నిలుచుండి ప్రార్థనఁ జేయవలయును.

తా॥ వైశ్రవణుని కొఱకు బలి నియ్యదలంచినట్లాయెనా బంగారము నాభి యందుఁ గలవాఁడును బంగారమును దుర్లభమగునట్లుచేసి మనుష్యులను బాధించు వాఁడును సమస్త భూతములకు నధిపతియును గుబేరుని సంబంధియును నగు వైశ్రవణుని కొఱకు నమస్కారము చేయుచున్నాను. ఈ బలి యా వైశ్రవణుని బొందుఁగాక యని పూజాద్రవ్యము నా వైశ్రవణుని బొందింపఁజేసి యనంతరము నిలుచుండి ప్రార్థనఁ జేయవలయును.

మూ॥ క్షత్రంక్షత్రం వైశ్రవణః । బ్రాహ్మణావయగ్గ్స్మః । నమస్తే
అస్తుమామాహిగ్ంసీః । అస్మాత్ప్రవిశ్యాన్నమద్ధీతి ॥

ప॥ క్షత్రం । క్షత్రం । వైశ్రవణః । బ్రాహ్మణాః । వయం । స్మః । నమః । తే । అస్తు । మా । మా । హింసీః । అస్మాత్ । ప్రవిశ్య । అన్నం । అద్ధి । ఇతి ॥

అ॥ వైశ్రవణః=వైశ్రవణుఁడు, క్షత్రం=పరిపాలించునట్టి, క్షత్రం=క్షత్రియ జాతీయుఁడు, వయం=మేము, బ్రాహ్మణాః=బ్రాహ్మణులమై, స్మః=అయితిమి, వైశ్రవణ=ఓ వైశ్రవణుఁడా! తే=నీకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక, మా=నన్ను, మాహింసీః=హింసచేయకుము, అస్మాత్=ఈ కారణమువలన, ప్రవిశ్య=ఈ స్థలమును బ్రవేశించి, అన్నం=అన్నమును, అద్ధి=భక్షింపుము, ఇతి=ఈ ప్రకారముగా నుపస్థానమును జేయవలయును.

తా॥ వైశ్రవణుఁడు పరిపాలించునట్టి క్షత్రియ వంశంబున జనియించినవాఁడు మేము బ్రాహ్మణవంశంబునఁ బుట్టినవారము. ఓ వైశ్రవణుఁడా! నీవు పాలించు వాఁడవగుటచేత మేము బ్రాహ్మణులమైనను నీకొఱకు నమస్కారముఁ జేయుచు

ర్తామ. మమ్ములను హింసింపకుము. ఈపూజాస్థలమునకు వచ్చి మాచే నీకొఱకు బలిగా నియ్యఁబడిన యన్నమును భుజియింపుము.

మూ॥ అథతమగ్ని మాదధీత । యస్మిన్నేతత్కర్మ ప్రియుంజీత॥

ప॥ అథ । తం । అగ్నిం । ఆదధీత । యస్మిన్ । ఏతత్ । కర్మ ॥ ప్రయుంజీత॥

అ॥ యస్మి = ఏయగ్నిహోత్రమునందు, ఏతత్ = ఈ, కర్మ = వైశ్రవణ బలిరూపమగుకర్మ, ప్రియుంజీత = చేయఁబడుచున్నదో, తం=ఆ, అగ్నిం=అగ్నిని, అథ = పూర్వమందుఁ జెప్పఁబడిన యుపస్థానానంతరము, ఆదధీత = స్థాపించవలయును.

తా॥ పూర్వమందుఁ జెప్పఁబడిన యుపస్థానానంతరమున వైశ్రవణ బలియుంపఁబడిన యగ్నిహోత్రమును భూమియందు స్థాపింపవలయును.

మూ॥ తిరోధాభూః । తిరోధాభువః ॥ ౧౨౮ ॥ తిరోధాస్వః । తిరోధాభూర్భువస్స్వః । సర్వేషాంలోకానామాధిపత్యేసీదేతి ॥

ప॥ తిరోధాః । భూః । తిరోధాః । భువః । తిరోధాః । స్వః । తిరోధాః । భూర్భువస్వః । సర్వేషాం । లోకానాం । ఆధిపత్యే ॥ సీద । ఇతి ॥

అ॥ అగ్నే = ఓయగ్నిహోత్రుఁడా !. భూః= భూలోకమును, తిరోధాః= నీయొక్క తేజస్సుచేఁ గప్పివేయుము, భువః = భువర్లోకమును, తిరోధాః = నీతేజస్సుచేఁ గప్పివేయుము, స్వః = స్వర్లోకమును, తిరోధాః = నీతేజస్సుచే, గప్పివేయుము, భూర్భువస్స్వః=భూలోకభువర్లోకములను సముదాయముగా, తిరోధాః= నీతేజస్సుచేఁ గప్పివేయుము, సర్వేషాం = సమస్తమైన, లోకానాం = లోకముల యొక్క ఆధిపత్యే = పాలించుటయందు, సీద= ఇక్కడుండుము, ఇతి = ఈరూపమైన మంత్రముచే నగ్నిస్థాపనఁ జేయవలయును.

తా॥ ఓయగ్నిహోత్రుఁడా ! నీవు నీతేజస్సుచేతను భూలోకమును భువర్లోకమును స్వర్లోకమును ప్రత్యేకముగాను భూలోకభువర్లోక స్వర్లోకములను సమష్టిగాను గప్పివేయుము. అనఁగా లోకములన్నింటిని వ్యాపించియుండు తేజస్సుగలవాఁడవగుము. మఱియు నీసమస్తలోకములను బరిపాలనఁ జేయుచు నిక్కడుండుము. ఈపూర్వోక్తమైన మన్త్రముచే నగ్నిస్థాపనఁ జేయవలయును.

మూ॥ అథతమగ్నిమిన్ధీత। యస్మిన్నేతత్కర్మప్రయుంజీత॥

ప॥ అథ। తం। అగ్నిం। ఇన్ధీత। యస్మిన్। ఏతత్। కర్మ। ప్రయుంజీత॥

అ॥ యస్మిన్ = ఏయగ్నియందు, ఏతత్ = ఈ, కర్మ = కర్మ, ప్రయుంజీత= చేయఁబడుచున్నదో, తం = ఆ, అగ్నిం = అగ్నిని, అథ = ఉపస్థానానంతరమున ఇంధీత = సమిదాధానముఁ జేయవలయును.

తా॥ ఏయగ్నిహోత్రమునందు వైశ్వదేవబలి సేయఁబడుచున్నదో ఆయగ్నిని నుపస్థానానంతరమున సమిధాధానము జేయవలయును.

మూ॥ తిరోధాభూస్స్వాహా। తిరోధాభువస్స్వాహా। తిరోధాస్వ
స్స్వాహా। తిరోధాభూర్భువస్స్వస్స్వాహా॥

ప॥ తిరోధాః। భూః। స్వాహా। తిరోధాః। భువః। స్వాహా। తిరోధాః। స్వః। స్వాహా। తిరోధాః। భూర్భువస్స్వః। స్వాహా॥

అ॥ అగ్నే = ఓయగ్నిహోతృఁడా! భూః = భూలోకమును, తిరోధాః = కప్పివేయుము, స్వాహా = నీకియ్యఁబడిన యీ సమిత్తుబాగుగా హుతమగుఁగాక, భువః = భువర్లోకమును, తిరోధాః = కప్పివేయుము, స్వాహా = బాగుగహుతమగుఁగాక, స్వః = స్వర్లోకమును, తిరోధాః = కప్పివేయుము, స్వాహా = బాగుగ హుతమగుఁగాక, భూర్భువస్స్వః = భూలోకభువర్లోక స్వర్లోకములను, తిరోధాః = కప్పివేయుము, స్వాహా = బాగుగహు తమగుఁగాక॥

తా॥ ఓయగ్నిహోతృఁడా! నీవు భూలోకమును నీతేజస్సుచేత గప్పివేసితివి. అట్టి నీ కొఱకు ఈసమిత్తు నిచ్చుచున్నాను. అది బాగుగ హుతమగుఁగాక భువర్లోకమును నీతేజస్సుచేఁగప్పితివి. అట్టి నీకొఱకు ఈ సమిత్తునిచ్చుచున్నాను. అది బాగుగ హుతమగుఁగాక. స్వర్లోకమును నీతేజస్సుచేతఁ గప్పివేసితివి. అట్టి నీకొఱకు సమిత్తునిచ్చుచున్నాను. అది బాగుగ హుతమగుఁగాక- భూర్భువస్స్వర్లోకములను సముదాయముగా నీ తేజస్సుచేఁగప్పివేసితివి. అట్టి నీకొఱకు సమిత్తునిచ్చుచున్నాను. అది బాగుగ హుతమగుఁగాక అని స్వాహాకారముగూడివట్లుగా మన్త్రము నుచ్చరించి సమిధలను హోమముసేయవలయును.

మూ॥ యస్మిన్నస్య కాలేసర్వా ఆహుతీర్హుతా భవేయుః ॥ ౧౨౫ ॥
అపి బ్రాహ్మణముఖీనా । తస్మిన్నహఃకాలే ప్రయుంజీత ।
పరస్సుప్తజనాద్వేపి ॥

ప॥ యస్మిన్ । అస్య । కాలే । సర్వాః । ఆహుతీః । హుతాః । భవేయుః । అపి । బ్రాహ్మణముఖీనాః । తస్మిన్ । అహఃకాలే । ప్రయుంజీత । పరః । సుప్త జనాత్ । అపి ॥

అ॥ అస్య = ఈ యారుణకేతుకాగ్ని సంబంధమైనవియు, బ్రాహ్మణ ముఖీనాః=బ్రాహ్మణభాగమందున్నవియు, సర్వాః=సమస్తమైన, ఆహుతీః=ఆహుతులు, యస్మిన్ కాలే = ఏ కాలమునందు, హుతాః = హోమముఁజేయఁబడినవై, భవేయుః=అవునో, తస్మిన్=అటువంటి, అహఃకాలే = ఆ దినసంబంధమగు కాలము నందు, ప్రయుంజీత = వైశ్రవణయజ్ఞమును జేయఁవలయును, వేపి = అలాగు కాని యెడల, సుప్తజనాత్పరః=మనుష్యులు నిద్రించిన పిమ్మటనైనఁ జేయవలయును ॥

తా॥ వైశ్రవణయజ్ఞమును జేయఁదగిన కాలమును జెప్పుచున్నాఁడు॥ అరుణ కేతుకసంబంధమైనవియు బ్రాహ్మణభాగమందుఁ జెప్పఁబడినవియు సమస్తమైన ఆహుతులే కాలమునందుఁ జేయఁబడుచున్నవో ఆ కాలమునందైనను లేక మనుష్యులు నిద్రించుచున్నప్పుడైనను వైశ్రవణయజ్ఞమును జేయవలయును.

మూ॥ మాస్మప్రమాద్యంతమాధ్యాపయేత్ । సర్వార్థాసిద్యంతే ।
యఏవంవేద । క్షుధ్రిన్నిదమజానతాం । సర్వార్థానసిధ్యంతే॥

ప॥ మా । స్మ । ప్రమాద్యంతం । ఆ । అధ్యాపయేత్ । సర్వార్థాః । సిధ్యన్తే । యః । ఏవం । వేద । క్షుధ్యన్ । ఇదం । అజానతాం । సర్వార్థాః । న । సిధ్యంతే ॥

అ॥ ప్రమాద్యంతం=దుర్వృత్తునిగా నున్నవానిని, మాధ్యాపయేత్స్మ = వేదమును జదివింపఁగూడదు, యః=ఎవఁడు, ఏవం=ఈ ప్రకారముగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, తస్య=వానికి, సర్వార్థాః=సమస్త కార్యములు, సిధ్యన్తే = సిద్ధించుచున్నవి, అజానతాం=తెలియనట్టివారికి, ఇదం=ఈకర్మ, క్షుధ్యన్=ఆఁకలివలెనే బాధించుచున్నది, తస్య=వానికి, సర్వార్థాః=సమస్తప్రయోజనములు, నసిద్ధ్యన్తే= సిద్ధింపవు ॥

తా॥ వేదాధ్యయనమునందు నియమమును జెప్పుచున్నాఁడు. దుర్మార్గప్రవర్తన గలవానికి వేదాభ్యాసము జేయఁగూడదు; ఈ ప్రకార మెవఁడు తెలిసికొనుచున్నాఁడో వానికి సమస్త కార్యములు సిద్ధించుచున్నవి. ఈ త్రైశ్రవణ బలి సంబంధమగు కర్మను గురువు వలనఁ దెలిసికొననివారు తినుటకు నన్నములేక యాఁకలిచే బీడింపఁబడినవారలై యే కోరికను బొందఁజాలరు.

మం॥ యస్తే విఘాతుకో భ్రాతా । మమాన్తర్హృదయే శ్రితః ॥ ౧౨౬॥
తస్మా ఇమమగ్రపిండంజుహోమి । సమేర్థాన్మావివధీత్ । మయి
స్వాహా॥

ప॥ యః । తే । విఘాతుకః । భ్రాతా । మమ । అన్తః । హృదయే । శ్రితః । తస్మై । ఇమమ్ । అగ్రపిండమ్ । జుహోమి । సః । మే । అర్థాన్ । మా । వివధీత్ । మయి । స్వాహా ॥

అ॥ కుబేర = ఓకుబేరుఁడా ! విఘాతుకః = అందఱియొక్కయు హిరణ్యాది లాభములను [illegible]ట్టునట్టి, తే = నీయొక్క, యః = ఏ, భ్రాతా = సోదరుఁడు కలఁడో, సః = అతఁడు, మమ = నాయొక్క. అన్తః = లోపల, హృదయే=మనస్సునందు, శ్రితః ఆశ్రయించి యుండెను, తస్మై = అతనికొఱకు, ఇమమ్ = ఈ, అగ్రపిండమ్ = శ్రేష్ఠమైన పిండమును, జుహోమి = హోమము చేయుచున్నాను, సః అతఁడు, మే = నాయొక్క, అర్థాన్ = హిరణ్యాది లాభములను, మావివధీత్ = భంగము చేయకుండుఁగాక, మయి = నాయందె యుండెడిఁగాక; స్వాహా = నాచే నియ్యఁబడిన బలిపిండము బాగుగ హుతమగుఁగాక ॥

తా॥ ఓకుబేరుఁడా ! సమస్తమైన వారియొక్క హిరణ్యాదిలాభములను జెడగొట్టునట్టి నీసోదరుండను నైత్రైశ్రవణుఁడుగలఁడో అతఁడు నామనస్సున నిలిచి యుండెను; కావున యాతనికొఱకు శ్రేష్ఠమగు నీపిండమును నిచ్చుచున్నాను. ఆత్రైశ్రవణుఁడు నాసంబంధమగు హిరణ్యాది లాభములను మఱియును నితరకోరికలను భంగము చేయక నాయందే కలిసియుండుఁగాక; నేనిచ్చిన పిండము బాగుగ హుతమగుఁగాక; అని త్రైశ్రవణ బలిజేయుచున్నాఁడు.

మూ॥ రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే। నమోవయం వైశ్రవణాయకుర్మహే। సమేకామాన్కామకామాయమహ్యం। కామేశ్వరోవైశ్రవణోదదాతు। కుబేరాయవైశ్రవణాయ। మహారాజాయనమః॥

ప॥ రాజాధిరాజాయః। ప్రసహ్యసాహినే। నమః। వయం। వైశ్రవణాయ కుర్మహే। సః। మే। కామాన్। కామకామాయ। మహ్యం। కామేశ్వరః। వైశ్రవణః। దదాతు। కుబేరాయ। వైశ్రవణాయ। మహారాజాయ। నమః॥

అ॥ రాజాధిరాజాయ = సమస్తప్రభువులకు నధిపతియైనవాఁడును, ప్రసహ్యసాహినే = సమస్తమైనవారియొక్క లాభములను బలాత్కారముగా నాకర్షించు వాఁడునగు వైశ్రవణాయ = వైశ్రవణునికొఱకు, వయం = మేము. నమః = నమస్కారమును, కుర్మహే = చేయుదుము, కామేశ్వరః = కోరికలకు నధిపతియగు, సః = ఆ, వైశ్రవణః = వైశ్రవణుఁడు, కామకామాయ=కోరికలను గోరుచున్న, మహ్యం = నాకొఱకు, మే = నాయొక్క, కామాన్ = కోరికలను, దదాతు = ఇచ్చుఁగాక, కుబేరాయ = కుబేరుని సోదరుండగు, వైశ్రవణాయ= వైశ్రవణుని కొఱకు, నమః=నమస్కారము, అస్తు = అగుఁగాక.

తా॥ సమస్తరాజులకు రాజైనవాఁడును సమస్తమైనవారి లాభములను బలాత్కారముగా హరించువాఁడునగు వైశ్రవణునికొఱకు మేము నమస్కారముఁ జేయుచున్నాము. కోరికలకు నధిపతియగు నా వైశ్రవణుఁడు కోరికల నపేక్షించియున్న, నాకొఱకు నాకుఁ గావలసిన కోరికల నిచ్చుఁగాక. కుబేరుని సోదరుండగు నా వైశ్రవణునికొఱకు నమస్కారమును మేము చేయుచున్నాము.

మూ॥ కేతవో అరుణాసశ్చ ఋషయో వాతరశనాః। ప్రతిష్ఠాగ్ం శతధాహి। సమాహితాసో సహస్రధాయసం॥

ప॥ కేతవః। అరుణాసః। చ। ఋషయః। వాతరశనాః। ప్రతిష్ఠాం। శతధా। హి। సమాహితాసః। సహస్రధాయసం॥

అ॥ కేతవః = కేతులను పేరుగలమునీశ్వరులును, అరుణాసశ్చ = అరుణులను మునీశ్వరులును, వాతరశనాః = వాతరశనులను పేరుగల మునీశ్వరులును,

సమాహితాసః = స్వస్థమైన మనస్సుగలవారై, శతధాహి = అనేకవిధములుగా, ప్రతిష్ఠాం = స్థితికి హేతువైనదియు, సహస్రధాయసం = అనేకఫలముల నిచ్చు నదియునగు నిష్టదేవతను బ్రసన్నమగునట్లు చేయుదుగాక॥

తా॥ కేతులు అరుణులు వాతరశనులు అను పేరుగల మునీశ్వరులు స్వస్థమైన మనస్సుగలవారై యజ్ఞమునందు సంభావితులై స్థిరమైనదియు ననేకవిధములుగా ఫలములనిచ్చునట్టి యిష్టదేవతను బ్రసన్నమగునట్లు చేయుదుగాక॥

మూ॥ శివానశ్శన్తమాభవన్తు। దివ్యాఆపఓషధయః। సుమృడీకా సరస్వతి। మాతేవ్యోమసన్దృశి॥ ౧౨౭॥ ౩౧॥

ప॥ శివాః। నః। శన్తమాః। భవన్తు। దివ్యాః। ఆపః। ఓషధయః। సుమృడీకా। సరస్వతి। మా। తే। వ్యోమ। సన్దృశి॥

అ॥ దివ్యాః = స్వర్గమందైన, ఆపః = జలములును, ఓషధయః = ఓషధులును, నః = మాకు, శివాః = మంగళకరములై, శన్తమాః = మిక్కిలి సుఖకరములై, భవన్తు = అగుదుగాక, సరస్వతి = సరస్సులుగలయోభూమీ! సుమృడీకా = మిక్కిలి సుఖకారిణివగుదువు, తే = నీయొక్క, వ్యోమ = రంధ్రము, మాసందృశి = అగపడకుండుగాక॥

తా॥ స్వర్గమందైన జలములును, అనగాననంతముఖలను గురియబడిన వర్షములన నేర్పడినవి. కాబట్టి స్వర్గసంబంధములై చెప్పబడియును, ఓషధులును మాకు మంగళము లను సుఖములను గలిగించు చుండుగాక, మఱియు సరస్సులతోఁ గూడియుండిన భూమియు సుఖకరమైన దియగుగాక ఓభూమీ! నీయందుండు మెరకపల్లము నుండుటచే రంధ్రముగానుండు ప్రదేశములు గడ్డిచే వ్యాపింపఁబడినవై యగపడకుండుగాక.

ఇతి ఏకత్రింశోనువాకస్సమాప్తః

—♦ అథద్వాత్రింశోనువాకః ప్రారభ్యతే ♦—

మూ॥ సంవత్సరమేతద్వ్రతంచరేత్। ద్వావామాసౌ॥

ప॥ సంవత్సరం। ఏకత్। వ్రతం। చరేత్। ద్వౌ। వా। మాసౌ॥

అ॥ ఏతత్=ఈ చెప్పఁబోవునట్టి, వ్రతం=వ్రతమును, సంవత్సరం=సంవత్సర పర్యంతమైన, ద్వా=రెండైన, మాసౌవా=మాసముల పర్యంతమైన, చరేత్=ఆచరింపవలయును.

తా॥ ఆరుణకేతుకాగ్నిని గుఱించి యజ్ఞము చేయఁదలఁచినవాఁడు ముందుగా సంవత్సరము వఱకైన యీ రెండు మాసముల వఱకైనగా ముందు చెప్పఁబోవునట్టి వ్రతము నాచరింపవలయును.

మూ॥ నియమస్సమాసేన ॥

ప॥ నియమః । సమాసేన ॥

అ॥ నియమః = ఈ వ్రతమునకుఁ గావలసిన నియమము, సమాసేన = సంక్షేపముగాఁ జెప్పఁబడుచున్నది.

తా॥ ఈ వ్రతమునందుఁ జేయవలసిన నియమములు సంక్షేపముగాఁ జెప్పఁబడుచున్నవి. అనఁగా ముఖ్యమైన వానిని గొన్నింటి నే చెప్పుచున్నాఁడు.

మూ॥ తస్మిన్నియమవిశేషాః । త్రిషవణముదకోపస్పర్శీ । చతుర్థకాలపానభక్తస్స్యాత్ । అహరహర్వాభైక్షమశ్నీయాత్ । ఔదుంబరీభిస్సమిద్భిరగ్నింపరిచరేత్ ॥ పునర్మామైత్వింద్రియమిత్యేతేనానువాకేన ॥

ప॥ తస్మిన్ । నియమవిశేషాః । త్రిషవణం । ఉదకోపస్పర్శీ । చతుర్థకాలపానభక్తః । స్యాత్ । అహరహః । వా । భైక్షం । అశ్నీయాత్ । ఔదుంబరీభిః । సమిద్భిః । అగ్నిం । పరిచరేత్ । పునర్మామైత్వింద్రియం । ఇతి । ఏతేన । అనువాకేన ॥

అ॥ తస్మిన్ = ఆవ్రతమునందు, నియమవిశేషాః = ముఖ్యమైననియమములు చెప్పఁబడుచున్నవి, త్రిషవణం=ప్రాతర్మధ్యాహ్నసాయం సవనములయందు, ఉదకోపస్పర్శీ=జలమునుస్పృశింపవలయును అనఁగాస్నానముచేయవలయును, చతుర్థకాలపానభక్తః=నాల్గవకాలమునందుఁబాలు మొదలగునవి త్రాగుటయు నన్నము భుజించువాఁడు, స్యాత్=అయ్యోని, అహరహర్వా=ప్రతిదినమందైనను, భైక్షం=భిక్షమును, అశ్నీయాత్=భుజింపవలయును, ఔదుంబరీభిః=మేడివృక్షముసంబంధమైన,

సమిద్భిః=సమిత్తులచేత, పునర్మామైత్వింద్రియమితి=పునర్మామైత్వింద్రియమనునట్టి, ఏతేన=ఈ, అనువాకేన=మంత్రముతో, అగ్నిం=అగ్నిహోత్రమును, పరిచరేత్= సేవింపవలయును.

తా॥ ఆవ్రతమునందుఁ జేయఁదగిన ముఖ్యమైన నియమములెవ్వియనఁగా, ప్రాతస్సవన మధ్యాహ్నసవన సాయంసవనములను జేయఁబోవునప్పుడు మూఁడుకాలములయందును స్నానముఁజేయవలయును. నాల్గవకాలమునందు భుజింపవలయును. అనఁగా మధ్యాహ్నము రాత్రి అనువిభాగము దినమునకు రెండుపూటలైనవి. కాఁబట్టి తాను ఏపూట భుజించునో దానికి నాల్గవపూటయందు భుజింపవలయును. అది యెట్లనఁగా తాను ఈదినమున మధ్యాహ్నము భుజించినయెడల ఆదినము రాత్రి మఱు నాఁడు మధ్యాహ్నము విడిచి మఱునాఁడు రాత్రి పాలు మొదలగునవి త్రాగుటయు నన్నమును భుజించుటయుఁ జేయవలయును. ఈ ప్రకారము చేయుటకు శక్తిలేని వారలు ప్రతిదినమందును భుజియింపవచ్చును. మఱియు పునర్మామైత్వింద్రియమ్ అనుమన్త్రము నుచ్చరించి మేడిసమిత్తులతో హోమముఁజేయుచు నగ్నిని సేవింప వలయును.

మూ॥ ఉద్ధృతపరిపూతాభిరద్భిః కార్యంకుర్వీత॥ ౧౨॥ అసంచయవాన్॥

ప॥ ఉద్ధృతపరిపూతాభిః । అద్భిః । కార్యం । కుర్వీత । అసంచయవాన్॥

అ॥ ఉద్ధృతపరిపూతాభిః = పాత్రములచేఁ దీసికొనిరాబడినవియు, వస్త్రాదులచే వడిఁగట్టినవియు నగు । అద్భిః=జలములచే, కార్యం=పాదప్రక్షాళాచమనాది కార్యమును, కుర్వీత=చేయవలయును, అసంచయవాన్=భిక్షను రాత్రి కొఱకుఁ దెచ్చుకొనఁగూడదు.

తా॥ నదులు చెఱువులు మొదలగువానిలోనుండి బిందెలు కుండలు మొదలగు పాత్రలతో జలము తెచ్చి వస్త్రము మొదలగువానిచే వడిఁబెట్టి యాజలముచేఁ బాదములు కడిగికొనుట యాచమనము చేయుట మొదలగు కార్యములను జేయవలయును భిక్షను రాత్రికొఱకు మఱియొకదానిలోఁ దెచ్చి యాయన్నమును భుజియింపఁగూడదు.

మూ॥ అగ్నయే వాయవేసూర్యాయ । బ్రహ్మణే ప్రజాపతయే । చన్ద్రమసేనక్షత్రేభ్యః। ఋతుభ్యస్సంవత్సరాయ। వరుణాయారుణాయేతి వ్రతహోమాః॥

ప॥ అగ్నయే । వాయవే । సూర్యాయ । బ్రహ్మణే । ప్రజాపతయే । చన్ద్రమసే । నక్షత్రేభ్యః । ఋతుభ్యః । సంవత్సరాయ । వరుణాయ । అరుణాయ । ఇతి । వ్రతహోమాః ॥

అ॥ అగ్నయే = అగ్నిహోత్రునికొఱకు, వాయవే = వాయువుకొఱకు, సూర్యాయ = సూర్యునికొఱకు, బ్రహ్మణే = బ్రహ్మకొఱకు, ప్రజాపతయే = సరస్వతికిఁ బెనిమిటియగు బ్రహ్మకొఱకు, చన్ద్రమసే = చంద్రునికొఱకు । నక్షత్రేభ్యః= నక్షత్రములకొఱకు, ఋతుభ్యః = వసంతాదిఋతువులకొఱకు, సంవత్సరాయ = ప్రభవాది సంవత్సరములలోఁ దత్కాల సంవత్సరముకొఱకు, వరుణాయ = వరుణునికొఱకు, అరుణాయ = అరుణునికొఱకు, ఇతి ఈప్రకారముగాఁ వ్రతహోమాః = వ్రతమును గుఱించి హోమములు చెప్పఁబడియున్నవి.

తా॥ అగ్నికొఱకు వాయువుకొఱకు సూర్యునికొఱకుఁ త్రిమూర్తులకు మూలకారణంబగు పరబ్రహ్మకొఱకును త్రిమూర్తులలో నొకఁడగు సృష్టికర్తయగు బ్రహ్మకొఱకుఁ జంద్రునికొఱకు నక్షత్రములకొఱకును వసంతాది సంవత్సరములలోఁ తత్కాల ఋతువుకొఱకును ప్రభవాది సంవత్సరములలోఁ దత్కాల సంవత్సరముకొఱకు వరుణునికొఱకును అరుణునికొఱకును హోమములను నిత్యముఁ జేయవలయును. అది యెట్లనఁగా అగ్నయేస్వాహా, వాయవేస్వాహా, సూర్యాయస్వాహా, అని ఈప్రకారముగా మూలములోఁ జెప్పఁబడిన మంత్రములకు స్వాహాకారముఁ జేర్చి చెప్పవలయును.

మూ॥ ప్రవర్గ్యవదాదేశః । అరుణాః కాండ ఋషయః ॥

ప॥ ప్రవర్గ్యవత్ । ఆదేశః । అరుణాః । కాండే । ఋషయః ॥

అ॥ ఆదేశః = ఆచరింపఁదగిన ధర్మము, ప్రవర్గ్యవత్= ప్రవర్గ్యాధ్యయనమునందుఁ జెప్పఁబడినట్లువలెనే ఆచరింపవలయును, కాండే = ఆరణ్యకమను పేరుగల యీ కాండమునందుఁ జెప్పఁబడిన, అరుణాః=అరుణులను పేరుగల, ఋషయః= మునీశ్వరులు హోమముఁజేయఁదగినవారు, అనఁగా ఆమునీశ్వరులగుఱించి హోమముఁ జేయవలయును.

తా॥ ఇక్కడ నాచరింపఁదగిన ధర్మము లెవ్వియనఁగాఁ బ్రవర్గ్యాధ్యయనమునందే యే ధర్మములు చెప్పఁబడినవో ఆ ధర్మములనే యిక్కడ నాచరింపవల

యును. ఈ యారణ్యక కాండయందుఁ జెప్పఁబడిన యరుణులను మునీశ్వరులగుఱించి హోమమునుఁ జేయవలయును.

మూ॥ అరణ్యేఽధీయీరన్ । భద్రంకర్ణేభిరితి ద్వే జపిత్వా॥ ౧౭౯॥

ప॥ అరణ్యే । అధీయీరన్ । భద్రంకర్ణేభిః । ఇతి । ద్వే । జపిత్వా ॥

అ॥ భద్రంకర్ణేభిరితి=భద్రంకర్ణేభిః అనునట్టిదియు స్వస్తినఇంద్రో అనున దియునగు, ద్వే = రెండైనమంత్రములను, జపిత్వా = జపించి, అరణ్యే=అడవియందు, అధీయీరన్=అధ్యయనముఁ జేయింపవలెను.

తా॥ ముందుగా 'భద్రంకర్ణేభిః' అనునట్టిదియు, 'స్వస్తినఇన్ద్రోవృద్ధశ్రవాః' అనునదియునగు రెండుమంత్రములను శాంతినిమిత్తము జపించి యడవియందు ఈ యారణ్యక కాండము నధ్యయనముఁ జేయింపవలయును.

మూ॥ మహానామ్నీభిరుదకగ్ం సగ్గ్స్పర్శ్య । తమాచార్యో దద్యాత్ । శివానశ్శన్తమేత్యోషధీరాలభతే । సుమృడీకేతి భూమిం ॥

ప॥ మహానామ్నీభిః । ఉదకం । సంస్పర్శ్య । తం । ఆచార్యః । దద్యాత్ । శివానశ్శన్తమా । ఇతి । ఓషధీః । ఆలభతే । సుమృడీకా । ఇతి । భూమిం ॥

అ॥ మహానామ్నీభిః = 'అపమాపామపస్రర్వాః' మహానామ్నీర్మహామానాః' అనునట్టిమంత్రములచేత ఉదకం=జలమును, సంస్పర్శ్య = స్పృశింపఁజేసి, [redacted] దద్యాత్ = అధ్యయనోపదేశమునియ్య వలయును, శివానశ్శన్తమేతి=శివానశ్శన్తమా అనునట్టి మంత్రముచేత । ఓషధీః=ఓష ధులను, ఆలభతే= స్పృశింపవలయును, సుమృడీకేతి= సుమృడీకా అనునట్టి మన్త్ర ముచేత, భూమిం = భూమిని, ఆలభతే = స్పృశింపవలయును.

తా॥ అపమాపామపస్రర్వాః, మహానామ్నీర్మహామానాః, అను మన్త్రము లచే బ్రహ్మచారిని జలమును స్పృశింపఁజేసి 'శివానశ్శన్తమాభవన్తు' అను మన్త్ర ముచే నోషధులను స్పృశింపఁజేసి "సుమృడీకాసరస్వతి" అను మన్త్రముచేభూమిని స్పృశింపఁజేసి పిమ్మట నాచార్యుఁడు బ్రహ్మచారిని నారణ్యక కాండాధ్యయనము నందు నియమింపవలయును.

మూ॥ ఏవమపవర్గే । ధేనుర్దక్షిణా ॥ కగ్ంసంవాసశ్చక్షౌమం । అన్యద్వా శుక్లం । యథాశక్తి వా ॥

పః- ఏవం ॥ అపవర్గే । ధేనుః । దక్షిణా । కంసం । వాసః । చ । క్షౌమం । అన్యత్ । వా । శుక్లం । యథాశక్తి । వా ॥

అ॥ అపవర్గే = అధ్యయనము చేసినపిమ్మటను, ఏవం = ఈ ప్రకారముగాఁ జేయవలయును, ధేనుః = ఆవు, ఆచార్యాయ = గురువుకొఱకు, దక్షిణా=దక్షిణ నిమిత్త మియ్యవలయును, కంసం = కంచుపాత్రను, క్షౌమంవాసశ్చ = పట్టువస్త్రమును, శుక్లం = తెల్లనైన, అన్యద్వా = ప్రత్తినూలుతో నేయఁబడిన వస్త్రమునైనను, యథాశక్తివా = లేక తనకు శక్తియున్నట్లు యేదోయొకదాని నియ్యవలయును.

తా॥ ఈ ప్రకారముగా యథావిధిగా నారణ్యకకాండమునధ్యయనముచేసిన పిమ్మట ప్రారంభమందేటిరుగా శాంతిమన్త్రములు మొదలగునవి పఠనచేసిరో అవి యున్నియు నంతమందును బఠింపవలయును. ఇట్లు సంపూర్తిగా నధ్యయనముఁ జేసినపిమ్మట నొక ఆవును త్రాగుటకుఁ గంచుపాత్రమును గట్టుకొనుటకుఁ బట్టువస్త్రమును లేదా ప్రత్తినూలుతో నేయఁబడినవస్త్రమునైనను అందుకు శక్తిలేనివాఁడైనయెడలఁ దనకు శక్తియున్నట్లుగా నాచార్యునికొఱకు దక్షిణనియ్యవలయును.

మూ॥ ఏవగ్గ్‌ స్వాధ్యాయధర్మేణ । అరణ్యేఽధీయీత । తపస్వీపుణ్యో భవతి తపస్వీపుణ్యోభవతి॥ ౧౩౦ ॥ ౩౨ ॥

ప॥ ఏవం । స్వాధ్యాయధర్మేణ । అరణ్యే । అధీయీత । తపస్వీ । పుణ్యః । భవతి । తపస్వీ । పుణ్యః । భవతి॥

అ॥ ఏవం = ఈ ప్రకారముగా, స్వాధ్యాయధర్మేణ = వేదమునందుఁజెప్పఁబడిన ధర్మములచే, అరణ్యే = అడవియందు, అధీయీత = అభ్యసింపవలయును, తపస్వీ = తపస్సుగలవాఁడును, పుణ్యః = పుణ్యాత్ముఁడును, భవతి = అగుచున్నాఁడు, తపస్వీ = తపస్సుగలవాఁడును, పుణ్యః = పుణ్యాత్ముఁడును, భవతి = అగుచున్నాడు.

తా॥ ఈప్రకారము వేదమునందుఁజెప్పఁబడిన శాంతినియమము మొదలైన ధర్మములతో ఈ యారణ్యకభాగమునరణ్యమునందు అధ్యయనము చేయవలయును. అరణ్యమందుఁజెప్పఁదగినవి. గనుక నే అరుణము మొదలగునికొన్ని పన్నములకు అరణ్యకమన్ని పేరువచ్చినది. ఈ ప్రకారముగా నియమముతో నధ్యయనముఁజేసినవాఁడు తపశ్శాలియు మిక్కిలి పుణ్యాత్ముఁడునగుచున్నాఁడు, దీనిలో నేమిసందేహములేదు, నిశ్చయమని చెప్పుటకొఱకు, తపస్వీ పుణ్యోభవతి, అని రెండుపర్యాయము లుచ్చరింపఁబడినది.

ఇతి తైత్తిరీయ యజురారణ్యకే ప్రథమప్రపాఠకే ద్వాత్రింశోఽనువాకః

సమాప్తః.